# అమృతవాహిని

## నవల

ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక నవలల పోటీలో
రెండవ బహుమతి పొందిన రచన

**అనురాధ (సుజల గంటి)**



Amrutha Vahini - Novel
by Anuradha (Sujala Ganti)

First Edition: December, 2015



For Copies & Address :
**Sujala Ganti**
303, Alekhya Rain Drops
Plot No. 17-18, Gautami Enclave,
Beside Chirec Public school
Kondapur, Hyderabad-500084
Telengana. Ph. No.7702319351/8897599414
sujalaganti@gmail.com

Copies: 500

Book price : Rs. 150/-

*Cover design:*
**Ponnada Murthy**

*Book Publishing Works:*
**Jyothivalaboju**
E-mail:jyothivalaboju@gmail.com...
Phone: 80963 10140

DTP & Type Setting:
**K. Ravi Prabha**, Cell: 96666 08835

*Printed at:*
**Karshak Art Printers,** Vidyanagar, Hyd.44

*Books available at:*
All Major Book Shops

Sole Distributors:
**Sai Venkata Ramana Book Distributors,**
Gandhi Nagar, Hyderabad.
Ph: 040-2754 3500, 9676799500

# అమృతవాహిని



**కొం**డల మీద ఎక్కడో ఓ నది సన్నని ధారలాగా మొదలై ప్రవహిస్తూ ప్రవహిస్తూ ఇంకా ఇంకా విశాలమై సముద్రాన్ని తలపించినట్టు – ఈ 'అమృతవాహిని' అనే నవల ఓ చిన్న కుటుంబంతో మొదలై, అమెరికాని చుట్టబెట్టి విశ్వవ్యాప్తమవుతుంది.

ఆ సన్నని ధార పేరు 'మంజరి'. ఓ మధ్యతరగతి కుటుంబంలో పుట్టి, పరిస్థితుల్ని ఆకళింపు చేసుకుని తల్లికి తోడై, తండ్రికి 'నమ్మక'మై, అత్యాశకు పోయే అక్కకు చక్కని జీవితాన్ని ప్రసాదించి, పుట్టినింటా, మెట్టినింటా తలలో నాలుకై... పయనిస్తూ... పయనిస్తూ... మారే పరిస్థితులకు అనుగుణంగా తనని తాను మలుచుకుంటూ నిండు గోదావరిలా ప్రవహించిన 'మంజరి' కథ ఖచ్చితంగా పాఠకుడి మనసుకి హత్తుకోవడమేగాక, కలకాలం నిలిచిపోతుంది.

'నిన్ను నేను చదివిస్తా... నువ్వు మరొకర్ని చదివించాలి' అనే మాట కొంచెం 'ఠాకూర్' కథని ఓ క్షణం జ్ఞప్తికి తెచ్చినా, మరుక్షణమే మరో మలుపు మనని కథలోకి లాక్కుపోతుంది.

ఇందులో ఏమి ఉన్నాయి? అంటే బోలెడు చెప్పొచ్చు.

భగవద్గీతనీ, మహాభారతాన్నీ, ఉపనిషత్సారాన్నీ ఎక్కడ వాడాలో అక్కడ వాడారు. తద్వారా మనదైన సంప్రదాయం మీదా, విజ్ఞానం మీదా ఉన్న 'పట్టు'ని చెప్పకనే చెప్పారు అనురాధ అనబడే 'సుజల గంటి'గారు.

ఒక పురుషుడి దృష్టిలో లోకం వేరు. స్త్రీ దృష్టిలో వేరు. ఆ స్త్రీ సంపూర్ణ స్త్రీత్వం గలిగిన 'అమ్మ' అయినప్పుడు ఆమె దృష్టిలోని లోకం ఎలా ఉంటుందో యీ 'అమృతవాహిని' నవల మనకి కళ్లకి కట్టినట్టు చెబుతుంది.

ఇందులో పచ్చి స్వార్థపరుల విన్యాసాలున్నాయి. స్నేహహస్తం జాచే స్వచ్ఛమానవుల అడుగుజాడలున్నాయి. ఊరుగాని ఊళ్లో, దేశంగాని దేశంలో 'నేనున్నాను' అని ధైర్యం చెప్పే అమృతహస్తాలూ ఉన్నాయి.

'ఇండియా'లో జరిగిన కథ మన ఇంటి వాతావరణాన్ని కళ్లకు కట్టిస్తే, అమెరికాలో జరిగిన కథ మనని అమెరికా తిప్పి చూపిస్తుంది.

అంతేకాదు... అక్కడి మన తెలుగువారి కష్టాలూ, కన్నీళ్లు, స్వార్థాలూ, స్నేహాలూ, అహంకారాలూ, మమకారాలూ అన్నీ చిరుగాలుల తెరల్లా మన మనసుని తాకుతూ మరో లోకానికి తీసుకుపోతాయి. నాకొకటి అనిపించింది... రచయిత్రి యొక్క సంస్కారము, పుట్టి పెరిగిన విధానమే పాత్రలను మలుస్తుందని. 'అమృతవాహిని'లో ఈ విషయం స్పష్టంగా కనిపిస్తుంది.

వ్యక్తుల కోపాన్నీ, ద్వేషాన్నీ కూడా ఓ పరిధిలోనే ఉంచారు గానీ, 'రాత'లో అసహనాన్ని ఎక్కడా చూపలేదు.

ఒక చక్కని మాట ఓ క్షణం వచ్చి వెళ్లిపోయే పాత్రద్వారా చెప్పించారు అనురాధగారు. ఇలా... "రెక్కలు వచ్చాక పక్షులు ఎగిరిపోతాయి. అది ప్రకృతి ధర్మం. తల్లిదండ్రులు ముసలివాళ్లయ్యాక వారి దగ్గరో, అవసరమైనప్పుడు అందుబాటులో ఉండటం మానవధర్మం (లేక) మనిషి ధర్మం" అని.

కృంగిపోవాల్సిన చోట మంజరి కృంగిపోదు. "ఉహూ... పరాజితురాలై వెనుతిరగకూడదు" అని నిర్ణయించుకుని, ముక్కుకు సూటిమార్గంలోనే, ఎవరినీ పరుషంగా నిందించకుండానే, అందనంత ఎత్తుకి ఎదుగుతుంది.

యాభై ఏళ్ల వయసులో డ్రైవింగ్ నేర్చుకుంటుంది. కుట్లూ, అల్లికలూ, వంటలూ ఏవీ 'శక్తి'కి కావు అనర్హం. అన్నీ బతుకుబండిని నడిపే శక్తిని ఇవ్వగలిగినవే అని నిరూపిస్తూ – మంజరిని హిమాలయపు ఎత్తున నిలబెడతారు రచయిత్రి. అలా అని ఎక్కడా నేల విడిచి సాము చెయ్యలేదు.

'తమ వ్యక్తిత్వాన్ని' సిన్సియర్‌గా మలుచుకోవాలనేవారికి ఈ నవల ఖచ్చితంగా ఒక స్ఫూర్తిగా నిలుస్తుందని మాత్రం నిర్ద్వంద్వంగా చెప్పగలను.

ఆంధ్రభూమి నవలల పోటీలో ఈ నవల ద్వితీయ బహుమతి పొందింది. కానీ పాఠకుల హృదయంలో మాత్రం ప్రథమ స్థానాన్నే అలంకరిస్తుందనడంలో నాకేమాత్రం సందేహం లేదు. అనురాధగారూ, మరిన్ని రచనలు చెయ్యండి. ఎందుకంటే జీవితంలోని చాలా కోణాల్ని అతి సున్నితంగా స్పృశించే నేర్పు మీలో ఉంది గనక.

శుభాభినందనలతో...

**భువనచంద్ర,**

ప్రముఖ రచయిత, సినీ గేయరచయిత

# ఆర్ద్రతతో సాగే అమృతవాహిని



**'అ**మృతవాహిని' నవల చదవాక ఒక రకమైన ఉద్వేగానికి లోనవక తప్పదు ఎవరికైనా! పాఠకుల మనసుని కదిలించి, అక్కడ నిలిచిపోతుంది.

ఒక స్త్రీ ఊహ తెలిసిన నాటినుంచీ జీవనయానంలో ఎదుర్కొన్న ఒడిదుడుకులను ఓర్పుగా నేర్పుగా అధిగమించి తన జీవితాన్ని సార్థకం చేసుకున్న విధానాన్ని కళ్లకు కట్టినట్లు తన నవలలో చిత్రీకరించారు శ్రీమతి సుజల గంటిగారు.

అనురాధ కలం పేరుతో అనతికాలంలోనే సాహిత్య ప్రపంచంలో తనకంటూ గుర్తింపు తెచ్చుకున్నారు సుజల గంటి. అనేక ప్రదేశాలు, దేశాలు తిరిగి అక్కడక్కడ కొన్నాళ్లు నివసించి, అక్కడి ప్రజల తీరుతెన్నులను మనస్తత్వాలను ఆకళింపు చేసుకుంటూ తన అనుభవాలని అందంగా అక్షరీకరిస్తున్నారు. అపారమైన పఠనానుభవం అందుకు తోడ్పడుతోందనడంలో సందేహం లేదు.

గుండె నిండా మమత నింపుకున్న ఒక మాతృమూర్తి, అనాథ పిల్లలని అమ్మలాగ అక్కున చేర్చుకున్న కరుణామయి, 'అమ్మా' అన్న పిలుపుని వినకుండా వెళ్ళిపోవడంతో మొదలైన కథ, ఆదిలోనే పాఠకులకు ఆసక్తి కలిగిస్తుంది.

భార్య మంజరి మనసులో ఘనీభవించిన మంచుకొండని కరిగించే ప్రయత్నం చేస్తాడు భారతీయ తత్వాన్ని నరనరానా నింపుకున్న విదేశీయుడు జెన్నీ. తన ప్రేమామృతాన్ని చేరదీసిన చిన్నారులకు పంచుతున్న మంజరికి చిన్నతనం నుంచీ తన జీవనవాహిని తిరిగిన మలుపులు గుర్తుకొస్తాయి.

ఆ మలుపుల్లోనే అనేకమంది పరిచయమౌతారు పాఠకులకి.

తల్లిదండ్రుల శ్రమని చిన్నతనంలోనే అర్థం చేసుకుని చేయూతనిచ్చి, తన పరిధిలో సమస్యలని పరిష్కరించాలని చూసే మంజరికి జీవితంలో అడుగడుగునా అడ్డంకులే. కలల్లో తేలిపోయే అక్కకి వాస్తవాలని తెలియజెప్పి, ఒక త్రోవ చూపించింది చిన్నతనంలోనే. తన సహాయం పొందిన అన్నదమ్ములే కాకుండా విధికూడా చిన్నచూపు చూసినా ధైర్యంగా పోరాటం సాగించి ఒక్కగానొక్క కొడుకుని

వృద్ధిలోకి తెచ్చి అమెరికా పంపించింది. ఆ కొడుకు చూపిన నిర్లక్ష్యాన్ని మౌనంగా భరించింది. తన బ్రతుకు తనదే అని ఒంటరి పోరాటం సాగిస్తున్న తల్లిని బంధంలో ఇరికించిన కొడుకుని మళ్ళీ నమ్ముతుంది పిచ్చితల్లి. ఇక్కడ అమ్మల అమాయకత్వాన్ని, ఎన్ని సార్లైనా మోసపోవడానికి సిద్ధపడే మాతృహృదయాన్ని, సున్నితంగా.. మనసుకి హత్తుకునేలా చెప్పారు రచయిత్రి.

ఈ రకంగా కొందరు పిల్లలు, తల్లిదండ్రుల ఆప్యాయతలని, అభిమానాన్ని సాకుగా వారి సేవలని అందుకోవడం చాలాసార్లు చూస్తుంటాం. అమెరికా తరచుగా వెళ్ళేవారందరికీ ఈ విషయాలు అనుభవాలే. సాయంత్రాలు పార్కులకి వెళ్ళినప్పుడు రకరకాల కథలు వినిపిస్తుంటాయి. సుజలగారి నవలలో ఉన్న మంజరి వంటి వాళ్ళని చూస్తూనే ఉంటాము. మేము వెళ్ళినప్పుడు కలిసిన ఒక గుజరాతీ స్త్రీది మంజరి గాథే. ఆవిడ పాస్‌పోర్ట్ కూడా దాచేశారు కొడుకు, కోడలు.. అందుకే ఈ నవల పెద్దవాళ్ళని బాగా ప్రభావితం చేసింది.

ప్రతి పుటలోనూ రచయిత్రి భావుకత ద్యోతకమౌతూ ఉంటుంది. చదువుతుంటే తాత్విక భావన కలుగుతుంది. ముఖ్యంగా జెన్నీ ప్రవేశించాక.. అతని జ్ఞానం ఆశ్చర్యం కలిగించక మానదు. ఒక సాధువు చేత, ప్రవక్త నోట ఆ మాటలు చెప్పిస్తే అది సాధారణం. అదే తత్వ విచారణ విదేశీయుని పలుకులలో ప్రత్యేకతని సంతరించుకుంటుంది. అక్కడే రచయిత్రి నైపుణ్యం తెలుస్తుంది.

ఈ నవలలో ఎటువంటి అవరోధాలనైనా ఎదుర్కొని అమృతాన్ని పంచుతూ ముందుకు సాగాలనే సందేశం కనిపిస్తుంది, మంజరిని చూసి నేర్చుకొమ్మనే సూచన వినిపిస్తుంది అంతర్లీనంగా.

మంజరి బహుముఖ ప్రజ్ఞ సంఘటనల ద్వారా నేర్పుగా చొప్పించారు రచయిత్రి. అంతే కాదు.. సమయానుకూలంగా పాత్రలను ప్రవేశపెడుతూ కథను ముందుకి నడిపారు. నవల చదువుతున్నంతసేపూ కథానాయిక ధైర్యానికి, స్థైర్యానికి, సంకల్పానికి, నిర్దిష్టమైన ఆలోచనకి అబ్బుర పడకుండా ఉండలేము. ఒక మంచినవల చదివామన్న అనుభూతి కలుగుతుంది.

శ్రీమతి గంటి సుజలగారి కలం నుండి మరిన్ని మంచి నవలలు రావాలని ఆశిస్తూ..

మరెందుకింక ఆలస్యం.. పదండి ముందుకు..

**– డా॥ మంథా భానుమతి,** ప్రముఖ రచయిత్రి

# నా మాట

**చి**న్ననాటినించీ కథలు రాయాలని ఉన్నా ఆ కోరిక తీరడానికి నాకు చాలా సమయం పట్టింది. కనబడ్డ ప్రతి పుస్తకం చదివేదాన్ని. ఇంట్లో పుస్తకాలు కొనకపోయినా పక్కవాళ్ళింట్లో కొన్న ప్రజామాత, భారతి. యువ, కృష్ణాపత్రిక అన్నీ చదివేదాన్ని. అవన్నీ చదివినప్పుడు వాటి గురించి ఎక్కువ అవగాహన లేదు. చదవడం ఇష్టం అంతే. ఇంట్లో పెద్దగా సాహిత్యం గురించిన అవగాహన లేదు. అమ్మ పెద్దగా చదువుకోలేదు. కానీ నాన్నగారికి పుస్తకాలు చదివే అలవాటు, నేను కాలేజీలో చదువుతున్నప్పుడు రాజమండ్రి కాస్మో పాలిటన్ క్లబ్‌లో ఉన్న లైబ్రేరీనించి పుస్తకాలు తెచ్చి చదివి నీ అభిప్రాయం చెప్పమనేవారు. వడ్డాది సుబ్బారాయకవి గారింట్లో అద్దెకు ఉండి వాళ్ళింట్లో గాజు తలుపుల వెనకనున్న సాహిత్యాన్ని చూడడం తప్ప ఆ విజ్ఞానాన్ని సొంతం చేసుకోవాలన్న జ్ఞానం లేదు. హిందీ సాహిత్యంపట్ల కూడా మక్కువ. ప్రేమ్‌చంద్ నవలలు తెలుగులో చదివి అవి మూలభాషలో చదవాలన్న తాపత్రయం. ఆ తరువాత శ్రీవారి సాహచర్యంలో ఆంగ్లసాహిత్యం పట్ల మక్కువ ఏర్పడింది. నా ఆశ ఏ భాషలోనూ ప్రావీణ్యాన్ని ఇవ్వలేదు. కానీ నేను చదివిన ఆ పుస్తకాలజ్ఞానం నాలో ఏ మూలో ఉండి, నాతో కలం పట్టించిందేమో అనుకుంటాను. చదువు వివిధ ప్రాంతాల్లో జరిగింది. వివాహం తరువాత శ్రీవారి ఉద్యోగరీత్యా ఎక్కువ కాలం గుజరాత్, అస్సామ్ డెహ్రాడూన్, ఢిల్లీలో గడపడం, పిల్లల మూలంగా అమెరికా చాలాసార్లు వెళ్ళడం జరిగింది. మనుష్యులను, వారి జీవనశైలిని అర్థం చేసుకుందుకు అవకాశం కలిగింది. భూతలస్వర్గంగా వర్ణించే అమెరికాను చూడాలన్న కల నిజమైంది. కానీ అక్కడ అన్నీ సుఖాలే కాదు కష్టాలు కూడా ఉన్నాయి. డాలర్లను రూపాయల్లోకి మార్చి మావాడు లక్షల్లో సంపాదిస్తున్నాడని మురిసి ఇక్కడ గొప్పలు చెప్పుకుంటూ వాళ్ళను డబ్బుకోసం పీడించే తల్లితండ్రులకు (అందరూ కాదు) అక్కడ వాళ్ళ కష్టాలను గూర్చి తెలిస్తే అలా పీడించరేమో! ఆ కష్టాలను నేను చూశాను. అలాగే పిల్లలకోసం వెళ్ళి వాళ్ళ స్వార్థానికి బలి అయిన ఎంతోమందిని చూడ్డం జరిగింది. అలా నాకు వెళ్ళిన ప్రతిసారీ కలిగిన అనుభవాలకు ఒక రూపం ఇవ్వాలన్న సంకల్పమే ఈ నవలకు నాంది. ఇందులోని కొన్ని పాత్రలు నాకు ఎదురుపడ్డవే.

బిడ్డలు కాదన్నంత మాత్రాన మనం భయపడకుండా మనం తల్చుకుంటే

ఎలా బతకవచ్చు! అన్న భావనే మంజరి పాత్రకు ప్రాణం పోసింది. మనదేశపు ఔన్నత్యాన్ని మన భాష ఔన్నత్యాన్ని మనకన్నా విదేశీయులు గౌరవిస్తున్నారు. అదే జెన్నీ పాత్రద్వారా చెప్పదల్చుకున్నాను. ఈ నవల బహుమతి పొందడమే కాక ఎంతోమంది పాఠకుల మనసు చూరగొంది. పత్రికలో నా ఫోన్ నంబరు ఇవ్వక పోయినా నా ఫోన్ నంబరు సంపాదించి ఎంతో మంది పాఠకులు ఫోన్ చేశారు. తొందరగా పుస్తకంగా వెయ్యండి అన్న అభిమానుల కోరిక మీదే సీరియల్‌గా ఆంధ్రభూమిలో వచ్చిన ఈ నవలకు పుస్తకరూపం ఇస్తున్నాను.

ఈ నా నవలకు 2014 ఉగాది నవలల పోటీలో ద్వితీయ బహుమతి ఇచ్చిన ఆంధ్రభూమి సంపాదక వర్గానికి, అడగగానే ఎంతో బిజీగా ఉన్నా నా ఈ నవలకు ముందుమాట రాసి ఫోన్‌లో కూడా చాలా మంచి నవల రాశానని అభినందించిన ప్రముఖ కథా, సినీ రచయిత 'భువనచంద్రగారికి' అలాగే అడగగానే ముందుమాట రాయడానికి ఒప్పుకున్న ప్రముఖ రచయిత్రి 'డా.మంథా భానుమతిగారికి', ముఖచిత్రం మీరే వెయ్యాలని అడిగితే నేనెప్పుడూ వెయ్యలేదమ్మా అంటూనే ఆనందంగా నా కోరిక మేరకు నేను కోరినట్లు ముఖచిత్రం వేసిన 'పొన్నాడ మూర్తిగారికి', జెవి పబ్లికేషన్స్ 'జ్యోతివలబోజు'కు నా మనఃపూర్వక ధన్యవాదాలు.

**– అనురాధ (సుజల గంటి)**

# అమృతవాహిని

హైద్రాబాద్ సెంట్రల్ మాల్‌లోంచి బైటికి వస్తున్న మంజరి 'అమ్మా!' అన్న పిలుపు విన్నా తనను కాదని ముందుకు నడిచింది. ట్రాలీలో సరుకులతో ఆమె వెనకే వస్తోంది హర్షిత. మళ్లీ ఇంకోసారి 'అమ్మా!' అన్న పిలుపునకు వెనక్కి తిరిగి చూసిన హర్షిత ఒక నడి వయస్కుడు పరిగెత్తుతున్నట్లుగా తమవైపు రావడం చూసింది.

"అమ్మా! ఆయనెవరో మిమ్మల్నే పిలుస్తున్నట్లుంది" అంది మంజరితో. వెనక్కి తిరిగి చూసిన మంజరి ఆ మనిషిని చూసి కూడా "మనని కాదు నడు. మీ నాన్నగారు ఎదురుచూస్తూ ఉంటారు" అంటూ వడివడిగా నడుస్తూ, ఫోన్ తీసి డ్రైవర్‌కు ఫోన్ చేసింది కారు తీసుకురమ్మని.

ఎంట్రన్స్‌లోకి వీళ్లు వచ్చేసరికి కారు రావడం హర్షిత, మంజరి కారులో కూర్చోవడం, ట్రాలీలో సామాన్లు డ్రైవర్ లోపల పెట్టడం కారు కదలడం చాలా త్వరగా జరిగింది. ఆ నడివయస్కుడు కారు దగ్గరకు వచ్చి కదులుతున్న కారువైపు నిస్తేజంగా చూస్తూ ఉండిపోయాడు.

'అమ్మ తనను ఎందుకు గుర్తుపట్టలేదు? గుర్తుపట్టినా పట్టనట్లు నటిస్తోందా?' అనుకున్నాడు.

'ఆమెను ఎలా కలుసుకోవాలి? ఎక్కడ ఉంటోంది?' అన్న ప్రశ్నలు అతని మస్తిష్కంలో కదలాడుతున్నాయి.

హర్షిత మనసులో కూడా బోలెడు ప్రశ్నలు. అతను ఎవరు? అమ్మను అమ్మా అని ఎందుకు పిలిచాడు? బహుశా అతని తల్లి కూడా అమ్మలా ఉంటుందేమో? వాళ్ల అమ్మ అనుకుని పిలిచాడా?

కానీ అదెలా సాధ్యం? అతని తల్లిని అతను గుర్తుపట్టలేడా? చిన్నపిల్లవాడు కాదుకదా!

తనకు తెలియనిదేదో ఉంది. అమ్మ కూడా అతని నుంచి తప్పించుకుందుకే హడావుడిగా ప్రయత్నించింది. లేకపోతే తాము హడావుడిగా పరుగెత్తాల్సిన పనిలేదు.

పోర్టికోలో కారు ఆగగానే డ్రైవర్ తెరిచేలోపునే డోర్ తీసుకుని దిగి, మౌనంగా తన గదిలోకి వెళ్లిపోయింది మంజరి. డ్రైవర్‌కి, హర్షితకి ఆమె ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. ఇన్నాళ్లలో ఆమె ఈ విధంగా ఏ రోజూ ప్రవర్తించలేదు.

హర్షిత మాట్లాడకుండా కొన్న సామాన్లు డ్రైవర్ సహాయంతో లోపలికి తీసుకువెళ్లింది. ఎప్పుడు బజారు వెళ్లినా ఎంత వద్దన్నా తమతో సమానంగా అన్ని పనులూ చేస్తుంది. ఆమె వయసు కన్నా ఎక్కువ పనిచేస్తుంది. ఆమెను చూసిన మిగిలినవాళ్లు కూడా యాక్టివ్‌గా ఉండడానికి ప్రయత్నిస్తారు.

* * *

అది ఒక అధునాతనమైన బంగళా. కొండాపూర్‌లో విశాలంగా నిర్మించబడిన ఇల్లది. మంచి ఆర్కిటెక్ట్ సహాయంతో కళాత్మకంగా నిర్మించారు. ఇల్లంతా ఒక కళాఖండంగా తీర్చిదిద్దబడింది. ఆ ఇంట్లోకి అడుగుపెట్టిన ఎవరైనా 'వావ్' అని అనకుండా ఉండలేరు.

ఇంటి యజమాని జెన్నీ, యజమానురాలు మంజరి. ఆ ఇంట్లో వాళ్లిద్దరూ కాక ఆరుగురు పిల్లలు ఉన్నారు. డ్రైవరుకి అదే కాంపౌండులో రెండు రూములు, కిచెన్ ఉన్న పోర్షన్ ఇవ్వబడింది. భార్య, ఇద్దరు పిల్లలతో సుఖంగా కాలం గడిచిపోతోంది యాదయ్యకు.

ఇంతకుముందు చాలామంది దగ్గర పనిచేశాడు. ప్రతిచోటా ఎంత సర్దుకుపోదామన్నా ఏదో గొడవ రావడం, వాళ్ల దగ్గర మానేసి ఇంకో చోట వెదుక్కోవడం జరిగేది.

ఈ ఇంట్లో ఉద్యోగం దొరికాక అతని సమస్యలన్నీ తీరిపోయాయి. ఈ ఇల్లు విడిచిపెట్టకూడదని నిశ్చయించుకున్నాడు.

మంజరి ఎంత ప్రేమాభిమానాలు చూపిస్తుందో పని విషయంలో అంత ఖరాఖండీగా ఉంటుంది. బద్ధకానికి ఆమె డిక్షనరీలో తావు లేదు. పనిపట్ల ఏ

మాత్రం అశ్రద్ధ అన్నది ఆమె సహించలేదు. ఎవరి పనులు వాళ్లు సక్రమంగా చేసినప్పుడు సమస్యలు తలెత్తవన్నది ఆమె సిద్ధాంతం.

యాదయ్యకు జీతం కాక ఇల్లు ఫ్రీ. అతని భార్య ఇంటిపనుల్లో మంజరికి సహాయం చేస్తుంది. యాదయ్య పిల్లలను మంచి స్కూల్లో చదివిస్తున్నాడు. జీతం మంజరి కడుతుంది.

ఆ ఇంట్లో ఉన్న ఆరుగురు పిల్లలు, మంజరిని 'అమ్మా' అని, జెన్నీని 'నాన్నా' అని పిలుస్తారు. కానీ వాళ్ల మధ్య ఉన్నది అనుబంధమే కానీ రక్తసంబంధం కాదు. ఆ పిల్లలకు వాళ్లు జన్మనివ్వని తల్లితండ్రులు.

ఆ ఇంటికి రాకపూర్వం వాళ్లు అనాథలు. ఏ రైల్వేస్టేషన్‌లోనో అడుక్కుంటూ, రోడ్డు మీద చిత్తుకాగితాలు ఏరుకుంటూనో బ్రతికినవాళ్లు. ఒక పిల్ల మంజరికి కుప్పతొట్టిలో దొరికింది.

ఈ సంగతులన్నీ ఇప్పుడు వాళ్లున్న స్థితి చూస్తే ఎవరూ నమ్మరు. వాళ్లు నాగరికత సంతరించుకుని, మంచి స్కూళ్లలో చదువుతున్న భావిభారత పౌరులు.

హర్షిత చరిత్ర మాత్రం మిగిలిన పిల్లలకన్నా విచిత్రమైనది. అందరి పిల్లలలోకి ఆమె పెద్దది. ఆమె ఇప్పుడు ఎం.బి.బి.ఎస్. చదువుతోంది. మిగిలిన పిల్లల సంరక్షణలో మంజరికి కుడిభుజంలా అన్నిటిలో సహాయపడుతుంది. మంజరికి హర్షిత చాలా విచిత్రమైన పరిస్థితుల్లో తారసపడింది.

హర్షిత మధ్యతరగతి కుటుంబంలో పుట్టింది. తల్లి, తండ్రి, ఒక తమ్ముడు. తండ్రి ఉద్యోగస్తుడు. తమ్ముడు, తను ఆడుతూ పాడుతూ హాయిగా కాలం వెళ్లబుచ్చేవారు.

ప్రతి మనిషి జీవితంలో విధి చాలా మార్పులు తెస్తుంది. ఆ మార్పులు ఎలాంటివో పరిస్థితులు ఎలా మారుతాయో ఆ విధాతకే తెలియాలి. ఊహించని పరిణామాలు జరగడమే జీవితంలో ఉన్న మిస్టరీ.

హర్షిత తండ్రి భార్గవ మంచి ఉద్యోగంలో ఉన్న మనిషి. అనుకూలవతి అయిన భార్య, ముత్యాల్లాంటి పిల్లలు. ఏ ఒడిదుడుకులు లేకుండా పూలనావలా జరుగుతున్న సంసారం.

తండ్రి ఆఫీసు నుంచి రావడం కోసం ఎదురుచూసేవారు హర్షిత, అభయ్. ఆఫీసునుంచి రాగానే పిల్లలతో కాసేపు ఆడుకునేవాడు. ఆ తరువాత వాళ్ల చదువుల్లో

సహాయపడడం అతని దినచర్యల్లో ఒకటి. తండ్రితో గడిపే ఆ సమయం వాళ్లకు ఆనందాన్ని పంచే సమయం.

అందమైన వాళ్ల జీవితాలకు కారుమబ్బు కమ్మింది. భార్గవకు ఎలా అలవాటు అయ్యిందో కానీ తాగుడు అలవాటు అయ్యింది, చాలా రోజులు ఇంట్లో ఎవరూ గ్రహించలేదు. కొద్దికాలం తరువాత ఇంట్లో ఇచ్చే జీతం తగ్గడం మొదలైంది. క్రమేపీ పిల్లలతో గడపడం మానేశాడు.

తండ్రి తమతో ఎందుకు గడపడం లేదో అర్థం కాలేదు. జీతం తక్కువ ఇస్తున్నట్లు గ్రహించిన కావేరి భర్తను కారణం ఏమిటని అడిగింది. ఆఫీసులో కటింగులు ఉన్నాయని తప్పించుకున్నాడు. భర్త చెప్పిన మాటలు నిజమని నమ్మింది. పొదుపుగా ఆ నెల ఇల్లు గడపడానికి తాపత్రయపడింది.

ఈ అలవాటుకు ముందు అతను ఇంటికి ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూసేవారు అతని భార్యాపిల్లలు. సాయంకాలం అతను వచ్చాక వాళ్లు నలుగురూ కలిసి గడిపే సమయం వాళ్ల జీవితంలో ఒక అందమైన అపురూపమైన ఘడియలుగా ఉండేవి.

ఆ అందమైన రూపానికి గ్రహణం పట్టింది. రెండు, మూడు నెలలు కూడా అలాగే జరిగేసరికి అనుమానం వచ్చింది కావేరికి.

"ఏవండీ ఈ రోజు జీతం వచ్చిందా? సరుకులన్నీ నిండుకున్నాయి" ఒకసారి ధైర్యం చేసుకుని అడిగింది.

"జీతం వస్తే ఇవ్వక ఏం చేస్తాను? ఇంకా రాలేదు" అన్నాడు.

జీతం రావడం అయిపోవడం రెండూ ఎప్పుడో జరిగిపోయింది. అతను అబద్ధం చెపుతున్నాడని తెలుసు. కానీ ఏం చెయ్యాలి?

ఆకలికి ఏడుస్తున్న పిల్లలకు ఏం పెడుతుంది? రోజూ మంచినీళ్లు తాగి పడుకోవడం సాధ్యం కాదు.

హర్షిత అడిగింది "పోనీ పక్క ఆంటీని అడిగి కొంచెం బియ్యం తేనా అమ్మా!" అని.

అది మాత్రం ఎన్నాళ్లు సాగుతుంది? ఒకటి రెండు రోజులైతే ఎవరైనా ఇస్తారు. ఆ తరువాత మొహం చాటు చేస్తారు. అనుకోకుండా భార్గవ స్నేహితుడు వస్తే అడిగింది "ఇంకా జీతం రాలేదట కదా!" అని.

అతనికి పరిస్థితి అర్థమయ్యింది. కానీ వాళ్ల ఇంటి విషయాల్లో కలగజేసుకోవాలో లేదో తెలియదు.

రాత్రిళ్లు ఇంటికి ఆలస్యంగా రావడం, అతని దగ్గర ఏదో వాసన రావడం గ్రహించింది. స్వతహాగా కావేరి అమాయకురాలు. ప్రపంచజ్ఞానం కూడా తక్కువ. స్వతంత్రంగా ఆలోచించడం లాంటిది ఆమెకు చేతకాదు. ఎవరు ఏం చెప్తే అది వినడం, చేయడం అలవాటు.

ఆమె మెతకతనాన్ని గుర్తించిన తండ్రి కాస్త కట్నం ఎక్కువ ఎరచూపి భార్గవ్‌తో పెళ్లి జరిపించాడు. స్వతహాగా మంచివాడైన భార్గవ తల్లి మాటను జవదాటలేక కావేరిని భార్యగా స్వీకరించాడు. అందుకే తల్లి ఈ సంబంధం గురించి చెప్పినప్పుడు తనవైపు నుంచి అభ్యంతరం తెలపలేదు. అదీకాక కావేరి అందంగా ఉంటుంది.

అతని ఉద్దేశంలో మగవాడు తెచ్చినది జాగ్రత్తగా ఖర్చుపెట్టి ఇల్లు నడిపే శక్తికన్నా భార్యకు తెలివితేటలు అవసరం లేదన్న భావన. అమాయకురాలైతే తనకనుగుణంగా నడుచుకుంటుందన్న ఆలోచన.

అందరూ ఆమె అమాయకత్వాన్ని తమకనుగుణంగా వాడుకున్నారు తప్ప ఆమె గురించి ఎప్పుడూ ఆలోచించిన పాపాన పోలేదు. ఆఖరికి కన్నతండ్రి కూడా ఆమె ఇష్టాయిష్టాలతో పని లేనట్లు తన బాధ్యత తీర్చుకున్నాడు. పిల్లలు ఎదిగాక తమ తల్లి అందరిలాంటిది కాదని గ్రహించారు. ఆమెపట్ల సానుభూతి చూపించేవారు. అందులో హర్షిత తల్లిని ఎప్పుడూ అంటిపెట్టుకుని ఉండి తల్లికి సహాయపడుతూ ఉండేది.

భార్గవ అలవాటు రోజు రోజుకూ ఎక్కువ అవడంతో ఇంట్లో అల్లకల్లోలం మొదలయ్యింది. భర్త చేస్తున్నది తప్పని తెలిసినా ఎదురుచెప్పడం కానీ, ఇదేమిటని నిలదియ్యడం కానీ చేతకాదు. అతను ఇంటి ఖర్చులకు ఒక నెల ఇస్తే ఇంకో నెల ఇచ్చేవాడు కాదు. ఇంట్లో ఇబ్బందుల్ని ఎలా ఎదుర్కోవాలో తెలియదు.

మందు అతని జీవితంలో ప్రధాన పాత్ర వహించడం మొదలుపెట్టింది. ఇదివరకు రాత్రికే పరిమితమైన అలవాటు ఇప్పుడు పగలు కూడా మొదలయ్యింది. తల్లి ఉంటే కొంత భయం అనేది ఉండేదేమో? కానీ రెండేళ్ల క్రితం ఆమె మరణించింది. అదుపులేని అతను విజృంభించాడు. దానితో ఆరోగ్యం దెబ్బతీసింది.

భయపడుతూనే హర్షిత “నాన్నగారూ ఈ అలవాటు మీ ఆరోగ్యాన్ని పాడుచేస్తుంది” అని నచ్చచెప్పడానికి ప్రయత్నించేది. అందులో పూర్తిగా మునిగిపోయిన అతనికి ఆ మాటలు చెవిటివాడి ముందు శంఖం ఊదినట్లుగా అయ్యింది.

ఒకరోజు నెత్తురు కక్కుతున్న భార్గవను చూసి కావేరి, హర్షిత భయపడ్డారు. డాక్టర్ పరీక్ష చేసి అతనికి సిరోసిస్ వచ్చిందని తాగుడు మాని మందులు వాడాలని చెప్పాడు. డాక్టర్ చెప్పిన మందులు కొనుక్కొచ్చారు.

బలవంతంగా మందులు మింగించగలిగారు. కానీ తాగుడు మాన్పించలేక పోయారు. అతని ఈ అలవాటు అతని ప్రాణాలు తీసింది. భార్యాపిల్లలను అనాథలు చేసింది.

ఏం చెయ్యాలో తెలియని అయోమయం. కర్మకాండలకు బంధువులు అందరూ వచ్చి వెళ్లారు. కావాల్సినవన్నీ చేశారు. వెళ్లారు.కావేరి తన తల్లీ, తండ్రీ ఆసరా ఉంటారనుకుంది. వాళ్లు ఏమీ మాట్లాడలేదు. కొడుకుల హయాం వచ్చాక వాళ్లదీ పరాధీన బ్రతుకు అయ్యింది. కూతుర్ని ఆదుకుంటామని చెప్పే ధైర్యసాహసాలు లేకపోయాయి. అందుకే రోజులు అవగానే మారు మాట్లాడకుండా ప్రయాణమయ్యారు.

* * *

ఇదంతా జరిగేసరికి హర్షిత పదో తరగతి చదువుతోంది. స్వతహాగా తెలివిగలది. చదువులో మంచిమార్కులు తెచ్చుకునేది. నాయనమ్మ మరణం, తండ్రి తాగుడుకు బానిస అవడం, తల్లి అమాయకత్వం ఆ పిల్లకు లేని పెద్దరికాన్ని తెచ్చిపెట్టాయి. ఇక తమ జీవితాలు ఎలా జరగాలన్నది తానే నిర్ణయించాలన్న సంగతి ఆమెకు అర్థమయ్యింది.

తండ్రి స్నేహితుల సలహాతో ఆఫీసు నుంచి రావాల్సిన డబ్బులు రాబట్టుకుని బాంకులో వేసింది. తల్లి ఉద్యోగం చేసేంత సమర్థురాలు కాదు. తన చదువు ఇంకా పూర్తికాలేదు. బాంకులో ఉన్న డబ్బులు ఇల్లు ఎక్కువ రోజులు గడపడానికి సరిపోదు. రాత్రంతా ఆలోచించిన హర్షిత బుర్రలో ఒక మెరుపులాంటి చిన్న ఆలోచన. తన తల్లి అమాయకురాలే కానీ అర్భకురాలు కాదు. వంట బాగా చేస్తుంది. సాంబారుపొడి, జంతికలు, చేగోడీలు లాంటివి చేసి ఇళ్లకు వెళ్లి అమ్మితే కొంతవరకు ఫర్వాలేదు.

ముందుగా ఎక్కడో అక్కడ ఆరంభం చెయ్యాలి. తమ ఎదురుగుండా ఉన్న మార్గాన్ని సుగమంగా మార్చుకోవాలంటే ముందు నడవడం మొదలుపెట్టాలి. అడుగులు వెయ్యడం మొదలుపెడితే మార్గాన్ని సుగమం చేసుకునే ఊహలు దాన్ని వెన్నంటే వస్తాయి అనుకుంది హర్షిత.

అవసరాలు, కష్టాలు మనిషిని రాటుతేలుస్తాయి. జరుగుబాటు ఉంటే సోమరితనం అంత సుఖమయమైన స్థితి లేదు. ఏనాడైతే జరుగుబాటు లేదన్న విషయం తెలుస్తుందో ఆ రోజే మనిషి జీవిత పోరాటానికి సన్నద్ధం అవుతాడు. జీవిత సంఘర్షణలో ఎన్నో ప్రయాసలు, ఎన్నో మజిలీలు.

పుడుతూనే నోట్లో బంగారు చెంచాతో పుట్టేవాళ్లు చాలా కొద్దిమంది మాత్రమే ఉంటారు. కొంతమందికి అతిచిన్న వయసులో జీవనపోరాటం మొదలవుతుంది.

సరుకులు బజారునుంచి తీసుకువచ్చి తల్లికి ఏమేం చెయ్యాలో వివరించింది. అయిన ఖర్చు మీద కొంత లాభం చేర్చి ప్రతిదానికి ఒక ధర నిర్ణయించింది. మార్కెట్‌లో ఉన్న వస్తువును దాని ధరను తరచి చూసింది. తాము అంతకన్నా తక్కువ ధరకు ఇవ్వగలిగితే ఫర్వాలేదని నిశ్చయించుకుంది.

ప్రస్తుతానికి తన చదువును ఆపక తప్పదు. తమ్ముడ్ని మాత్రం స్కూల్‌కి పంపి, హర్షిత కార్యోన్ముఖురాలైంది. తల్లి తయారుచేసిన సరుకులు అందంగా కవర్లలో ప్యాక్ చేసి, దానిపైన లేబుల్స్ అంటించి అందమైన అక్షరాలతో సరుకుల పేర్లు దానిమీద రాసింది. పొద్దున్నే లేవడం, స్నానం ముగించి, ఈ సరుకులన్నీ ఒక బాగ్‌లో వేసుకుని, భోజనం చేసి మధ్యలో ఆకలి వేస్తే తినడానికి వీలుగా ఒక చిన్న డబ్బాలో ఇడ్లీ, దోశ, ఉప్మా ఏదో ఒకటి పెట్టుకొని బయలుదేరేది. కొత్తలో ఈ పని అంత సులభంగా ఉండేది కాదు. చిన్న వయసు. ఆశే కానీ అనుభవం లేదు. మొహం మీదే తలుపు వేసేవాళ్లు కొంతమంది అయితే ఎక్కువ లాభాలు లేకుండా ధర నిర్ణయించినా ఇంకా చవకగా ఇస్తారేమో అని బేరాలు సాగించేవాళ్లు కొంతమంది.

ఒక్కొక్క రోజు ఒక్కో పాఠాన్ని నేర్చుకుంటూ ముందుకు సాగడానికి ప్రయత్నిస్తోంది హర్షిత. కావేరి జీవితంలో ఎలాంటి మార్పూ లేదు. ఇదివరకు మొగుడు చెప్పినట్లు వినేది. ఇప్పుడు కూతురు చెప్పినట్లు వింటోంది. రాగాపోగా తేడా అల్లా ఇదివరకు అధికారం. ఇప్పుడు ఆప్యాయత అంతే!

హర్షితకు ఎవరో సలహా ఇచ్చారు. స్కూల్ ఆవరణలో నుంచుంటే స్కూల్లో పనిచేసే టీచర్లు ఇంటికి వెడుతున్న సమయంలో వాళ్లను ప్రార్థిస్తే అమ్మకం బాగా జరగవచ్చని. వాళ్లు చెప్పిన ఆలోచనకు కార్యరూపం ఇవ్వడానికి బయలుదేరింది హర్షిత.

ఎర్రని వేలుపు తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. మెడలో ఉన్న చున్నీని తల మీద కప్పుకుంది. భుజాన్న సంచీ, పైన ఎండ. కారుతున్న చెమటలు తుడుచుకుంటూ వడలిన పుష్పంలా ఉంది హర్షిత. అప్పుడే స్కూలు ముందు ఒక కారు ఆగింది. కార్లోంచి దిగుతున్న మంజరి చూపులు హర్షిత మీద పడ్డాయి. అలసటతో చెమటలు కారుతూ ఇంత ఎండలో భుజాన్న సంచీతో ఈ పిల్ల స్కూల్ ముందు ఎందుకు నిలబడింది? అన్న అనుమానం వచ్చింది. తన అనుమాన నివృత్తి కోసం కారు దిగి నడుచుకుంటూ హర్షిత సమీపానికి వచ్చింది.

“ఏమ్మా! ఇంత ఎండలో ఇక్కడ ఎందుకు నించున్నావు?” అంది.

సంచీలో సరుకులు తీసి చూపిస్తూ, “మా అమ్మ ఇంట్లో చేసింది మేడమ్. చాలా రుచిగా ఉంటాయి. స్కూల్లో టీచర్లు తీసుకుంటారేమో అని ఇక్కడ నిలుచున్నాను. స్కూల్ అయిపోయాక వాళ్లు బైటికి వచ్చినప్పుడు ఎవరైనా కొంటారేమోనన్న ఆశ” అంది.

మంజరి ఆలోచనలో పడింది. నిండా పదిహేనేళ్లు లేవు. చదువుకోవాల్సిన వయసులో ఈ అమ్మాయి ఈ పని చేస్తోందంటే ఆర్థిక ఇబ్బందులు ఉండి ఉంటాయి. వివరాలు తరువాత కనుక్కోవచ్చు అనుకుని,

“నాతో స్కూల్లోకి రా. నీకు నేను సహాయం చేస్తాను” అంటూ ఆ అమ్మాయిని స్కూల్ ఆవరణలోకి భుజం మీద చెయ్యి వేసి తీసుకువెళ్లింది.

నేరుగా ప్రిన్సిపాల్ రూమ్‌కు వెళ్లింది. మంజరిని చూడగానే నవ్వుతూ సాదరంగా ఆహ్వానించింది ప్రిన్సిపాల్. మంజరితోబాటు ఉన్న ఆ పిల్ల ఎవరో అర్థం కాలేదు. మంజరి తనతోబాటు ఆ అమ్మాయిని కూడా కూర్చోమంది.

కుర్చీలో కూర్చుంటూ మంజరి అంది. “మీరు నన్ను ఎందుకో రమ్మన్నారట. నేను కారు దిగుతుంటే ఈ అమ్మాయి దగ్గర కొన్ని సరుకులు ఇంట్లో చేసినవి ఉన్నాయి. మీ స్కూల్లో టీచర్లు ఎవరైనా కొంటారేమో కనుక్కోండి. మార్కెట్ కన్నా ఇంట్లో చేసిన వస్తువులు నాణ్యత ఉంటాయి. ఈ వస్తువులు కొనడం ద్వారా ఈ అమ్మాయికి సహాయం చేసినవాళ్లం అవుతాము. ఈ విధంగా తన

కాళ్లమీద తను నిలబడాలన్న ఆత్మవిశ్వాసానికి మనం మెచ్చుకోవాలి" అంది మంజరి.

మంజరి పిల్లలిద్దరూ ఆ స్కూల్లో చదువుతున్నారు. కిరణ్, కార్తీక. కార్తీక ఆరో క్లాస్, కిరణ్ నాలుగో క్లాస్. మంజరికి, ఆ పిల్లలకు ఉన్న సంబంధం ఆ స్కూల్ ప్రిన్సిపాల్‌కు తెలుసు. మంజరి గురించి అన్ని విషయాలు, ఆమె చేసే మంచి పనులు తెలుసు. అందుకే మంజరి పట్ల గౌరవం ఆవిడకు.

"ఈసారి యాన్యువల్ ఫంక్షన్‌కు మిమ్మల్ని చీఫ్ గెస్ట్‌గా అనుకుంటున్నాము. ముందుగా మీ పర్మిషన్ తీసుకుందామన్న ఉద్దేశంతో మిమ్మల్ని రమ్మని పిలవడం జరిగింది."

"మీకు తెలుసు కదా! నాకిలాంటివన్నీ ఇష్టం ఉండవని, నాకు తోచినది చెయ్యడం తప్ప ఈ వయసులో నేను ఏదీ ఆశించి చెయ్యడం లేదు. దేశంలో అందర్నీ బాగుపరిచే ఉద్దేశం కానీ, ఆలోచన కానీ నాకు లేవు. చెయ్యలేను కూడా! నాకు తోచిన రీతిలో నాకున్న పరిధిలో సమాజానికి ఇతోధికంగా సాయపడాలన్నది నా కోరిక.

నేను చేసే ఈ చిన్ని పనులకు మీరేదో పెద్ద పేర్లు పెట్టి నన్నొక గొప్పదాని కింద జమకట్టి ప్రముఖ వ్యక్తి కింద నాకు ఇంపార్టెన్స్ ఇవ్వకండి. నాకివన్నీ ఇష్టం ఉండదు. అందరిలాగే కిరణ్, కార్తీకల తల్లిదండ్రులుగా గార్డియన్స్‌గా యాన్యువల్ ఫంక్షన్‌కి వస్తాము" అంది.

మంజరిని ఒప్పించడానికి నోరు తెరవబోతున్న ప్రిన్సిపాల్‌ను సున్నితంగా వారిస్తూ "నగరంలో చాలా ప్రముఖులు ఉన్నారండి. వాళ్లను పిలవండి. ఇంతకన్నా నేను చెప్పలేను. వీలుంటే ఈ అమ్మాయికి సహాయం చెయ్యండి."

మంజరిని ఒప్పించడం సాధ్యం కాదనుకుని, "ష్యూర్ అలాగే! నీ పేరేంటమ్మా?" అని అడిగింది ప్రిన్సిపాల్.

"హర్షిత అండీ" అని చెప్పింది. మంజరి ప్రిన్సిపాల్‌గారి మాటలు వింటూ, మంజరిని అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తోంది.

"నీ బాగ్‌లో ఉన్న సరుకులు ఇక్కడ వదిలి రేపు రా. నీ సరుకులు అన్నీ మా స్టాఫ్ కొనేటట్లు చేసి డబ్బులు నీకు అందజేస్తాను. రేపు వచ్చి నీ డబ్బులు కలెక్ట్ చేసుకో" అంది ప్రిన్సిపాల్.

హర్షిత మనసులో అనుకుంది 'ఈ మంజరిగారు ఎవరో చాలా పవర్‌ఫుల్ లేడీలా ఉంది' అని.

కొద్దిక్షణాల్లో హర్షిత, మంజరి లేచి వాళ్ల వాళ్ల నెలవులకు వెళ్లిపోయారు. ఆ తరువాత పనిలో పడి మంజరి చాలారోజులు హర్షిత గురించి ఆలోచించలేదు. ఒక రోజు సాంబారు పొడి అయిపోయింది. అప్పుడు సడన్‌గా హర్షిత జ్ఞాపకం వచ్చింది.

'అరె, ఆ రోజు ఆ పిల్ల దగ్గర్నుంచి తను కూడా సరుకులు కొని ఉండవలసింది. తను వాడుకుని బాగుంటే తనకు తెలిసినవాళ్లకు కూడా చెప్పి ఉంటే ఆ అమ్మాయికి సాయపడినట్లు ఉండేది' అనుకుంది.

అలా అనుకున్న మరుక్షణం ప్రిన్సిపాల్‌కు ఫోన్ చేసి హర్షిత గురించి అడిగింది. ప్రిన్సిపాల్ ఇచ్చిన సమాధానం మంజరిని నిరాశకు లోను చేసింది. హర్షిత మర్నాడు స్కూల్‌కు వచ్చి డబ్బులు తీసుకుని తన సరుకులు అన్నీ అమ్ముడైనందుకు హర్షం వ్యక్తం చేసి వెళ్లిపోయింది. మళ్లీ రాలేదు.

ఆ విషయం తెలుసుకున్న మంజరి చాలా బాధపడింది. హర్షిత ఏ కారణాల చేత రాలేదో! తన గురించి వివరాలు కూడా అడగలేదు. ఇంత తొందరగా ఆ అమ్మాయి ఆర్థికబాధలు తీరిపోయాయా?

హర్షితను చూసిన ఉత్తర క్షణంలోనే ఆ అమ్మాయికి జీవితం పట్ల ఒక అవగాహన, దేన్నైనా సాధించడానికి వెనుకాడని మనస్తత్వం ఉన్నట్లు కనబడ్డాయి. ఇంత చిన్న వయసులో కుటుంబ బాధ్యతలు తలకెత్తుకునే పరిస్థితులు ఏమయి ఉంటాయి? తల్లితండ్రులు లేరా?

ఆ అమ్మాయిని గురించిన ఆలోచనలతో మంజరి మనసు పరిపరివిధాల పరుగులు పెట్టడం మొదలుపెట్టింది. వాటిని ఎక్కడ ఆపాలో తెలియదు.

* * *

"అమ్మా! గుడికి వెడదామా?" అన్న యాదయ్య భార్య లక్ష్మి మాటలతో ఈ లోకంలోకి వచ్చింది. ఆమె ఎదురుగా పూజాసామగ్రితో నిలబడ్డ లక్ష్మిని చూడగానే తన ఆలోచనలు పక్కకు పెట్టి గుడికి వెళ్లడానికి తయారయ్యింది.

వారంలో రెండు రోజులు గుడి, రెండు రోజులు తోటపని, రెండు రోజులు ఊళ్లో ఆమె ధనసహాయం అందజేసే వృద్ధాశ్రమాలు, అనాథ శరణాలయాలు

అన్నీ సందర్శించడం, ఆదివారాల్లో ఇంట్లో సభ్యులతో కలసి గడపడం ఆమె అలవాటు.

ప్రతి ఆదివారం వాళ్ల ఇంట్లో ఒక చిన్న పండగలా ఉంటుంది. జెన్నీ, మంజరి కూడా పిల్లలతో పిల్లలయిపోయి, ఆటలు, పాటలు, కేరింతలు చేస్తారు. యాదయ్య, లక్ష్మి, వాళ్ల పిల్లలు అందరూ ఆ ఆటపాటలలో భాగస్వాములే. అందుకే ఆ ఇంట్లో అందరూ ఆదివారం కోసం ఎదురుచూస్తారు. ఆనందంగా గడిపే ఆ రోజంటే అందరికీ ఇష్టం.

మంజరి జంటనగరాల్లో ఉన్న ఏ గుడీ వదిలిపెట్టకుండా అన్ని గుళ్లూ వెడుతుంది. ఆ రోజు చిక్కడపల్లి వేంకటేశ్వరస్వామి దేవాలయానికి వెళ్లింది. కారు దిగి లక్ష్మి పూజ సామానుతో అనుసరించగా గుడి ఆవరణలోకి అడుగుపెట్టింది. గుడిలో ఒక స్తంభానికి ఆనుకుని కళ్లు మూసుకున్న హర్షిత కనిపించింది. ఆమెను చూడగానే మంజరికి చాలా ఆనందం కలిగింది. హర్షితను ఎలా కలవాలా అనుకున్న తనకు దైవసాన్నిధ్యంలో ఆమెను కలవడం దేనికో సంకేతంలా అనిపించింది.

మెల్లిగా ఆమె దగ్గరకు వెళ్లి భుజం మీద చెయ్యి వేసింది. భుజం మీద స్పర్శకు కళ్లు తెరచిన హర్షిత ఎదురుగా మంజరిని చూసి ఆశ్చర్యపోయింది. కంగారుగా లేచి నుంచుని ఏం మాట్లాడాలో తెలియక కండువా కొసలు మెలిపెట్టడం మొదలుపెట్టింది. హర్షిత ఎక్కువగా పరికిణీ, కండువాలు వేసుకుంటుంది. ఎందుకంటే ఆ బట్టలకు కుట్టుకూలీ ఇవ్వక్కర్లేదు.

కావేరి ఇంట్లో కుడుతుంది. అందరిలాగా పంజాబీ డ్రెస్సు వేసుకోవాలని ఉన్నా ఆ కోరికను మనసులోంచి తుంచేసింది. తండ్రి ఉండగా కొన్నవి కొన్ని ఉన్నాయి. అవి అప్పుడప్పుడు వేసుకుంటూ ఉంటుంది.

"ఏం హర్షితా బాగున్నావా?" అంటూ పలకరించింది మంజరి.

"బాగున్నానండీ మీరు ఈ గుడికి వస్తారా?" అని అడిగింది.

"ఏం ఎందుకు అలా అడిగావు?"

"నేనెప్పుడూ చూడలేదు. నేను తరచూ ఈ గుడికి వస్తూ ఉంటాను" అంది హర్షిత.

"నేను తరచూ రాను. అప్పుడప్పుడు వస్తాను. ఊళ్లో ఉన్న మిగిలిన గుళ్లకు

కూడా వెడతాను. నువ్వు తరచూ ఇక్కడికి వస్తానంటున్నావు అంటే మీ ఇల్లు ఇక్కడకు దగ్గరా?"

"అవునండీ. ఈ గుడికి రెండు వీధుల అవతలే మా ఇల్లు. అందుకే ఇక్కడకు వస్తాను."

"సరే రా. ముందు దేవుడి దర్శనానికి వెడదాం. ఆ తరువాత నీతో మాట్లాడాలి" అంది మంజరి.

హర్షిత ఆశ్చర్యంగా చూసింది 'తనతో మాట్లాడ్డానికి ఈవిడకు ఏం మాటలు ఉన్నాయి?' అని. పెద్దావిడ కదా ఎందుకు ప్రశ్నించడం అని భగవత్ దర్శనానికి ఆమెను అనుసరించింది.

ఆ కల్యాణమూర్తి ఏడుకొండలవాడ్ని దర్శించుకున్నాక గుడి మెట్ల మీద ఒక వారగా కూర్చున్నాక అడిగింది మంజరి –

"నీ గురించి చెప్పమ్మా. ఆ రోజు హడావుడిలో అడగలేకపోయాను. ఇంత చిన్న వయసులో చదువు మానేసి ఈ అమ్మకాలేమిటి? నిన్ను గురించి ప్రిన్సిపాల్‌ను అడిగాను. ఆ రోజు తరువాత నువ్వు మళ్లీ రాలేదని తెలిసింది. ఏమైనా వేరే కొత్త పని మొదలుపెట్టావా?"

మంజరి మాటల్లోని ఆప్యాయతకు మంచు కరిగినట్లుగా ఎన్నో రోజులుగా ఘనీభవించిన కన్నీళ్లు చెంపల మీద జాలువారాయి. ఆ అమ్మాయి కన్నీళ్లు చూసి కంగారుపడింది మంజరి.

"అరె నేను ఏమన్నాను? నీకు బాధగా ఉంటే చెప్పొద్దులే. ఏదో తెలుసుకోవాలన్న కుతూహలం కొద్దీ అడిగాను" అంటూ భుజం మీద చెయ్యి వేసింది. ఆ స్పర్శలోని ఆప్యాయతకు చలించిన హర్షిత ఆవిడ ఒళ్లో తల పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆకుచాటు పిందెలాగ పెరగాల్సిన వయసులో కష్టాలను ఎదుర్కోవాల్సి రావడం ఎంత కష్టతరమైనదో అనుభవించిన వాళ్లకే తెలుస్తుంది. హర్షిత ఏడుస్తున్నంతసేపూ మాట్లాడకుండా నిశ్శబ్దంగా ఆమె వీపు నిమురుతూ ఉండిపోయింది మంజరి. కొంత సేపటికి తెప్పరిల్లిన హర్షిత ఆవిడ ఒళ్లో నుంచి గబుక్కున లేచి సిగ్గుపడుతూ కళ్లు తుడుచుకుంటూ "సారీ అండి" అంది.

ఎవరో పెద్దగా పరిచయం లేని మనిషి దగ్గర అంత దుఃఖం ఎందుకు

వచ్చిందో అర్థం కాలేదు. తన మనసు ఓదార్పు కోరుకుంటుందా అనుకుంది హర్షిత.

"ఏం ఫరవాలేదు మీ అమ్మలాంటిదాన్ని. నిన్ను మొదటిసారి చూసినప్పుడే నాకు ఏదో తెలియని వాత్సల్యం కలిగింది కాబట్టి నీ సమస్యలేమైనా ఉంటే నాతో షేర్ చేసుకోవచ్చు" అంది మంజరి.

మంజరి మాటలతో ఏదో సాంత్వన కలిగినట్లనిపించింది. మెల్లిగా తన గురించి అన్ని వివరాలు ఆమెతో చెప్పింది.

"ఈమధ్య అమ్మకు ఒంట్లో బాగుండటం లేదు. అందుకే అమ్మ పొడులు, జంతికలు తయారుచేయలేకపోతోంది. నాకు ఏదో కొద్దిగా వంట చేయడం వచ్చు కానీ మిగిలినవి చేతకావు. ఇది కూడా ఈ మధ్యే నేర్చుకున్నాను. అమ్మ ఆరోగ్యం బాగుపడితే కానీ మళ్లీ ఆ పని మొదలుపెట్టలేము. అప్పటిదాకా ఏం చెయ్యాలో, ఇల్లు ఎలా గడుస్తుందో అర్థం కావటం లేదు. బాంకులో ఉన్న డబ్బులు తరిగిపోతున్నాయి. అమ్మ మందులు, ఇంటి ఖర్చులు, తమ్ముడి స్కూల్ ఫీజు ఇవన్నీ అందులోనే గడవాలి. ఏం చెయ్యడానికి పాలుపోని పరిస్థితుల్లో చిక్కుకున్నాను. కాసేపు భగవత్ సన్నిధానంలో కూర్చుందామని వచ్చాను" అంది.

"సరే, మీ ఇంటికి నన్ను తీసుకువెడతావా?" అంది మంజరి. వాళ్లింటికి వెళ్లి పరిస్థితులు ఆకళింపు చేసుకుందామన్న భావనతో.

"మీరు మా ఇంటికి వస్తారా?" అంటూ ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసింది హర్షిత.

"ఏం రాకూడదా?"

"అబ్బే అది కాదండీ..." అని తడబడుతున్న ఆ పిల్లను మెల్లిగా దగ్గరకు తీసుకుని "నడు మరి" అంటూ లక్ష్మివైపు తిరిగింది బయలుదేరమన్నట్లు.

మంజరి, హర్షిత కారు వెనక సీటులో కూర్చున్నారు. లక్ష్మి చెప్పవలసిన అవసరం లేకుండానే ముందు సీట్లో భర్త పక్కన కూర్చుంది.

హర్షిత దారిచూపగా యాదయ్య కారు ఆమె ఇంటివైపు మళ్లించాడు. చుట్టుపక్కల అపార్ట్‌మెంట్‌లు వచ్చినా ఇంకా కొంతమంది తమ పాత ఇళ్లను వదలలేక ఆ ఇళ్లను చిన్న చిన్న పోర్షన్స్‌గా చేసి అద్దెలకు ఇచ్చారు. అలాంటి ఒక పోర్షన్‌లో హర్షిత వాళ్లు అద్దెకుంటున్నారు.

రెండు గదులు, వంటిల్లు ఉన్న ఇల్లది. కొంత ఫర్నిచర్ హర్షిత తండ్రి టైములో కొన్నది అలాగే ఉండడంతో అవి వాళ్ల పాతవైభవాన్ని గుర్తుచేస్తున్నాయి. ఆ వీధిలో అంత ఖరీదైన కారు రావడం అందులోంచి హర్షిత దిగడం, ఆమెతో ఉన్న మంజరిని చూసి చుట్టుపక్కలవాళ్లు వింతగా ఇళ్లలోంచి తొంగిచూశారు.

హర్షిత, మంజరి, లక్ష్మి లోపలికి దారితీశారు. సోఫాలో ఉన్న గుడ్డలు తీసి "కూర్చోండి మేడమ్" అంటూ చేతిలో ఉన్న గుడ్డలు లోపల పెట్టడానికి వెళ్లింది.

"అమ్మా!" అన్న కూతురి పిలుపుతో అప్పటిదాకా దగ్గి అలిసిపోయిన కావేరి మెల్లిగా కళ్లు విప్పి చూసింది.

మెల్లిగా తల్లికే వినపడేటట్లుగా మంజరి గురించి చెప్పి, ఆవిడ వచ్చినట్లు తెలియపరిచింది. ఓపిక తెచ్చుకుని మెల్లిగా మంచం మీద నుంచి లేచి ముందు గదిలోకి వచ్చింది కావేరి.

"నమస్కారమమ్మా! మీ గురించి మా హర్షిత చెప్పింది" అంటూ చేతులు జోడించింది. అంత గొప్పావిడ తమ ఇంటికి ఎందుకు వచ్చిందో అర్థం కాలేదు.

ఆ కాస్త సమయంలోనే వాళ్లెంత దీనావస్థలో ఉన్నారో గ్రహించింది మంజరి. కావేరి నడిచి వస్తుంటే అస్థిపంజరం నడిచి వస్తున్నట్లుగా ఉంది. ఎక్కువసేపు మంచంలో పడుకుని గడపడం మూలాన జుట్టంతా అట్టలు కట్టి ఉంది.

హర్షిత రెండు స్టీలు గ్లాసుల్లో కాఫీ చేసి తీసుకువచ్చింది.

"తీసుకోండి మేడమ్" అంటూ గ్లాసులు ఉన్న చిన్న ప్లేటు ఆమె ముందుకు వంచి తీసుకోమన్నట్లుగా చూసింది.

ఆ పిల్ల కళ్లల్లో కనబడుతున్న ఆప్యాయతకు కాదనలేక కాఫీ తీసుకుని, రెండో గ్లాస్ కావేరికిస్తూ "మీరిలా వచ్చి నా పక్కన కూర్చోండి" అంది మంజరి కావేరిని.

కావేరీ మూలగా ఉన్న ఒక స్టూల్ జరుపుకుని కూర్చుంటూ "నేను కాఫీ మానేశాను. ఆ గ్లాసు మీ పక్కనున్న ఆమెకు ఇవ్వండి" అంది.

మారు మాట్లాడకుండా ఆ రెండో గ్లాసు లక్ష్మికి ఇచ్చింది. మంజరి ఎంత చనువు ఇచ్చినా, తన పక్కన కూర్చోమన్నా లక్ష్మి ఎప్పుడూ తన పరిధి దాటదు. అందుకే సోఫా పక్కన నేలమీద కూర్చుంది. ఆమె ఇచ్చిన కాఫీ గ్లాసు అందుకుంది.

హర్షిత వైపు చూస్తూ, "మీ తమ్ముడేదమ్మా? కనబడదేమిటి? ఈ పాటికి స్కూల్ అయిపోయి ఉంటుంది కదా!" అంది మంజరి.

"ఆడుకుందుకు వెళ్లి ఉంటాడు. కాస్సేపట్లో వస్తాడు" అంది హర్షిత.

తన మనసులో రూపుదిద్దుకున్న ఆలోచనలను బహిర్గతం చెయ్యడం మంచిదనుకుంది మంజరి. తన ఆలోచనను వాళ్లు హర్షిస్తారో లేదో తెలియదు. అయినా చెప్పాక కదా వాళ్లు హర్షిస్తారో లేదో తెలియడానికి, గొంతు సవరించుకుని,

"కావేరిగారూ! మీ ఇంటి పరిస్థితి హర్షిత ద్వారా నాకు తెలిసింది. ప్రస్తుతం మీరున్న పరిస్థితుల్లో ఎవరిదో ఒకరి చేయూత కావాలి. ఆ చేయూత నేను అందించడానికి సంసిద్ధంగా ఉన్నాను. ముక్కూ మొహం తెలియని నేను, మీకు ఎందుకు సహాయం అందజేయాలనుకుంటున్నానన్న సందేహం మీకు కలగవచ్చు.

నా శక్తి మేరకు నాకు తటస్థపడ్డవాళ్లల్లో మంచివాళ్లు ఎవరైనా కష్టంలో ఉంటే ఇతోధికంగా సహాయపడాలన్నది నా అభిమతం. ప్రపంచంలో అందరికీ సహాయపడగలనని నేను అనుకోవడం లేదు. ఒకానొకప్పుడు ఇలాంటి కష్టాలు నేనూ అనుభవించినదాన్నే. కాబట్టి ఆ కష్టాలను అధిగమించడానికి నాకు చేతనయిన సహాయం చెయ్యాలని నా కోరిక.

మొదటి చూపులోనే హర్షితపట్ల నాకు సద్భావం ఏర్పడింది. చదువుకోవాల్సిన వయసులో కుటుంబ బాధ్యతను నెత్తిన వేసుకుంది. ఇంత ఆత్మాభిమానం, తెలివితేటలు ఉన్న పిల్ల చదువుకుని పెద్దదైతే రేపు సమాజానికి గర్వకారణంగా మారి, తను కూడా సమాజానికి ఉపయోగపడాలని నా కోరిక, మీరేమంటారు?" అంది మంజరి.

"నాకేం తెలియదండి" అంది కావేరి.

"అమ్మకు అంత పెద్ద మాటలు అర్థం కావండి. అమ్మ అమాయకురాలు. పెద్దగా చదువుకోలేదు కూడా. అందుకే ఇంటి బాధ్యత నేను నెత్తిన వేసుకున్నాను. చిన్నతనం నుంచీ ఆవిడ తెలివితక్కువతనాన్ని ఆసరా చేసుకుని అందరూ ఆమెను వాడుకుందుకు ప్రయత్నించారు తప్ప, ఆవిడ గురించి ఆలోచించలేదు" అంది హర్షిత.

"సరే, నేను చెప్పదల్చుకున్నది నీతోనే మాట్లాడతాను. నేను నీ చదువు, మీ తమ్ముడి చదువు బాధ్యత తీసుకుంటాను. మీ అమ్మగారి ఆరోగ్యం కుదుటబడ్డాక ఆవిడ చెయ్యగలిగిన పని ఏదైనా ఏర్పాటు చేస్తాను. ఇవన్నీ నేను ఫ్రీగా మీకు ఎందుకు చేస్తున్నాను అని నువ్వు అనుకోవచ్చు.

ఇందులో నాదో కండిషన్ ఉంది. నువ్వు, నీ తమ్ముడు చదువులకయ్యే ఖర్చులు అణా పైసలతో రాయబడుతుంది. మీరిద్దరూ ఎంతవరకూ చదువుకున్నా నాకభ్యంతరం లేదు. కానీ మీ చదువులు పూర్తి అయ్యి ఉద్యోగాలు వచ్చాక ఈ అయిన ఖర్చు బాకీ కింద తీర్చినా సరే, లేక మీరిద్దరూ ఇంకో ఇద్దరికి ఇలాగే చేయూత ఇచ్చినా సరే.

ఇలా ఒక దీపం నుంచి ఇంకో దీపం వెలిగించటం మొదలుపెడితే కొంతైనా దేశంలో పేదరికం, నిరక్షరాస్యత దూరం అవడానికి ఆస్కారం ఉంటుంది. నువ్వు కొంచెం పెద్దదానివి కాబట్టి ఖాళీ టైమ్‌లో చిన్న క్లాసుల వాళ్లకు ట్యూషన్ చెప్పి డబ్బు సంపాదించుకోవాలి. అది నీ పై ఖర్చులకు పనికి వస్తుంది. నా సలహా నచ్చిందా?" అని అడిగింది మంజరి.

హర్షిత కిదంతా ఆశ్చర్యంగా ఉంది. 'లోకంలో ఇలాంటివాళ్లు కూడా ఉంటారా?' అని.

కానీ ఆవిడ ఆలోచన ఎంత మంచిది. ఇలాంటి చైన్ రియాక్షన్‌తో సమాజంలో కొంతమందికైనా మేలు జరుగుతుంది కదా!

"మీ సలహా చాలా చాలా బాగుంది. తుపాన్‌లో చిక్కుకున్న నావలా ఉన్న మా పరిస్థితిలో మీలాంటి దేవత వచ్చి ఇలా వరాలిస్తానంటే నాకు నమ్మబుద్ధి కావటం లేదు" అంటూ చెంపలమీద కారుతున్న కన్నీటిని సైతం తుడుచుకోవటం మర్చిపోయి, వంగి ఆమె పాదాలకు నమస్కరించింది.

పాదాలకు నమస్కరిస్తున్న హర్షితను ప్రేమగా లేపి అక్కున చేర్చుకుంది మంజరి.

అలా మంజరి జీవితంలో ప్రవేశించింది హర్షిత. హర్షితని ఆమె తమ్ముడు అభయ్‌ను స్కూల్లో జాయిన్ చేసింది. కావేరికి టి.బి. ఆరంభదశలో ఉంది. ఆమెకు మంచి వైద్యానికి ఏర్పాట్లు చేసింది.

కావేరి ఆరోగ్యం బాగుపడ్డాక ఆమెను ఒక అనాధశరణాలయంలో పిల్లలను చూడ్డానికి ఆయాగా నియమించింది.

హర్షిత చాలా తెలివైన పిల్ల. చదువుమీద అమితమైన ఆసక్తి. టెంత్ స్టేట్ ఫస్ట్ వచ్చింది. "తరువాత ఏం చదువుతావో నిర్ణయించుకుంటే దాన్ని బట్టి ఇంటర్‌లో గ్రూప్ సెలక్షన్ చేసుకోవచ్చు. నీ నిర్ణయం ఏమిటి?" అని అడిగింది మంజరి.

చిన్నప్పట్నుంచీ డాక్టర్ కావాలన్న కోరిక ఆమె మనసులో బలంగా ఉంది. కానీ డాక్టర్ చదవడం అంటే మాటలు కాదు. అది డబ్బుతో కూడుకున్న పని. అదీకాక తొందరగా జీవితంలో సెటిల్ అయ్యి, బాధ్యతలు చేపట్టడానికి అవకాశం ఉండదు.

తటపటాయిస్తున్న హర్షితను చూసి "నీ మనసులో ఉన్న కోరికను బయటపెట్టు. నీవు ఎన్నుకున్న మార్గం సరైనదో లేదో నేను ఆలోచించి నీకు మార్గం చూపించగలుగుతాను" అంది మంజరి.

మెల్లిగా తన మనసులోని కోరికను బైటపెట్టింది. తన భయాలను కూడా బహిర్గతం చేసింది.

ఆమె భయాలను విని చిరునవ్వు నవ్వి, "నీకు ఏ అడ్డంకీ లేదు. నువ్వు ఏం చదువుకున్నా నేను చదివిస్తాను" అంది మంజరి.

అలా హర్షిత ఇంటర్ అవగానే మెడిసిన్‌లో జాయిన్ అయ్యింది. అభయ్‌ను రెసిడెన్షియల్ స్కూల్లో జాయిన్ చేశారు. కావేరి అనాధశరణాలయంలోనే ఉండడం మొదలుపెట్టింది. ఆమె జీతం అభయ్ స్కూలు ఫీజులకు సరిపోతుంది.

హర్షిత ఇప్పుడు మంజరి ఇంట్లోనే ఉంటోంది. ఆ రోజు మాల్‌లో కనబడ్డ మనిషి గురించి గుర్తుకు వచ్చినా ధైర్యం చేసి మంజరిని అడిగే చనువు లేదు.

* * *

మంజరికి ఇంటి బాధ్యతలు, బైట సోషల్ సర్వీస్ కాక కాస్సేపు పూజ, మెడిటేషన్ కూడా చేస్తుంది. చాలామటుకు వంట తనే చేస్తుంది. లక్ష్మి పై పనులకు సహాయపడుతుంది. ఇంట్లో ఉన్న పని, వాళ్ల వాళ్ల వయసును బట్టి అందరికీ పంచబడుతుంది.

ఒకరు పనిచేస్తే ఒకరు కూర్చోవడం మంజరికి ఇష్టం ఉండదు. వంట చేసిన గిన్నెలు లక్ష్మి తోముతుంది. ఎవరి కంచాలు వాళ్లు కడిగి పెట్టుకోవాలి. డైనింగ్ టేబుల్ మీద కంచాలు ఒకరు పెడితే ఇంకొకళ్లు మంచినీళ్లు పెట్టడం చెయ్యాలి.

ఒకరు డస్టింగ్ చేస్తే, ఒకరు మొక్కలకు నీళ్లు పెడతారు. అన్ని పనులు సుశిక్షితులైన సైనికుల్లా చేసుకుపోతారు. ఆ ఇంటికి కొత్తగా వచ్చినవాళ్లకు ముందుగా ఆ పద్ధతులు విచిత్రంగా అనిపించినా తరువాత మెచ్చుకోకుండా ఉండలేరు. అందరి ఇళ్లల్లో అలాగే ఉంటే, ఇంట్లో పని ఎవరికీ బరువు అనిపించదు.

జెన్నీని, మంజరిని చూసిన వాళ్లకు కొంచెం ఆశ్చర్యం కలుగుతుంది. జెన్నీ ఆ దేశస్థుడిలా కనిపించడు. అతని రూపం చూసి అనుమానం వచ్చినా, అతని అలవాట్లు, అతని తెలుగు ఉచ్చారణ మాత్రం ఆ అనుమానాన్ని దూరం చేస్తుంది.

అతని ఇంగ్లీష్‌లో అమెరికన్ ఉచ్చారణ స్పష్టంగా తెలుస్తుంది. మంజరి, జెన్నీ అమెరికా నుంచి వచ్చారన్న విషయం అందరికీ తెలుసు. అందుకే అతని ఇంగ్లీష్‌ను ఎవరూ పెద్దగా పట్టించుకోరు.

జెన్నీ రోజూ పొద్దున్నే లేచి కాస్సేపు యోగా, మెడిటేషన్ చేస్తాడు. ఆ తరువాత ఒక కప్పు కాఫీ తాగి, మంజరి, అతను ఇద్దరూ వాకింగ్‌కు వెళతారు. ఒక గంట వాకింగ్ చేసి ఇంటికి వచ్చి ఇద్దరూ ఆ రోజు పేపరు చూస్తారు.

మంజరి హెడ్‌లైన్స్ మాత్రం చదివి పిల్లల్ని స్కూలుకు పంపటానికి ప్రయత్నాలు చేస్తుంది. లక్ష్మి సహాయంతో వాళ్లకు బ్రేక్‌ఫాస్ట్, లంచ్ బాక్సులు తయారుచెయ్యడం అన్నీ చేశాక, స్నానం చేసి, పూజ చేసుకుందుకు వెడుతుంది.

హర్షిత, కార్తీక్, కిరణ్, ఉజ్వల, కుముద, కేదార్ వీళ్లందరూ మంజరి ఇంట్లో ఉండే పిల్లలు. హర్షిత అందరికన్నా పెద్దది. అందరూ అక్కా అని పిలుస్తారు. కార్తీక్ ఆరో క్లాస్, కిరణ్ నాలుగో క్లాస్, ఉజ్వల, కుముద సెవెన్త్ క్లాస్, కేదార్ అందరికన్నా చిన్నవాడు, రెండో క్లాస్ చదువుతున్నాడు.

కార్తీక, కిరణ్‌లు ఒక స్కూల్‌లోనూ, ఉజ్వల, కుముద, కేదార్‌లు ఒక స్కూల్లోనూ చదువుతున్నారు. వీలునిబట్టి వాళ్ల హోంవర్క్‌లు హర్షిత కానీ, మంజరి కానీ చూస్తారు. జెన్నీ అవసరానికి మించి ఇంటిపనుల్లో కలుగజేసుకోడు. అతని దినచర్యలో ఎక్కువభాగం ఆధ్యాత్మిక చింతనలో గడుపుతాడు. నగరంలో ఎక్కడ ప్రవచనాలు ఉన్నా అతను తప్పక హాజరు అవుతాడు. అతనికొక చిన్న కారు ఉంది. అతనే డ్రైవ్ చేస్తాడు.

ఒక్క ఆదివారం మాత్రం ఇంట్లో అందరికీ పండగలా ఉంటుంది. ఆ రోజు జెన్నీ మనస్ఫూర్తిగా పిల్లలతో పిల్లవాడిలా ఎంజాయ్ చేస్తాడు. జెన్నీ, మంజరిలది విచిత్రదాంపత్యం. ఒకే ఇంట్లో ఉన్నా వాళ్లిద్దరూ ఎక్కువగా

మాట్లాడుకున్న సందర్భాలు చాలా తక్కువ. మాట్లాడుకున్నప్పుడు ఎప్పుడూ పురాణాలు, ఉపనిషత్తుల మీద చర్చించుకుంటారు. వాళ్లిద్దరూ ఇంటి విషయాలు ఎప్పుడు చర్చించుకుంటారో ఇంట్లో ఉన్న మిగిలిన జనాలకు తెలియదు.

వీళ్లిద్దరూ ఎవరింటికీ వెళ్లడం ఎప్పుడూ జరగదు. లక్ష్మి, యాదయ్య, హర్షితకి వీళ్ల గురించి సంశయాలు ఉన్నా, వాళ్లు తమ మనస్సులోనే ఆ ఆలోచనలకు సమాధి కట్టేశారు.

ఆ రోజు ఆదివారం. పిల్లలకు ఆటవిడుపు. ఎనిమిదికన్నా ముందు ఎవరూ లేవరు. మంజరి, జెన్నీ మాత్రం వాళ్ల దినచర్యలో ఏ మార్పూ తీసుకురారు. వాకింగ్ నుంచి వచ్చాక గార్డెన్‌లో కూర్చుని పేపర్ చదువుతున్న జెన్నీ దగ్గరకు ట్రేలో కాఫీ కప్పులతో వచ్చింది మంజరి.

"నీతో కొంచెం మాట్లాడాలి" అంటూ కాఫీ అందించింది.

"మాట్లాడు. నాతో మాట్లాడడానికి నీకు పర్మిషన్ కావాలా?" అన్నాడు.

"రెండు రోజుల క్రితం సిటీ సెంట్రల్ వెళ్లినప్పుడు దినేష్ కనిపించాడు. అమ్మా అంటూ పిలుస్తూ వెనకపడ్డాడు. నేను చూడనట్లుగా తెలియనట్లుగా నటించి ఇంటికి వచ్చేశాను" అంది.

"ఇన్నాళ్ల తరువాత కనబడ్డాడంటే తను కూడా అమెరికా నుంచి ఇక్కడకు వచ్చేశాడేమో! అయినా నువ్వు మాట్లాడి ఉండాల్సింది."

"అన్నీ తెలిసి నువ్వు ఇలా మాట్లాడుతున్నావేమిటి? ఈ అమ్మ ఇంకా బతికుందని వాడికి ఇన్నాళ్లకు తెలిసిందా? వాడి మాటలు, వాడి చర్యలు మర్చిపోయేవేనా? వాడు నా గుండెలకు చేసిన తూట్లు ఇంకా ఈనాటికీ పూడలేదు" అంది బాధగా.

"లేదు మంజరీ! క్షమించడంలో ఉన్న ఆనందం దేనిలోనూ లేదు. ఇంతమంది అనాథలకు అండగా నిలిచిన నువ్వు నీ కన్నకొడుకును ఎందుకు కాదను కుంటున్నావు? అవును దినేష్ చేసింది తప్పే కానీ, ఓ స్త్రీగా, తల్లిగా నీలో క్షమాగుణం ఉండాలి."

"లేదు. నా మనసు చాలా దెబ్బతింది" అంది మంజరి.

"అలా అనకు మంజరీ! మానవుడు ఇన్ని అరాచకాలు చేస్తున్నా భూమాత అన్నీ భరించి ఈ భూభారాన్ని మోయటం లేదూ! ఆమె నీలాగే అలిగితే ఈ

మానవాళి అంతా ఏమయిపోతుంది?” అని చిరునవ్వు నవ్వాడు.

“లేదు జెన్నీ! నాలో అంత క్షమాగుణం లేదు. ఈ అనాథ పిల్లల్ని కూడా ఏదో ఆశించి నేను చేరదియ్యలేదు. నేను పడ్డ బాధల్ని మర్చిపోవడానికి దీన్నొక ఆధారంగా ఎంచుకున్నాను తప్ప, వీళ్లనుంచి నేను ఏమీ ఆశించటం లేదు. ఇదివరకటి ప్రేమమూర్తి, అనురాగమూర్తి అయిన మంజరి ఏనాడో చచ్చిపోయింది. ఇప్పుడు విరాగిగా మిగిలిన మంజరిని మాత్రమే!”

“లేదు మంజరీ! నిన్ను నువ్వు మోసపుచ్చుకుంటున్నావు. ఎంత కాదనుకున్నా దినేష్ నీ పేగు తెంచుకుని పుట్టిన బిడ్డ. నువ్వు ఎంత కాదని వాదించినా, దినేష్ నీ బిడ్డ కాదన్న విషయం నీ మనసు అంగీకరించటం లేదు. అలా నీ మనసు అంగీకరించిన పక్షంలో దినేష్‌ను చూసిన మరుక్షణంలో నీలో ఎలాంటి భావాలు కలుగకూడదు.

నువ్వు చెప్పకపోయినా ఈ రెండు రోజులుగా నీ మనసులో చెలరేగుతున్న అలజడిని నేను గుర్తించాను. నువ్వే చెప్పేదాకా నేను ఏమీ అడగదల్చుకోలేదు. నువ్వు కాదన్నా నీలోని ప్రేమమూర్తి, అనురాగమూర్తి చచ్చిపోయిందంటే నేను నమ్మలేను. నీలోని ఆ ప్రేమైకతత్వమే నీ పట్ల నన్ను ఆకర్షితుడ్ని చేసింది.

నీలో ప్రేమే లేకపోతే మనింట్లో మనం కాక ఒక పదిమంది మనమీద ఆధారపడి బ్రతికే పరిస్థితి కలిగి ఉండేది కాదు. కాబట్టి నేను చెప్పేదేమిటంటే నీ గతంలో ఉన్న చేదును, నీ జీవితంలోంచి, నీ జ్ఞాపకాల్లోంచి తీసెయ్యి. దినేష్ కనబడితే అతన్ని క్షమించడానికి ప్రయత్నించు. ఇంతకన్నా నేను చెప్పేదేమీ లేదు.”

“నువ్వు చెప్పింది వినడానికి బాగానే ఉంది. కానీ నా జీవితం మొత్తంలో నేను ఆనందించిన క్షణాలు చాలా తక్కువ. ఎంత కాదనుకున్నా నా పాతజీవితంలో చేదు అనుభవాలు, అనుభూతులే ఎక్కువ ఉన్నాయి. ఇదిగో ఇన్నాళ్లకు ప్రశాంతమైన జీవితం గడుపుతున్నాను. ఈ ప్రశాంతతలో ఒక చిన్న అలజడి వీడి రాకతో” అంది.

“అవన్నీ సరే, నువ్వు కర్మసిద్ధాంతాన్ని నమ్ముతావు కదా! నీకు తెలియదని కాదు కానీ నాకు తెలిసినది చెప్తాను విను. ప్రాచుర్యంలో ఉన్న కర్మసిద్ధాంతాన్ని అనుసరించి, ప్రతివారు తమ కర్మల యొక్క ఫలితాన్ని అనుభవించాలి. సత్కార్యం సత్ ఫలితాన్ని, దుష్కార్యం దుఃఖాన్ని ఇవ్వటం అనివార్యం. హిందూ సిద్ధాంత

ప్రకారం కర్మ సిద్ధాంతాన్ని మూడు భాగాలుగా విభజిస్తారు. సంచిత కర్మ – మనం పూర్వజన్మలో చేసిన కర్మ. ప్రారబ్ధకర్మ – ఈ జన్మలో మనం అనుభవించవలసిన సంచితకర్మలోని భాగం. ప్రారబ్ధ కర్మని మనం తరచూ విధి అని అంటూ ఉంటాము. ఆగామి కర్మ – ఈ జన్మలో మనం చేసే కర్మలు, దాని తాలూకు ఫలితాలు వచ్చే జన్మలో అనుభవించేది.

కాబట్టి నువ్వు ఇంతకుముందు జీవితంలో పడ్డ కష్టాలను, బాధలను, నీ సంచితకర్మ అనుకుని మర్చిపోవడం మంచిది. ఇప్పుడు నువ్వు చేస్తున్న పనులన్నీ ఆగామి కర్మలుగా అనుకోవచ్చు. అందుకే గతం గతః అనుకుని ముందుకు సాగిపోయి హాయిగా మిగిలిన జీవనాన్ని గడపమని నా అభ్యర్థన. నువ్వెప్పుడైనా విజయదాసు కథ చదివావా?"

"విజయదాసు కథా ఎందులో ఉంది? నాకు చదివిన గుర్తు లేదు" అంది మంజరి.

"ఈ కథ మనం చర్చించుకున్న కర్మల గురించి, ప్రారబ్ధ కర్మల్లో సుఖదుః ఖాలు రెండూ ఉన్నాయి. మనకిష్టం లేకపోయినా కష్టాలు అనుభవించినట్లే సుఖాలు కూడా అనుభవించాలి. దీనికి ఉదాహరణ విజయదాసు కథ. ఇది కాశీమజిలీ కథల్లో ఉంది.

ఢిల్లీ చక్రవర్తి దగ్గర విజయదాసు అనే ఒక మంత్రి ఉండేవాడు. మంత్రి పదవిలో ఉంటూనే అతను కామక్రోధాదులు జయించినవాడై, విరక్తితో జీవించేవాడు. అతనికి సంగీతమంటే చాలా ఇష్టం. అందుకని వేదాంత కీర్తనలు పాడించుకుని వింటూ ఉండేవాడు. కొన్ని తత్వాలు తాను రచించి వీణ మీటుతూ పాడేవాడు.

అతని కీర్తనలు సన్యాసులు, బైరాగుల నోట ప్రాచుర్యం పొందాయి. విజయదాసు తత్వాలంటే వేదాంతులు సైతం చెవులు కోసుకునేవారు.

అలా ఒక సన్యాసి ఆ కీర్తనలు విని ఆనందించి అతన్ని చూడాలన్న ఉబలాటంతో అతని కోసం వెతకగా అతను ఢిల్లీ వాస్తవ్యుడని తెలిసి అక్కడికి వెళ్లి అడిగాడు. ఎవరూ చెప్పలేకపోవటంతో తిరిగి హరిద్వార్ వెళ్లిపోదామని నిశ్చయించుకున్న సమయంలో విజయదాసు తత్వాన్ని పాడుతున్న ఒక గాయకుడ్ని చూసి అతని పాట అయ్యాక అతన్ని "అయ్యా! విజయదాసు అన్న ఈ వ్యక్తి ఎక్కడ ఉంటాడు? అసలు బ్రతికే ఉన్నాడా?" అని అడిగాడు. అప్పుడు ఆ సన్యాసి

విజయదాసు ఢిల్లీ రాజుకు మంత్రి అన్న విషయం చెప్పగానే, మహావిరక్తుడిలా తత్వాలు రచించే అతను తుచ్ఛభోగాలు అనుభవిస్తున్నాడా అనుకున్నాడు. అయినా అతన్ని చూడాలన్న ఉద్దేశంతో "అతని దర్శనం నాకు లభ్యమవుతుందా?" అని అడిగాడు.

"మహా మహావాళ్లకు అతని దర్శనం దుర్లభం. అయినా ప్రయత్నించండి" అన్నాడు. చాలా రోజుల తరువాత అతికష్టంమీద అతనికి విజయదాసు దర్శనం కలిగింది. అతను సన్యాసిని సాదరంగా ఆహ్వానించి ఆసనం మీద కూర్చోమన్నాడు. "ఇంత చక్కని తత్వాలు రాసి నువ్వు ఈ తుచ్ఛభోగాలు అనుభవిస్తున్నావేమిటి?" అని అడిగితే, "ఇవి నన్ను వదలవు. ఇది సుఖప్రారబ్ధం" అంటాడు.

అప్పుడు ఆ సన్యాసి "నువ్వు వదలలేక అలా అంటున్నావు. నాతో రా! ఇవి వదిలిపోతాయి'' అంటాడు. ''అలాగే'' అని విజయదాసు అతని వెంట బయలుదేరతాడు. ఏనాడూ శ్రమ అన్నది ఎరగని అతని దేహం అలసిపోతే సన్యాసి జాలిపడి అతన్ని చెట్టునీడన విశ్రమించమని తాను భిక్షాటనకై బయలుదేరతాడు.

ఢిల్లీ చక్రవర్తితో పనిపడిన ఒక మహారాజు అతన్ని కలవడానికి బయలుదేరి మార్గమధ్యంలో ఆగి, అక్కడ చెట్టుకింద విశ్రమిస్తున్న విజయదాసును గుర్తించి అతనికి తన పరివారంతో సకల మర్యాదలు చేయిస్తాడు. సన్యాసి తిరిగి వచ్చి చూస్తే తాము విశ్రమించిన చెట్టు ఎక్కడుందో అర్థం కాలేదు. విజయదాసు కనిపించలేదు. విజయదాసు ఎక్కడున్నాడో తెలియక అతనిని పేరుపెట్టి పిలిచాడు. అప్పుడు కొంతమంది రాజభటులు అతని దగ్గరకు వచ్చి అతనిని విజయదాసు దగ్గరికి తీసుకువెళ్లారు. రాజోపచారములతో ఉన్న విజయదాసును చూసి "రాజభోగాలు లేకుండా ఉండలేక తెప్పించుకున్నావా?" అన్న ప్రశ్నకు, "నేను ఏమీ ఎరగను. మీకు కావాల్సిన సమాధానం వాళ్లు చెబుతారు" అంటూ అక్కడున్న వాళ్లను చూపించాడు. వాళ్ల ద్వారా అసలు విషయం తెలిసింది.

అప్పుడు విజయదాసును చూసి సన్యాసి, "నువ్వు చెప్పినది నిజమే! సుఖదుః ఖాలూ రెండూ మన ప్రారబ్ధకర్మలే! రెండూ అనుభవించక తప్పదు. నువ్వు నీమానాన వెళ్లి నీ రాచకార్యాలు యథావిధిగా చేసుకో. నేను నా యాత్ర కొనసాగిస్తాను" అంటూ సన్యాసి వెళ్లిపోయాడు" అంటూ ముగించాడు జెన్నీ.

అతని మాటల్లో ఉన్న సత్యాన్ని గుర్తించి నవ్వు మొహంతో "హిందూ ధర్మాన్ని బాగానే ఔపోసన పట్టావే. ఒకానొకప్పుడు నేను నీకు గురువునైనా ఇప్పుడు శిష్యురాలినిగా మారిపోక తప్పదన్న మాట" అంది మంజరి.

"హిందూ ధర్మంలోని లోతులు తెలుసుకుంటే ఒక విధమైన ఆనందం, ప్రశాంతత కలుగుతాయి. ఈ దైవం, ఆత్మ, పరమాత్మ అన్న నమ్మకం మనిషిని ఒక నిర్దుష్టమైన మార్గంలో నడవడానికి మార్గదర్శిగా ఉపయోగపడుతుందని నా విశ్వాసం. హిందూ ఫిలాసఫీ చాలా లోతయినది. ఎందరో మహామహులు దాని గురించి విశ్లేషించి రాశారు. అవి అన్నీ చదవడానికి అర్థం చేసుకుందుకు నా ఈ జీవితకాలం సరిపోదేమో!" అన్నాడు.

ఇంతలో పిల్లలు లేచిన అలికిడి అవడంతో ఇద్దరూ ఇంట్లోకి నడిచారు. ఇంట్లోకి వచ్చిన ఆ ఇద్దరికీ పిల్లలందరూ 'గుడ్మార్నింగ్' చెప్పి దగ్గరగా వచ్చి కౌగలించుకున్నారు. ఒక్కొక్కర్నీ దగ్గరకు తీసుకుని ప్రేమగా నుదుటిమీద చుంబించింది మంజరి.

మంజరి ఆలింగనంలో, ఆ ముద్దులో వారు పొందే ప్రేమాభిమానాలు ఆమె తమ కన్నతల్లి కాదన్న భావన రానియ్యదు. ఆ చిన్నారులకు తమ తల్లితండ్రులెవరో తెలియదు. కులమేమిటో, మతమేమిటో తెలియదు. తల్లి పాలు తాగిన గుర్తు కూడా లేదు. ఆ పిల్లలు క్రితం జన్మలో చేసుకున్న పుణ్యమా అన్నట్లు వాళ్లు అయిదుగురూ మంజరి కంటపడ్డారు.

హర్షిత తప్ప అందరూ బోర్నవిటా తాగుతారు. ప్రొద్దునే డైనింగ్ టేబుల్ చుట్టూ చేరి అందరూ నవ్వుతూ, సరదాగా ఒక గంట కబుర్లు చెప్పుకుంటారు. పిల్లలు వాళ్ల వాళ్ల స్కూల్లో జరిగిన సంఘటనలు, వాళ్లు ఆ వారంలో చేసిన యాక్టివిటీస్ అన్నీ పోటీల మీద పూసగుచ్చినట్లు చెపుతారు.

కబుర్లు చెప్పుకుంటూ అందరూ కలిసి బ్రేక్ఫాస్ట్ చేస్తారు. ఆదివారం నాడు పిల్లలకిష్టమైనవి అడిగి అన్నీ చేస్తుంది మంజరి. మధ్యాహ్నం భోజనం తరువాత అందరూ పార్క్కో, సినిమాకో వెడతారు.

మంజరికి సినిమా అంటే పెద్ద ఇంట్రెస్ట్ లేకపోయినా పిల్లల కోసం తానూ వాళ్లలో ఒక పిల్లగా మారి ఎంజాయ్ చేస్తుంది. జెన్నీ మాత్రం కొన్నిసార్లు వాళ్లతో కలుస్తాడు. కొన్నిసార్లు కలవడు. ఈ సందడిలో యాదయ్య, లక్ష్మి, పిల్లలు కూడా కలుస్తారు.

సాయంకాలం దాకా ఎంజాయ్ చేసి, ఎనిమిది గంటలకల్లా ఎవరి రూముల్లోకి వాళ్లు వెళ్లిపోతారు. మర్నాడు స్కూల్‌కు కావాల్సినవన్నీ బాగ్‌లో సర్దుకుని, డిన్నర్ చేసి పడుకుంటారు. ఎగ్జామ్స్ టైములో తప్ప చదువుకు ఆదివారం సెలవు. హోంవర్కులన్నీ శనివారం సాయంకాలానికి పూర్తిచేస్తారు.

ఇంట్లో ఒకటే టీవీ ఉంది. అది కూడా హాల్లో ఉంది. పిల్లలు ఎవరూ గంట కన్నా టీవీ చూడకూడదు. మంజరి చేసే శాసనాలను పిల్లలు ఆనందంగా స్వీకరిస్తారు. ఆమె సంరక్షణలో వాళ్లు లోటన్నది ఏనాడూ అనుభవించాల్సిన అవసరం రాలేదు.

* * *

రాత్రి మంచం మీద పడుకున్న మంజరికి ఎంత వద్దనుకున్నా గతం కళ్లముందు కదలాడుతోంది.

మంజరి మధ్యతరగతి కుటుంబంలో మూడవ సంతానంగా పుట్టింది. తండ్రి గవర్నమెంట్ ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. కటింగులు పోను వచ్చే జీతం బొటాబొటీగా సరిపోతుంది. ఎంత పొదుపుగా ఖర్చుపెట్టినా ఎప్పుడూ దేనికోదానికి లేదు అనుకోక తప్పనిసరి పరిస్థితి.

మంజరి తండ్రి వెంకటరమణ. ఇంటికి పెద్ద కొడుకు. అతని తరువాత నలుగురు పిల్లలు. తండ్రి వేదం చదువుకున్నాడు.

ఇదివరలో బ్రాహ్మణకులంలో పుట్టినవాళ్లు వేదం చదువుకుని యజ్ఞయాగాలు చేయడం చేసేవారు. రాజులు వాళ్ల పేరిట అగ్రహారాలూ, పొలాలూ ఇస్తే వాటిమీద వచ్చే ఫలసాయంతో బతుకులు నిశ్చింతగా గడిచిపోయేవి.

కాస్త చదువుకున్నవాళ్లు కరణీకాలు చేసేవారు. రమణ తాతతండ్రులు వేదాన్ని నమ్ముకున్నవాళ్లు. కాలం మారింది. రాజులూ, రాజ్యాలూ పోయాయి. వేదాన్ని నమ్ముకున్నవాడికి భుక్తి గడవడం కష్టమైపోయింది.

రమణ తండ్రి ఉన్న కొద్దిపొలం మీద రాబడి రాక పౌరోహిత్యం చేసి, పిల్లల్ని పెద్దవాళ్లను చేశాడు. పెద్దకొడుకైన రమణని ఎక్కువ చదివించలేకపోయాడు. ఆడపిల్లలకు తగిన సంబంధాలు చూసి పెళ్లి చేశాడు.

రమణ పూనుకుని తమ్ముడ్ని బాగా చదివించాలని పట్టుపట్టాడు. రమణ పుణ్యమా అని కేశవ ఎం.ఎస్సీ. చదివి కాలేజీలో లెక్చరర్‌గా చేరాడు.

మంచి ఇంటినుంచి వచ్చిన పిల్లను పెళ్లిచేసుకున్నాడు. తన సంపాదనలో అన్నగారికి భాగం ఇవ్వడం కానీ, తల్లిదండ్రుల బాధ్యత వహించడం కానీ అతనికి అవసరం లేదనుకున్నాడు.

రమణ పెళ్లి అయినా తన సంపాదనతో తమ్ముడ్ని చదివించడం తన బాధ్యత అనుకుని సంతోషంగా స్వీకరించాడు. తన బాధ్యతను సక్రమంగా నిర్వహించే ప్రయత్నంలో కొత్త పెళ్లికూతురిలా అడుగుపెట్టిన సీతను కూడా భాగస్వామిని చేశాడు.

చాలామంది ఆడవాళ్లలాగే సీత కూడా పెళ్లి తరువాత అత్తవారి ఇంట్లో అందరూ తనవాళ్లే అనుకుంది. పెళ్లయ్యాక ఇంట్లో ఉన్న మరిదిని సొంత తమ్ముడిలా ఆదరించి, అతను కాలేజీకి వెళ్లినప్పుడు వేడివేడిగా అన్నం వండిపెట్టి మధ్యాహ్నం తినడానికి బాక్స్ కట్టి ఇచ్చి, రాత్రుళ్లు అతను చదువుకుంటుంటే కాఫీలు కాచి ఇచ్చేది.

కాపరానికి వచ్చిన లగాయతు అత్తమామల సేవ, మరిది సేవలో ఆమె జీవితం గడిచింది. మరిది ఎం.ఎస్సీ. చదువుతుండగా ప్రతాప్ పుట్టాడు. అత్తమామలు వంశాంకురం పుట్టాడని సంబరపడ్డారు. మరిది చిన్న ప్రతాప్‌ను చూసి ఎంతో మురిసిపోయేవాడు. వదిన కొంగు వదలకుండా తనకు కావాల్సిన అన్ని పనులకూ ఆవిడ్ని కేంద్రంగా చేసుకున్నాడు.

అవసరం తీరాక తన దారి తాను చూసుకున్నాడు. చిన్నకొడుకు ప్రవర్తనకు తండ్రి బాధపడుతుంటే ఏం చెప్పాలో తెలియలేదు.

"పోనీండి నాన్నా! వాడు వృద్ధిలోకి వచ్చాడు. అంతే చాలు" అన్నాడు.

ప్రతాప్ తరువాత ప్రసన్న, ఆ తరువాత మంజరి. మంజరి తరువాత ఇంకొక అబ్బాయి. చుట్టుపక్కల అందర్నీ చూసి తమకు లేనిదేమిటో తరచి చూసుకునే అన్నా, అక్కలకు మంజరి, తమ్ముడు పుట్టకపోతే తమ భాగం పెరిగి ఉండేదన్న భావన.

ప్రతాప్‌కు కొంచెం ఊహ వచ్చినప్పట్నుంచీ తాత, నాన్నమ్మలు తమ దగ్గరే ఎందుకు ఉంటారన్న ఆలోచన. అప్పటికీ ఆగలేక ఒకరోజు తల్లిని అడిగాడు. నాన్నమ్మ, తాత బాబయ్య దగ్గర కూడా ఉండొచ్చు కదా అని.

దానికి సమాధానంగా "తల్లితండ్రులు పెద్దకొడుకు దగ్గరే ఉండాలి" అని చెప్పింది సీత.

అప్పుడు వాడికి అమ్మ ఎందుకు అలా అందో అర్థంకాకపోయినా పెరుగుతున్న కొలదీ తను ఇంటికి పెద్దవాడు కాబట్టి అమ్మా, నాన్న తన దగ్గరే ఉంటారన్న భయం పట్టుకుంది.

ఆ చాలీచాలని నిత్యసంఘర్షణలో ఆప్యాయతలకు ఎక్కువ చోటు లేదు. మంజరి తల్లి తన వంతుగా పిల్లలందర్నీ ఒకేలా చూడ్డానికి ప్రయత్నించి వాళ్ల మధ్య అనుబంధాలు పెంచడానికి తాపత్రయపడేది. కానీ ఎక్కువగా సఫలీకృతురాలు కాలేకపోయింది.

అన్న, అక్కలకు పూర్తి వ్యతిరేకం మంజరి. మంజరికి చిన్నప్పట్నించీ అభిమానం, ఆప్యాయతల పట్ల మక్కువ ఎక్కువ. డబ్బు లేకపోయినా ఉండవచ్చు కానీ అభిమానాలు, ఆప్యాయతలు, అనుబంధాలు లేని జీవితం ఉప్పులేని పప్పులాంటిదన్న భావన ఉండేది ఆమెకు.

తల్లి, తండ్రి నిత్యావసరాలకు పడే కష్టం ఆమెకు బాగానే అర్థం అయ్యేది. ఓపిక ఉన్నన్నాళ్లు పూజలు చేయడానికి వెళ్లి వచ్చిన సంభారాలు ఇంట్లో ఇచ్చేవాడు రమణ తండ్రి. అతని ఆదాయం ఉన్నప్పుడు బియ్యానికి లోటు ఉండేది కాదు.

ఆధరువులు వెతుక్కోకుండా ఉండాలని పెరట్లో అరటి మొక్కలూ, కొన్ని పాదులూ పెట్టింది సీత. పెద్దపిల్లలిద్దరూ సహాయం చేసేవారు కాదు కానీ, మంజరి చిన్నప్పట్నించీ తల్లి వెనకాల మొక్కలకు గొప్పులు తవ్వడం, ఎండిన ఆకులు తీసిపారేయడం చేసేది.

తాత, నాన్నమ్మ అంటే ప్రాణం. వాళ్లకు ఏం కావాలన్నా 'మంజరీ' అనీ, 'బుజ్జికన్నా' అని పిలిచేవారు. ఎదుగుతున్న సంసారంతో పెద్దకొడుకు కష్టాలు చూస్తూ ఏమీ చెయ్యలేని తమ అసహాయతకు బాధపడేవారు ముసలివాళ్లు.

మంజరి తాతగారి దగ్గర సంస్కృత శ్లోకాలూ, శతకాలలోని పద్యాలూ నేర్చుకునేది. మిగిలిన ఇద్దరి పిల్లలకూ కూడా నేర్పాలని తాపత్రయపడ్డా వాళ్లిద్దరూ ఆయన దరిదాపులకు కూడా వచ్చేవారు కాదు.

దాశరథీ శతకంలోని పద్యాలు చిన్నారి మంజరి నోట విని ఎంతో మురిసిపోయేవారు.

కనీసం ఈ పిల్లయినా తన దగ్గర సంస్కృతం నేర్చుకుంటున్నందుకు ఆనందంగా ఉండేది. కొంచెం పెద్ద అయ్యాక తాతగారి ద్వారా దాని అర్థం తెలుసుకుందుకు ప్రయత్నించేది.

తన మనసులోని భావాలను చెప్పలేకపోయినా తన చేతల్లో చూపించేది. ఆమె మంచితనాన్ని అమాయకత్వంగానూ, ఆమె ప్రేమను చేతకానితనంగానూ అనుకునేవారు అన్నా, అక్కా. పెద్దపిల్లల ప్రవర్తన గ్రహించిన తల్లి మంజరిని హెచ్చరించడానికి ప్రయత్నించినా మంజరి “నాకు తెలుసమ్మా! పోనీలే, వాళ్లు పరాయివాళ్లు కాదు కదా! నా అక్క, అన్ననే కదా! వాళ్లనుకుంటారని నేను నా తత్వాన్ని మార్చుకోలేను. ఎప్పుడో అప్పుడు వాళ్లల్లో కూడా మార్పు వస్తుందని నా అభిప్రాయం” అనేది.

తనకన్నా చిన్నవాడైన తమ్ముడ్ని ఎంతో ప్రేమగా చూసుకునేది. చిన్నవాడైన మురళి కొంచెం పెద్దవాడయ్యేదాకా అక్క అంటే చాలా ప్రేమగా ఉండేవాడు. తరువాత అక్క, అన్నలనుచూసి కొంచెం మారాడు. తన అవసరం ఉన్నప్పుడు మంజరి పట్ల ప్రేమగా ఉంటూ మిగిలిన సమయాల్లో మంజరి ఏం చెప్పినా వినకుండా నిర్లక్ష్యం చేయడం అలవాటు చేసుకున్నాడు.

కాలగమనంలో ముసలివాళ్లిద్దరూ స్వర్గస్థులయ్యారు.

రమణ తమ్ముడు తల్లీతండ్రీ పోయినప్పుడు వచ్చాడు కానీ కర్మకాండలకు అయిన ఖర్చులో తన బాధ్యత కూడా ఉందన్న సంగతి విస్మరించాడు. అన్నగారు అడిగినప్పుడు ఏం సమాధానం ఇవ్వాలా అనుకున్నాడు. కానీ అతనికి ఆ అవసరం రాలేదు. రమణ ఆ విషయం ఎత్తలేదు.

బాబయ్య వచ్చినప్పుడల్లా అతను వేసుకునే బట్టలూ అవీ చూసి ఆరాధనగా చూసేవాడు ప్రతాప్. ప్రసన్న కూడా పిన్ని, వాళ్ల పిల్లల బట్టలను చూసి తమకెందుకు లేవని బాధపడేది. తల్లిని అలాంటి బట్టలు కుట్టించమని అడగాలని ఉండేది. కానీ ధైర్యం లేక మానేసింది.

ఒకరోజు బాబయ్యను అడిగాడు ప్రతాప్ “మీ ఇంటికి మమ్మల్ని ఎప్పుడూ పిలవ్వే” అని.

ఆ మాటకు కొంచెం షాక్ తిని, “నేను పిలిచినా మీ నాన్న రాడు” అన్నాడు.

ప్రతాప్ “నేను వస్తాను” అన్నాడు.

"అలాగే తప్పకుండా రా! చెల్లాయిని కూడా తీసుకురా!" అన్నాడు.

తల్లితో చెపితే వద్దంటుందని చెప్పకుండా వెళ్లదల్చుకున్నారు. మంజరి రానంది. ప్రసన్న మాత్రం ఆనందంగా వస్తానంది.

ఒకరోజు స్కూల్ ఎగ్గొట్టి బాబయ్య ఇంటికి వెళ్లారు. పిన్ని తలుపు తీసి లోపలికి రమ్మంది. తినడానికి ఏవేవో పెట్టింది. ప్రతాప్, ప్రసన్న ఆనందంగా తిన్నారు. ఇల్లంతా కలియతిరిగారు. బాబయ్య ఇల్లు తమ ఇంటికన్నా చాలా బాగుంది. వాళ్ల ఇల్లు, బట్టలు అన్నీ తెగ నచ్చేశాయి.

ఇంటికి తిరిగి వచ్చిన ఇద్దరికీ తమ ఇల్లు అస్సలు బాగులేదు. రాజును చూసినమ్మకు మొగుడ్ని చూస్తే మొత్తబుద్ధి అయ్యిందట.

ఇదివరకే తమ ఇల్లు నచ్చేది కాదు. ఏం అడిగినా అమ్మ ఎప్పుడూ లేదంటుంది. ఇప్పుడసలు నచ్చడం మానేసింది.

కొన్నాళ్లు ఆగి తల్లినడిగాడు "అమ్మా, బాబయ్య ఇల్లులా మనిల్లు ఎందుకు ఉండదు?" అని.

"బాబయ్య ఇంటికి వెళ్లావా?" అంది సీత.

"అవును, నేను ప్రసన్న వెళ్లాం."

"మంజరి కూడా వచ్చిందా? బాబయ్య మిమ్మల్ని రమ్మన్నాడా?"

"నాయనమ్మ పోయినప్పుడు బాబయ్య వచ్చాడుగా అప్పుడు నేను అడిగాను. బాబయ్య రమ్మన్నాడు. నేను, ప్రసన్న వెళ్లాము. మంజరి రాలేదు. దానికిలాంటివన్నీ నచ్చవుగా. ఎంతసేపూ నీ కొంగు పట్టుకు తిరుగుతుంది."

సీతకు ఒక్కసారిగా దుఃఖంతో బాటు కోపం కూడా వచ్చింది. ఎప్పుడైతే మరిది తన స్వార్థం చూసుకున్నాడో ఏమీ అనలేక వాళ్లనుంచి తన పిల్లలను దూరంగా ఉంచాలనుకుంది. అసలు ఎప్పుడూ రాడు, వచ్చినా పిల్లల కోసం ఒక పండు కానీ, తీపి కానీ తీసుకురాడు.

పిల్లలు వాళ్లింటికి రాకపోకలు మొదలుపెడితే తమ ఇద్దరి మధ్యా ఉన్న వ్యత్యాసం స్పష్టంగా కనబడి పిల్లల మనసులో లేనిపోని ఆలోచనలు వస్తాయి.. ఏనాడూ ఆప్యాయంగా మా ఇంటికి రండని పిలువలేదు.

"తప్పమ్మా! అలా వెళ్లకూడదు. నాన్నగారికి తెలిస్తే బాధపడతారు" అంది.

అంతేకానీ మీరు అస్తమానూ వెడితే మీ బాబాయి మిమ్మల్ని ఆదరించడు అని చెప్పలేకపోయింది.

* * *

మంజరి చిన్నతనం అంతా ఇలాంటి వాతావరణంలో గడిచింది. ఏటికి ఎదురీదడం కన్నా ప్రవాహంతోపాటు ప్రయాణం సాగించడంలో విజ్ఞత ఉందనుకుంటుంది మంజరి. దీనికి పూర్తి విరుద్ధం మంజరి అక్క ప్రసన్న.

ప్రసన్న ఎప్పుడూ కలల్లో విహరిస్తూ ఉంటుంది. తను అందంగా ఉంటానని, శాపవశాత్తు వీళ్లింట్లో పుట్టానని, ఏ రాజకుమారుడో వచ్చి తనను వివాహం చేసుకుంటాడన్న ఊహల్లో తేలిపోతూ ఉంటుంది.

ఆమె కలల్నిండా అందమైన నగలు, చీరలు, గొప్పింటి అబ్బాయిలు తనను పెళ్లిచేసుకుందుకు క్యూలో నిలబడ్డట్లు. ఇలాంటి ఊహలే ఆమె కళ్లముందు కదలాడుతూ ఉంటాయి. ఆమెకు సిండ్రెల్లా స్టోరీ చాలా ఇష్టం. తన జీవితంలో కూడా అలాగే జరుగుతుందన్న భ్రమ.

మంజరి మాత్రం ఎప్పుడూ శ్రద్ధగా తన పాఠాలు చదువుకోవడం, అవసరమైన మేరకు తల్లికి సహాయం చేయడం చేస్తుంది. మంజరి పుస్తకాలు ముందు వేసుకుని కూర్చుంటే ప్రసన్నకు కోపం. దాన్ని చూసి తల్లి తననెక్కడ చదవమంటుందేమోనని.

పోనీ మంజరి చదువుకుంటోంది కదా అని సీత ఆమెకు ఏదైనా పని చెపితే వెంటనే పుస్తకం చేతిలోకి తీసుకుని చదువుతున్నట్లు నాటకమాడేది.

పక్క ఇంటికి పెత్తనాలకు వెళ్లమంటే మహా ఆనందంగా ఉండేది. తల్లి, తండ్రి పడే కష్టం చూస్తూ కూడా చూడనట్లు ఉండేవారు.

పెరుగుతున్న పిల్లలు, పెరుగుతున్న ఖర్చులు, అత్తమామల కర్మకాండకు చేసిన అప్పు ఇంకా తీరలేదు. కూతురు ఎదిగివస్తోంది. చదువుకుని ఉద్యోగం చేసుకుంటే ఎవరైనా పెళ్లికొడుకు సులువుగా దొరుకుతాడన్న ఆశ. కానీ ఆమె ఆశ తీరేనా?

టెంత్ క్లాస్ మూడుసార్లు తప్పిన కూతుర్ని చూసిన సీత ఇంక దీనికి పెళ్లిచెయ్యడం ఒక్కటే మార్గం అనుకుంది. కానీ అది కూడా అంత సులభం కాదు. పెళ్లికొడుకుల మార్కెట్‌లో వీళ్లకు వేలం పాడగలిగిన స్తోమత లేదు. అయినా ప్రయత్నం చేయాలి.

ఎవరెక్కడ సంబంధం ఉన్నా మాట్లాడడానికి వెళ్లేవాడు. వాళ్లు పిల్ల ఏం చదువుకుంది, కట్నం ఎంతిస్తారు అని అడగ్గానే తిరిగి వచ్చేవాడు రమణ.

పల్లెటూర్లో ఉండి వ్యవసాయం చేసుకుంటున్న రెండో పెళ్లికొడుకు సంబంధం వచ్చింది. పిల్లవాడు చిన్నవాడే. ప్రసన్నకు, అతనికి ఐదేళ్ల కన్నా ఎక్కువ తేడా లేదు.

మొదటి భార్య అతని మేనమామ కూతురే. ఆ పిల్ల డెలివరీ టైములో డాక్టర్ల నిర్లక్ష్యం మూలంగా ప్రాణాలు పోగొట్టుకుంది. ఆడపిల్ల పుట్టింది. పిల్లవాడి మేనమామకు, మంజరి తండ్రికీ దూరపు చుట్టరికం, కొద్దిపాటి స్నేహం ఉంది. మంజరి తండ్రి అంటే ఉండే అభిమానం కొలదీ ఎవరో పరాయి పిల్ల బదులు తన మిత్రుడి కూతురైతే తన మనవరాల్ని ప్రేమగా చూస్తుందన్న ఆశ.

పిల్ల పెళ్లి ఎలా చెయ్యాలా అని సతమతమవుతున్న వెంకటరమణకు ఈ సంబంధం చాలా నచ్చింది. మగపెళ్లివారు భూస్వాములు, బాగా డబ్బున్నవాళ్లు, కట్నకానుకలు ఏమీ వద్దన్నారు. అందుకని ఇంకా బాగా నచ్చింది. ఈ పిల్ల పెళ్లి ఎక్కువ ఖర్చు, కష్టం లేకుండా అయిపోతే పెద్దకొడుకు పెళ్లితో రెండో కూతురి పెళ్లి ముడిపెట్టవచ్చు అన్న ఆలోచన.

చట్టరీత్యా కట్నాలు ఇవ్వడం, పుచ్చుకోవడం నేరమన్న విషయం మాటల వరకే పరిమితం. చేతల్లో అమలు పరుస్తున్నట్టు కానరాదు. అందుకే ఎంతో ఆనందంగా ఈ విషయాన్ని ఇంట్లో చెప్పాడు. భార్య సీత చాలా సంతోషించింది. రెండో పెళ్లివాడన్న మాట తప్ప తమ అంతస్తుకు మించిన సంబంధం. పెళ్లి అయ్యాకైనా కూతురు సిరిసంపదలతో తులతూగుతుందని సంతోషించింది.

తల్లి ద్వారా విషయం విన్న ప్రసన్న ఇంత ఎత్తున ఎగిరింది. “మీకసలు బుద్ధుందా? నన్ను రెండో పెళ్లివాడ్ని, పల్లెటూర్లో వ్యవసాయం చేసుకునేవాడ్ని చేసుకోమంటారా? పట్నంలో మంచి ఆఫీసరు హోదా ఉన్నవాడ్ని తప్ప నేనుచేసుకోను” అంది.

“ఆఫీసరు పెళ్లికొడుకు ఊరికే వస్తాడా తల్లీ! కట్నాల మార్కెట్‌లో అతను అడిగిన రేటు చెల్లిస్తే కానీ పెళ్లిపీటల మీద కూర్చోడు. కట్నం కాక వాళ్లమ్మ గొంతెమ్మ కోరికలు తీర్చాలి. ఇవన్నీ మా శక్తికి మించిన పనులు. ఏదో మన అదృష్టం కొలదీ ఈ సంబంధం వచ్చింది” అంది సీత.

"అంత స్తోమత లేనివాళ్లు పిల్లల్ని ఎందుకు కన్నారు? మేము ఏమైనా కనమని అడిగామా?" అంది.

ఆ మాటకు నిశ్చేష్టురాలైన సీత నోటమాట రాక సిగ్గుతో తలవంచుకుని ఏం చెయ్యాలో తెలియక నించుండిపోయింది. అక్కగారి మాటలకు మంజరి కూడా బాధపడింది. తల్లి కళ్లు ఒత్తుకుంటూ లోపలికి వెళ్లడం చూసి,

"ఏంటక్కా! ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా? అమ్మ చూడు ఎంత బాధపడుతోందో! ప్రపంచంలో అందరూ డబ్బున్నవాళ్లే ఉండరు కదా! డబ్బున్న చోట ప్రేమాభిమానాలు ఉంటాయన్న నమ్మకం ఏమిటి? నాన్నగారు, అమ్మ మనను ఎంత ప్రేమగా చూసుకుంటారు. వాళ్లు చేసే ఏ పనైనా మన భవిష్యత్తు బాగుండాలనే కదా!" అంది మంజరి.

'కోపంలో నోరు జారింది కానీ తల్లిని నొప్పించాలని తనూ అనుకోలేదు. రెండో పెళ్లివాణ్ణి, పల్లెటూర్లో ఉండేవాడ్ని చేసుకోవాలని ససేమిరా ఇష్టం లేదు. తను కోరుకునే సంబంధం తేవచ్చు కదా! తన బాధ ఎవరికి అర్థం అవుతుంది?' అనుకుంది ప్రసన్న.

అక్కగారి మూర్ఖత్వానికి నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు మంజరికి. రోజూ దేనికో దానికి గొడవ చేస్తారు అక్కా, అన్నా. ఇద్దరూ తమ పరిస్థితిని అర్థం చేసుకోరు. వాళ్ల గొంతెమ్మ కోర్కెలు తీర్చడానికి తండ్రి సంపాదన సరిపోదు. అప్పటికీ తల్లి చాలా పొదుపుగా సంసారం చేస్తుంది.

తండ్రి ఒక కప్పుకాఫీ కూడా బైట తాగడు. సాయంకాలాలు కొట్లో పద్దులు రాస్తున్నాడు. అదనపు ఆదాయం ఉంటేనే కానీ తమ బాధ్యతలు తీరవని. పెద్దకూతురు అన్న మాటలకు బాధపడి సీత మంచం మీద కూర్చుని ఏడుస్తోంది.

'భగవంతుడా! కన్నపిల్లలతో ఇలాంటి మాటలు పడడానికా నాకు ఈ జన్మనిచ్చావు? వాళ్ల కోరికలు తీర్చలేని అశక్తతనిచ్చావేమయ్యా?' అంటూ తను పూజించే దేవుడ్ని వేడుకుంటూ కన్నీరు కారుస్తోంది.

అనవలసిన మాటలు అనేసి కోపంగా తన గదిలోకి వెళ్లి తలుపులు ధడాలున వేసుకుంది. ఒక రెండు గంటల దాకా ఆ తలుపులు తీయబడవు. పూర్వకాలంలో రాణుల కోసం ప్రత్యేకం కోపగృహాలు ఉండేవిట. బహుశా ఆ విషయం ఏ పుస్తకంలోనో చదివి ఉంటుంది ప్రసన్న.

అక్కగారు ఇప్పుడు ఏం చెప్పినా పెడర్థాలు తీస్తుందన్న సంగతి తెలిసిన మంజరి తల్లి దగ్గరకు వెళ్లింది. ఏడుస్తున్న తల్లిని చూసి మనసు చివుక్కుమంది. ఎంత కష్టంగా ఉన్నా వీలయినంతవరకూ నవ్వుతూ ఉండే తల్లి అక్క మాటలకు ఎంత నొచ్చుకోకపోతే కంటనీరు పెడుతుంది? ఏ తల్లయినా పిల్లల క్షేమం కోరుతుంది కదా! ఈ విషయం పెద్దవాళ్లిద్దరికీ ఎందుకు అర్థం కాదు!

ఒకే ఇంట్లో ఉంటూ ఒకే రక్తం పంచుకుపుట్టిన మంజరికీ, పెద్దవాళ్లిద్దరిలోనూ ఆలోచించే విధానంలో చాలా వ్యత్యాసం ఉంది. ఉన్నదాంట్లో సంతృప్తి పడి, పరిస్థితులను తనకనుకూలంగా మలచుకోవడం ఎవరూ నేర్పకుండానే ఆ పిల్లకు ఎలా వచ్చిందో రమణకు, సీతకు కూడా అర్థం కాదు. ఆ పిల్లలా మిగిలినవాళ్లు కూడా ఉంటే ఎంత బాగుంటుందో అని అనుకోకుండా ఉండలేరు.

తల్లి భుజం మీద చెయ్యి వేసి "ఊరుకో అమ్మా! చిన్నపిల్లలా ఆ ఏడుపు ఏమిటి? అక్క ఏదో తెలియక అంది. నిన్ను కష్టపెట్టాలన్న ఉద్దేశం ఉండి ఉండదు" అంది మంజరి.

"నిజంగా అది అన్నదాంట్లో తప్పు కూడా ఏమీ లేదులే. పోషించలేనప్పుడు పిల్లల్ని కనడం తప్పే. నాకసలు ఇంతమందిని కనకూడదన్న విషయం తెలియదు. అసలే మట్టిబుర్ర. మీ నాన్నగారు చెప్పింది చేయడం తప్ప ఎప్పుడూ సొంతంగా ఆలోచించినదాన్ని కాదు. ఆయనకు ఈ జ్ఞానం ఉందో లేదో నాకు తెలియదు.

పెద్దవాళ్లిద్దరితో ఆపేస్తే కొంతలో కొంతయినా వాళ్ల కోర్కెలు తీర్చేవాళ్లమేమో! ఈ జ్ఞానం ముందు ఉండాలి. ఇప్పుడు అనుకుని ఏం ప్రయోజనం? ఈ వచ్చిన సంబంధం కూడా మన అదృష్టం కొద్దీ దొరికింది. పిల్లవాడు చిన్నవాడు, బుద్ధిమంతుడు. డబ్బుకు లోటు లేదు. పిల్ల సుఖపడుతుందన్న ఆశ" అంటూ కళ్లు తుడుచుకుంది.

"ఇప్పటికి ఊరుకో అమ్మా! బాధపడకు. నేను మెల్లిగా అక్కకు నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తాను" అంది మంజరి.

పదిహేడేళ్లు ఉన్న పెద్దపిల్లకు లేని పరిపక్వత దానికన్నా మూడేళ్లు చిన్నదయిన మంజరికి ఎలా వచ్చిందో? అంతా పూర్వజన్మ సుకృతం. మంజరి తన పాలిట వరం అనుకుంది సీత.

అన్ని విషయాల్లో చేదోడువాదోడుగా ఉండే ఆ పిల్లంటే సీతకు ఒక పాలు అభిమానం ఎక్కువనే చెప్పాలి. భర్త ఇంటికొచ్చే వేళయ్యింది. దీని రభస వింటే ఏం గొడవ చేస్తాడోనని భయపడి, మొహం కడుక్కుందుకు బాత్‌రూమ్‌లో దూరింది.

తల్లి మొహం కడుక్కుని వచ్చేసరికి వేడిగా కాఫీ తయారుచేసి తీసుకు వచ్చింది. పమిట చెంగుతో మొహం తుడుచుకుంటూ వచ్చిన సీతకు, కాఫీ గ్లాసుతో రెడీగా నిలబడ్డ మంజరిని చూడగానే ఆనందంతో కన్నీళ్లు వచ్చాయి. తల్లి కళ్లల్లో కన్నీళ్లు చూసిన మంజరి కంగారుపడి –

"ఇప్పుడే కదమ్మా! బాధపడొద్దు. అన్నీ సర్దుకుంటాయని చెప్పాను కదా" అంది.

"లేదురా! నీలాంటి బంగారు కూతుర్ని చూసి ఆనందంతో కన్నీళ్లు వచ్చాయి. మిగిలిన పిల్లలు కూడా నీలా ఆలోచిస్తే ఈ ప్రపంచంలో నా అంత అదృష్టవంతురాలు ఎవరూ ఉండరు" అంది.

"ఆ రోజు కూడా త్వరలో వస్తుంది అమ్మా" అంది మంజరి.

మురిపెంగా కూతురి మొహంలోకి చూస్తూ ఎడం చేత్తో కూతురి తలమీద చెయ్యివేసి, కుడిచేత్తో కాఫీగ్లాస్ అందుకుని, మనసులో ఆ రోజు త్వరలో రావాలని కోరుకుంటున్నాని అనుకుంది.

"అక్కా" అంటూ తన పక్కలో చేరిన చెల్లిని చూసి ఏమిటన్నట్లుగా చూసింది ప్రసన్న.

"నీతో కొంచెం మాట్లాడాలి" అంది మంజరి.

"ఏం! అమ్మ నిన్ను రాయబారం పంపిందా?"

"అదేం లేదక్కా! నా అంతట నేనే వచ్చాను. నేను చెప్పేది కొంచెం ఓర్పుతో విను. నీకు నచ్చితే సరే. లేకపోతే నిన్నెవరూ బలవంతం చెయ్యరు."

ఏ కళనుందో "సరే చెప్పు. విన్నంత మాత్రాన నష్టం లేదు కదా!" అన్న ధోరణిలో చెల్లెలివైపు చూసింది.

"ఒక్కసారి పెళ్లికొడుకును చూడు. రెండో పెళ్లివాడయినా చిన్నవాడే అంటున్నారు కదా! రెండో విషయం, నాన్నగారూ వాళ్లూ మాట్లాడుకుంటుంటే విన్నాను. వాళ్లు బాగా డబ్బున్నవాళ్లుట. ఎటూ మనం పేదరికంలో పెరుగు

తున్నాము. పెళ్లయ్యాకయినా నీ కోరికలు తీర్చుకోవచ్చు కదా!" అంటూ అర్థోక్తిలో ఆగింది.

అక్కగారు ఏం మాట్లాడకపోవడంతో మళ్లీ మొదలుపెట్టింది. "నువ్వు ఈ సంబంధం కాదంటే వాళ్లకు ఇంకోళ్లు దొరుకుతారు. కానీ నాన్న మాత్రం ఇంత గొప్పింటి సంబంధం తేలేరు. కాబట్టి నువ్వు ఒకసారి ఆలోచించుకుని, అతన్ని చూస్తే బాగుంటుంది. ఇంక పాప సంగతంటావా... నీకు తోచకపోతే ఆడుకుందుకు ఒక బొమ్మ దొరికిందని అనుకో. ఎలాగా నాన్నమ్మ ఉంది కాబట్టి, నువ్వు పెద్దగా చెయ్యాల్సినది ఏమీ ఉండదు" అంది మంజరి.

చెల్లెలి మాటల్లోని లాజిక్ నచ్చింది. 'ఇన్నాళ్లూ డబ్బులేక తీరని తన కోరికలన్నీ తీరుతాయి. చీరలకీ, నగలకీ లోటుండదు. తన అందంతో అతన్ని తనవాడిగా చేసుకుంటే తను ఆడింది ఆట, పాడింది పాటగా చేసుకోవచ్చు' అనుకుంది. అందుకే చెల్లెలితో –

"సరేలే! అమ్మతో చెప్పు. నేను పెళ్లిచూపులకు రెడీ అని" అంది.

* * *

కేశవ అగ్రికల్చర్ బి.ఎస్సీ చేసినా ఒక్కడే కొడుకవటంతో పొలాన్ని కౌలుకివ్వడం ఇష్టం లేక సొంత వ్యవసాయం చేస్తున్న తండ్రికి పనిభారం తగ్గించడానికి, ఎక్కువ చదువులు చదివి ఉద్యోగాలకు వెళ్లడం కన్నా తల్లిదండ్రులకు అండగా ఉండడానికి నిశ్చయించుకున్నాడు.

ఇరవై రెండేళ్లకే మేనమామ కూతురితో వివాహం అయ్యింది. భార్యను అమితంగా ప్రేమించాడు. వాళ్లది అన్యోన్య దాంపత్యం. కానీ విధి చిన్న చూపు చూసింది. కనకం ఆడపిల్లను ప్రసవించి మరణించింది. తను అమితంగా ప్రేమించిన భార్య నిష్క్రమణను తట్టుకోలేకపోయాడు. తిరిగిరాని లోకాలకు భార్య వెళ్లిపోయిందని తెలిసినా, ఆమెను మర్చిపోలేక జీవితంలో స్తబ్ధత పెంచుకున్నాడు.

కేశవ ఈ పరిస్థితికి తల్లిదండ్రులతోబాటు మామగారయిన మేనమామ కూడా చాలా బాధపడ్డాడు. కూతుర్ని ఎలాగా తీసుకురాలేడు. వీలయినంత త్వరలో కేశవను ఈ బాధనుంచి బైటపడవేయడం తన కర్తవ్యంగా భావించాడు. దానికి పునర్వివాహం ఒక్కటే మార్గమని ఆలోచించి, రమణ కూతురి గురించి ఆలోచించాడు.

సమయం దొరికినప్పుడల్లా కేశవతో మాట్లాడుతూ మళ్లీ అతని జీవితంలో భార్య అవసరం, పిల్లకు తల్లి అవసరం ఎంతో అతనికి వివరించడం మొదలుపెట్టాడు. ముందు వ్యతిరేకించినా పెద్దవాళ్లు పడుతున్న బాధను గుర్తించి, పెళ్లికి తన అంగీకారాన్ని తెలిపాడు.

పెళ్లిచూపుల్లో కేశవను చూసిన ప్రసన్న చాలా సంతోషించింది. అందగాడే అని మనసులో అనుకోకుండా ఉండలేకపోయింది. ఈ సంబంధం కాదంటే తండ్రి తనని ఏ లేనివాడికో కట్టబెడతాడన్న భయం కూడా ఉండడంతో పెళ్లికి అంగీకారం తెలిపింది.

ప్రసన్న, మంజరి చాలా అందంగా ఉంటారు. చక్కని ఒత్తయిన జుట్టు, చెంపకు చేరడేసి కళ్లు, తీర్చిదిద్దిన ముక్కు, చక్కని అవయవ సౌష్ఠవంతో చూపరులను ఆకట్టుకునే అందం.

సీత అనుకుంటూ ఉంటుంది గుడ్డిలో మెల్లలా అందమైన పిల్లల్ని ఇచ్చాడు దేవుడు. చదువుతో బాటు అందం కూడా లేకపోతే?

ప్రసన్నను చూసిన కేశవ అభ్యంతరం చెప్పలేదు. పాపను బాగా చూసుకోవాలని చెప్పాడు. పెళ్లిఖర్చులు మగపెళ్లివారే పెట్టుకుంటానన్నా వెంకట రమణ తిరస్కరించాడు.

“మా ఇంట్లో మొదటి కార్యం. నా స్తోమతకు తగ్గట్టుగా కన్యాదానం చేసి నా పిల్లను అత్తవారింటికి పంపుతాను” అన్నాడు.

సరేనన్నారు మగపెళ్లివారు. ఉన్నంతలో పెళ్లి బాగా చేసి, చీరసారె పెట్టి కూతుర్ని అత్తవారింటికి పంపాడు రమణ. ప్రసన్నకు కేశవ నచ్చాడు. అత్తవారు పెట్టిన నగలు తెగ నచ్చాయి. నచ్చనిది ఆ పల్లెటూరు, సవతి కూతురు ప్రియ.

అత్తమామలు ఎంతో ప్రేమగా చూసుకుంటున్నారు. కొన్ని రోజుల్లోనే ప్రియ చిరునవ్వులు, ముద్దుమురిపాలు ఆమెలో మార్పు తీసుకువచ్చాయి.

పేరుకు పల్లెటూరైనా పెద్ద ఇల్లు, వాకిలి, అన్ని సౌకర్యాలు ఉన్నాయి. పుట్టింట్లో రేపు కోసం తడుముకోవటం అలవాటయిపోయింది. పండక్కి అందరూ పరమాన్నం వండుకుంటే, తమ ఇంట్లో కూడా వండుకుంటే బాగుంటుందన్న కోరిక ఉండేది.

సేమ్యా పరమాన్నం ఎలాగా లేదు. బియ్యం పరమాన్నం అప్పుడప్పుడు వండేది తల్లి. అన్నం ఉడికాక బెల్లం వేసి చివర్లో కాస్త పాలు పోసేది. స్నేహితులు వాళ్ల ఇళ్లల్లో చేసుకునే పిండివంటలు చెపుతూ ఉంటే, ఎప్పుడైనా అవి తింటామా అనిపించేది. బంధువుల ఇళ్లకు వెళ్లే అలవాటు లేదు.

ఇప్పుడు ప్రసన్నకు దేనికీ లోటు లేదు. ప్రతిదానికీ తడుముకునే ప్రసక్తి లేదు. సరికదా అన్నీ ఎక్కువే ఉన్నాయి. వాస్తవాన్ని గ్రహించి పరిస్థితుల కనుగుణంగా నేర్చుకోవాలని, అందరికీ అన్నీ దొరకవనీ చాలా తొందరగానే గ్రహించింది ప్రసన్న. అందుకే తన భవిష్యత్తుకు సోపానాలు వేసుకుంది.

పల్లెటూరని ముందు గొణిగినా, మెల్లిగా అక్కడి వాతావరణానికి అలవాటు పడడం మొదలుపెట్టేది. కొత్తలో ఎప్పుడూ తన గదిలోంచి బైటకు వచ్చేది కాదు. అత్తగారే అన్ని పనులూ చేసుకునేది. కొత్తకదా అని సర్దుకుపోయేది ఆవిడ. ప్రియను కూడా దగ్గరకు తీసేది కాదు.

కేశవ కొన్ని రోజులు చూసి మెల్లిగా "అమ్మకు ఇంటిపనుల్లో సహాయం చెయ్యి" అన్నాడు.

అది ఆజ్ఞో, అర్థింపో తెలియలేదు. ఇష్టం లేకపోయినా అత్తగారి వెనుక అన్ని పనులకూ బయలుదేరేది.

పనివాళ్లు, పాలేర్లూ "చిన్నమ్మాయిగారూ" అంటూ ఉంటే చాలా బాగుండేది. ఇంట్లో ఎప్పుడూ పనివాళ్లు లేరు. మన్నన ఎరగదు. ఇప్పుడీ కొత్త పిలుపు ఆమెకు బాగుంది. ఆ పిలుపు కోసం మెల్లిగా అన్ని పనుల్లో తలదూర్చడం మొదలుపెట్టింది.

తనకు తెలియకుండానే పనివాళ్ల మీద అజమాయిషీ, పాలేళ్లు సరిగా పనిచేస్తున్నారా లేదా చూడడం అలవాటయ్యింది. డబ్బు విషయాలు కూడా కోడలికి అప్పగించింది. చేతినిండా డబ్బులు. తన చేతిమీదుగా అందరికీ జీతాలవీ ఇవ్వడం – ఇవన్నీ ముందు ఆనందం ఇచ్చినా ఆ తరువాత అలవాటయ్యాయి.

ఇప్పుడు ప్రతి పనికీ అత్తగారు, మావగారు "ప్రసన్నా!" అని పిలుస్తుంటే మనసుకు హాయిగా ఉంటోంది. అలాగే ప్రియ బోసినవ్వులు, కేశవ ఎత్తుకున్నప్పుడు, పక్కనున్న ప్రసన్న బుగ్గలు తన చిన్న చిన్న చేతులతో తడిమేది.

పువ్వులా మెత్తగా ఉన్న ఆ చేతులు బుగ్గకు తగలగానే ఏదో తెలియని ఆనందం. మాట వచ్చిన వెంటనే "అమ్మ" అన్న పదం ఆమెకే దక్కింది. ఆ

పిలుపుతో ఆ చిన్నారికి అమ్మ అయిపోయింది. అందులోని మాధుర్యాన్ని ఆస్వాదించింది.

మెల్లిగా కొత్త వాతావరణానికి అలవాటుపడిపోయింది. ప్రసన్నను చేసుకుని తాను తప్పు చెయ్యలేదనుకున్నాడు కేశవ.

ఎప్పుడు పుట్టింటికి వెళ్లినా, అత్తగారు వద్దన్నా ప్రియను తనతో తీసుకువెళ్లేది. ప్రియను అక్కున చేర్చుకుంది. పుట్టగానే తల్లిని పోగొట్టుకున్న ఆ చిన్నారికి తల్లిగా, తనను తాను మలుచుకుంది. అందరి ప్రేమకూ పాత్రురాలయ్యింది.

ప్రసన్నలోని ఈ మార్పు తల్లితండ్రులకు చాలా ఆనందాన్ని కలుగజేసింది. అక్కగార్ని చూసి మంజరి అందరికన్నా ఎక్కువ ఆనందించింది. నిజం చెప్పాలంటే ప్రసన్నలోని ఈ మార్పుకు విత్తనం మంజరి వేస్తే, కేశవ, అతని తల్లిదండ్రులు చూపించిన ఆప్యాయత, చనిపోయిన కూతుర్ని ఆమెలో చూసుకుంటున్న ప్రియ అమ్మమ్మ, తాతలు ఆ విత్తనానికి నీరు పోసి ఎరువు వేశారు.

ఇప్పుడు తను పొందుతున్న ఆనందానికి మంజరి కారణమని గాఢంగా నమ్ముతుంది ప్రసన్న. మూర్ఖత్వంలో ఉన్న తనను, చిన్నపిల్లయినా ఎంతో ముందుచూపుతో హెచ్చరించింది. దాని మాట వినకపోయి ఉంటే ఈనాడు ఈ అదృష్టం, ఈ ప్రేమాభిమానాలు తనకు దక్కి ఉండేవి కావు.

* * *

దేముడి దయవలన ఒక ఆడపిల్ల బాధ్యత తీరింది. ఇంకా ముగ్గురు పిల్లలను గట్టెక్కించాలి. తెలివితేటలున్నా ప్రతాప్‌కు చదువు పట్ల నిర్లక్ష్యం. అందుకే డిగ్రీ రెండుసార్లు డింకీలు కొడితే కానీ కంప్లీట్ చెయ్యలేకపోయాడు.

ప్రతాప్‌కు కూడా జీవితంలో చాలా పైకి ఎదగాలని, డబ్బున్నవాడు అవ్వాలని కోరికలు ఉన్నాయి. ఎప్పుడూ అందమైన కలలు కంటూ స్వప్నలోకాల్లో విహరిస్తూ ఉంటాడు. ఆ కలలు తీరే మార్గం ఎలా?! రమణ నిర్మొహమాటంగా చెప్పాడు – "ఇంక నిన్ను చదివించటం నా వల్ల కాదు, ఉద్యోగం చూసుకో" అని.

బాగా చదువుకున్నవాళ్లకే ఉద్యోగాలు దొరకడం కష్టమైన ఈ రోజుల్లో బొటాబొటీ మార్కులతో పాసయినవాడికి ఉద్యోగం దొరకడం అంత సులభమైన పని కాదు. ఆఖరికి ప్రయత్నించగా, ఒక ప్రైవేట్ ఆఫీసులో క్లర్క్‌గా ఉద్యోగం దొరికింది. ఉద్యోగం వచ్చింది కాబట్టి అడ్డు లేకుండా తన సరదాలు

తీర్చుకుందామనుకున్నాడు. కొడుకు జీతం తెచ్చి తన చేతికిస్తాడనుకున్నాడు రమణ.

ప్రతాప్ తన సంపాదనలో ఒక్క రూపాయి కూడా తండ్రి చేతిలో పెట్టేవాడు కాదు.

ఇక ఆగలేక ఒకరోజు "ఏరా జీతం వచ్చిందా? కొంత నీ ఖర్చులకు ఉంచుకుని, మిగిలిన జీతం అమ్మకు ఇయ్యి" అన్నాడు రమణ.

"నా జీతం నా ఇష్టం. ఇది నా కష్టార్జితం. కన్నకొడుక్కు తిండి పెట్టడం కూడా ఒక ఉద్ధరింపు అయినట్లు మాట్లాడుతున్నారేమిటి? ఇన్నాళ్లూ పెట్టారు. ఇప్పుడూ పెట్టండి. అంతగా కుదరదంటే నేను వేరే వెళ్లిపోతాను" అన్నాడు.

శూలాల్లాంటి ఈ మాటలకు ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు రమణకు.

సీత మాత్రం ఊరుకోలేక, "అదేమిట్రా! మీ నాన్నగారు అన్నదాంట్లో తప్పేం ఉంది? అయినా నాన్నగారితో మాట్లాడే విధానం అదేనా? కొడుకు ఎదిగి వచ్చి సంపాదనాపరుడైతే పెళ్లయ్యేదాకా తండ్రి బరువు బాధ్యతలు తాను కూడా పంచుకుంటాడు. ఇంకా నీ వెనక ఒక చెల్లెలు, తమ్ముడు ఉన్నారు" అంది.

"ఓహో! మీ బరువు బాధ్యతలు పంచుకోవడానికా నన్ను కనిపెంచారు. ఇంత స్వార్థపరులైన తల్లిదండ్రులను నేనెక్కడా చూడలేదు. పిల్లల్ని కనీ పెంచడం ప్రతి తల్లిదండ్రులూ చేస్తారు. ఇందులో మీరు ఎక్కువగా చేసిందేమీ లేదు. అదీకాక చిన్నప్పట్నించీ ఉన్న నా కోరికల్ని డబ్బులేక అణుచుకున్నాను. కనీసం నా సంపాదనతోనైనా నన్ను జీవితాన్ని అనుభవించనివ్వండి. నాకు చాలా కోరికలు ఉన్నాయి. మంచి ఖరీదైన బట్టలు, సినిమాలు, షికార్లు, బైక్‌మీద తిరగాలని, ఈ కోరికలు మీరెలాగూ తీర్చలేదు. అందుకని ఇవన్నీ నా సంపాదనతో నేను తీర్చుకోవాలని అనుకుంటున్నాను.

మీరు కన్న పిల్లలు మీ బాధ్యత అంతే! మీ బాధ్యతలు నన్ను పంచుకోమనడం ఏం బాగాలేదు. ఇంతకన్నా నేను చెప్పేదేం లేదు. నా నుంచి ఏ సాయం అందదు" అంటూ విసురుగా చెప్పులేసుకుని బైటికి వెళ్లిపోయాడు.

"వీడు ఇంత పొగరుగా సమాధానం చెప్తున్నాడేమిటండీ! కొంపలోంచి పొమ్మందాం. బెదిరిస్తున్నాడు. బైటికిపోతే వాడి సంపాదనతో వాడు ఎన్ని కోరికలు

తీర్చుకుంటాడో తెలుస్తుంది. నోట్లోకి ఒక ముద్ద వెళ్లాలంటే ఎంత ఖర్చు, ఎంత శ్రమ ఖర్చుపెట్టాలో ఆచరణలోకి వస్తే కానీ తెలియదు. మీరు కష్టపడి సంపాదిస్తుంటే, నేను వండిపెడ్తే తినేవాడికి, అందులో ఉండే కష్టసుఖాలు అర్థం కావటం లేదు. తిరిగి వచ్చాక చెప్తాను. డబ్బు ఇవ్వని పక్షంలో ఇంట్లోంచి వెళ్లిపొమ్మని" అంది ఆవేశంగా సీత.

"ఊరుకో సీతా! కడుపు చించుకుంటే కండలు బైటపడతాయి. వాణ్ణి ఇంట్లోంచి పొమ్మంటే ఊళ్లో మన పరువేం కావాలి? అందరూ మననే దుయ్యబడతారు. ఇన్నాళ్లూ భరించాం. ఇంకొన్నాళ్లు భరిద్దాం. పెళ్లి చేసుకున్నాక వాడే వేరు వెడతాడులే" అన్నాడు.

"ఏమో! నాకదీ అనుమానమే! ఈ అప్రాచ్యుడు ఇంకా ఎన్ని వెధవ పనులు చేస్తాడో? వీడి ప్రభావం చిన్నవాడిమీద కూడా పడితే మన గతి అధోగతే!" అంది సీత.

"తల్లివి శాపనార్థాలు పెట్టకు. ప్రసన్న కూడా ఇలాగే ఉండేది కదా! కానీ మనం చెప్పినట్లు పెళ్లి చేసుకుంది. ఇప్పుడు ఎంత మారిందో చూశావు కదా! అలాగే వీడు కూడా మారతాడని ఆశిద్దాం. మన గతి ఏమిటన్నది నిర్ణయించవల్సిన వాడు ఆ పైన ఉన్నాడు. మనం నిమిత్తమాత్రులమే" అన్నాడు రమణ.

ఈ ఘర్షణ వింటున్న మంజరి, తల్లిదండ్రులు పడుతున్న బాధ, అన్నగారు చేసిన గాయం తల్చుకుని బాధపడింది. 'కష్టాలు ఇచ్చిన దేముడు, ఆ కష్టాల్ని అర్థం చేసుకునే పిల్లల్ని కూడా ఇస్తే ఎంత బాగుంటుంది?' అనుకుంది. మంజరి ఇంటర్ పాసయ్యింది. చాలా మంచిమార్కులు తెచ్చుకుంది. గ్రాడ్యుయేషన్ చెయ్యాలని మనసులో ఉన్నా, తండ్రికి అదనపు భారం కావడం ఇష్టం లేక ప్రైవేటుగా చదువుతానంది. తమ కష్టాలు అర్థం చేసుకుని మసలుకోగలిగే కూతురు ఉన్నందుకు ఆ దంపతులు ఇద్దరూ ఎంతో సంతోషించారు.

ఇంట్లోనే ఉండి ప్రైవేట్‌గా గ్రాడ్యుయేషన్ చదవడం మొదలుపెట్టింది. దానికి తగ్గ పుస్తకాల కోసం స్నేహితుల ఇళ్లకు వెడుతూ ఉండేది. అందులో జానకి మొదటిది. చిన్ననాటి నుంచీ కలిసి చదువుకున్నారు. తెలియనివి ఒకళ్ల నడిగి ఒకరు నేర్చుకునేవారు.

జానకి కాలేజీలో చేరింది. మంజరిని కూడా చేరమంది. "ఇద్దరం ఇన్నాళ్లూ సరదాగా గడిపాము. ఈ మూడేళ్లూ కూడా గడిపితే బాగుంటుంది కదా!" అంది.

"నీకు మా ఇంటి సంగతి తెలుసు కదా! కాలేజీలో చేరితే ఫీజ్ కట్టాలి. పోనీ అది ఎలాగో మానేజ్ చేసినా కాలేజీకి రావాలంటే మంచిబట్టలు కావాలి. పుస్తకాలు కొన్నైనా కొనక తప్పదు. నా చదువుకన్నా ముఖ్యం మురళి చదువు" అంది.

అదీ నిజమే! ఇంట్లోంచి బైటికి అడుగుపెడితే ప్రతిదానికీ డబ్బు అవసరం పడుతుంది. మంజరి ప్రతి విషయాన్ని చక్కగా ఆలోచిస్తుంది. తనకైతే అలాంటి ప్రాబ్లమ్ లేదు కాబట్టి కాలేజీలో చేరగలిగింది. మంజరికి కాలేజీ ముచ్చట్లు కళ్లకు కట్టినట్లు చెప్పేది.

పొద్దున్న ఇంటిపనుల్లో తల్లికి సహాయం చేస్తూ, మధ్యాహ్నం తన చదువు సాగించేది. సాయంకాలం కొంతమంది పిల్లలకు ట్యూషన్స్ చెప్పేది. వేన్నీళ్లకు చన్నీళ్లు తోడన్నట్లు తన వంతుగా ఇంటి ఖర్చులకు కొంత డబ్బు సంపాదించడం మొదలుపెట్టింది.

మురళి టెంత్‌క్లాస్‌లోకి వచ్చాడు. వాడికీ అందరి పిల్లల్లా గొంతెమ్మ కోరికలు ఉన్నా చిన్నప్పట్నించీ మంజరి ప్రభావం వాడిమీద ఉండడంతో ప్రతాప్‌లాగా పేచీ పెట్టేవాడు కాదు. అడగకుండా వాడి చిన్న చిన్న కోరికలు తీర్చే అక్క మంజరి అంటే వాడికి ఇప్పుడు అమితమైన ప్రేమ. మధ్యలో కొన్నాళ్లు నిర్లక్ష్యం చేశాడు. తరువాత తన తప్పు తెలుసుకున్నాడు.

మంజరికి తనకన్నా చిన్నవాడైన మురళిమీద మక్కువ ఎక్కువ. ఇద్దరికీ ఎక్కువ వ్యత్యాసం లేకపోయినా వాడిపట్ల చూపే ప్రేమలో అనురాగం వెల్లివిరిసేది. తల్లి తనకిచ్చేదాంట్లో వాడికి కొంత ఇచ్చాకే మిగిలినది తీసుకునేది.

ఇప్పుడు కూడా చిన్న చిన్న అవసరాలకు మంజరిమీదే ఆధారపడతాడు. చదువుకుని బాగా వృద్ధిలోకి వస్తే ఈ ఆర్థిక సమస్యలు దూరమవుతాయని, అందుకని కష్టపడి చదివి మంచి మార్కులు తెచ్చుకోవాలని అక్కగారు చెప్పే మాటలను ఆచరణలో పెట్టేవాడు.

ఆ కారణంగా టెంత్‌లో స్టేట్ ఫస్ట్ వచ్చాడు. రమణ, సీత చాలా సంతోషించారు. మురళికి అందరూ తనను గొప్పగా పొగడడం, స్కూల్లో ప్రిన్సిపాల్, టీచర్లు అభినందించడం చాలా ఆనందం కల్గించింది.

అక్క చెప్పినట్లుగా చదువుకుంటే ఇంకా బాగా పేరు ప్రఖ్యాతులు వస్తాయి. దానితోబాటే మంచి ఉద్యోగం కూడా సంపాదించుకోవచ్చు అని అనుకున్నాడు.

ఇంటర్‌లో ఇంకా ఎక్కువ మార్కులు తెచ్చుకోవాలని నిశ్చయించుకున్నాడు.

అనుకున్నట్లుగా మురళి ఇంటర్‌లోనూ మంచి మార్కులు తెచ్చుకున్నాడు. ఎంసెట్‌లో మంచి మార్కులు తెచ్చుకున్నాడు. మంచి మార్కులు రావడంతో గవర్నమెంట్ కాలేజీలో ఇంజనీరింగ్‌లో సీట్ వచ్చింది. రమణ కొంచెం ఆలోచించడం చూసి మంజరి మురళిని చదివించమని ప్రోత్సహించింది.

"నాకు తలకు మించిన బరువు అవుతుందమ్మా!" అన్నాడు.

"లేదు నాన్నా! మురళి కష్టపడి చదువుతున్నాడు. ఒక్క నాలుగేళ్లు కష్టపడితే వాడికి ఉజ్జ్వల భవిష్యత్తు ఇచ్చినవాళ్లం అవుతాం" అంది.

అలా మురళి ఇంజనీరింగ్‌లో జాయిన్ అయ్యాడు. తమ్ముడ్ని మంజరి పదే పదే హెచ్చరించేది.

"నువ్వు కష్టపడి చదవాలి. టైమ్ వృథా చేయకూడదు. ఆ తరువాత నీ స్వార్థం చూసుకోకుండా నాన్నగారికి చేయూతనివ్వాలి" అంటూ. ఇంజనీరింగ్‌లో చేరుతున్న ఆనందంలో అక్కగారి మాటలకు తల ఊపాడు.

* * *

ఒకరోజు ప్రతాప్ మెడలో దండలతో ఒక అమ్మాయిని తీసుకుని గుమ్మంలో ప్రత్యక్షమయ్యాడు. ఆశ్చర్యంగా చూస్తున్న తల్లిదండ్రులతో, "నేను పెళ్లిచేసుకున్నాను. మీరెలాగూ ఇప్పట్లో నాకు పెళ్లి చేయరు. అందుకే నా పెళ్లి నేను చేసుకున్నాను" అన్నాడు.

దిగ్భ్రమ నుంచి ముందుగా తేరుకున్న సీత "ఒక్క నిముషం ఉండండి" అంటూ హారతి తీసుకురావడానికి లోపలికి వెళ్లింది. హారతిచ్చి "లోపలికి రండి" అంటూ వంటింట్లోకి వెళ్లిపోయింది.

గదిలోకి వెళ్లి తలుపులు వేసుకున్నారు కొడుకు, కోడలు. కొడుకు చేసిన చర్యవల్ల తగిలిన షాక్ నుంచి ఇద్దరూ కోలుకోలేకపోతున్నారు. తల్లిదండ్రుల పట్ల అతని నిర్లక్ష్యం వాళ్ల గుండెల్లో ముళ్లు గుచ్చినట్లుగా ఉంది.

అందరి పిల్లలూ ఇలాగే ప్రవర్తిస్తున్నారా? లేక దురదృష్టం తమను వెంటాడుతోందా? ఆ పిల్ల ఏమిటో, ఆ వివరాలు తమకు తెలియవు. వాడి పెళ్లితో ముడిపెట్టి మంజరి బాధ్యతను తీర్చుకుందామనుకున్నారు.

తాను అనుకున్నది అవలేదు సరికదా, ఇంట్లో ఇంకో మెంబరు పెరిగితే

ఖర్చు పెరుగుతుంది. ప్రతాప్ జీతం డబ్బులు ఇవ్వకపోయినా పోనీలే అని సరిపెట్టుకున్నారు. ఇప్పుడు ఈ అమ్మాయిని కూడా పోషించాలంటే...?

ఆ అమ్మాయి అలవాట్లు, ఆచార వ్యవహారాలు ఏమిటో? అన్నీ అనుమానాలే.

'ఈ సమస్యను కాలమే పరిష్కరించాలి' అనుకుంది సీత. వంట అయ్యాక భోజనాల కోసం తలుపు తట్టింది. తలుపు తీసిన కొడుకుతో భోజనాలకు రమ్మంది.

గొడవ జరుగుతుందనుకున్న ప్రతాప్ తల్లిదండ్రులు ఏమీ మాట్లాడక పోవడంతో తానేదో విజయం సాధించాననుకుని, మనసులో గర్వపడ్డాడు. అతను, భార్య భోజనాలకు వచ్చారు. మంజరి ప్రేమగా "వదినా" అంటూ చిరునవ్వుతో పలకరించింది.

ఆమె నవ్వుమొహం చూసి తాను కూడా సంతోషించింది రేఖ.

"మీ చెల్లెలు చాలా మంచిది" అంది ప్రతాప్‌తో.

ప్రతాప్ ఏం మాట్లాడలేదు. అందరూ మంచివాళ్లే కానీ అతనిలోని స్వార్థం వాళ్ల మంచితనాన్ని తనకనుకూలంగా వాడుకోదల్చుకున్నాడు.

ప్రేమతో కొడుకును ఆదరిద్దామని అనుకున్నా, కొడుకు ప్రవర్తన సీతను ఆ పని చెయ్యనివ్వలేదు. పెళ్లయినా ప్రతాప్ ప్రవర్తనలో మార్పు రాలేదు.

ఇంట్లో ఖర్చులకు డబ్బు ఏమీ ఇచ్చేవాడు కాదు. ప్రతాప్ భార్య రేఖ కూడా ఉద్యోగస్థురాలే. ఇద్దరూ ఉదయాన్నే వెళ్లిపోవడం, సాయంకాలం తిరిగి రావడం, ఎక్కడి బట్టలు అక్కడ వదిలెయ్యడం చేసేవారు.

అన్నిటికన్నా సీతని బాధించిన విషయం, ఈడొచ్చిన పిల్ల మంజరి ముందు, పెద్దవాళ్లయిన తామిద్దరి ముందూ ప్రతాప్, భార్య చేసే శృంగార చేష్టలు భరించ శక్యం కాలేదు. పట్టపగలు కూడా తలుపులు వేసుకుని కూర్చోవడం, అంత చిన్న ఇంట్లో వాళ్లు ఒక గది ఆక్రమించుకుంటే భర్త, మంజరి, మురళి, తను మిగిలిన స్థలంలో ఎలా సర్దుబాటు చేసుకోవాలి?

మురళికి చదువుకుందుకు చాలా ఇబ్బందిగా ఉంది. హాస్టల్లో పెట్టే స్తోమత లేదు. మధ్య మధ్యలో ఫ్రెండ్స్ ఇళ్లకు వెళ్లి చదువుకునేవాడు. అస్తమానూ అలా చెయ్యాలంటే సాధ్యం కాదు. మంజరి దానికొక సొల్యూషన్ కనిపెట్టింది. పెరట్లోకి

ఒక బల్బ్ కనెక్షన్ ఇచ్చి, ఒక కుర్చీ వేసుకుని తమ్ముణ్ణి అక్కడ చదువుకోమని సలహా ఇచ్చింది.

ఇంట్లో ఫ్రీ లాడ్జింగ్, ఫ్రీ పనిమనుషులు, చాలా ఆనందంగా గడిచిపోతోంది. సీత, మంజరి జీతం బత్తెం లేని పనిమనుషులుగా ఉన్నారు. హద్దులు మీరుతున్న వాళ్ల చేష్టలకు ముగింపు పాడాలని నిర్ణయించుకుంది సీత.

రేఖ ఇంట్లో ఏ పనీ ముట్టుకునేది కాదు. వాళ్ల గదిలో కూడా ఎక్కడి వస్తువులక్కడ పడేసేవారు. ఇల్లు చీదరగా ఉండడం ఇష్టం లేక తానే సర్దుకునేది. మంజరి వాళ్ల గదిలోకి వెళ్లడానికిష్టపడేది కాదు సీత. ఆమెకు తెలియని విషయం రేఖను ఇంటిపనుల్లో కలగజేసుకోవద్దని సలహా ఇచ్చినది ప్రతాప్ అని.

ఆ రోజు ప్రతాప్, రేఖ ఆఫీస్‌నుంచి వచ్చేసరికి సూట్‌కేస్‌లు రెండు, అట్టపెట్టెలు రెండు సర్ది ఉన్నాయి. హాల్లో సామాన్లు చూసి "ఇంటికెవరైనా చుట్టాలు వచ్చారా అమ్మా!" అన్నాడు.

"చుట్టాలు మీరున్నారు చాలదూ! అయినా చుట్టాలన్నవాళ్లు ఎక్కువ కాలం ఉండకూడదు. అవి మీ సామానే! మీకు టైమ్ ఉండదని నేను సర్దిపెట్టాను. ఆటో పిలుచుకో" అంది సీత.

నిర్ఘాంతపోయాడు ప్రతాప్. కానీ అంతలోనే తేరుకుని, "రేఖా లోపలికి వెళ్లు. అమ్మ వేళాకోళం చేస్తోంది" అన్నాడు.

"నేనేం వేళాకోళం చెయ్యడం లేదు. మన మధ్య అంత సౌరభ్యం కూడా ఉందా? నీ వేషాలు ఇన్నాళ్లూ భరించాను. ఇంక మా వల్ల కాదు. నీ దారి నువ్వు చూసుకో" అంది.

"కన్నకొడుకును ఇంట్లోంచి వెళ్లిపొమ్మంటున్నావా? నువ్వసలు తల్లివేనా?" అన్నాడు.

"నేను కన్నతల్లినే! శరీరంలోని ఒక భాగం పాడయిపోతే, ఆ అంగానికున్న చీడ మిగిలినవాటికి సోకకుండా చూడాల్సిన బాధ్యత నాకు ఉంది. అందుకే నువ్వు ఒక్క క్షణం ఈ ఇంట్లో ఉండడానికి వీలులేదు. నువ్వు నీ భార్యతో తక్షణం బైటికి నడు. నువ్వు కన్నకొడుకులా ప్రవర్తిస్తే నేను కూడా అలాగే ప్రవర్తించేదాన్ని. కానీ నువ్వు స్వార్థపరుడిలా ప్రవర్తించావు. అందుకే నేను కూడా అలా ప్రవర్తించాల్సి వస్తోంది" అంది.

"నేను వెళ్లను. ఏం చేస్తావు?" అన్న కొడుకు మొండివాదనకు, అన్నాళ్లూ బడబానలంలా కడుపులో దాచుకున్న బాధ కన్నీళ్ల రూపంలో ముంచెత్తింది.

అప్పటిదాకా ప్రేక్షకురాలిగా ఉండిపోయిన మంజరి, గబగబా తల్లి దగ్గరకు వచ్చి, తల్లిని పొదివి పట్టుకుని "ఊరుకో అమ్మా" అంటూ వంటింట్లోకి తీసుకుపోయింది.

ఈ సమస్యకు పరిష్కారం ఏమిటో అర్థం కావటం లేదు. ఈ ప్రతాప్ అన్న చెదను దూరం చెయ్యకపోతే మిగిలిన ఇద్దరి పిల్లల భవిష్యత్తు కూడా సర్వనాశనం అయిపోతుంది.

ఎప్పుడో చిన్నప్పుడు చదివిన పద్యం గుర్తుకు వచ్చింది. ఆ పద్యంలో చెప్పినట్లుగానే ఉంది ఇప్పుడు తమ స్థితి.

కొరగాని కొడుకు పుట్టిన
కొరగామియె కాదు తండ్రి గుణములు చెరచున్
జెరకు తుద వెన్ను పుట్టిన
జెరకున దీపెల్ల చెరచు సిద్ధము సుమతీ!

"ఈ సమస్యను ఎలా పరిష్కరించాలమ్మా?" అంటున్న తల్లిని చూసి మంజరి అంది.

"వాడు ఇల్లు వదిలి వెళ్లకపోతే మనమే వదిలి వెళ్లిపోదామమ్మా. ఇది మన సొంత ఇల్లేం కాదు. అద్దె ఇల్లే కదా! ఇంతకన్నా చిన్న ఇల్లు తీసుకుంటే మనకు అద్దె కూడా తగ్గుతుంది. మురళి చదువు అయ్యేదాకా కాలక్షేపం చేద్దాం. కష్టాలు కలకాలం ఉండవంటారు కదమ్మా పెద్దలు."

ఎప్పటినుంచో అలవాటైన ఇల్లు. అనుకోకుండా చవకలో రెండు పడకగదులు ఉన్న ఇల్లు దొరికింది. ఇప్పుడు మళ్లీ ఇల్లు మారాలంటే అదీ ఇన్నాళ్ల తరువాత కష్టమైన పనే అన్న ఆలోచనలో పడింది సీత.

మంజరి స్నేహితురాలు వాళ్ల డాబామీద ఉన్న రెండు గదులు అద్దెకివ్వడానికి వాళ్ల తల్లిదండ్రులను ఒప్పించింది. అది ఇల్లు అనడం కన్నా గూడు అనే అనాలేమో! వాళ్లు సామాన్లు పెట్టుకుందుకు అనువుగా ఉంటుందని రెండుగదులు, బాత్‌రూమ్, టాయిలెట్ కట్టుకున్నారు. ఇన్నాళ్లు ఆ గదుల్లో పనికిరాని సామాను ఉండేది.

మంజరి అప్పుడప్పుడు వాళ్ల అమ్మాయితో వాళ్ల ఇంటికి వస్తూ ఉంటుంది. ఆ అమ్మాయి మంచితనం, తల్లిదండ్రులంటే ఉన్న ప్రేమ, గౌరవం తెలుసున్నవాళ్లు. అందుకే పనికిరాని సామాను అంతా అమ్మేసి గదులు ఖాళీ చేసి ఇచ్చారు.

సీత ఆ రెండు గదులకు సరిపడ సామాను సర్ది అవసరం లేని సామాను అమ్మేసింది. రమణ ముందు అడ్డుచెప్పబోయాడు. భార్య మొహంలోని దీనత్వాన్ని గ్రహించి, ఈ పరిస్థితులను ఎదుర్కోవడానికి ఆమె ఎంత సంఘర్షణ అనుభవిస్తోందో అతను ఊహించగలడు. మగవాడు తను ఆఫీసుకు వెళ్లిపోవడంతో వీటినుంచి తప్పించుకుంటున్నాడు.

'ట్రూ సోల్జర్' లాగా ఈ బ్రతుకు యుద్ధంలో పోరాడుతున్నది ఆమే. అందుకే ఆమె నిర్ణయానికి తాను కూడా కట్టుబడి ఉండాలి. మళ్లీ గొడవపడ్డం ఇష్టం లేక ప్రతాప్ సామాను ఒక గదిలో పెట్టి, తాళం వేసి, ఆ తాళాలు పక్క ఇంట్లో ఇచ్చి వెళ్లిపోయారు. ఆఫీస్ నుంచి ఇంటికి వచ్చిన ప్రతాప్, రేఖలకు తాళం చూసి ఆశ్చర్యం వేసింది.

ఆ ఇంటికి ఎప్పుడూ తాళం వేసిన గుర్తులేదు. అలాంటిది తాళం ఉందంటే ఏమయిందో అని కంగారుపడ్డారు. ప్రతాప్ స్కూటర్ చప్పుడు విని పక్కింటావిడ బైటికి వచ్చి, "మీ అమ్మగారు మీకు ఈ తాళాలు ఇమ్మన్నారు" అంటూ ఇచ్చింది.

"మా అమ్మావాళ్లు ఎక్కడకు వెళ్లారు?" అని అడిగాడు.

"వాళ్లు ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయారు కదా!' అంటూ ఆవిడ లోపలికి వెళ్లిపోయింది.

ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోవడం ఏమిటి? తమతో ఒక్క ముక్క కూడా చెప్పలేదు. తమ సామాను కూడా పట్టుకెళ్లిపోయారా? ఇంతకన్నా సౌకర్యంగా ఉండే ఇల్లు వీళ్లకు ఎలా దొరికింది? అన్నీ ప్రశ్నలే.

తలుపు తీసిన ప్రతాప్‌కు ఇల్లంతా బోసిగా దర్శనం ఇచ్చింది. గదిలోకి వెళ్లి చూస్తే తమ సామాను తప్ప ఇంట్లో పూచికపుల్ల కూడా లేదు. ప్రతాప్ గ్రహించాడు. తల్లి తెలివిగా తన ఎత్తుకు పై ఎత్తు వేసిందని.

ఇన్నాళ్లూ తల్లిదండ్రుల కష్టం మీద జల్సాగా గడిచినవాడికి స్వయంగా బరువు బాధ్యతలు మొయ్యాలంటే భయం వేసింది. తల్లి తనను చిత్తుగా ఓడించింది. ఆ ఓటమిని అతని మనసు భరించలేకపోయింది.

ఇప్పుడే వస్తానని చెప్పి స్కూటర్ తీసుకుని పక్కింటివాళ్ల నడిగి అడ్రస్ కనుక్కుని, తల్లిదండ్రులు ఏ పరిస్థితిలో ఉన్నారో చూద్దామని బయలుదేరాడు. డాబా మీదకు వచ్చిన ప్రతాప్‌ను నవ్వుతూ పలకరించింది సీత.

“రా, నువ్వు మమ్మల్ని వదిలి వెళ్లనన్నావు కదా! అందుకే మేమే నిన్ను వదిలి వచ్చేశాము. ఇది చాలా పెద్ద భవంతి. ఇందులో నీకు కూడా సౌకర్యంగా ఉంటుందంటే నాకేం అభ్యంతరం లేదు.”

తల్లి మాట్లాడే విధానాన్ని వింతగా వింటోంది మంజరి. తల్లి మాటల్లోని వ్యంగ్యాన్ని బాగానే అర్థం చేసుకున్నాడు ప్రతాప్. చాలా నిశితంగా చుట్టుపక్కల పరికించాడు. ఇప్పుడు తాముంటున్న ఇంటికన్నా ఏ విధంగానూ సౌకర్యంగా లేదు. తనను దూరం చేయడానికి తెలివిగా తల్లి ప్లాన్ వేసిందని అర్థం అయ్యింది.

ఇక తన ఆటలు సాగవు. తన దారి తను చూసుకోవాలి. అయినా ఆశ చావక,

“నువ్వేదో గొప్ప పని చేశాననుకుంటున్నావేమో! నీలాగా మూర్ఖంగా ఎవరూ కొడుకును పోగొట్టుకోరు. మీస్వార్థం మీరు చూసుకున్నారు. ఇంక మీకూ, నాకూ ఏ సంబంధం లేదు” అన్నాడు.

“సంతోషం, నాకూ అదే కావాలి. ఎవరు స్వార్థపరులో నిజాయితీగా నీ మనస్సును అడిగితే చెప్తుందనుకుంటాను. అదీకాక ఈ స్వార్థం ఇప్పుడు నాకు అవసరం. ఇంకా నామీద ఆధారపడ్డ పిల్లలు ఇద్దరు ఉన్నారు. రేపు నువ్వు కూడా తండ్రివి అవుతే నా స్వార్థం ఎంతవరకూ సమంజసమో నీకు బాగా అర్థం అవుతుందనుకుంటాను” అంది సీత.

ఇంక మాట్లాడడానికి ఏమీ లేక తనకు వాళ్ల అండదండలు ఉండవన్న విషయం అర్థమయ్యింది. నిజాన్ని అతను జీర్ణించుకోలేకపోతున్నాడు. తల్లిదండ్రుల సెంటిమెంట్ అన్న బలహీనతపై తను మేడ కట్టుకోవచ్చనుకున్నాడు. అతని గాలిమేడలు కూలిపోయాయి.

ఉక్రోషంతో వెనక్కు తిరిగాడు. మొహం వేళ్లాడేసుకుని వచ్చిన భర్తను చూసి, “ఎక్కడకు వెళ్లారు? ఏం జరిగింది?” అని అడిగింది.

“అమ్మావాళ్ల దగ్గరకు వెళ్లాను. మనతో ఒక్క మాట చెప్పకుండా ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయారు. ఒక్క అయిదేళ్లు కష్టపడి ఇక్కడే అడ్జెస్ట్ అవుతే, మనం

ఒక ఇల్లు కొనుక్కోవచ్చన్న ఆశతో ఉన్నాను. ఇప్పుడు ఇక అది తీరని కోరిక. అందుకే నువ్వు వేరు కాపరం అన్నా వినకుండా ఇక్కడికే తీసుకువచ్చాను. మన ఇద్దరి జీతాలు నిల్వచేసి ఇల్లు కొనుక్కోవచ్చని ఆశపడ్డాను" అన్నాడు.

"వాళ్ల దగ్గరకు ఎందుకు వెళ్లారు? కారణాలు కనుక్కుందుకు వెళ్లారా?"

"లేదు. వాళ్లు ఇల్లు ఖాళీ చేశారంటే ఇంతకన్నా మంచి ఇంటికి వెళ్లారేమో అని వెళ్లాను."

"ఏం ఆ ఇల్లు బాగా లేదా?" అంది రేఖ.

"బాగానా? అధ్వాన్నంగా ఉంది. పెద్ద ఇల్లయితే మనం కూడా అక్కడకు వెళ్లిపోవచ్చని అనుకున్నాను. కానీ అమ్మా, నాన్నా తెలివిగా ఇంతకన్నా చిన్నది, తక్కువ సౌకర్యాలు ఉన్న ఇంట్లోకి మారారు. ఇంక మన పాట్లు మనం పడాల్సిందే" అన్నాడు.

ఆ రాత్రికి బైటికి వెళ్లి భోజనం చేశారు. మర్నాడు ఆఫీసుకు వెళ్లి, ఆఫీసులో ఆలోచించాడు. ఇప్పుడింక ముందుగా వంట సామాను కొనుక్కోవాలి. రోజూ హోటల్లో తింటూంటే ఇద్దరి జీతాలు భోజనానికి సరిపోతాయి అనుకున్నాడు.

ఒక నెల గడిచేసరికి సంసారంలోని కష్టనష్టాలు అవగాహనకి వచ్చాయి. రేఖకు పుట్టింట్లో కాస్త పనిచెయ్యడం అలవాటు ఉన్నా, పెళ్లి అయిన ఈ ఆరునెలలలో భర్త మాట విని, అత్తగారు, ఆడపడుచు చేస్తూంటే హక్కు ఉన్నట్లుగా, సుఖపడ్డానికి అలవాటు పడిపోయింది. ఇప్పుడు ఇంటిపని చెయ్యాలంటే ఒళ్లు వంగటం లేదు.

ప్రతాప్‌కు కూడా పనులు పురమాయించడం మొదలుపెట్టింది. అసలే చిన్నప్పట్నించీ పనిచెయ్యడం కానీ, ఇంటిపనుల్లో, సమస్యలలో బాధ్యత వహించడం కానీ అలవాటు లేని ప్రతాప్ నా వల్ల కాదన్నాడు.

పర్యవసానం రోజూ ఇంట్లో గొడవలు, ఒకరి మీద ఒకరు అరుచుకుంటూ పనులు పూర్తిచేసుకుంటూ ఆఫీస్‌కు వెళ్లేవారు. వెంకటరమణ, సీతల మంచితనంతో అద్దె ఎక్కువగా పెంచకుండా ఇన్నాళ్లూ ఆగిన ఇంటియజమాని, రోజూ వీళ్ల కీచులాటలతో విసిగిపోయి, పొమ్మనలేక పొగపెట్టినట్లు ఇంటద్దె పెంచాడు.

జల్సాలకు తప్ప డబ్బు ఖర్చుపెట్టడం అలవాటు లేనివాడికి ఇంట్లో

అవసరాలు తీరాలంటే ఎలా డబ్బు ఖర్చు అవుతుందో అర్థం అవడం మొదలుపెట్టింది. అమ్మా, నాన్నల అండలో ఏదీ పట్టనివాడికి అన్నీ సునాయాసంగా వస్తాయనుకున్నవాడికి. ఒక్కొక్కటే కొంటూంటే దాని ధరలు అవగతమవడం మొదలుపెట్టాయి.

ఈ ఖర్చులకే కంగారుపడుతున్న మనిషికి, ఇంటద్దె పెరగడం పులిమీద పుట్రలా అయ్యింది. బడ్జెట్ వేసి ఖర్చుపెట్టినా, ఖర్చు పరిధి దాటుతోంది. అలాంటి సమయంలో ఇంటద్దె పెంచడం చాలా బాధ అనిపించింది. ఇదివరకు అమ్మా, నాన్నా మీద ఎగిరినట్లుగా ఇంటాయన మీద ఎగరలేదు. భార్య కూడా సగం జీతం మాత్రం ఇచ్చి సగం జీతం దాచుకుంటోంది.

మెల్లి మెల్లిగా తల్లిదండ్రులు సంసారం నడపడానికి ఎన్ని అవస్థలు పడేవారో అవగతమవడం మొదలుపెట్టింది. తమ ఆర్థిక పరిస్థితికి, తన తీరని కోరికలకు తల్లిదండ్రులు బాధ్యులన్నట్లుగా ప్రవర్తించి, వాళ్లమీద కసి తీర్చుకుంటున్నట్లుగా వ్యవహరించి, తన భవిష్యత్తును తానే పాడుచేసుకున్నాడు.

తాను నడుస్తున్న దారి సరైనదని అనుకుని రేఖ అభిప్రాయానికి విలువ ఇవ్వకుండా, ఆమెను కూడా తన దారిలో నడిపించాడు. ఈ గమనంలో పరిస్థితులు ఎప్పుడూ తనకు అనుగుణంగా ఉంటాయనుకున్నాడు. ఇంతకన్నా తక్కువ అద్దె ఉన్న ఇంటిలోకి మారాలనుకున్నాడు.

దానికి రేఖ ఒప్పుకోలేదు. “ఇంతకన్నా చిన్న ఇల్లు ఎక్కడ దొరుకుతుంది” అంది.

“అమ్మావాళ్లకు దొరికినట్లుగా మనకూ దొరుకుతుంది. వెతకాలి” అన్నాడు.

“సరే వెతుకు, నచ్చితే మారదాం” అంది.

అంటే నేను ఏమీ శ్రమపడను అని పరోక్షంగా చెప్పింది.

వాళ్ల సంసారంలో మెల్లిగా చీలికలు మొదలయ్యాయి. ప్రతాప్ తనవంతుగా ఇంటి వేట కొనసాగించాడు. అతనికి తమకు సరిపడ్డ ఇల్లు దొరకలేదు. నీటిలోకి దిగితే కానీ నీటిలోతు తెలియదన్నట్లు, సంసారం ఈదడం అంత సామాన్యమైన విషయం కాదని స్వానుభవం అవడం మొదలుపెట్టింది.

రోగం తగ్గాలంటే మందు చేదుగా ఉందని ఇవ్వడం మానరు కదా! డాక్టరన్నవాడు రోగాన్ని కనిపెట్టి సరైన మందు సరి అయిన సమయంలో

వెయ్యాలి. అలాగే పిల్లలు దారితప్పి నడుస్తుంటే డాక్టర్ మందు వేసినట్లే తల్లి కూడా చేదుమందు అనే గుణపాఠం చెప్పాలి.

సీత తెలివిగా వేసిన మందు ప్రతాప్ పట్ల గుణం చూపడం మొదలుపెట్టింది. తల్లిగా ఆమెకు కావాల్సింది అంతకన్నా ఏదీ లేదు. ఏదైనా కష్టపడకుండా అప్పనంగా వస్తే దాని విలువ తెలియదు. ఏదైనా సాధించాలంటే దాని వెనుక ఉన్న కష్టం కూడా మనిషికి అవగతం అవ్వాలి.

ప్రతాప్ ఇప్పుడు మొదలుపెట్టిన పయనంలో ఎంతవరకూ కృతకృత్యు డవుతాడో కాలమే నిర్ణయించాలి.

* * *

ఆర్థికంగా మంజరి తమ మీద ఆధారకపోయినా తమ బాధ్యతగా ఆమెకు వివాహం జరిపించాలి. మంజరి పెళ్లి ఎలాగో అలాగ చేసేస్తే మురళి ఇంక రెండేళ్లలో చదువు పూర్తిచేసుకుని గట్టెక్కుతాడు. మంజరికి చక్కని సంబంధం చూసి వివాహం చేస్తే తమ బాధ్యత తీరినట్లే. మురళి గురించి బెంగ లేదు. దేముడు కరుణించి పెద్దపిల్లకు దొరికినట్లుగా మంజరికి మంచి సంబంధం దొరికితే బాగుంటుందనుకున్నారు రమణ, సీత.

పెళ్లికొడుకుల వేట మొదలుపెట్టాడు వెంకటరమణ. పెళ్లికొడుకులకు కొదవ లేదు. కానీ వాళ్ల గొంతెమ్మ కోరికలు తీర్చటం కష్టంగా ఉంది. కొంతమంది కట్నాలు భారీగా అడుగుతుంటే, కొంతమంది పెళ్లి మాకు తగ్గట్టుగా చేయండి అంటున్నారు. మరికొంతమంది అమ్మాయి ఇంజనీరింగ్ చేసిందా అని అడుగు తున్నారు.

ఇదివరకు రోజులే నయం. పిల్ల కాస్త అందంగా ఉండి, సంప్రదాయమైన కుటుంబంలోంచి వచ్చిందంటే, ఇష్టపడి చేసుకునేవారు. ప్రేమ పెళ్లిళ్ల సంగతి వదిలేస్తే, అందరికీ అమ్మాయి అందంగా ఉండాలి, కట్నకానుకలు బాగా కావాలి. అందుకే ఆడపిల్ల అంటే ఎంత ప్రేమ ఉన్నా ఆడపిల్ల పుడితే శక్తి లేనివాడు బాధపడుతున్నాడు. ఇన్ని చట్టాలు వచ్చినా ఈనాటికీ ఆడపిల్ల బాధ్యత ఖర్చుతో కూడిన పనే.

అలా వెతకగా మంజరి అదృష్టవశాత్తు ఒక ప్రైవేట్ సెక్టర్‌లో పనిచేస్తున్న కుర్రవాడు దొరికాడు. కష్టపడి పైకి వచ్చాడు. తల్లి తప్ప ఎవరూ లేరు. తండ్రి లోటు తీర్చే మావగారు దొరికితే, తను రేపు లేకపోయినా కొడుకు

ఒంటరివాడవడన్న ఉద్దేశంతోనూ, మొదటి చూపులోనే మంజరి అంటే సదభిప్రాయం కలగడంతోనూ ఆదిత్య తల్లి ఈ పెళ్లికి ఒప్పుకుంది.

ఆఫీసులో ప్రావిడెంటు ఫండ్‌లోంచి లోన్ తీసుకుని, ఉన్నంతలో పెళ్లి బాగా జరిపించి, చీర, సారె పెట్టి మంజరిని అత్తవారింటికి పంపారు.

పెళ్లికి ప్రసన్న తన ఇద్దరు పిల్లలతో వచ్చింది. ప్రియకు మూడేళ్లు వచ్చాక ప్రసన్న గర్భవతి అయ్యింది. అత్తమామల ఆనందానికి అంతులేదు. కానీ ఎక్కడో చిన్న భయం. ప్రియ తల్లి పురిట్లో చచ్చిపోయింది. కాబట్టి మళ్లీ అలా జరుగుతుందేమో అన్న భయం.

అందుకే నెల తప్పినప్పట్నించీ ఎంతో అపురూపంగా చూసుకున్నారు. సీత, రమణల ఆనందానికి అంతే లేదు. ప్రియ అమ్మమ్మా అని పిలిచినా కన్నకూతురి కడుపు పండుతోందంటే కలిగే ఆనందం వేరు.

సీత మూడో నెల్లో వెళ్లి, చలివిడీ అదీ పెట్టింది. సీతతో బాటు అక్క ఇంటికి మంజరి కూడా వెళ్లింది. ప్రసన్న వాళ్ల ఊరు మంజరికి చాలా నచ్చింది. పల్లెటూరి అందాలను కన్నుల పండువగా చూసింది. పచ్చని పొలాలతో ప్రకృతి ఆకుపచ్చని ఓణీ వేసుకున్న కన్నెపిల్లలా ఉంది. పొలాల పక్కన ప్రవహిస్తూ వంకరలు తిరుగుతున్న కాలువ అమ్మాయి నడుం ఒంపులా అందంగా ఉంది.

తన్మయత్వంగా అన్నీ చూసిన మంజరి "అక్కా! నువ్వెంత అదృష్టవంతురాలివి. ప్రకృతి ఒడిలో హాయిగా సేదతీరుతున్నావు. ఇంత అందాన్ని ఆస్వాదించడానికి జీవితం సరిపోదేమో!" అంది.

చెల్లెలి మాటలకు నవ్వుతూ, "నీ అంత ఆస్వాదించడం నాకు చేతకాదు. ఇదంతా నీ చలవే. ఆనాడు నీ సలహా విని ఈ పెళ్లికి ఒప్పుకోకపోతే ఇంత మధురమైన జీవితం నాకు దక్కి ఉండేది కాదు" అంది.

సీతకూ, మంజరికి అక్కడ ఉన్న నాలుగు రోజులూ రాచమర్యాదలు జరిగాయి. ఆ ఇల్లు, వైభవం చూసి కూతురి అదృష్టానికి మురిసిపోయింది సీత. మంజరికి, సీతకు పట్టుచీరలు పెట్టించింది ప్రసన్న అత్తగారు. సీత తీసుకుందుకు మొహమాటపడింది.

ఏడోనెలలో పురిటికి తీసుకెడతానంటే పంపనని కచ్చితంగా చెప్పారు ప్రసన్న

అత్తమామలు “మిమ్మల్ని నొప్పించాలని కాదు. మా భయాన్ని మీరు అర్థం చేసుకోండి” అంటూ.

ఏడో నెలన సూడిదలిచ్చి శాస్త్రానికి ఇంటికి తీసుకువచ్చి, తిరిగి దిగబెట్టింది సీత. పురిటి సమయానికి అక్కడికే రమ్మంటే వెళ్లి నెల్లాళ్లు ఉండి వచ్చింది.

మనవడు పుట్టాక, అమ్మమ్మ, తాతల ఇంటికి మొదటిసారి వచ్చాడు. ఖర్చులో ఖర్చు అని మనవడికి ఒక కాసు బంగారం గొలుసు పెట్టింది సీత. పెళ్లికి పది రోజులు ముందుగా వచ్చి తల్లికి సహాయపడింది ప్రసన్న.

నాలుగు రోజుల ముందు వచ్చి మావగారికి అన్ని పనుల్లో సహాయం చేసి, కొడుకు లేని లోటు తీర్చాడు కేశవ. పెళ్లికి కేశవ తల్లిదండ్రులు, ప్రియ అమ్మమ్మ, తాత కూడా వచ్చారు.

పెళ్లికి డబ్బు సాయం చెయ్యబోయిన కేశవను ప్రేమగా తిరస్కరించాడు. “నేను మీకు పెట్టాలి కానీ మీనుంచి తీసుకోవడమేమిటి?”

ఇంకా పాతకాలపు ఆలోచనలో ఉన్న మామగార్ని ఏమీ అనలేకపోయాడు. తల్లి సలహా మేరకు పెళ్లికి చక్కని రెండు పట్టుచీరలు, ఒక నెక్లెస్ కొని భార్య ద్వారా ఇప్పించాడు.

అది కూడా వద్దంటే వాళ్లు నొచ్చుకుంటారని మాట్లాడలేదు. పిల్లలతో కళకళలాడుతున్న ఇంటిని చూసి మురిసిపోయారు సీత, రమణ. పెళ్లికాగానే ఎవరి ఊళ్లకు వాళ్లు వెళ్లిపోయారు.

మంజరితో పాటు, ఆమె చూసీ చూడకుండా చేసే సహాయం లేకపోవడం కొట్టొచ్చినట్లు కనబడుతోంది. ఇంట్లోని మెంబర్లు తగ్గడంతో ఇదివరకటిలా డబ్బుకు కటకటలాడాల్సిన పరిస్థితి కలగటం లేదు.

* * *

మంజరి కొత్తకాపురం బాగానే ఉంది. అత్తగారు, ఆదిత్య ప్రేమగానే చూసుకుంటున్నారు. మొదటినుంచీ అత్యాశకు పోయే అలవాటు లేనిది కాబట్టి, ఉన్నదాంట్లోనే ఇల్లు చక్కదిద్దుకునేది. ఆదిత్య మంజరిని చూసి తన అదృష్టానికి మురిసిపోయేవాడు. అనుకూలవతి అయిన భార్య దొరికిననాడు మగవాడు సామ్రాజ్యాలు గెలుచుకున్నంత ఆనందం పొందగల్గుతాడు.

అనురాగం పండించే భర్త, ఆప్యాయత ఒలకబోసే అత్తగారు, సంసార జీవితం బాగానే సాగుతోంది.

తెల్లవారినది మొదలు ఆ ఇంట్లో 'మంజరీ' అన్న పిలుపు మారుమ్రోగుతుంది.

"నా పెన్ ఏదీ, నా షర్ట్ ఏదీ" అంటూ ఆదిత్య, "మంజరీ! ఇవాళ వంట ఏం చెయ్యమంటావు? నాకు పూజ కోసం పూలు కోశావా?" అంటూ అత్తగారు.

ముందునుంచీ పని అలవాటు ఉంది. ఇంట్లో తల్లీ, తండ్రి, మురళి ఆమెను తెల్లవారి లేచినది మొదలు ఇలాగే అడిగేవారు. అది గుర్తుకు వచ్చేది. అలా అనుకున్నప్పుడు అమ్మ, నాన్నగారూ ఎలా ఉన్నారో? మురళి ఎలా ఉన్నాడో అన్న ఆలోచన వస్తుంది.

ముచ్చటగా వాళ్ల అవసరాలు తీరుస్తూ ఇటూ అటూ ఇల్లంతా తానే అయి తిరుగుతుంది. ఇంటి బైట ఉన్న పెరట్లో పూలమొక్కలు ఒకటీ అరా ఉండేవి. ఆదిత్యకు పెద్ద శ్రద్ధ లేదు. అత్తగారికి ఇంట్లో పని చేసుకోవడం, పూజ చేసుకోవడం, ఎప్పుడైనా గుళ్లో పురాణాలు ఉంటే వినడానికి వెళ్లడమే తెలుసు.

మంజరికి ఇంటి చుట్టూ ఉన్న స్థలం బాగా నచ్చింది. అది వాళ్ల మావగారి హయాంలో కట్టిన ఇల్లు. మూడొందల గజాల స్థలంలో ఒక చిన్న పెంకుటిల్లు. తరువాత ఆదిత్య దాన్ని డాబాగా మార్చాడు.

పనివాళ్లను పిలిచి ముందు, వెనక స్థలం అంతా బాగుచేయించింది. ఇంటి ముందు అందంగా బారులు తీరినట్లు పూలమొక్కలు వేసింది. సన్నజాజి మొక్కలు వేసింది. తీగ పాకడం మొదలుపెట్టాక తమ పడకగది పక్కగా డాబా మీదికి ఎక్కేట్లుగా ఏర్పాటు చేసింది.

ఇంట్లో కూడా చిన్న చిన్న మార్పులు చేసింది. ఇంకా అత్తగారు వంట పొయ్యి మీద చెయ్యడం, కాఫీలకు మాత్రం కిరసనాయిల్ స్టవ్ వాడడం చూసింది. అవగాహన లేక మారుతున్న కాలంతో వాళ్లు మారలేదు. గాస్ కనెక్షన్‌కి అప్లై చెయ్యమని ఆదిత్యకు చెప్పింది.

మంజరి చెప్పేదాకా తనకు తట్టనందుకు బాధపడ్డాడు. కొద్ది రోజుల్లో ఆ ఇంట్లో గాస్ స్టవ్ చోటుచేసుకుంది. అమాయకంగా వాళ్ల అత్తగారు చదువుకున్న పిల్లలెంతైనా అన్నీ తెలుసుకుంటారు అనుకుంది.

ఇలాంటివన్నీ తెలుసుకోవాలంటే చదువుతో బాటు లోకజ్ఞానం కూడా ఉండాలన్నది ఆమెకు తెలియదు. కూతుళ్లు లేని ఆమె కోడలిలో కూతుర్ని చూసుకుంది. మంజరి కూడా ఆమె ఆదిత్య తల్లిగా కాక తన తల్లిగా చూసుకుంది.

పడకగది కూడా చాలా అందంగా తయారుచేసింది. ఆమెకు కుట్లు, అల్లికలు అంటే చాలా ఇష్టం. తలగడా గలేబుల మీద అందమైన డిజైన్ వేసి ఎంబ్రాయిడరీ చేసింది. ఇంటిని కళాత్మకంగా తీర్చిదిద్దింది. ఆదిత్య మెచ్చుకుంటూ "అందుకే అన్నారు. ఇంటిని చూసి ఇల్లాలిని చూడమని. నువ్వెంత అందమైనదానివో అంత అందంగా ఇంటిని తీర్చిదిద్దావు" అన్నాడు.

మంజరికి అదే ఆనందం. ఒక చిన్న పొగడ్త మనసుకు ఎంతో సంతృప్తినిస్తుంది.

పెళ్లయిన సంవత్సరానికి మంజరి నెల తప్పింది. అత్తగారి ఆనందానికి అవధులు లేవు. మంజరి వద్దని వారిస్తున్నా అపురూపంగా చూసుకునేది. ఏ పని చెయ్యబోయినా అడ్డుకుని.

"నీతో పని చేయిస్తే నా మనవడు బైటికి వచ్చాక మా అమ్మతో పని చేయించావని నాతో దెబ్బలాడతాడు" అంది.

"ఒకవేళ మనవరాలు వస్తేనో?" అని నోరు జారి తప్పుచేసినట్లుగా బాధపడుతున్న కోడల్ని చూసి నవ్వుతూ,

"ఫరవాలేదమ్మా! మనవరాలయితే మహలక్ష్మి అనుకుంటాను. ఎవరో ఒకరు. నాకు ఆడుకుందుకు కాలక్షేపానికి ఒక చిన్న పాపాయి కావాలి."

రమణ, సీత ఈ కబురు విని చాలా సంతోషించారు. మంజరిని పురిటికి తీసుకురావాలని నిర్ణయించుకున్నారు. ఎందుకంటే ప్రసన్న గర్భవతి అయినప్పుడు ఆమె అత్తవారు వాళ్లు పురిటికి పంపలేదు.

సీతకు పిల్లను పురిటికి తీసుకురావాలన్న ముచ్చట తీరలేదు. ఇప్పుడు మంజరి విషయంలో ఆ ముచ్చట తీర్చుకుందామని సంబరపడింది. సూడిదలిచ్చి ఏడో నెలలో పురిటికి తీసుకువచ్చింది సీత. నెలలు నిండాక పండంటి కొడుకు ప్రసవించింది మంజరి.

తన రక్తం పంచుకు పుట్టిన బాబును చూసుకున్న మంజరికి అనిర్వచనీయ మైన అనుభూతి కలిగింది. ఈ చిన్నారికి ఇప్పుడు తను అమ్మ అన్న భావన

చాలా గొప్పగా ఉంది. అమ్మ అయిన ప్రతి ఆడపిల్లా ఈ మధుర భావనకు లోనవుతుందేమో! సృష్టికర్త ఎంత గొప్పవాడు!

కబురు తెలిసిన ఆదిత్య తల్లి, మనవడు పుట్టినందుకు చాలా సంతోషించింది. తన స్వహస్తాలతో కోడలికి తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్తూ, ఆమె రాకకోసం ఎదురుచూస్తున్నట్లుగా ఉత్తరం రాసింది. ఉత్తరం చదివిన మంజరి ఆ ఉత్తరం తల్లికి కూడా చూపించింది.

ఉత్తరం చదివిన సీతకి కళ్ల వెంబడి నీళ్లు వచ్చాయి. తను చేసిన పూజల పుణ్యమో ఏమో కానీ కూతుళ్లిద్దరికీ మంచి సంబంధాలు, మంచి అత్తగార్లు దొరికారని సంబరపడింది. ఆ ఆనందాన్ని భర్తతో పంచుకుంది. ఆ మాట విన్న రమణ "అందుకే అంటారు కష్టాలు కలకాలం ఉండవని. మనిద్దరం ఈ పిల్లల్ని ఎలా సాకుతాం? వీళ్లని గట్టెక్కిస్తామా? అని అస్తమానూ అనుకునేవాళ్లం. కాలం గిర్రున తిరిగి అందరూ ఒక ఒడ్డుకు చేరుకున్నారు" అన్నాడు.

"ఏమిటో! ఒక్క ప్రతాప్ మాత్రం మనకు దూరమయ్యాడు" అని కళ్లు ఒత్తుకుంది.

"ఎందుకు బాధపడ్తావు? కాలమే అన్ని సమస్యలు పరిష్కరిస్తుంది. ఇప్పటిదాకా జరిగిన దాంట్లో మన ప్రమేయం ఏమాత్రం ఉంది కనుక? వాడంతట వాడు మనం కావాలని తిరిగి వస్తే ఆనందంగా ఆహ్వానిద్దాం. లేకపోతే ఇప్పుడు జరుగుతున్నట్లుగానే జరుగుతుంది" అన్నాడు.

ప్రసన్న కొడుకును నెల రోజులు దాకా పెంచింది సీత. అందులో కూడా ఎక్కువగా వాడి నాన్నమ్మ, తాతగార్ల తరువాతే తన ఒడిలోకి వచ్చేవాడు. ప్రియ తరువాత చంటిపాప, అందులో మగపిల్లవాడు. తాత, నాన్నమ్మ అస్సలు వాడ్ని విడిచేవారు కాదు. దాంతో సీతకి చంటిబిడ్డ ముచ్చట తీరలేదు. మురళి తరువాత ఇంట్లో చంటిబిడ్డ కేరింతలు అందర్నీ ఆనందంలో ముంచాయి. అత్తగారు నెల లోపలే దింపేయమంటే మూడవ నెల వచ్చేదాకా దింపను. నా ముచ్చట కూడా తీర్చుకోవాలి కదా!" అంది సీత.

రోజూ మనవడికి నలుగు పెట్టి నీళ్లు పోయడం, సాంబ్రాణి పొగ వెయ్యడం అన్నీ చేసేది. వాడు కాస్త ఏడుపు మొదలుపెట్టేసరికి వంట కూడా మానేసి పరుగుపెట్టి వచ్చేది. అందుకే కాబోలు పెద్దవాళ్లు అన్నారు అసలు కన్నా వడ్డీ ముద్దని.

మూడవ నెల వచ్చాక బారసాల చేసి చీర, సారె పెట్టి అత్తవారింట్లో దింపి వచ్చింది. ఒక మూడు నెలలు ఇంట్లో మంజరి తోటి, రెండు నెలలు చంటివాడి ఏడుపుతో కళకళలాడిన ఇల్లు ఇప్పుడు బోసిపోయినట్టుగా ఉంది.

రమణ ఆఫీసుకు, మురళి కాలేజీకి వెళ్లిపోతే ఏమీ తోచటం లేదు. ఇన్నాళ్లూ సమయం సరిపోయేది కాదు. కాలం పరిగెడుతున్నట్లుగా అనిపించేది. ఇప్పుడు చెయ్యడానికి పెద్ద పని లేదు. ఏమీ తోచడం లేదు.

* * *

బాబును అత్తగారు చూసుకోవడంతో మంజరికి ఏమీ తోచటం లేదు. ఆదిత్యను అడిగింది నేను కూడా ఉద్యోగం చేస్తానని.

"ఉద్యోగాలు అంత సులభంగా దొరుకుతాయా? నీ ఇష్టం. ప్రయత్నించి చూడు" అన్నాడు.

తనకు సరిపడే ఉద్యోగాల కోసం ప్రయత్నాలు మొదలుపెట్టింది. కానీ ఏదీ ఫలించలేదు. పోనీ టీచర్ ఉద్యోగం అయితే అటు బాబుని చూసుకోవచ్చు. ఇటు ఉద్యోగం చేయవచ్చు అని ఆలోచించి, చుట్టుపక్కల ఉన్న స్కూళ్లల్లో ప్రయత్నాలు సాగించింది.

చాలా స్కూళ్లు రిజెక్ట్ చేశాయి. మంజరి డిగ్రీ ప్రైవేట్‌గా చేయడం ఒక కారణం అయితే టీచర్ ట్రైనింగ్ లేకపోవడం రెండవ కారణం. మంజరికి ట్యూషన్స్ చెప్పే అనుభవం ఉంది కాబట్టి పాఠాలు బాగానే చెప్పగలదు. అలా ప్రయత్నించగా ఇంటికి కొంచెం దూరంలో ఉన్న స్కూల్లో లీవ్ వేకెన్సీ ఉందని, అందులో ముందు జాయిన్ అయితే తరువాత తన పని నచ్చితే ఉద్యోగం పర్మినెంట్ చేస్తామని చెప్పింది ప్రిన్సిపాల్. స్కూల్లో చేరిన అనతి కాలంలోనే మంచి టీచరుగా పేరు తెచ్చుకుంది. స్కూల్ ప్రిన్సిపాల్ ప్రోద్బలంతో ప్రైవేటుగా బి.ఎడ్. కూడా పూర్తి చేసింది. ఇవన్నీ అయ్యేసరికి బాబు పెరిగి పెద్దవాడు అయ్యాడు.

బాబుకు అయిదేళ్లు వచ్చి స్కూల్‌కి వెళ్లడం మొదలుపెట్టాక అత్తగారు ఇంకో బిడ్డ కావాలంటున్నా పట్టించుకోలేదు. తన తల్లిదండ్రులు ఎదుర్కొన్న పరిస్థితి తమకు రాకూడదు. ఉన్న ఒక్క పిల్లవాడ్ని సక్రమంగా తీర్చిదిద్దగలిగితే చాలనుకుంది. అందుకే దినేష్ తరువాత ఆదిత్య అనుమతితో పిల్లలు పుట్టకుండా జాగ్రత్త పడింది.

దినేష్‌ను తను పనిచేస్తున్న స్కూల్లోనే జాయిన్ చేసింది. మంజరి మీద ఉన్న అపారమైన విశ్వాసం ఆదిత్యను తమ బ్రతుకు బండి పగ్గాలను ఆమె చేతుల్లో పెట్టి నిశ్చింతగా ఉండేటట్లు చేసింది.

మురళి పై చదువులకు అమెరికా వెళ్లిపోయాడు. వెంకటరమణ రిటైర్ అయిపోయాడు. చదువు పూర్తయ్యి ఉద్యోగంలో చేరగానే తల్లిదండ్రులు ఉండటానికి చిన్న ఇల్లు కొన్నాడు మురళి.

గృహప్రవేశానికి వచ్చిన మంజరి, ప్రసన్న మురళి ప్రయోజకత్వానికి, తల్లిదండ్రుల పట్ల వాడు చూపించిన బాధ్యతకు ఎంతో సంతోషించారు. కొత్త ఇంట్లో కూతుళ్లు, అల్లుళ్లు, మనవల సందడితో కడుపు నిండుగా ఉన్నా, కొడుకులు ఆ సంతోషంలో పాలుపంచుకోలేదని బాధపడింది సీత.

మురళి అవసరమైన డబ్బు అరేంజ్ చేసి ఇల్లు తల్లిదండ్రుల పేరు మీద కొన్నాడు. సెలవు లేక గృహప్రవేశానికి రాలేకపోయాడు. ప్రతాప్ ఎక్కడున్నాడో తెలియదు.

* * *

తల్లితండ్రులను క్షోభ పెట్టిన ఫలితం త్వరలోనే అనుభవానికి వచ్చింది ప్రతాప్‌కి. ఎవర్నయినా విమర్శించడం కానీ, తప్పులెంచడం కానీ చాలా సులభమైన పని. ఏదైనా తనదాకా వస్తేనే కానీ తెలీదు.

సుఖానికి అలవాటుపడ్డ భార్యాభర్తలిద్దరూ బాధ్యత నెత్తిమీద పడి అందులో ఉన్న కష్టాలు తెలిసి వచ్చేసరికి పరిస్థితిని సమర్థవంతంగా పరిష్కరించడం మానేసి ఒకళ్ల తప్పులు మరొకరు ఎంచుకోవడం మొదలుపెట్టారు.

రోజూ కీచులాటలు. ఇద్దరికీ ఆశలు మెండు. వాళ్లకున్న ఆశలకు వాళ్ల డబ్బు సరిపోదు. ప్రతాప్ కొంత మారి, నిజాన్ని స్వీకరించడానికి సిద్ధపడ్డా రేఖ దానికి తయారుగా లేదు.

ఆవేశంలో మోహంలో ఒకళ్లనొకళ్లను ప్రేమించుకున్నామని భ్రమపడ్డారు. జీవితం అంటే సినిమాలోలాగా మూడు గంటల్లో పూర్తి అయ్యేది కాదనీ, పెళ్లంటే బాధ్యతతో కూడుకున్నదని ఇద్దరికీ అవగాహన లేదు.

ప్రతాప్ తన మూర్ఖత్వంతో తల్లిదండ్రులను దూరం చేసుకున్నాడు. రేఖ తల్లిదండ్రులు ఈ పెళ్లికి సుముఖంగా లేరు కాబట్టి వారిద్దరి మధ్య కలుగజేసుకో దల్చుకోలేదు. ప్రతాప్ డామినేషన్‌ని భరించలేకపోయింది రేఖ.

దాంతో, "ఏదో నా ఖర్మ కాలి నీ మోహంలో పడ్డాను. లేకపోతే నాకు నీకన్నా పెద్ద ఉద్యోగస్తుడే దొరికేవాడు" అంటూ సాధించేది.

నచ్చచెప్పే పెద్దవాళ్లు లేక మొత్తానికి చిలికి చిలికి గాలివాన అయి వ్యవహారం విడాకుల దాకా వచ్చింది. ప్రతాప్‌తో తెగతెంపులు చేసుకున్నాక రేఖ తల్లిదండ్రుల పంచన చేరింది. కొన్నాళ్ల తరువాత వేరే పెళ్లి చేసుకుని, ఆ ఊరునించి వెళ్లిపోయింది.

ప్రతాప్ తాను కట్టుకున్న గాలిమేడలు కూలిపోవటంతో ఏం చెయ్యాలో పాలుపోని అయోమయానికి గురయ్యాడు. ఏ మొహం పెట్టుకుని తల్లితండ్రుల దగ్గరకు చేరతాడు? ఊరు మారితే కొంత మార్పు ఉంటుందని, పాత జ్ఞాపకాలు మరుగున పడతాయని, తల్లిదండ్రులకు తన పరాభవం తెలియడం ఇష్టం లేక ఆ ఊరు వదిలి వేరే ఊరు వెళ్లిపోయాడు.

తెలిసినవాళ్ల ద్వారా ఈ విషయం తెలిసిన సీత, రమణ బాధపడ్డారు. కన్నకొడుకు క్షమించమని తమ దగ్గరకు రాకుండా తమనుంచి దూరంగా వెళ్లిపోయినందుకు ఎంత సర్ది చెప్పుకుందామన్నా గుండెల్లో బాధ తన్నుకు వచ్చింది. కన్నాక పిల్లలందరూ తమ కళ్లముందు కళకళలాడుతూ చల్లగా ఉండాలనే ప్రతి తల్లతండ్రులూ కోరుకుంటారు.

గృహప్రవేశానికి ప్రతాప్ కూడా ఉంటే బాగుంటుందనిపించినా అతను ఎక్కడున్నాడో తెలియక వస్తున్న కంటనీటిని బైటికి రాకుండా ఉండడానికి సీత చాలా తాపత్రయపడాల్సి వచ్చింది.

గృహప్రవేశం తరువాత అందరూ ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయారు. తల్లితండ్రుల సౌకర్యం కోసం మురళి ఇంట్లో అన్ని సదుపాయాలూ కల్పించాడు. ఫోన్ కూడా పెట్టించాడు. ప్రతి వారం క్రమం తప్పకుండా ఫోన్ చేసి అమ్మానాన్నలతో మాట్లాడుతాడు.

మంజరి, ప్రసన్న కూడా తమ్ముడి దగ్గరనుంచి నెలకో ఫోన్ అయినా రాకపోతే ఊరుకోమని బెదిరించారు. అక్కల మాట ప్రకారం వీలున్నప్పుడల్లా ఫోన్ చేసి అమెరికా కబుర్లు చెపుతూ వాళ్లు అమెరికా చూసినంత అనుభూతి కలిగేటట్లుగా మాట్లాడేవాడు.

* * *

మనోహర గీతంలా సాగుతున్న మంజరి జీవితంలో అపశృతి దొర్లింది. బ్రెయిన్ ఫీవర్‌తో ఆదిత్య మరణించాడు. మంజరికి, అత్తగారికి ఇది ఊహించని దెబ్బ.

చిన్నతనంలో భర్తను పోగొట్టుకున్నా, దినేష్ కోసం మొండిగా నిలదొక్కుకుంది. మళ్లీ చరిత్ర పునరావృతమైనట్లు ఇదివరకు తను ఉన్న స్థితిలో మంజరి. కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చినా తిరిగిరాని లోకాలకు వెళ్లిపోయిన కొడుకు, భర్తను పోగొట్టుకుని చిన్నపిల్లవాడితో ఉన్న కోడలు, తండ్రి ప్రేమ పూర్తిగా పొందని మనవడు. పెద్దదయిన తను దుఃఖం కడుపులో దిగమింగాలి అనుకుంది ఆదిత్య తల్లి.

విషయం తెలిసిన రమణ, సీత పరుగున వచ్చారు. సంగతి తెలిసి ప్రసన్న, భర్త వచ్చారు. ఎవరు వచ్చి మాత్రం ఏం చెయ్యగలరు? కడుపు శోకంతో ఉన్న అత్తగారి కోసం తన దుఃఖాన్ని మింగేసింది. ఒకరి కోసం ఒకరు తమ బాధను కడుపులో దాచేసుకున్నారు. ఎవరికి వారే ఎదటివాళ్లు ఏడిస్తే ఓదార్చాలని చూసి, ఆ అవసరం పడక దుఃఖాన్ని దిగమింగేశారు.

జీవితనౌక సరంగు మారాడు. ఇదివరకు ఆదిత్య అయితే ఇప్పుడు ఆ పాత్ర మంజరి తీసుకుంది. కష్టాలకు భయపడి పారిపోవడం వలన ప్రయోజనం లేదు. ఎదురొడ్డి ముందుకు సాగడంలోనే విజ్ఞత ఉందనుకున్న మంజరి కన్నీళ్లను కంటి చాటున దాచేసింది. జరగవలసిన కార్యక్రమాలకు తానే ముందడుగు వేసింది.

భర్త పోయినా ఏడవలేదని కొంతమంది విమర్శిస్తే మరికొంతమంది సిగ్గు లేకుండా అన్ని పనులకూ పూనుకుందని విమర్శించారు. ఈ విమర్శలకు దడవకుండా ముందుకు నడవడానికి నిశ్చయించుకుంది. అత్తగార్ని ఓదార్చి బలవంతంగా రెండు ముద్దలు తినిపించింది.

"నాన్న ఏరమ్మా?" అన్న కొడుకును గుండెలకు హత్తుకుని, "దేముడి దగ్గరకు వెళ్లారమ్మా. నిన్ను బాగా చదువుకోమన్నారు" అంది.

రోజులయిపోగానే ప్రసన్న, భర్త వాళ్ల ఊరు వెళ్లిపోయారు. వచ్చిన చుట్టాలందరూ ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లిపోయారు.

"అమ్మను కొన్నాళ్లు నీకు సాయంగా ఉంచుతానమ్మా" అన్నాడు రమణ.

"ఎందుకు నాన్నా! మీరొక్కరూ ఎన్నాళ్లని అమ్మ లేకుండా ఉండగలరు? ఈ వయసులో మిమ్మల్ని విడదీయడం భావ్యం కాదు. ఈ ప్రయాణం నేను ఒంటరిగా సాగించవలసిందే. అవసరానికి నావాళ్లు నాకు తోడు ఉన్నారన్న తృప్తి చాలు" అంది మంజరి. లక్ష్మీదేవిలా పసుపు కుంకుమలతో తిరగవలసిన పిల్లకు ఈ గతి పట్టిందని సీత కుళ్లికుళ్లి ఏడ్చింది.

"మనం ఏం పాపం చేశామండీ? పెద్దవాడు చూస్తే అలా అయ్యాడు. మిగిలిన పిల్లలు ఆనందంగా ఉన్నారని మురుస్తుంటే నీకింత అర్హత లేదన్నట్లుగా ఇప్పుడు దీని జీవితం ఇలా అయ్యింది. నిండా ముప్పై ఏళ్లు లేకుండానే దాని బతుకు ఒంటరి బతుకయ్యింది. దేవుడనే వాడున్నాడా అండీ? ఉంటే మంజరి జీవితాన్ని ఇలా ఎందుకు చేశాడు?" అంటూ ఏడ్చింది సీత.

"ప్రారబ్ధ కర్మ అనుభవించక తప్పదు కదా! మనకి కష్టాలు వచ్చినంత మాత్రాన దేముడున్నాడా అని ప్రశ్నించడం తప్పు. భగవంతుడి చర్యలు ఎప్పుడు ఎలా ఉంటాయన్నది మహా మహా ముముక్షువులకే అంతుపట్టదు. అలాంటిది సామాన్యులం మనమెంత? చిన్నదయినా తన కష్టాన్ని మనకు, వాళ్ల అత్తగారికి కనబడకుండా ఎంత స్థితప్రజ్ఞత కనబరుస్తోందో మంజరి చూడు. దాన్ని చూసైనా మనం నేర్చుకోవాలి" అన్నాడు రమణ.

"తల్లినండీ! పిల్లను అలాంటి స్థితిలో చూసి తట్టుకోవడమంటే సామాన్య విషయం కాదు. మీకున్నంత గుండెధైర్యం నాకు లేదు" అంది.

"పిచ్చిదానా! ఇది గుండె ధైర్యం కాదు. నా గుండె కరడుగట్టుకుపోయింది. నువ్వు ఆడదానివి కాబట్టి ఏడ్చి నీ బరువు దింపుకుంటావు. మగవాడై పుట్టినందుకు నేను దానికి కూడా నోచుకోలేదు" అన్నాడు రమణ.

రమణ, సీత తమ ఊరికి వెళ్లిపోయారు. ఆఫీసు నుంచి ఆదిత్యకు రావాల్సిన డబ్బులు అంతా వసూలు చేసుకుని, అంతా ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో వేసింది. ఆదిత్య ఉద్యోగం మంజరికి ఇస్తామన్నారు. స్కూల్లో టీచర్‌గా కంటిన్యూ చెయ్యదల్చుకుంది. అందుకే ఆ జాబ్‌ను తిరస్కరించింది.

ఆఫీసు ఉద్యోగం అయితే పొద్దున్న వెళ్లి సాయంకాలం రావాలి. అత్తగార్ని, బాబుని చూసుకోవడం కుదరదు. లేని తండ్రిని ఎలాగూ తేలేదు. ఇప్పుడు దినేష్‌కు తల్లీతండ్రీ అన్నీ తానే అయి పెంచాలి. టీచర్ ఉద్యోగంలో ఉండడం తనకు అనుకూలంగా ఉంటుందని నిశ్చయించుకుంది.

మురళి రాలేకపోయినందుకు బాధపడుతూ ఫోన్ చేశాడు. ఏదైనా డబ్బు అవసరం అయితే నాకు చెపితే నేను సహాయపడతానన్నాడు. "అంత అవసరం లేదు లేరా! నువ్వు ఉన్నావన్న ధైర్యం చాలు నాకు" అంది.

తల్లిదండ్రుల అనుమతితో మురళి అక్కడ తనతో పనిచేస్తున్న తెలుగు అమ్మాయిని పెళ్లిచేసుకున్నాడు. సీత ఈ కొడుకు పెళ్లి కూడా తన చేతుల మీద జరగలేదని బాధపడింది.

"వీలయినంత త్వరలో అక్కడకు వస్తానమ్మా! అప్పుడు మళ్లీ నీ ముచ్చట కోసం మేం మళ్లీ పెళ్లి చేసుకుంటాం" అన్నాడు.

"అందరూ ఒకసారే పెళ్లిచేసుకుంటారు. నువ్వు నిత్య పెళ్లికొడుకులా ఎన్నిసార్లు చేసుకుంటావురా?" అంది సీత.

"భాగస్వామి మారనంతసేపూ ఎన్నిసార్లు పెళ్లిచేసుకున్నా తప్పు లేదమ్మా!" అన్నాడు నవ్వుతూ.

"మాటలు బాగా నేర్చావు. సరే! నువ్వు ఇక్కడకు వచ్చినప్పుడు సరదాగా మనవాళ్లందర్నీ పిలిచి ఫంక్షన్ పెట్టుకుందాములే. నీది, కోడలిది ఫోటోలు పంపు. చూసి ఆనందిస్తాను" అంది సీత.

తల్లి ముచ్చట తీరుద్దామన్నా ఏడాది దాకా మురళి ఇండియా రాలేకపోయాడు. పెళ్లయిన ఏడాదికి బంధువులందర్నీ పిలిచి మళ్లీ పెళ్లిలా చేస్తే బాగుండదని అనుకుంది సీత. కోడలు నెల తప్పిందని తెలిసింది.

"ప్రసవానికి ఇక్కడ ఉండిపోతుందేమిటిరా! నా చేత్తోనే పురుడు పోసి మనవడ్ని ఎత్తుకుంటాను" అంది.

కొడుకు, కోడలు వచ్చారు. ఏదో చెయ్యాలన్న ఆత్రుత సీతకు. పోనీ పెళ్లి చూడలేదు కాబట్టి మనవడ్ని తన చేతులతో ఎత్తుకోవాలని. తల్లి మాటలకు నవ్వుతూ "అమ్మా! నీ ముచ్చట అక్కయ్యలతో తీర్చుకున్నావుగా! మా ఆవిడ అమెరికాలో కంటే వాడు అమెరికన్ సిటిజన్ అవుతాడు" అన్నాడు.

అమెరికన్ సిటిజన్ అవుతే ఏం వస్తుంది అని అడగబోయి కొడుకు వేళాకోళం చేస్తాడని మాట్లాడలేదు. పోనీ గాజులు పెట్టించే ముచ్చట చేసి అందర్నీ పిలుస్తానంది. తల్లి ముచ్చట కాదనలేక సరే అన్నాడు.

తమ్ముడు, మరదలూ వచ్చారని అక్కలిద్దరూ వచ్చారు. మంజరి ముందు

వెళ్లనంది, అత్తగారు ఒక్కర్నీ వదలి రావడం ఇష్టం లేక. కానీ ఆవిడ ఒప్పుకోలేదు. దినేష్‌ను తీసుకుని వెళ్లమని ఒత్తిడి చేసింది. మరదల్ని, తమ్ముణ్ని చూసి అక్కలిద్దరూ చాలా సంతోషించారు. మూడేళ్ల దినేష్ తల్లి వెనకాతల దాక్కున్నాడు. ఎవరి దగ్గరకు వెళ్లాలన్నా బెదురు.

మంజరి అంటే ఎంతో ప్రేమ మురళికి. ఆమెవివాహానికి కానీ, బావగారు పోయినప్పుడు కానీ రాలేకపోయాడు. అక్కను ఈ స్థితిలో చూసి బాధ కలిగింది. బావగార్ని అసలు కంటితో చూడనే లేదు.

దినేష్‌ను దగ్గరకు తీసుకుందామంటే రెండు రోజులదాకా రాలేదు. ఆ తరువాత చాక్లెట్ చూపిస్తే అప్పుడు వచ్చాడు.

కోడలి గాజుల ఫంక్షన్ బాగా చేసింది సీత. ప్రసన్న, సీత కలిపి అన్ని పనులూ చేశారు. మంజరి బైటికి రాకుండా గదిలో కూర్చుంది.

అందరూ పూలు పెట్టుకుంటుంటే దినేష్ "పూలు మా అమ్మకు కూడా ఇవ్వండి" అన్నాడు.

సీతకు కడుపులో దుఃఖం ఆగలేదు. అలా అని కంట నీరు పెట్టలేదు. తెలివిగా ప్రసన్న పూలదండ వాడి చేతిలో పెట్టింది. వాడు పరిగెట్టుకుంటూ వెళ్లి మంజరికిచ్చాడు. హాలులో జరుగుతున్న మాటలు ఆమెకు వినబడుతున్నాయి. దినేష్ "అమ్మా! నీకు పూలు" అంటూ ఇస్తే వాడికి తను పూలు ఎందుకు పెట్టుకోదో చెప్పినా అర్థం కాని వయసు. అందుకని అలాగే అంటూ తీసుకుని పక్కన పెట్టింది.

ఒక నెల ఉండి మురళి వెళ్లిపోయాడు. మురళికి కూతురు పుట్టింది.

దినేష్‌కు ఒక రోజు జ్వరం వచ్చింది. రెండు రోజులైనా జ్వరం తగ్గలేదు. అత్తాకోడళ్లు వాడికేమైపోతుందోనని వెయ్యి దేముళ్లకు దణ్ణం పెట్టుకుని నిద్రాహారాలు లేకుండా గడిపారు.

ఇరవై మూడేళ్లకే మోడులా మారిపోయిన కోడలిని చూసి ఆవిడ మనసు రోదించేది. పోనీ మళ్లీ పెళ్లి చేస్తేనో అనిపించింది. కానీ పిల్లవాడితో ఉన్న ఆడదాన్ని పెళ్లిచేసుకుందుకు ముందుకు వచ్చేవాళ్లు ఎవరుంటారు?

దినేష్ వాళ్లిద్దరికీ బ్రతకడానికి ఆలంబన. ఇద్దరి మనసూ ప్రతి క్షణం వాడి చుట్టూ తిరుగుతుంది. వాడికి జ్వరం తగ్గి మామూలు అయ్యేదాకా వాళ్లిద్దరూ తిండి సరిగా తినలేదు.

* * *

కాలం చాలా వేగంగా పరుగులు పెడుతోంది. మంజరి అత్తగారు దినేష్ పది సంవత్సరాలప్పుడు ఆమెను వదిలి వెళ్లిపోయింది. ఆదిత్య మరణం, తరువాత తల్లిలాంటి అత్తగారు తనకు తోడు ఉండడంతో జీవితం అంత కష్టమనిపించలేదు.

రమణ, సీత వచ్చారు. దినేష్ చిన్నవాడు కనుక రమణే అన్నీ చేశాడు. రోజులైపోయాక కూతురు ఒంటరిగా ఉంటుందని, రమణ, సీత తమతో వచ్చెయ్యమన్నారు.

"లేదు నాన్నా! ఇక్కడ నాకు ఉద్యోగం ఉంది. అదీగాక ఈ ఇంట్లో ఆదిత్య జ్ఞాపకాలు ఉన్నాయి. ఇవన్నీ వదిలి నేను రాలేను" అంది.

ఎన్నడూ ఎవరికీ చెడు తలపెట్టకుండా అందరికీ మంచి చేసే ఈ పిల్లకు జీవితం ఇన్ని పరీక్షలు పెడుతోందేమిటో అనుకున్నారు ఆమె తల్లితండ్రులు. చేసేది లేక ఆమెను వదిలి తమ ఊరు వెళ్లిపోయారు. ఒంటరి ప్రయాణం మొదలయ్యింది. ఇదివరకు పిల్లవాడిని వీలైనంత వరకూ అత్తగారు చూసుకునేది. అందుకే కష్టం కలగలేదు. ఇప్పుడు పొద్దున్నే లేవడం, దినేష్‌ను స్కూల్‌కి తయారుచేయడం, వాడ్ని స్కూల్ బస్ ఎక్కించి తాను స్కూల్‌కు వెళ్లేది.

రెండు, మూడు క్లాస్‌ల దాకా తను పనిచేస్తున్న స్కూల్‌లోనే చదివేవాడు. పిల్లవాడి భవిష్యత్తు ఆలోచించి మంచి స్కూల్లో వెయ్యాలని స్కూల్ మార్చింది. దినేష్ స్కూల్‌నించి వచ్చిన గంట తరువాత కానీ స్కూల్ నించి రావడానికి కుదిరేది కాదు. ఈ సమస్య ఎలా పరిష్కరించాలా అనుకున్న తరుణంలో ఆపద్బాంధవిలా పనిమనిషి తాను సహాయం చేస్తానని ముందుకు వచ్చింది.

"అమ్మగారూ! మీరు వచ్చేదాకా బాబును నేను చూసుకుంటాను" అని హామీ ఇచ్చింది. స్కూల్ నించి ఇంటికి వచ్చి బట్టలు మార్చుకుని తల్లి వచ్చేదాకా చదువుకుంటూ ఉండేవాడు. చదువులో ఎప్పుడూ ముందు ఉండేవాడు. స్కూల్ ఫస్ట్ వచ్చేవాడు. స్కూల్ నించి రాగానే కొడుకు చదువు పట్ల శ్రద్ధ వహించేది. ఆమె కేంద్ర బిందువు వాడే.

దినేష్ టెంత్‌కి వచ్చేసరికి ఒక రెండేళ్ల తేడాలో తల్లిదండ్రులు కాలగర్భంలో కలిసిపోయారు. మురళి కర్మకాండలకు వచ్చి వెళ్లిపోయాడు. వెళ్లిపోయే ముందు అక్కగారు వద్దంటున్నా తల్లితండ్రుల పేరు మీద ఉన్న ఇల్లు దినేష్ పేరు మీద రాశాడు. అప్పుడు వద్దంది కానీ తరువాత దినేష్ పై చదువులకు అమెరికా వెడతానన్నప్పుడు అది ఉపయోగానికి వచ్చింది.

మురళి అమెరికాలో సెటిల్ అయిపోయాడు. బాధ్యతల వలయంలో దూరాలు పెరిగాయి. తల్లితండ్రులు ఉన్నప్పుడు అడపాదడపా కలుసుకునేవారు. అలాంటిది ఇప్పుడు సంవత్సరాలు గడిచినా కలుసుకోవడానికి వీలుపడటం లేదు. అక్కచెల్లెళ్లిద్దరూ ప్రసన్న కూతురి పెళ్లిలో కలిశారు. దినేష్ పెరిగి పెద్దవాడయ్యాడు. మంచి మార్కులతో ఎమ్.ఎస్. చేయడానికి అమెరికా వెళ్లిపోయాడు.

ఒక్కసారిగా మంజరి జీవితంలో శూన్యం చోటుచేసుకుంది. స్కూల్ వదిలాక ఇంటికి రావాలంటే ఒక విధమైన బెరుకు, భయం, ఒంటరితనం ఎంత బాధాకరమైనదో తెలుస్తోంది. అప్పటికీ ఒక క్రమశిక్షణ ఏర్పర్చుకుంది. కాస్సేపు యోగా, ధ్యానం చెయ్యడం మొదలుపెట్టింది. పుస్తకాభిలాష ఉన్నా ఇన్నాళ్లూ తీరని తన కోరికను సఫలం చేసుకోవాలని నిశ్చయించుకుంది.

మంచి లైబ్రరీ కోసం గాలించింది. అదృష్టవశాత్తు ఇంటికి దగ్గరలోనే లైబ్రరీ దొరికింది. మెంబర్‌షిప్ తీసుకుని పుస్తకాలు తెచ్చుకుని చదవడం అలవాటు చేసుకుంది. పుస్తక పఠనంతో ఒంటరితనాన్ని పారదోలగలుగుతోంది. మెల్లిమెల్లిగా సాహిత్యంలో ఉన్న ఔన్నత్యాన్ని అవగతం చేసుకోవడం మొదలుపెట్టింది. ప్రముఖుల రచనలు అన్నీ చదవడం మొదలుపెట్టింది.

అలా చదివి రచనల్లో తన మనసుకు నచ్చిన విషయాలు తనలో చెలరేగిన ఆలోచనలు, ఊహలు, విశ్లేషణ చేస్తూ ఒక పుస్తకంలో రాయడం అలవాటు చేసుకుంది. ప్రతి రచయితకూ ఒక విశిష్టత ఉంటుంది. వరుసగా ఆ రచయిత రచనలు చదవగా అతని రచన, అతని శైలిలోనూ ఉన్న మాధుర్యం అవగాహనకు వస్తుంది. ఒక సమస్యను వివిధ వ్యక్తులు వివిధ కోణాల్లో చూడ్డం జరుగుతుంది. ఆ సమస్యను రచయిత చూసే విధానం అతని రచనల్లో పొందుపరచడం జరుగుతుంది. వారి భావవ్యక్తీకరణ అందులో ద్యోతకమవుతుంది. రచయిత మథనంలోంచి పుట్టిందే మంచి రచన కాగలదు.

* * *

ఒకరోజు అకస్మాత్తుగా మంజరికి తండ్రి పుస్తకాల గురించి జ్ఞాపకం వచ్చింది. ఉద్యోగ విరమణ తరువాత తనకు తాను భక్తిభావం వైపు మళ్లించుకోవడానికి వేదాంతం, ఉపనిషత్తులు, భగవద్గీత చదవడం మొదలుపెట్టారు రమణ. అతనికి నచ్చినవి పుస్తకంలో రాసుకునే అలవాటు ఉంది. రమణ మరణానంతరం తనతో కొన్ని పుస్తకాలు తెచ్చుకుంది. ఇప్పుడు ఆ పుస్తకాలు

తెరిచి తండ్రి కూర్చిన ఆణిముత్యాలు చదవాలని నిశ్చయించుకుంది.

అలా ఓ పుస్తకం తెరువగా...

ఈశోపనిషత్ గురించి, దాంట్లో ఉన్న మంత్రాలు, ఆ మంత్రాలకు ఇచ్చిన వివరణ రాసి ఉంది. అందులో ఉన్న ఏడవ మంత్రం గురించి రమణ రాసుకున్న వివరణ చాలా నచ్చింది. ముత్యాలసరాల్లా ఉన్న అక్షరాల వెంట మంజరి కళ్లు పరుగుపెట్టాయి.

'ఈ ప్రపంచంలో అన్నీ పరమాత్మ దేహంలోని భాగాలే. పరమాత్మ అన్నింటా, లోపల బయట వ్యాపించి ఉన్నాడు. కానీ మనిషికి ప్రతిదానికీ దుఃఖమే. దాన్ని ఎలా దూరం చేసుకోవాలో ఈ మంత్రం చెప్పింది.

యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూద్విజానతః

తత్రకో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యత.

లోకంలో నా అనుకున్నవాడు దగ్గరయితే మోహం, దూరమయితే శోకం కలుగుతున్నాయి. ఇష్టం లేనిది దూరంగా పోతే సంతోషం. దగ్గరికి వస్తే బాధ కలుగుతాయి. వీటన్నిటికీ ఆధారం ఒకటే అని తెలిస్తే వానికి శోకము, మోహము కలగవు. అందరియందు ఏకత్వ భావన కలిగితే కనిపించేవాటి యందు జాలి కలుగుతుంది తప్ప ద్వేషం కలుగదు.

కాలిలో ముల్లు గుచ్చుకుంటే చేయి ఊరికే ఉండదు. తీసే ప్రయత్నం చేస్తుంది. అలాగే ఎవడైనా శోకిస్తుంటే వాడి శోకాన్ని తగ్గించే ప్రయత్నం చేస్తాము. ఒకరికి కలిగిన ఆనందాన్ని మనమూ అనుభవిస్తాము. ప్రత్యేకించి ఈ భావన ఒకరియందే కాక విశ్వం అందరి యందు ఆ భావనే ఉండాలి.

ఈ ప్రపంచంలో కనిపించేవన్నీ పరమాత్మవే అనుకుంటే ఆ పరమాత్మ మనవాడు అనుకుంటే ఇక మనం పోగొట్టుకునేది ఏమీ ఉండదు. ఈ భావన కల్గినప్పుడు మోహశోకాలకు తావు లేదు. ఎవరయితే పరమాత్మ తనయందు ఉన్నాడని అనుకుంటాడో వారికి బాహ్యామైన వస్తువులు దేని మీద మోహం ఉండదు.

ఉపనిషత్తుల్లో ప్రపంచమంతా పరమాత్మలో ఉన్నట్లుగా విశదీకరిస్తే, రమణ మహర్షిలాంటి మహాత్ములు మన ఆత్మనే పరమాత్మ అనుకోమన్నారు. భగవంతుడు అందరి హృదయాల్లో ఉన్నాడు. ఉండటమే కాదు అన్నిటికీ ఆధారమని, మూలమనీ

అంటారు. అన్నీ ఆ భగవంతుడి నుండి ఉదయించి ఆయనలో లీనమవుతాయి. ఇవన్నీ నిత్య సత్యాలు.' చదవడం ఆపిన మంజరి ఆలోచనలో పడింది. తండ్రి ఎంత చక్కగా అందరి మహామహుల గురించి, ఉపనిషత్తుల గురించి చదివి దాన్ని తనదైన భాషలో వ్యక్తీకరించాడు. అప్పుడే నిశ్చయించుకుంది తండ్రి రాసుకున్న నోట్సులన్నీ కూలంకషంగా చదివి, అర్థం చేసుకుని ఆపైన ఎవరి బోధనలో ఏముందో చదివి తెలుసుకోవాలని.

తల్లి తండ్రి గురించిన జ్ఞాపకాలు రాగానే అప్రయత్నంగా కంటనీరు కారింది. కాలం ఎంత వేగంగా పరిగెట్టింది. ఇంకా తమ చిన్నతనం, అక్క, అన్న, తమ్ముడు, తను చేసిన చేష్టలు నిన్న మొన్న జరిగినట్లుగా ఉన్నాయి.

ఆదిత్య మరణంతో కాలం స్తంభించిపోతుందనుకుంది. కానీ అలా జరగలేదు. కాలగమనం సాగుతూనే ఉంది. బాధ్యతల్లో పడ్డ తనకు ఆదిత్య, అత్తగార్ల జ్ఞాపకాలు తెరమరుగయ్యాయి. కాలం ఎవరికోసం ఆగదు. ఎవరున్నా లేకపోయినా కాలచక్రం తన పని చేసుకుంటూ పోతుంది.

స్కూల్లో మంచి పేరు తెచ్చుకుంది. ప్రైమరీ సెక్షన్‌కు హెడ్‌గా బాధ్యతలు అప్పగించింది ప్రిన్సిపాల్. స్కూల్లో తనతో పనిచేసే ప్రతిమ మంచి స్నేహితురాలయ్యింది. అదే ఊళ్లో ఉన్న కాలేజీలో వాళ్లాయన లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. స్టాఫ్ రూమ్‌లో కలుసుకుని మాటలు కలుపుకున్న వారిద్దరి స్నేహం అనతికాలంలో పుష్పించింది.

ప్రతిమ ప్రస్తుతంలో జీవించాలంటుంది. వేదాంతం మంచిదే కానీ మరీ వేదాంత ధోరణిలో పడి నేటి కాలమాన పరిస్థితులను అర్థం చేసుకోకుండా బ్రతికితే ఎదురుదెబ్బలు తగులుతాయన్నది ఆమె వాదన. మంజరి దానికి ఒప్పుకోదు. జీవితంలో పాజిటివ్ థింకింగ్ ఉండాలంటుంది.

"నీ ఉద్దేశంలో పాజిటివ్ థింకింగ్ అంటే అందర్నీ గుడ్డిగా నమ్మడమా!" అంది.

"అందర్నీ గుడ్డిగా నమ్మడం కాదు. అందరిలో మంచి చూడాలి అని నా ఉద్దేశం" అంది.

"అందరిలో మంచి చూడాలి కానీ అందరూ మంచివాళ్లని నమ్మకూడదు. ఇప్పుడు ప్రపంచంలో అందరూ పరుగు పందెంలో ఉన్నారు. పరుగు పందెంలో

ఉన్నవాడు, తాను విజేత అవ్వాలంటే పక్కవాడ్ని పడగొట్టాలి. పక్కవాడ్ని పడగొట్టాలన్న భావన వచ్చాక తను అనుసరించే పద్ధతి మంచిదా, కాదా అన్నది ఆలోచించడు. తాను గెలుపొందాలంటే మిగిలినవాళ్లను పడగొట్టడమే అతని లక్ష్యం" అంది.

"అందరూ పరుగుపందెంలో పాల్గొనాలని లేదు కదా!" అంది.

"పరుగు పందెం అంటే నా ఉద్దేశం తాను ముందుకు నడవడానికి చేసే ప్రయత్నం. మానవుడు ప్రగతి కోరుకుంటాడు కదా! దాని కోసం ముందుకు సాగడానికి తనకు వచ్చే అవరోధాలను దాటుకుంటూ వెళ్లాలి. ఆ అవరోధాలను దాటడానికి అనువైన వాళ్లను వాడుకోవాలి. వాడుకున్నాక వాళ్లతో పని అయిపోయాక వాళ్లను త్యజించాలి. ప్రస్తుతం జరుగుతున్నది ఇదే.

నువ్వు అమాయకంగా అందర్నీ నమ్ముకుంటూ పోతే నిన్ను తమ అవసరానికి వాడుకుని ఆ తరువాత నిన్ను వద్దనుకునే అవకాశం ఉందని హెచ్చరిస్తున్నాను. బి.సి. నాటి దానిలా ఆలోచించకు. జీవితంలో ఎదురుదెబ్బలు తగులుతాయి" అంది.

"పోనీలే నా జీవితంలో ఎదురుదెబ్బలు తినాలని ఉంటే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు?" అంటూ నవ్వింది.

"నిన్ను ఆ బ్రహ్మదేవుడు కూడా మార్చలేడు. నాకు క్లాస్‌కి టైమ్ అవుతోంది" అంటూ వెళ్లిపోయింది ప్రతిమ.

ఒకరోజు సడన్‌గా దినేష్ నుంచి ఫోన్ వచ్చింది. ఈ మధ్య ఫోన్ చేయడం తగ్గిస్తే చదువులో ఉన్నాడని సరిపెట్టుకుంది. ఆత్రుతగా ఫోన్ అందుకుంది. కొడుకు క్షేమ సమాచారం కోసం, కొడుకు చెప్పే కబుర్ల కోసం...

దినేష్ చెప్పిన కబురు షాక్ ఇచ్చింది. ఏం చెయ్యగలదు? కొడుకు భవిష్యత్తు గురించి వాడి పెళ్లి గురించి ఎన్ని కలలు కంది? ప్రతి తల్లికీ తన పిల్లల పెళ్లి గురించి సుందరమైన కల ఉంటుంది. అది అపురూపమైన కల. ఆ కల అనుకున్న రీతిలో తీరితే ఎంతో సంతోషిస్తుంది పిచ్చితల్లి.

అది తీరని కోరిక అయిననాడు బాధపడ్డం తప్ప ఏం చెయ్యలేదు. దినేష్ అక్కడ సిటిజన్ అయిన అమ్మాయిని పెళ్లిచేసుకున్నాడు. పెళ్లికి ఎందుకు తొందరపడ్డాడో అర్థం కాలేదు. ఈ రోజుల్లో ఆడపిల్లలు కూడా ఇరవై నాలుగేళ్లు

దాటకుండా పెళ్లి చేసుకోవడం లేదు. అలాంటిది మగపిల్లవాడు, పెళ్లికి ఇంత తొందరపడాల్సిన అవసరం ఏముంది? మంజరి ఆలోచనలు అంతకన్నా సాగలేదు. కొడుకు మాటలే చెవిలో రింగుమంటున్నాయి.

ఫోన్ ఎత్తగానే –

"ఏరా బాబూ! ఎలా ఉన్నావు? నీ చదువు బాగా సాగుతోందా? ఈ ఏడాదితో నీ చదువు పూర్తయితే ఉద్యోగం దొరుకుతుంది కదా! అక్కడే ఉద్యోగం చేస్తావా? ఇండియా వచ్చేస్తావా?" అని అడిగింది.

"లేదమ్మా! నీకొక విషయం చెప్పాలి" అన్నాడు.

"ఏం నాన్నా! డబ్బేమైనా కావాలా?"

"డబ్బు అవసరం ఏం లేదు. నేను పెళ్లి చేసుకున్నాను. మన తెలుగు అమ్మాయే. ఇక్కడే పుట్టి పెరిగింది. నాతోబాటే చదువుతోంది. అనుకోకుండా జరిగిపోయింది. నీకు ముందుగా తెలుపలేకపోయాను" అన్నాడు.

కలలో కూడా ఇలా జరుగుతుందని ఊహించలేదు. అసలు తన కొడుకు పెళ్లి ఈడుకు వచ్చాడన్న ఊహ కూడా ఆమె మనసులో రాలేదు. కాలం మారింది. ఆడపిల్లలు కూడా మగపిల్లలతో సమానంగా చదువులు చదివి అనుకున్న ఉద్యోగం వస్తేనే కానీ పెళ్లికి సిద్ధపడటం లేదు. దానితో పాతికేళ్లు వచ్చేదాకా పెళ్లిళ్లు చేసుకోవటం లేదు. పోనీ వాడిష్టపడ్డ అమ్మాయిని తాను కాదంటుందనుకుని తొందరపడ్డాడా? తనకు వాడు, వాడికి తను అనుకున్నప్పుడు వాడు ఇలాంటి పని చెయ్యాల్సిన అవసరం ఎందుకు వచ్చింది? బాధతో కళ్లనీళ్లు తిరిగాయి.

అనుకోకుండా ఎందుకు జరిగిపోయిందో మంజరికి అర్థం కాలేదు.

అసలు విషయం, అక్కడ సిటిజన్‌గా ఉన్న అమ్మాయిని పెళ్లిచేసుకుంటే గ్రీన్ కార్డు తొందరగా వస్తుంది. దినేష్‌కు ఇండియా వచ్చే ఉద్దేశం లేదు. అతనికి అమెరికా గడ్డ నచ్చింది. అతని ఆలోచనలకు తగ్గట్లుగా అవకాశం దొరికింది. తెలివైనవాడు దాన్ని ఉపయోగించుకున్నాడు.

వైశాలి అక్కడ సెటిల్ అయిన తెలుగు ఫ్యామిలీకి చెందిన అమ్మాయి. ఆమె దినేష్ వలలో పడిందో, దినేష్ ఆమెను వలలో పడేశాడో మొత్తానికి ఇద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్లి చేసుకుందామని నిశ్చయించుకున్నాక వైశాలి వాళ్లింట్లో చెప్పింది. ఆమె తల్లితండ్రులు అభ్యంతరం తెలుపలేదు.

మొదటినుంచీ వైశాలికి ప్రతి విషయంలో స్వేచ్ఛనిచ్చారు. ఆమె తల్లితండ్రులు కూడా ప్రేమించి పెళ్లిచేసుకున్నారు. అందుకే వైశాలి దినేష్‌ను ప్రేమించాను అన్నప్పుడు వాళ్లకు ఆశ్చర్యం కలుగలేదు. ఇంకా పాత వాసనలు పోకపోవడంతో కూతురు ఏ అమెరికన్‌నో ప్రేమించానని చెప్పకుండా ఇండియన్‌ని, అందులో తెలుగబ్బాయిని ప్రేమించడం వాళ్లకు సంతోషం కలిగించింది.

ఏ దేశమేగినా ఎందు కాలిడినా ఇంకా తెలుగుతనాన్ని, తెలుగుదేశాన్ని మర్చిపోలేని వాళ్లలో వీళ్లు కూడా ఒకరు. అందుకే పెళ్లికి వాళ్ల అంగీకారం తెలిపారు.

పెద్ద తరహాగా వైశాలి తల్లితండ్రులు దినేష్‌ను అతని వివరాలు అడిగారు. వాళ్లమ్మగారి గురించి తెలుసుకుని, పెళ్లికి ఆవిడ్ని కూడా రమ్మని చెప్పమని అడిగారు. తల్లి కాదంటే ఈ అవకాశం జారిపోతుందన్న భయం ఏ మూలో ఉండడంతో దినేష్ "ఫరవాలేదు. అమ్మ అభ్యంతరం చెప్పదు. ఇప్పుడు ఆవిడకు పాస్‌పోర్ట్, వీసా అన్నీ దొరికేసరికి చాలా టైమ్ పడుతుంది" అన్నాడు.

ఇంక వాళ్లేమీ మాట్లాడకుండా పెళ్లి జరిపించారు. చదువు పూర్తి చేసుకుని ఇద్దరూ ఉద్యోగాల్లో సెటిల్ అయ్యారు. దినేష్‌కు గ్రీన్‌కార్డ్ వచ్చేసింది. తల్లికి అప్పుడప్పుడు ఫోన్ చేస్తూ ఉంటాడు. కొడుకు పెళ్లి, ఫోటోల్లో చూసి ఆనందించింది మంజరి. చెల్లెలు ద్వారా ఈ విషయం విన్న ప్రసన్న బాధపడింది. చిన్నతనంలో భర్తను పోగొట్టుకుంది. కొడుకు వృద్ధిలోకి వచ్చాడు. కానీ పెళ్లి విషయంలో తల్లి పాత్ర లేదనుకున్నాడు. ముందు ముందు దాని జీవితం ఎలా జరుగుతుందో అనుకుంది.

* * *

ప్రసన్న కొడుకు, కూతురు ఆమెను ఎంతో ప్రేమగా చూసుకుంటారు. ప్రియ ఆమెను కన్నతల్లిలాగే చూస్తుంది. ఈ అదృష్టానికి మంజరే కారకురాలని ఎప్పుడూ అనుకుంటుంది.

తన పెళ్లికి వచ్చిన మంజరి అంటే ప్రియకు చాలా ఇష్టం. మంజరిలోని విశిష్టత ఆమెను ఎక్కువ ఆకర్షించింది. పిన్నీ అని నోరారా పిలిచే ప్రియ అంటే మంజరికి కూడా ప్రేమే. మంజరి సలహా మేరకే ప్రియను హాస్టల్లో పెట్టి ఇంజనీరింగ్ చదువుకునేటట్లు చేసింది ప్రసన్న. ప్రియకు తొందరగా పెళ్లి చెయ్యాలనుకున్న అత్తమామలకు నచ్చచెప్పి, ప్రియను పై చదువులకు

ప్రోత్సహించింది. చదువు యొక్క విలువ తరువాత తెలుసుకుంది. చదువును నిర్లక్ష్యం చేసి తాను ఎంత పొరపాటు చేసిందో తెలిసివచ్చింది. తన అదృష్టం బాగుండబట్టి మంజరి మాట విని ఈ పెళ్లి చేసుకుంది. ఈనాడు సుఖపడుతోంది. అనుకోకుండా మంజరికి జరిగినట్లుగా తనకు అన్యాయం జరిగి ఉంటే తన గతేమై ఉండేది? అన్న భావన ఆమె వెన్ను జలదరింపజేస్తుంది.

తల్లి దగ్గరికి వచ్చినప్పుడల్లా రెండు రోజులు మంజరి దగ్గరకు వచ్చి గడుపుతుంది ప్రియ. తన దగ్గరకు ప్రియ వచ్చినప్పుడు మంజరి కూడా చిన్నపిల్ల అయిపోతుంది. ప్రసన్న కొడుకు కూడా ఇంజనీరింగ్ చేసి ఇక్కడే ఉద్యోగంలో చేరాడు. "పై చదువులకు అమెరికా వెళ్లవా?" అన్నదానికి సమాధానంగా "అందరూ అమెరికా వెళ్లిపోతే ఇండియాలో ఉండేవాళ్లు ఎవరు? చదువులవగానే అమ్మానాన్నలను వదిలేసి పారిపోవడానికి మనమేమీ పక్షులం కాదు. పక్షులైతే రెక్కలొచ్చాక ఎగిరిపోతాయి. అది ప్రకృతి ధర్మం. మానవ ధర్మం ముసలితనంలో అమ్మానాన్నల దగ్గర ఉండడం. అలా అని నేను ఆ పల్లెలో వ్యవసాయం చేస్తానని కాదు. అవసరమైనప్పుడు వాళ్లకు అందుబాటులో ఉండడమే నా ధ్యేయం" అన్నాడు.

ప్రసన్న కొడుకు పార్థు పెళ్లికి వెళ్లింది మంజరి. "నీ కొడుకు పెళ్లి కళ్లతో చూడలేదని బాధపడ్డావు కదా! నా కొడుకు పెళ్లిలో ఆ ముచ్చట తీర్చుకో. నీకు కూడా నాతో సమానంగా అత్తగారి లాంఛనాలు ఇవ్వమన్నాను" అంది ప్రసన్న.

"తప్పు అక్కా! నాకా అర్హత లేదు. పచ్చని పందిట్లో నాలాంటి వాళ్లు వస్తే అశుభం అంటారు. నీ పిల్లవాడికి అన్నీ మంచి జరగాలి. దూరంగా ఉంటాను అంతే. నాకు ఆ అదృష్టమే రాసి ఉంటే ఇలా అయ్యేది కాదు. నా కొడుకు నాతో చెప్పకుండా పెళ్లి చేసుకునేవాడు కాదు. బహుశా వాడికి మేనమామ పోలిక వచ్చిందేమో! ఇద్దరు కొడుకులూ అలా పెళ్లి చేసుకుంటే అమ్మ మాత్రం ఏం చెయ్యగలిగింది? దేనికైనా ప్రాప్తం ఉండాలి" అంది మంజరి.

* * *

మంజరికి ఒక రోజు కొడుకు నుంచి అమెరికాకు రమ్మంటూ ఆహ్వానం వచ్చింది. కొడుకు ఫోన్ చేసి, "అమ్మా! నువ్వు ముందు పాస్‌పోర్ట్ చేయించుకో. ఆ తరువాత నీకు వీసా పేపర్లు పంపుతాను. ఒకసారి మల్టిపుల్ వీసా వచ్చిందంటే నువ్వు ఎప్పుడు కావాలంటే అప్పుడు నా దగ్గరకు రావచ్చు" అన్నాడు.

అప్పుడే కొడుకు దూరమయి మూడేళ్లు దాటిపోయింది. కొడుకును

చూడాలన్న తపన. ముందుగా పాస్‌పోర్ట్‌కు అప్లయి చేసింది. ఆమెకు తెలిసున్న ఫ్రెండ్ ద్వారా అనుకున్నదాని కన్నా ముందుగానే పాస్‌పోర్ట్ వచ్చింది. పాస్‌పోర్ట్ వచ్చిందని తెలిశాక వీసా పేపర్లు పంపించాడు. వీసా పేపర్లు నింపి, దానికి అవసరమైన డబ్బు కట్టి, మద్రాస్ ఇంటర్వ్యూకి వెళ్లింది. మొత్తానికి వీసా దొరికింది. వెంటనే కొడుకు టిక్కెట్టు పంపాడు.

మొదటిసారిగా విమానం ఎక్కుతోంది మంజరి. పాతకాలం వాళ్లలాగా తన భయాన్ని బయటపెట్టలేకపోతోంది. కానీ ఏదో తెలియని భయం. పుట్టిన ఊరు, దేశం వదిలి కొడుకు కోసం పరాయి దేశం ప్రయాణమవుతోంది. తన జీవితం ఏ మలుపు తిరగబోతోందో?

కొడుకును వదిలి ఇన్నాళ్లూ ఒంటరిగా ఉండిపోయింది. పోనీ వాడికి ఇన్నాళ్లకు అమ్మ కావాలనిపించింది. రమ్మన్నప్పుడు వెళ్లి వాడితో, కోడలితో ఆనందంగా కొన్నాళ్లు గడిపితే తిరిగి వచ్చాక ఆ ఆనందం తాలూకు అనుభూతులతో మిగిలిన జీవితం ఆనందంగా హాయిగా గడిపేయవచ్చు. వాడ్ని అనవసరంగా అపార్థం చేసుకుందేమో! ఏ తప్పని పరిస్థితుల్లో పెళ్లి చేసుకోవాల్సి వచ్చిందో?

తనతో పనిచేసే ప్రతిమ, ఆమె భర్త మద్రాస్ వచ్చి ప్లేన్ ఎక్కిస్తామన్నారు. వాళ్లిద్దరూ అన్ని విధాలా సాయపడ్డారు. ఆమెకు కావాల్సిన వస్తువులు, అవసరమైన మందులు అన్నీ కొనిపించారు. కొడుక్కోసం ఊరగాయలు, పొడులు అన్నీ తయారుచేసింది. కోడలికి పట్టుచీర, ఒక జత గాజులు, నెక్లెస్ కొంది.

"ఇప్పుడివన్నీ ఎందుకు మంజరీ!" అన్న స్నేహితురాలి మాటలకు, "నా కోడలికి పెళ్లిలో ఏం పెట్టలేదు కదా! కూతురయినా, కోడలైనా ఆ అమ్మాయే కదా! మొదటిసారి వెడుతున్నాను. పెళ్లి కూడా నా కళ్లతో చూడలేదు. ఉత్తి చేతులతో ఎలా వెళ్లను?" అంది మంజరి.

"నీ కొడుకు నీకు చెప్పి పెళ్లి చేసుకోలేదు కదా! నీకు చెప్పి నీ సమక్షంలో చేసుకుని ఉంటే ఏం చేసినా అందం చందం" అంది ప్రతిమ.

"వాళ్లు తప్పు చేశారని నేనూ తప్పు చేస్తే నా పెద్దరికం ఏముంది చెప్పు? ఏది ఏమైనా వాళ్లు నా కొడుకు, కోడలు కాకుండా పోతారా?" అంది మంజరి.

అమ్మ మనసుకు జోహార్లు అనుకుంది ప్రతిమ. ఇంకేమీ మాట్లాడలేదు. ఇంకా మాట్లాడి ఆమెను నొప్పించదల్చుకోలేదు.

ఎయిర్‌పోర్ట్‌లో అడుగుపెట్టినప్పుడు మొదలైన గుండె దడ ప్లేన్‌లో కూర్చునేదాకా తగ్గలేదు. అప్పటికీ తెలిసున్నవాళ్ల ద్వారా లోపలికి వచ్చి మంజరికి అన్నీ విశదంగా చెప్పి చెక్ ఇన్‌కు లోపలికి వెళ్లేదాకా సహాయపడ్డాడు ప్రతిమ భర్త.

ఆ తరువాత ధైర్యం తెచ్చుకుని ఫ్లైట్ ఎక్కి ఎయిర్ హోస్టెస్ చూపగా తన సీట్ దగ్గరకు వెళ్లి హాండ్‌బ్యాగేజ్ పైన కేబిన్‌లో పెట్టి తన సీట్‌లో కూర్చుంది.

ప్లేన్ బయలుదేరడానికి సిద్ధంగా ఉందని పైలెట్ అనౌన్స్ చేశాక ఎయిర్ హోస్టెస్ తన డిమానస్ట్రేషన్ మొదలుపెట్టింది. సీట్ బెల్ట్ ఎలా పెట్టుకోవాలో, ఆక్సిజన్ మాస్క్ గురించి, అంతా అమెరికన్ యాక్సెంట్‌తో వివరిస్తోంది. మంజరికి ఒక్క ముక్క అర్థం కాలేదు. ఆ అమ్మాయి చూపించిన విధంగా సీట్ బెల్ట్ పెట్టుకుందుకు ప్రయత్నించింది. కానీ సరిగా పెట్టుకోవటం రావటం లేదు.

పక్క సీట్లో అమ్మాయి మంజరి అవస్థ గమనించి సహాయపడింది. "థాంక్యూ" అంది మంజరి. "ఇట్స్ ఓకె" అంటూ ఒక చిన్న చిరునవ్వు నవ్వి 'జాన్ గ్రిషమ్' రాసిన 'ద కింగ్ ఆఫ్ టార్ట్స్' చదవటం మొదలుపెట్టింది ప్లేన్ టేక్ ఆఫ్ అయ్యింది. ఒక నిముషం తల తిరిగినట్లయ్యింది. భయంతో ఇష్టదైవాన్ని తలచుకుంది. ఆ తరువాత ఆ అమ్మాయిని చూసి ధైర్యం తెచ్చుకుని, తన పర్స్‌లోంచి ప్రయాణం కోసం పెట్టుకున్న యండమూరిగారి నవల 'నల్లంచు తెల్లచీర' తీసి చదవడం మొదలుపెట్టింది.

మంజరి చేతిలోని తెలుగు నవల చూసి పక్క సీట్ అమ్మాయి, "మీరు తెలుగువారా?" అని అడిగింది.

ఆ మాటతో ఎడారిలో ఒయాసిస్ చూసిన అనుభూతి కలిగింది మంజరికి. "మీరు కూడా తెలుగువారా?" అంది ఆనందంతో.

"అవునండీ తెలుగువాళ్లమే. మీ చేతిలో నవల చూసేదాకా మీరు తెలుగువారని నేను అనుకోలేదు. అదీగాక కొంతమందికి పక్కవాళ్లతో మాట్లాడ్డం ఇష్టం ఉండదు. నా పేరు ప్రణతి. మేం న్యూజెర్సీలో ఉంటాం. అమ్మావాళ్లు హైద్రాబాద్‌లో ఉంటారు. వాళ్లను చూడ్డానికి వెళ్లి పదిరోజులుండి వెనక్కి వెళ్లిపోతున్నాను. మద్రాసులో ఎవరో ఫ్రెండ్స్‌ను కలవాలి. అందుకే ఇక్కడనుంచి ఫ్లైట్ బుక్ చేసుకున్నాను.

ఉద్యోగాల్లో సెలవులు దొరక్క తల్లితండ్రుల కోసం సమయం వెచ్చించాలన్నా కుదరటం లేదు. డాలర్లు ఖర్చుపెట్టగలం కానీ మా ప్రేమను పంచలేకపోతున్నాము. మీ డాలర్లు మాకొద్దు. మీ ప్రేమాభిమానాలు కావాలంటారు. వాళ్లు మమ్మల్ని కనిపెంచిన తల్లితండ్రులు. మా అభివృద్ధికై నిరంతరం శ్రమించి మాకు సోపానాలు వేశారు. అలాంటి వాళ్ల కోసం కొంత సమయాన్ని వెచ్చించలేని దౌర్భాగ్యస్థితిలో ఉన్నాం. వాళ్లకు మేం ఎంత సమయం ఇవ్వగలుగుతున్నాం అని తలుచుకుంటే బాధ కలుగుతుంది ఆంటీ. ఓ... సారీ... మిమ్మల్ని ఆంటీ అనొచ్చా?" అంటూ ఆగిపోయింది.

"తప్పకుండానమ్మా! ఆంటీ అను, అత్తయ్య, పిన్నీ ఏదైనా అను నీ ఇష్టం. ఈ ప్రయాణంలో మాట్లాడడానికి నాకు ఒక తోడు దొరికింది. నా జీవితంలో మొట్టమొదటిసారి విమానం ఎక్కాను. అమెరికా కూడా మొదటిసారి వస్తున్నాను. ఏదో తెలియని భయం. నీ మాటలు అమృతజల్లులా ఉన్నాయి. దేశం కాని దేశం. ప్రయాణంలో తెలుసున్న భాష మాట్లాడేవాళ్లు దొరికితే ఎంత ఆనందంగా ఉంటుందో వర్ణించలేను" అంటూ ఆగింది మంజరి.

"ఫర్వాలేదు ఆంటీ! మీకు ఏమైనా హెల్ప్ కావాలంటే నేను చేస్తాను. మీరు ఎక్కడికి వెళ్లాలి?" అని అడిగింది.

"నేను కూడా నూజెర్సీ వెళ్లాలమ్మా. మా అబ్బాయి, కోడలు అక్కడ ఉంటున్నారు. వాడు రమ్మంటే వెడుతున్నాను" అంది.

"న్యూజెర్సీలో మీ అబ్బాయి ఎక్కడ ఉంటున్నారు?" అంది.

"నాకు ఇంకా కొత్త కదమ్మా! ఇదిగో వాడి అడ్రస్" అంటూ కొడుకు అడ్రస్ ఉన్న పుస్తకం చూపించింది మంజరి.

"మీ అబ్బాయి ఉంటున్నది మర్రే హిల్స్ ఆంటీ.... అక్కడ ఇండియన్స్ కొంచెం తక్కువ ఉన్నారు. మేం ప్రిన్స్టన్‌లో ఉంటాము. మేం ఉండే ఏరియాలో ఇండియన్స్ చాలామందే ఉన్నారు. మీరున్న ఏరియాకు కొంచెం దూరమనే చెప్పవచ్చు."

మంజరి కొంచెం బాధపడింది. ఈ అమ్మాయితో కొంచెం పరిచయం అయ్యింది. ఎప్పుడైనా కాలక్షేపం కావాలంటే తోడు దొరికిందని సంబరపడింది. ఆ ఆనందం అంతా హుష్‌కాకి అయిపోయింది.

మంజరికి తెలియని విషయం అమెరికాలో ఎవరికీ ఇంకోళ్ల గురించి పట్టించుకుందుకు టైమ్ ఉండదని, వాళ్ల ఊళ్లోలాగా ఇరుగుపొరుగు మాట్లాడుకోవడం లాంటివి ఉండవని. ఎవరి పనిలో వాళ్లు బిజీగా ఉంటారు. బద్ధకం అన్నది అమెరకన్లలో లేదని, నిరంతరం కష్టపడతారని, వాళ్ల పనులు వాళ్లు చేసుకుంటారని, నౌకర్లతో పని చేయించుకుని, కాళ్లు చాపుకుని ఊసుపోక కబుర్లు ఎవరూ చెప్పుకోరని తెలియదు మంజరికి.

అక్కడకు వెళ్లిన కొద్ది కాలానికి అక్కడి వాతావరణం, వాళ్ల నిత్యావసరాలు, జీవితం అన్నీ అర్థం అవుతాయి. ప్రయాణంలో తోడు దొరికింది. అదీకాక కొడుకు ఎలాగా ఏర్పోర్ట్‌కు వస్తాడు.

ఫ్లైట్‌లో ఇండియన్ ఫుడ్ సర్వ్ చేశారు. భోజనం గురించి ముందు భయపడింది. వాళ్లిచ్చిన భోజనం ఫరవాలేదనిపించింది. కడుపు నింపుకుంది. తెలియనివన్నీ ప్రణతినడిగి తెలుసుకుంది. మొత్తానికి మంజరి సప్తసముద్రాలూ దాటి క్రౌంచద్వీపం అనబడే అమెరికాలో అడుగుబెట్టింది.

మంజరి ఎక్కిన విమానం నువార్క్‌లోని లిబర్టీ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్‌లో లాండ్ అయ్యింది. ప్రణతి ఇమ్మిగ్రేషన్ ఫామ్ నింపడంలోనూ, లగేజ్ తీసుకుని బైటికి వచ్చేదాకా హెల్ప్ చేసింది. లగేజ్ తీసుకుని బైటికి రాగానే దినేష్‌ను చూపించి మా అబ్బాయి వచ్చాడమ్మా అంటూ చూపించి, ఆ అమ్మాయి తనకు ఎంత సహాయం చేసిందో చెప్పింది. దినేష్ సభ్యతగా థాంక్స్ చెప్పాడు.

నవ్వుతూ "ఫరవాలేదండీ, నాకూ మంచి కాలక్షేపం అయ్యింది" అంటూ తనను రిసీవ్ చేసుకుందుకు వచ్చిన భర్తతో వెళ్లిపోయింది. ఆమె వెళ్లిపోయాక అయ్యో అడ్రస్, ఫోన్ నెంబర్ తీసుకోలేదని బాధపడింది. తీసుకున్నా ఆమెతో మాట్లాడడానికి వాళ్లకు టైమ్ ఉండదన్న సంగతి తెలియదు మంజరికి.

తల్లి లగేజ్ ఉన్న ట్రాలీని తీసుకుని కార్ పార్కింగ్ లాట్‌లోకి నడిచాడు దినేష్. లగేజ్ కార్ డిక్కీలో వేసి తల్లిని ముందు సీట్లో కూర్చోమని సీట్ బెల్ట్ పెట్టాడు. మంజరి మొట్టమొదటిసారి కారు ఎక్కింది. వాళ్లింట్లో ఎవరూ కారు కొనలేదు. మురళి ఇండియాలో ఉంటే కొనేవాడేమో! కారులో కూర్చున్న మంజరి కొడుకు డ్రైవ్ చెయ్యడం, వేగంగా పరుగెడుతున్నట్లుగా ఉన్న విశాలమైన రోడ్లు, అందమైన కోనిఫర్ చెట్లు, ఇళ్లు అన్నీ విచిత్రంగా చూస్తోంది. రోడ్లు ఎంత విశాలంగా ఉన్నాయో అనుకుంది.

"చెప్పమ్మా, ప్రయాణం బాగా జరిగిందా? ఏం ఇబ్బంది కాలేదు కదా!" అన్నాడు.

కారు స్టీరింగ్‌ని అవలీలగా తిప్పుతూ డ్రైవ్ చేస్తున్న కొడుకును అపురూపంగా చూస్తున్న మంజరి కొడుకు మాటలకు ఉలిక్కిపడి "ఆ బాగానే జరిగింది. ముందు కొంచెం భయం వేసినా తరువాత ప్రణతి సహాయంతో నాకు కొత్త, భయం పోయిందిరా" అంది.

"నీ లక్ బాగుంది కాబట్టి ఆవిడ దొరికింది. లేకపోతే కొంచెం ఇబ్బంది అయ్యేది. లేకపోయినా ఎయిర్ హోస్టెస్‌లు హెల్ప్ చేస్తారు" అన్నాడు.

కారు వాళ్లుండే ఏరియాకు చేరింది. కార్ పార్క్ చేసి సూట్‌కేస్‌లు రెండూ తీశాడు. "ఇంత బరువుగా ఉన్నాయి. ఏం తెచ్చావు?" అన్నాడు. మంజరి మాట్లాడలేదు. చుట్టుపక్కల అంతా విచిత్రంగా చూస్తోంది. పెట్టెలు మొయ్యడానికి ఎవరైనా వస్తారేమో అని చూసింది.

"నువ్విక్కడే ఉండు" అంటూ ముందు ఒక పెట్టి లాక్కుని వెళ్లి ఎక్కడో పెట్టి వచ్చి, రెండో పెట్టి లాగుతూ చిన్న పెట్టె చేతిలో పట్టుకుని, "నడు" అన్నాడు.

"మొయ్యడానికి ఎవర్నైనా పిలిస్తే బాగుంటుంది కదా!" అంది.

"ఇక్కడ అలా ఎవరూ దొరకరు. మన పనులు మనమే చేసుకోవాలి" అన్నాడు. అపార్ట్‌మెంట్ ముందు నిలుచుని బెల్ కొట్టాడు. తలుపు తీసి బైటికి వచ్చింది వైశాలి. సామాను అపార్ట్‌మెంట్‌లోకి లాగాడు. కర్రతో కట్టిన టూ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్. వాళ్ల బెడ్‌రూమ్ కాక మరో బెడ్‌రూమ్‌లో తన సామాను పెట్టాడు.

కోడల్ని చూడగానే గ్రహించింది మంజరి ఆమె గర్భవతని. అంటే తను త్వరలో నాన్నమ్మ అవబోతోందన్నమాట.

"మీరు కాఫీ తాగుతారా, టీ తాగుతారా" అని అడిగింది కోడలు.

"ఏదైనా ఫరవాలేదు. ముందు బాత్‌రూమ్ ఎక్కడుందో చూపించు. బ్రష్ చేసుకుని స్నానం చెయ్యాలి" అంది.

"దినేష్ నువ్వు చూపించి అన్నీ ఎక్స్‌ప్లెయిన్ చెయ్యి" అంటూ వంటింట్లోకి వెళ్లింది.

"నీ కోడల్ని చూశావా అమ్మా!" అన్నాడు.

"ఆ బాగుందిరా. తెలుగు కూడా బాగానే మాట్లాడుతోంది."

"మా అత్తగారు పట్టుపట్టి తెలుగు నేర్పించారు. మాట్లాడుతుంది కానీ కొంచెం అమెరికన్ యాక్సెంట్ ఉంటుంది. నడు, నీకు బాత్‌రూమ్ చూపిస్తాను" అంటూ బాత్‌రూమ్ చూపించి కుళాయిలో ఒకవైపు చల్లనీళ్లు, ఒకవైపు వేడినీళ్లు వస్తాయని, ఇండియాలోలా ఎక్కడ పడితే అక్కడ నీళ్లు పొయ్యకూడదని, స్నానం బాత్‌టబ్‌లోనే చెయ్యాలని, అన్నీ విశదంగా చెప్పాడు.

"బాత్‌రూమ్ తడి చెయ్యకుండా జాగ్రత్తగా వాడుకో" అన్నాడు. అన్నీ విచిత్రంగా చూసి హాండ్‌బాగ్‌లో ఉన్న బ్రష్ తీసుకుని బ్రష్ చేసుకుని వచ్చేసరికి కోడలు కాఫీ తెచ్చింది.

"కాఫీ బాగుందమ్మా, ఎన్నో నెల?" అని అడిగింది.

"సెవెంత్ మంత్. మీకెలా తెలిసింది? దినేష్ ముందే చెప్పాడా?"

"వాడేం చెప్పలేదు. నిన్ను చూసి గ్రహించాను."

పాంట్ మీద అంత లూజ్ షర్ట్ వేసుకున్నా కనబడుతోందా అనుకుంది వైశాలి. అదేమీ లేకపోయినా మొహం చూసి గ్రహిస్తారన్న విషయం వైశాలికి తెలియదు.

"ఈ రోజు నీ కోసం సెలవు పెట్టాము. బ్రేక్‌ఫాస్ట్ చేసి కాసేపు పడుకో. వంట నేను, వైశాలి కలిసి చేస్తాము. నీకు జెట్‌లాగ్ ఉంటుంది" అన్నాడు.

"జెట్‌లాగ్ అంటే ఏమిటిరా?" అంది మంజరి.

"ఇండియాలో మనకు పగలు అయినప్పుడు ఇక్కడ రాత్రి. ఇక్కడ రాత్రి అయినప్పుడు అక్కడ పగలు. నీ శరీరం అక్కడ రాత్రి ప్రకారం నిద్ర కోరుతుంది. కానీ ఇక్కడ పగలు కాబట్టి నువ్వు ఎక్కువ సేపు పడుకోకుండా రాత్రిదాకా కాలక్షేపం చేస్తే రెండు రోజుల్లో నీ శరీరం ఇక్కడ దానికి అలవాటు పడుతుంది" అన్నాడు.

"అలా అయిన పక్షంలో ఇప్పుడు నువ్వు చెప్పినట్లు పడుకుంటే నాకు రాత్రి నిద్ర రాదు. పడుకోకుండా కాలక్షేపం చేస్తే మీ అందరితో బాటు నిద్రపోవచ్చు కదా!" అంది.

సాయంకాలం దాకా నిద్ర ఆపుకుని ఇంక ఆపుకోలేక నాలుగయ్యేసరికి నిద్రపోయింది. రాత్రి పన్నెండు అయ్యేసరికి తెలివి వచ్చి ఏం చెయ్యాలో తెలియలేదు. అలా మంచం మీద కూర్చుని జాగారం చేసింది.

మంజరి తను తెచ్చిన ఊరగాయలు, పొడులు కోడల్ని సీసాలు ఇమ్మని చెప్పి, అందులో అన్నీ సర్దింది. తను కోడలి కోసం తెచ్చిన చీర, నెక్లెస్, గాజులు ఇచ్చింది. గాజులు, నెక్లెస్ చూసి సంతోషించింది. కానీ చీర చూసి కొంచెం మొహం ముడుచుకుంది.

"నేను ఎక్కువ చీరలు కట్టను. నాకు చీరలు కట్టుకోవడం రాదు" అంది.

"నేను నీకు కడతానమ్మా. నేను నీకు నేర్పిస్తాను" అంది మంజరి.

"ఇండియన్ ఫంక్షన్స్‌కు వెళ్లినప్పుడు కట్టుకోవచ్చు కదా" అన్నాడు దినేష్.

చీర ఓపెన్ చేసి చూపించింది. మంజరి ఓపెన్ చేసిన చీర చూసి వైశాలి ఒక్కసారిగా "వావ్ బ్యూటిఫుల్" అంది. నెమలికంఠం రంగు చీరకు క్రీమ్ కలర్ బార్డర్, చీర అంతా చిన్న జరీ బూటా, పమిట నెమళ్లతో నిండి చాలా అందంగా ఉంది. "ఐ లవ్ ఇట్" అంది.

"పోనీలే అమ్మా! నీకు నచ్చింది కదా! నీ సైజ్ తెలియక బ్లౌజ్ కుట్టించలేదు. ఎవరి దగ్గరైనా మిషన్ ఉంటే నీకు కావాల్సిన రీతిలో నీకు బ్లౌజ్ కుడతాను" అంది.

"మీరు కుడతారా?" అని ఆశ్చర్యపోయింది.

"ముందు ఎవరి దగ్గరైనా మిషన్ ఉందేమో చూడు. నా దగ్గరున్న మామూలు బట్టతో ముందుగా ఒకటి కుడతాను. నీకు అది ఫిట్ అయి నచ్చితే దీన్లో ఉన్న బ్లౌజ్‌పీస్‌తో కుడతాను" అంది.

"అలాగే తప్పకుండా కనుక్కుంటాను. నాకు తెలిసినవాళ్లను కనుక్కుంటాను" అంది వైశాలి.

"నేను క్షేమంగా చేరినట్లు మా ఫ్రెండ్‌కు ఫోన్ చెయ్యాలిరా. ప్రతిమ ఆమె భర్త నాకు ఇక్కడికి రావడానికి చాలా సహాయం చేశారు" అంది.

"అలాగేనమ్మా లాండ్ లైన్ నుంచి నువ్వు ఎవరితో మాట్లాడాలన్నా ఫోన్ చేసుకోవచ్చు" అంటూ ఏఏ నెంబర్లు నొక్కాలో అన్నీ వివరంగా చెప్పాడు.

ప్రతిమకు ఫోన్ చేసింది. మంజరి ఫోన్ కోసం ఎదురుచూస్తున్నట్లుగా వెంటనే ఫోన్ ఎత్తింది. మంజరి గొంతు విని–

"హమ్మయ్య క్షేమంగా చేరావు కదా! నీ గురించే ఆలోచిస్తున్నాను. ఎలా వెళ్లావో ఏమిటో అని ఒకటే భయం" అంది.

"అంతా బాగానే జరిగింది. మీ సహాయం, దైవసహాయం ఉండబట్టి క్షేమంగా చేరాను. నేను త్వరలో నాయనమ్మను అవబోతున్నాను" అంటూ ఎంతో సంతోషంగా చెప్పింది మంజరి.

"నీ కొడుకు చాలా తెలివైనవాడు మంజరీ! నిన్ను తన అవసరానికి ఉపయోగించుకుందుకు పిలిపించుకున్నాడు" అంది.

"అలా ఎందుకనుకోవాలి? పోనీలే హాయిగా వాడికి ఉపయోగపడినట్లు ఉంటుంది. మనవడి ముద్దుముచ్చట్లు చూసినట్లు ఉంటుంది. ఒంటరి బ్రతుకు. ఈ వయసులో ఇంతకన్నా ఏం కావాలి చెప్పు" అంది.

నిజంగా మంజరి అమాయకురాలో లేక పోజిటివ్ థింకింగ్‌తో ఆలోచిస్తోందో తెలియటం లేదు.

* * *

మనసులో కోడలికి గాజుల ఫంక్షన్ చెయ్యాలని ఉంది. కొడుకుతో చెప్తే ఏమంటాడో అన్న భయం. ఇదే ఇండియాలో అయితే అందర్నీ పిలిచి ఎంత గ్రాండ్‌గా చేసి ఉండేది అనుకుంది. అయినా ఊరుకోలేక కొడుకు దగ్గర తన కోరిక చెప్పింది. వైశాలి ఏమిటని అడిగింది.

అప్పుడు అంతా వివరంగా చెప్పింది మంజరి. "ఇట్ ఈజ్ జస్ట్ లైక్ బేబీ షవర్ కానీ అది అయిపోయింది" అంది.

"అంటే" అని అడిగింది అర్థం కాక మంజరి. అప్పుడు దినేష్ విశదంగా ఫ్రెండ్స్ అందరూ కలిసి పార్టీలా అరేంజ్ చేసి, పుట్టబోయే బేబీకి అవసరమైన సరుకులన్నీ బహుమతిగా ఇస్తారని చెప్పాడు. బిడ్డ పుట్టినప్పుడు కావాల్సిన సరుకులు ఒక్కసారిగా కొనాలంటే కష్టం కాబట్టి ఫ్రెండ్స్ అందరూ కలిసి ఇస్తారని చెప్పాడు. ఈ పద్ధతి బాగుంది అనుకుంది మంజరి. పిల్లవాడి కోసం ఇచ్చిన వస్తువులన్నీ తల్లికి చూపించాడు.

పడుకునేందుకు క్రిబ్, స్నానానికి టబ్, ఆడుకుందుకు రకరకాల సామాన్లు, మగపిల్లలు వేసుకునే డ్రెస్‌లు అన్నీ ఉన్నాయి. ఉండబట్టలేక అడిగింది. "అదేమిట్రా పుట్టబోయేది మగపిల్లవాడన్నట్లు ఆ బట్టలిచ్చారు. వాళ్లకెలా తెలుసు?" అంది.

"ఇక్కడ ముందే చెప్తారమ్మా" అన్నాడు. ఏమిటో అన్నీ తను లేకుండా

ముందే అయిపోతున్నాయి. ఎక్కువ ఆశలు లేకపోయినా చిన్న చిన్న ముచ్చట్లు కూడా తీరటం లేదు అనుకుంది మంజరి.

'అందుకే అంటారు దేనికైనా ప్రాప్తం ఉండాలని. తనకు ప్రాప్తం ఉన్నవాటితో ఆనందం పొందడమే' అనుకుంది మంజరి.

"పోనీ మీ అత్తగారితో మాట్లాడి నా ముచ్చట కోసం చేద్దామురా" అంది.

"సరే అలాగేలే" అన్నాడు. అత్తగారితో మాట్లాడితే ఆవిడ చాలా సంతోషంగా అంగీకరించింది.

ఇండియా వదిలిపెట్టాక ఇలాంటి సరదాలు తక్కువయ్యాయనే చెప్పాలి. బిజీ లైఫ్‌లో అన్నీ సాధ్యం కావు. అప్పటికీ మన సంస్కృతిని మర్చిపోకూడదని చాలామంది తెలుగు అసోసియేషన్స్ అని ఏర్పరుచుకున్నారు. మన పండుగలు, గెటు గెదర్స్ అన్నీ సరదాగా పెట్టుకుందుకు తాపత్రయపడతారు.

వచ్చే వీకెండ్‌లో గాజుల ఫంక్షన్ చేసేటట్లుగా డిసైడ్ చేసుకున్నారు. పక్క అపార్ట్‌మెంట్‌లో ఉన్న లిండా దగ్గర మిషన్ ఉన్నట్లు తెలిసింది మంజరికి.

ఆ రోజు కొడుకు, కోడలు ఆఫీస్‌కి వెళ్లిపోయాక తలుపు తీసుకుని బైట నుంచుంది మంజరి. వేసవి కాలం మూలంగా వాతావరణం చాలా బాగుంది. చెట్లన్నీ చిగిర్చి పచ్చదనాన్ని సంతరించుకున్నాయి. ఆకు లేకుండా పువ్వులున్న చెట్లు జీవితంలో మొట్టమొదటిసారి చూసింది మంజరి. ముందు పువ్వులు వచ్చి తరువాత ఆకులు వస్తాయని కొడుకు చెప్పాడు.

రంగు రంగుల పువ్వులతో చెట్లు విరబూసి ఉన్నాయి. అలా బైట నుంచున్న మంజరికి ఎదురింటి అమెరికన్ 'హలో' అని పలకరించింది. తను కూడా 'హలో' అంది. ఆమె పేరు లిండా అని చెప్పి మీ పేరు అని అడిగింది. పేరు చెప్పింది మంజరి.

మంజరి కట్టుకున్న చీరమీద ఎంబ్రాయిడరీ చూసి, "ఇటీజ్ నైస్" అంది లిండా. నేనే చేశానన్నట్లుగా కొంత యాక్షన్‌తోటి, తనకొచ్చిన ఇంగ్లీష్‌తోటి చెప్పడానికి ప్రయత్నించింది. అప్పుడు చెప్పింది లిండా తనకూ కుట్లూ, అల్లికలూ అంటే ఇష్టమని చెప్పి తను చేసినవి మంజరికి చూపించింది. పిల్లలకు ఆడుకుందుకు బొమ్మల క్లాత్‌తో బుక్స్‌లా కుడతానని చెప్పింది.

అమెరికాలో చిన్నపిల్లల బొమ్మల మీద చాలా శ్రద్ధ చూపిస్తారు. ప్రతి బొమ్మ మీదా ఆ బొమ్మ పిల్లలకు ఏ విధంగానూ హానికారకం కాదని రాసి ఉంటుంది. రకరకాల బొమ్మలతోటి, ఇంగ్లీషు అక్షరాలు ఉన్న బట్ట తెచ్చి పిల్లల కోసం ఆ క్లాత్‌తో పుస్తకాలలా కుడుతుంది. అలాంటి పుస్తకాల ద్వారా పిల్లలకు అక్షరాలు, రంగులు నేర్పడానికి ప్రయత్నిస్తారు. కాగితం అయితే పిల్లలు నోట్లో పెట్టుకుంటే ప్రమాదం. బట్ట అయితే ప్రమాదం ఉండదని వారి భావన. లిండా అలాంటి పుస్తకాలు, హవాయ్ చెప్పల్ మీద ఫర్‌తో క్రోషియాతో డెకరేటివ్ డిజైన్స్, డైపర్ ఛేంజింగ్ పాడ్స్ చేసి అమ్ముతుంది.

అంటే ఆమె దగ్గర సూయింగ్ మిషన్ ఉందన్నది నిర్ధారణ అయ్యింది. కాబట్టి తన అవసరానికి మిషన్ అడుగుదామని తనకొచ్చిన భాషలో ఆమెను అడిగింది. లిండా తప్పకుండా ఇస్తానని, ఆమెను లోపలికి పిలిచి ఆ మిషన్‌ను ఎలా నడపాలో, దాంట్లో ఏమేమి ఉన్నాయో అన్నీ చెప్పింది. ఆ టెక్నాలజీ చూసి చాలా ఆశ్చర్యపోయింది మంజరి. ఆమెకు తెలుసున్న మిషన్ మామూలిదే. తొందరగా దాన్లో ఉన్నవి ఆకళింపు చేసుకుందుకు ప్రయత్నించింది.

ఇంటికొచ్చాక కొడుకుతో ఆనందంగా లిండాకూ, తనకూ జరిగిన సంభాషణ ఆనందంగా చెప్పింది.

"నువ్వేం చెప్పావో ఆమెకు ఏం అర్థం అయ్యిందో" అంటూ వేళాకోళం చేశాడు.

మర్నాడు తన దగ్గరున్న బట్టతో కోడలి పాత బ్లౌజ్‌తో కొలతలు తీసుకుని, వాళ్లు ఆఫీస్‌నుంచి ఇంటికి వచ్చేసరికి బ్లౌజ్ తయారుచేసింది. ఇంటికి వచ్చిన కోడలితో తను కుట్టిన బ్లౌజ్ వేసుకుని చూడమని చెప్పింది. పెర్‌ఫెక్ట్ ఫిటింగ్‌తో ఉన్న బ్లౌజ్ చూసి వైశాలి ఆశ్చర్యపోయింది. దినేష్‌కు చూపించి "అమేజింగ్ కదా!" అంది.

అది చూసి తల్లిని వేళాకోళం చేసినందుకు బాధపడ్డాడు. ఆవిడలోని ప్రతిభను ప్రశంసించకుండా ఉండలేకపోయాడు. ఇద్దరూ చాలా బాగుందని మెచ్చుకున్నారు.

ఆ రాత్రి రెండు మూడు రకాల డిజైన్స్ పేపర్ మీద వేసి చూపించి పట్టుచీర మీద బ్లౌజ్ ఎలా కావాలో చెప్పమంది. వైశాలి సెలెక్ట్ చేసిన డిజైన్ బ్లౌజ్ మర్నాటికి తయారయ్యింది. లిండాకు చూపిస్తే లిండా కూడా చాలా మెచ్చుకుంది.

గాజుల ఫంక్షన్ నాటికి చీర, బ్లౌజ్ రెడీ. గాజులు ఎక్కడ దొరుకుతాయన్న సమస్య వచ్చింది. ఎడిసన్ ఏరియాలో ఒక గుజరాతీ ఆమె లక్క గాజులు అమ్ముతుందని తెలిసి వైశాలిని ఆమెకు నచ్చిన గాజులు తెచ్చుకోమని చెప్పింది.

తెలిసున్న ఇద్దరు ముగ్గురు తెలుగువాళ్లను పిలిచారు. వైశాలి అమ్మా, నాన్నా కూడా వచ్చారు. అందరికీ రుచికరమైన వంట చేసింది మంజరి. వైశాలి తల్లి అపర్ణతోనే అన్నీ చేయించింది. ఆదిత్య ఉంటే తామిద్దరూ వచ్చి కోడలికి అన్నీ తన చేతుల మీద చేసి ఉండేది. తనకా అదృష్టం లేకుండా పోయింది.

కాలం మారింది కాబట్టి ఈ మాత్రమైనా నలుగురిలోకి రావడం జరుగుతోంది. ఇదివరలో ఎంత అధ్వాన్నంగా ఉండేది భర్తపోయిన స్త్రీ బతుకు. దేనికీ పనికిరాదని తీసిపారేయడమే. ఆ శిక్ష ఆడదానికెందుకో, శాస్త్ర ప్రకారం మగవాడు కూడా భార్య పోయాక అన్నిటికీ అనర్హుడే. కానీ శాస్త్రం చెప్పిందని రవిక బొడ్లో దోపుకుని మగవాడు అన్ని కార్యక్రమాలకి తయారవుతాడు. మరి ఆ అర్హత ఆడదానికెందుకు ఉండదో? చిన్నప్పటినుంచీ పెట్టుకునే బొట్టూ, గాజులూ కూడా తీసేస్తారు. మనసులో బాధపడ్డం తప్ప పైకి అనలేని దుర్బలత్వం.

రెండు రోజులు ముందుగా కొన్ని స్వీట్స్, చలివిడి అన్నీ చేసింది. ప్రొద్దునే లేచి రకరకాల వంటలు ఒక్కర్తే చేసింది. మొహమాటానికి కూడా సహాయం చేస్తానని అపర్ణ తల్లి రాలేదు. వచ్చిన అతిథులంతా వంట బాగుందని మెచ్చుకుంటే తెగ మురిసిపోయింది మంజరి. తను అనుకున్నట్లుగా కోడలి గాజుల ఫంక్షన్ చేశానన్న తృప్తితో అలసట మర్చిపోయింది.

అందరూ వెళ్లాక అన్నీ క్లీన్ చెయ్యడం బాధ్యత మంజరిదే అయ్యింది. ఎవరికి వారు తినేసి మంచాలెక్కేశారు. అపర్ణ, భర్త పని ఉందంటూ వెళ్లిపోయారు. మిగిలిన సరుకులు అన్నీ సర్ది ఫ్రిజ్‌లో పెట్టవలసినవి పెట్టి, డైనింగ్ టేబుల్ మీద ఉన్న గాజు సామానంతా డిష్ వాషర్‌లో వేసింది. ఇల్లంతా వాక్యూమ్ క్లీనర్‌తో క్లీన్ చేసింది. అన్నీ సర్దేసరికి రాత్రి పది అయ్యింది. అలసిన శరీరం విశ్రాంతి కోరింది. ఆ రోజు అలసట రెండు రోజుల దాకా తీరలేదు.

పూర్తిగా ఇంటి బాధ్యత అంతా మంజరి తన భుజస్కంధాల మీద వేసుకుంది. ఇల్లు వాక్యూమ్ చేయడం, వంట, లాండ్రి అన్నీ ఆమే చేస్తోంది. లాండ్రి అపార్ట్‌మెంట్‌లో లేదు. కామన్ లాండ్రీకి బట్టలు తీసుకువెళ్లి కాయిన్ వేసి ఉతుక్కురావాలి. ఒకసారి ఉతకడానికి ఇంకోసారి డ్రైయర్‌లో వెయ్యడానికి వెళ్లాల్సి

వచ్చేది. ఇంట్లో ఉంటే అంత కష్టం ఉండేది కాదు. ఒక్కోసారి మిషన్ ఖాళీ లేకపోతే ఆ బట్టలు ఇంటికి తేవడం, మళ్లీ తీసుకెళ్లడం కష్టంగా ఉండేది.

తరువాత కొడుకు బట్టలు అక్కడ వదిలేయవచ్చని, ఇక్కడ ఇండియాలోలాగా ఎవరైనా ఎత్తుకుపోతారన్న భయం లేదని చెప్పాక అక్కడే వదిలేయడం మొదలుపెట్టింది. తనకు ఖాళీ ఉన్నప్పుడు బట్టలు మిషన్‌లో వేసి వచ్చేది. మంజరి లేనప్పుడు ఈ పనులన్నీ ఎవరు చేసేవారో మంజరి ఎప్పుడూ ప్రశ్నించలేదు. ఇప్పుడు ఆనందంగా చేస్తున్న పనులు తరువాత తనకు భారం కాబోతాయని ఆమెకు తెలియదు.

చిన్ననాటి నుంచీ శ్రమకు అలవాటుపడ్డ శరీరం. ఒళ్లు దాచుకోవడం తెలియదు. నా వాళ్లకే చేస్తున్నానన్న అనుభూతి ఆమెకు పనిపట్ల విసుగు కలుగజెయ్యనివ్వలేదు. పని చెయ్యకుండా ఖాళీగా కూర్చుని ఏం చేస్తానన్న భావన ఆమెకు పనిపట్ల ఆసక్తిని పెంచింది.

మంజరి రకరకాలు వండి పెడుతుంటే ఆనందంగా హాయిగా ఎంజాయ్ చేస్తున్నారు. అపర్ణ ఉద్యోగస్తురాలవ్వడంతో ఏదో వంట చేయడం, సెలవు రోజుల్లో బైట తినడం తప్ప ఇంత రుచిగా ఎప్పుడూ చేసిన పాపాన పోలేదు. ఇల్లు వదిలి పెట్టాక దినేష్ కూడా ఇంత రుచికరమైన వంటలు తినలేదు. వాళ్లకు నిత్య పండగలా ఉంది.

వైశాలికి వంట చేయడం బద్ధకం. అందుకని వీకెండ్స్‌లో ఒక గుజరాతీ ఆమె వచ్చి వారానికి సరిపడా రొట్టెలూ, కూర, పప్పు చేసి వెళ్లిపోతే ఫ్రిజ్‌లో పెట్టుకుని మైక్రోవేవ్‌లో ఎవరికి కావాల్సినవి వాళ్లు వెచ్చబెట్టుకుని తినడం, ఇంకా బద్ధకం వేస్తే బ్రెడ్, జ్యూస్‌లతో కడుపు నింపుకోవడం చేసేవారు.

వారాంతంలో కాన్‌లతో జ్యూస్‌లు, పాలు తెచ్చుకోవడం కొత్తలో చాలా విచిత్రంగా అనిపించింది మంజరికి. పాలు కాచకుండా మైక్రోవేవ్‌లో వెచ్చబెట్టుకుని తాగడం కూడా వింతగా అనిపించింది. అన్నీ రెడీమేడ్‌వి దొరుకుతాయి అంటే ఏమిటో అనుకుంది. ఈ విచిత్ర జీవితం, వాతావరణం అర్థమయ్యేసరికి కోడలికి పురిటి రోజులు దగ్గరకొచ్చేశాయి.

వైశాలికి డెలివరీ రోజులు దగ్గర పడుతున్నాయి. మంత్లీ చెకప్ నుంచి వీక్లీ చెకప్ దగ్గరకు వచ్చింది. ఒకరోజు మంజరితో దినేష్ చెప్పాడు.

"అమ్మా! నీకు తెలుసా? అమెరికాలో బేబీ పుట్టకముందు పేరెంట్స్ ఏం చెయ్యాలి? వాళ్లను ఎలా రిసీవ్ చేసుకోవాలి? డెలివరీలో బేబీ ఎలా బైటికి వస్తుంది. బేబీని ఎలా ఎత్తుకోవాలి? ఎలా ఫీడింగ్ ఇవ్వాలి? డైపర్ ఎలా మార్చాలి? అన్నీ క్లాసులు కండక్ట్ చేస్తారమ్మా. మన ఇండియాలో ఇలా ఉండదు కదా!" అన్నాడు.

నిజమే ఇండియాలో ఇలా ఉండదు. బేబీ వస్తున్నాడంటే అమ్మమ్మలు కాస్త తాపత్రయపడతారు, నాన్నమ్మకు ఏ పనీ లేదు. డైపర్‌లంటే ఏమిటో తెలియదు. బేబీ ఎలా బైటికి వస్తుందో బిడ్డను కనే తల్లికే తెలియదు. ఆధునికత సంతరించుకున్న తల్లులకు ఇప్పుడు సైన్స్ పరిజ్ఞానంతో ఏమైనా తెలుసేమో! అమ్మమ్మలు బొంతలు, లంగోటీలు కుట్టడమో, కుట్టించడమో, బాలింతరాలికి కాయం, సొంఠిపొడి తయారుచేయడం ఇవి తెలుసు.

దినేష్ తరువాత వాళ్లింట్లో చంటిపిల్లలెవరూ లేకపోవడంతో ఇప్పుడొచ్చిన మార్పులు మంజరికి తెలియవు. ఫ్రెండ్స్ మధ్య కూర్చున్నప్పుడు కూడా ఇలాంటి వాటి గురించి ఎప్పుడూ సంభాషణలు జరగలేదు.

ఇక పుట్టబోయే బిడ్డ తండ్రికి ఇవన్నీ తెలిసే అవకాశం లేదు. పురిటికి పుట్టింటికి వెళ్లిన పెళ్లాం మూడో నెలలో బిడ్డను ఎత్తుకు వచ్చాక బిడ్డను చేతిలో పెడితే ఒక ఐదు నిమిషాలు ఎత్తుకుని ఇచ్చే తండ్రులే ఎక్కువ. ఎక్కడో కానీ, వాళ్ల ఆటా పాటా చూసే తండ్రులు చాలా తక్కువ.

తన ఆలోచనలు పక్కకు పెట్టి "అయితే అవన్నీ మీరిద్దరూ నేర్చుకున్నారా? ఇక్కడ అందరికీ అమ్మమ్మలూ, నాన్నమ్మలూ వచ్చి పురుడు పొయ్యరు కదా! అందుకని మిమ్మల్ని దానికి తగ్గట్టుగా ఆయత్తం చేశారేమో! పోనీలే ఈ పద్ధతి కూడా బాగానే ఉంది" అంది మంజరి.

ఇది జరిగిన వారానికి నొప్పులు వస్తుంటే హాస్పిటల్‌కు తీసుకువెళ్లారు. నార్మల్ డెలివరీ కోసం వెయిట్ చేశారు. సడన్‌గా బిడ్డ బ్రీచ్ పొజిషన్‌లోకి తిరిగాడని, సిజేరియన్ చేయాల్సి వచ్చింది. మనవడ్ని హాస్పిటల్ వాళ్లు చేతిలో పెడతారని ఎదురుచూసిన మంజరికి నిరాశ ఎదురయ్యింది. కొడుకు తీసుకెళ్లి నర్సరీలో అందరి పిల్లల మధ్య ఉన్న ఒక ఉయ్యాలలో ఉన్న పిల్లవాడ్ని గాజు తలుపుల వెనక నుంచి చూపించి, "అదుగో అమ్మా నీ మనవడు" అన్నాడు.

"అదేమిట్రా అన్ని గొట్టాలు పెట్టారు? పిల్లాడికేం ఒంట్లో బాగుండలేదా?" అంది మంజరి.

ముక్కులోనూ, నోట్లోనూ ట్యూబ్‌లతో వరుసగా ఉయ్యాలలో పడుకున్న పిల్లలందర్నీ చూసి ఒక్కసారి భయంలాంటిది కలిగింది.

"అదేం లేదమ్మా! భయం లేదు. తల్లి పొట్టలో ఉండగా వాడిలోకి వెళ్లిన ఫ్లూయిడ్స్ అన్నీ తియ్యడానికి అలా పెడతారు. మన ఇండియా కన్నా ఇక్కడ పిల్లలను చాలా శ్రద్ధగా చూసుకుంటారమ్మా!" అన్నాడు.

కొడుకు మాటలన్నీ సగం అర్థం అయి సగం అర్థం కాక ఉన్నాయి. ఇక్కడి పద్ధతులు అర్థం చేసుకోవాలంటే తన జీవితకాలం సరిపోదేమో! కొడుకేమో అన్నీ మనదేశం కన్నా ఈ దేశం గొప్పదని పొగడడంతో సరిపోతోంది.

ఏం ఇండియాలో మాత్రం అందరూ పిల్లల్ని కనటం లేదూ! అక్కడ ఇంత అపురూపం లేకపోయినా పిల్లలు బతుకుతూనే ఉన్నారు. జనాభా కూడా వద్దన్నా పెరుగుతోంది అనుకుంది మంజరి.

కోడల్ని రూమ్‌లోకి షిఫ్ట్ చేశారంటే చూడ్డానికి వెళ్లింది. "మమ్మీ బాబును చూశారా?" అంది కోడలు.

"ఆ చూశానమ్మా! బాగున్నాడు. దగ్గరగా చూడలేదనుకో. దూరం నించి చూశాను'' అంటూ వైశాలివైపు చూసి ఆశ్చర్యంగా అడిగింది ''ఏం తింటున్నావమ్మా?" అని.

"ఆకలి వేస్తోంది. ఐస్ ముక్కలు తింటున్నాను" అంది. ఆ మాటకు నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు.

"ఆకలి వేస్తే ఐస్ ముక్కలు తినడం ఏమిటమ్మా! అసలే పచ్చి బాలింతరాలివి. నజ్జు చేస్తుంది. అదీకాక పళ్లు కూడా పాడయిపోతాయి. తినకు. ఒంట్లోని రక్తం అంతా పోయి అసలే బలహీనంగా ఉంటావు. చాలా జాగ్రత్తగా ఉండాలమ్మా! పెద్దదాన్ని చెప్తున్నాను. విను" అంది.

ఇక్కడి డాక్టర్ల కన్నా మీకెక్కువ తెలుసా అనబోయి ఏమనుకుందో మాట్లాడకుండా ఐస్ తినడం మానేసింది.

మంజరికి హాస్పిటల్ చాలా నచ్చింది. అద్దంలా నీట్‌గా ఉంది.

పేషెంట్‌తో ఉన్నవాళ్లు తాగడానికి కాఫీలు, జ్యూస్‌లు ఉన్నాయి. దేనికీ డబ్బు కట్టక్కర్లేదు. అదే మన ఇండియాలో అయితే ఫ్రీగా వస్తున్నాయని మొత్తం హాస్పిటల్‌లో ఉన్నదంతా తాగేసి మరీ వదిలిపెడతారేమో! ఫ్రీగా వస్తే ఫినాయిల్ కూడా తాగే రకాలు ఉన్నారు. ఏమిటి తను కూడా దినేష్‌లా ఆలోచిస్తోంది.

అన్నీ బాగున్నా మంజరికి ఏదో వెలితిగా ఉంది. కోడలు ఇంటికి వచ్చేదాకా మాట్లాడలేదు. అన్నిటికన్నా మంజరికి ఆశ్చర్యం వేసిన విషయం తల్లికి డెలివరీ అయిన వెంటనే స్నానం చెయ్యమంటారు. బిడ్డకు మాత్రం బొడ్డు ఊడేదాకా స్నానం చేయించకూడదు. మనదేశంలో దానికి విరుద్ధంగా చేస్తారు. బిడ్డకు వెంటనే స్నానం చేయిస్తారు. తల్లికి పదకొండో రోజు. ఏమిటో ఈ అమెరికా! అన్నీ విచిత్రమే అనుకుంది మంజరి.

అక్కడి పద్ధతి ప్రకారం హాస్పిటల్‌లో ఉండగానే బేబీకి పేరు పెట్టాలి. వైశాలి, దినేష్ ఒక నిర్ణయానికి రావడానికి కొంచెం టైమ్ పట్టడంతో అక్కడి స్టాఫ్ వేళాకోళంగా 'నేమ్‌లెస్ బేబీ' అనడం మొదలుపెట్టారు. బేబీ మారిపోకుండా ఉండడానికి వీలుగా తల్లికి, తండ్రికి, బేబీకి టాగ్‌లు కడతారు. టాగ్ లేకపోతే నర్సరీలోంచి బేబీని తీసుకోనివ్వరు.

మంజరికి ఈ పద్ధతి చాలా నచ్చింది. ఇలా మనదేశంలో కూడా జరిగితే బాగుండును. అప్పుడప్పుడు మగపిల్లల కోసం హాస్పిటల్‌లో జరిగే బిడ్డ మార్పిడిని అరికట్టవచ్చు అని. ఏమిటి? తను కూడా అమెరికా వ్యామోహంలో పడిపోతుందా? అనుకుంది.

బాబుకు ధీరజ్ అని పేరు పెట్టారు. వైశాలి నాలుగో రోజు ఇంటికి వచ్చింది. ఇంటికొచ్చాక మంజరికి ఒక్క నిముషం తీరిక లేదు. కోడలికి అన్ని అవసరాలు చూడడం, బాబును చూడడం, ఇంటిపని, అంతా చాలా శ్రమతో కూడుకున్న పని.

కోడలు ఆపరేషన్ అయ్యిందని చెప్పి మంచం దిగడం మానేసింది. వాళ్లింట్లో అందరికీ నార్మల్ డెలివరీ కాబట్టి సి సెక్షన్ అయినవాళ్లు ఏ జాగ్రత్తలు తీసుకోవాలో ఆమెకు తెలియదు. అందుకే కోడలు అలిసిపోతుందని భోజనం కూడా మంచం దగ్గరే ఇవ్వడం చేసేది.

కోడలు కడుపుతో ఉందని తెలిస్తే అక్కడినించి కాయం అవీ చేసి

పట్టుకొచ్చేది. నడుముకు గట్టితనం వస్తుంది అనుకుంది. కాలం మారిపోయిందని ఇప్పుడు అవి ఎవరూ తినటం లేదన్న విషయం మంజరికి తెలియదు.

ఇదికాక ధీరజ్ రాత్రుళ్లు నిద్రపోకుండా ఏడవడం, పిల్లవాడి ఏడుపు పక్క అపార్ట్‌మెంట్‌వాళ్లకు వినపడకూడదుట. పిల్లవాడన్నాక ఏడవకుండా ఎలా ఉంటాడు? అదే ప్రశ్న కొడుకును అడిగింది మంజరి. నోట్లో పాసిఫైర్ వేస్తారట అక్కడివాళ్లు. అదేమిటన్న ప్రశ్నకు, పిల్లవాడి నోరు ముయ్యడానికి వాడి నోట్లో ఒక తిత్తి పారేస్తారు. ఆ తిత్తి చప్పరించుకుంటూ ఉండడంతో వాడి ఏడుపు బైటికి రాదు.

ఈ సంగతి విన్న మంజరికి నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు.

ఒక రోజు పొట్టలో గాస్‌తో పిల్లవాడు ఏడుపు ఆపటం లేదు. వాళ్లిద్దరికీ ఏం చెయ్యాలో తోచక మంజరి దగ్గరకు తీసుకువచ్చాడు దినేష్.

"అమ్మా! వీడెందుకో ఏడుస్తున్నాడు. మాకిద్దరికీ అర్థం కావటం లేదు" అన్నాడు.

మంజరి పిల్లవాడ్ని తీసుకుని అన్నీ నొక్కి చూసింది. పొట్ట నొక్కగానే ఏడుపు ఎక్కువ అవడంతో "పొట్ట నొప్పిరా" అంటూ వాడ్ని కాళ్లమీద బోర్లా పడుకోబెట్టింది.

"అమ్మా అలా పడుకోబెట్టకు. వాడికి ఊపిరాడదు" అంటూ గట్టిగా అరిచాడు. బెదిరిపోయి వాణ్ని మామూలుగా తీసి ఎత్తుకుంది. బోర్లా పడుకున్నప్పుడు ఊరుకున్నవాడు మళ్లీ ఏడుపు మొదలుపెట్టాడు.

"ఏం కాదు నాన్నా! కొద్దిసేపట్లో వాడికి నొప్పి తగ్గి నిద్రపోతాడు" అని మళ్లీ వాడ్ని బోర్లా పడుకోబెట్టి జోకొట్టింది. వాడు కాసేపటికి హాయిగా నిద్రపోయాడు. తల్లిని రెండోసారి వద్దనలేక ఊరుకున్నాడు.

దినేష్‌కు తల్లి చెప్పేదాంట్లో నమ్మకం లేక మర్నాడు డాక్టర్‌కు ఫోన్ చేసి విషయం చెప్పాడు. డాక్టర్ మంజరి చేసినది కరెక్ట్ అని చెప్పి, "షి ఈజ్ ఎక్స్‌పీరియన్స్‌డ్" అన్నాడు. అప్పటికి దినేష్‌కు తల్లి మీద నమ్మకం కలిగింది.

* * *

పదిహేను రోజులు గడిచాక కోడలు నిద్రపోతోంది. కొడుకు ఆఫీస్‌కు వెళ్లాడు. లాండ్రీ చాలా ఉందని లిక్విడ్ సోప్ ఒక గ్లాసులో పోసి బట్టల మధ్య పెట్టి బట్టలున్న బుట్ట తీసుకుని తలుపు దగ్గరగా వేసి బయలుదేరింది. లిండా

బైట కుర్చీలో కూర్చుని ఎవరితోనో మాట్లాడుతోంది. అమెరికన్‌లా ఉంది. పక్కన ప్రామ్‌లో ముద్దులు మూటగట్టే పసిపాప గులాబీ రంగులో ఉంది.

దగ్గరకు రమ్మన్నట్లుగా సైగ చేసింది. బట్టలు గుమ్మంలో వదిలి, అక్కడకు వెళ్లింది. తన పక్కనున్న మనిషిని చూపిస్తూ –

"మీట్ స్టెల్లా. నాలుగు రోజుల క్రితం బేబి పుట్టింది. గర్ల్ బేబీ" అంటూ పరిచయం చేసింది.

నార్మల్ డెలివరీ అయి ఉంటుంది అనుకుని, తన సందేహాన్ని తీర్చుకుందుకు 'నార్మల్ డెలివరీ' అని అడిగింది.

స్టెల్లా చెప్పిన జవాబు విని ఆశ్చర్యం వేసింది. స్టెల్లాకు సుమారు నలభై సంవత్సరాలు ఉన్నాయి. ఆమెకు చాలా రోజుల దాకా పిల్లలు లేరు. పెళ్లి కూడా లేట్‌గా చేసుకుంది. ఆమెకు కూడా సి సెక్షన్ అయ్యింది. మరి రెస్ట్ తీసుకోవా అన్నదానికి నవ్వింది. హాస్పిటల్ నుంచి తానే డ్రైవ్ చేసుకుని వచ్చానని, ఇంట్లో అన్ని పనులూ తానూ తన భర్త కలిపి చేసుకుంటామని.

మరి పెద్దవాళ్లెవరూ హెల్ప్‌కి రాలేదా అన్న ప్రశ్నకు కూడా చిరునవ్వుతో అలాంటిదేమీ ఇక్కడ ఉండదని చెప్పింది.

వైశాలి మాత్రం రెస్ట్ కావాలని చెప్పి ఎప్పుడూ మంచం దిగటం లేదు. సి సెక్షన్ అయితే అలాగే ఉంటారనుకుంది మంజరి. అలా అవసరం లేదని ఇప్పుడు తెలిసింది. మరి వైశాలి ఎందుకు అలా చేస్తోందో ఇప్పుడు అర్థం అయ్యింది. అత్తగారి మంచితనాన్ని తెలివిగా వాడుకుంటోంది.

వంటింట్లో వంట చేస్తున్న మంజరి, బెడ్రూమ్‌లో ఏదో హడావుడి జరుగుతున్నట్లుగా అనిపించి, స్టవ్ తగ్గించి బెడ్‌రూమ్‌లోకి వచ్చింది. ధీరజ్ మంచం మీద ఉన్నాడు. కొడుకు పక్కన నుంచుని ఉన్నాడు. వైశాలి ఫోన్‌లో డాక్టర్‌తో మాట్లాడుతోంది.

మంజరికి ఏం జరిగిందో అర్థం కాలేదు. సరే వాళ్లే చెప్తారని ఊరుకుంది.

వైశాలి ఫోన్ అవగానే ఆత్రుతగా "డాక్టర్ ఏం చెప్పింది" అని అడిగాడు దినేష్.

"డ్రగ్ కంట్రోల్ వాళ్లకు ఫోన్ చేసి కనుక్కోమని చెప్పింది" అంటూ ఏడుపు మొహం పెట్టింది వైశాలి.

అప్పుడు ఇంక ఆగలేక మంజరి కొడుకును ఏమయ్యిందని అడిగింది.

"వాడికి డైపర్ మారుస్తుంటే యూరిన్ నోట్లోకి వెళ్లిపోయింది. అది పాయిజన్ అవుతుందేమో అని భయపడుతోంది" అన్నాడు.

మంజరికి ఆ మాటలకు విరగబడి నవ్వాలనిపించింది. తాను నవ్వితే బాగుండదని కంట్రోల్ చేసుకుని, "మగపిల్లలకు డైపర్ మార్చేటప్పుడు కొంచెం జాగ్రత్త అవసరం. ఇందులో భయపడాల్సింది ఏమీ లేదు. నోట్లోకి యూరిన్ వెళ్లినంత మాత్రాన పాయిజన్ అయిపోదు. మొరార్జీ దేశాయ్‌గారు తన యూరిన్ తాగారుట. ఆయన చాలా రోజులు బతకలేదూ? ఏం భయపడకండి నేను వాడ్ని క్లీన్ చేస్తాను. ఈసారి డైపర్ ఎలా మార్చాలో నేను చూపిస్తాను" అంది.

"నీకు డైపర్ మార్చడం వచ్చా!"

"మీరు మారుస్తుంటే చూశాను ఇదేమైనా బ్రహ్మవిద్యా" అంది.

మనసులో అనుకుంది వీళ్లేదో క్లాసులకి వెళ్లి ఆ క్లాస్‌లో మొత్తం పిల్లల పెంపకం నేర్చేసుకున్నామని అనుకుంటున్నారు. ఆ క్లాస్‌లో వాళ్లేం నేర్పారు? వీళ్లేం నేర్చుకున్నారు. పుస్తకాలు చదివినంత మాత్రాన అన్నీ తెలిసిపోతాయా? ఏదైనా ప్రాక్టీస్ చేస్తేనే కానీ రాదు. అనుభవం ద్వారా నేర్చుకున్నది ఏ పుస్తకాలూ పాఠాలు నేర్పలేవని వీళ్లకు ఎవరు చెప్తారు?

ఆ ప్రహసనం తరువాత మంజరికి అదనపు భారం పెరిగింది. తనకు తెలియకుండానే తన ఉచ్చు తను బిగించుకోవడం మొదలుపెట్టింది. ముందు ముందు దీని ప్రభావం ఆమె జీవితంలో ఏ మార్పు తేబోతోందో ఆమె గ్రహించే స్థితిలో లేదు. మనవడు ఇప్పుడు ఆమె వీక్‌నెస్.

పిల్లల్ని పెంచడంలో అనుభవంతో కొన్ని తెలిసినా అన్నీ తెలుస్తాయన్న గ్యారంటీ లేదు. కొన్ని మనం తెలియకుండా చేసి వాటితో బిడ్డ ప్రాణాలకు ముప్పుతెస్తాయి.

ఒకరోజు ఏడుస్తున్న మనవడ్ని ఊరుకోబెట్టడానికి వాడ్ని ఒళ్లో వేసుకుని కాళ్తో వాడి తల ఊపడం మొదలుపెట్టింది. ఇది చాలా మంది చేసే పనే. అది చూసిన వైశాలి "మమ్మీ" అంటూ గట్టిగా అరిచింది.

"అలా తల ఊపకూడదు. డేంజర్" అంది.

మంజరికి మనసు చివుక్కుమంది. "మేం అందరం పిల్లల్ని ఊరుకోబెట్టడానికి ఇలాగే చేస్తామమ్మా" అంది.

"అలా చెయ్యకూడదు. అలా చేస్తే పిల్లలకు 'షేకెన్ బేబీ సిండ్రోమ్' అన్న జబ్బు వస్తుంది. పసిపిల్లల నరాలు చాలా సున్నితంగా ఉంటాయి. తల పెద్దదిగా ఉండడంతో తల ఊపినప్పుడు మెడలో నరాలు దెబ్బతినే ప్రమాదం ఉంది. ఒక్కోసారి నరాలు దెబ్బతిని బ్లీడింగ్ అవుతుంది. మనకి పైకి కనిపించదు కదా! ఎక్కువ బ్లీడింగ్ అవుతే బేబీ కోమాలోకి వెళ్లిపోవడం, ఒక్కోసారి చచ్చిపోవడం కూడా సంభవిస్తుంది. బ్రెయిన్ డామేజ్ అయితే ఒక్కోసారి గుడ్డితనం కూడా రావడం జరుగుతుంది. అందుకే ఎప్పుడూ తల ఊపకూడదు.

అలా మనం ఊపి బిడ్డకు ఏమైనా ప్రమాదం జరిగితే ఇక్కడి ప్రభుత్వం మనం సరిగ్గా పెంచటం లేదని పిల్లల్ని వాళ్లు తీసేసుకుంటారు. పిల్లల్ని మనం ఒక్క క్షణం కూడా వదిలి ఉండకూడదు" అంటూ అమెరికాలో పిల్లల పట్ల ఎలా వ్యవహరించాలో అన్నీ వివరంగా చెప్పింది వైశాలి.

నిజంగానే ఈ దేశంలో పిల్లల గురించి ప్రభుత్వం చాలా శ్రద్ధ తీసుకుంటోంది. పిల్లల బొమ్మలు, పిల్లల ఆహారంలోనూ ఎన్నో కొత్త పద్ధతులు కనిపెడుతున్నారు. బాల్యం అంటే ఇలా ఉండాలి అన్నట్లు పెంచుతారన్న మాట. ఇక్కడ మనదేశంలోలాగా ఏదో ఇంత వేళకు పాలు పట్టి, ఒక బొంత గుడ్డ వేసి పడుకోబెట్టడం కాదు. వాళ్ల కోసం బేబీ కాట్, అందమైన దుప్పట్లు, కార్లో వాళ్ల సేఫ్టీతో సెపరేట్ సీట్. ఇవన్నీ విచిత్రంగా చూస్తోంది మంజరి. ఎప్పుడూ తల్లి ఒడిలోనే ఉండాలని ఏమీ లేదు. కార్ సీట్లో పడుకోబెట్టి హాయిగా తల్లి విడిగా కూర్చోవచ్చు.

మంజరికి ఆరు నెలల వీసా మాత్రం దొరికింది. ఇంకొక నెలలో ఆమె వీసా టైమ్ పూర్తి అవుతుంది. కొడుకు, కోడలు పూర్తిగా మంజరి మీద ఆధారపడిపోయారు. ఇంకొక నెలలో ఆమె ఇండియా వెళ్లిపోవాలి. ఏం చెయ్యాలో తెలియటంలేదు. ఆలోచనలో పడ్డారు.

అమెరికా వచ్చి ఐదు నెలలు అయ్యింది. ఆనందంగా ఉన్న మంజరికి కాలం పరుగెట్టినట్లుగా ఉంది. ఈ ఐదు నెలలు కాలంలో తమ్ముడు మురళి ఇక్కడే ఉన్నాడన్న సంగతి కూడా మర్చిపోయింది. వాడితో మాట్లాడి ఎన్నాళ్లయ్యింది! ఇక్కడికి వచ్చినట్లు వాడికి చెప్పలేదని బాధపడింది. పర్స్‌లోంచి

డైరీ తీసి మురళికి ఫోన్ చేసింది. ఫోన్ తీసిన మురళి అక్కగారి టోన్ విని ఆశ్చర్యంగా ఎప్పుడొచ్చావని అడిగాడు.

వివరంగా తను రావడం, కోడలు ప్రెగ్నెన్సీ, డెలివరీ అన్నీ చెప్పింది.

"నీ కొడుక్కి నీ గురించి ఎంత శ్రద్ధ ఉందో నాకు తెలియదు. నువ్వు చెప్పావని అమెరికా వచ్చిన కొత్తలో తరచూ ఫోన్ చేస్తూ ఉండేవాడు. ఆ తరువాత వాడు ఎక్కడ ఉన్నాడో తెలియదు. వాడికి పెళ్లి ఎప్పుడు అయ్యింది? నాకేమీ చెప్పలేదే. పోనీ వాడు కాపోతే నువ్వైనా చెప్పవచ్చు కదా! నువ్వు పిలిస్తే నేను రానా?" అని నిష్ఠూరంగా పలికాడు.

ఏమని చెబుతుంది? నీ మేనల్లుడు కూడా నువ్వు నడిచిన దారిలోనే నడిచాడని చెప్తుందా! నువ్వు మాత్రం అమ్మా, నాన్నా లేకుండా పెళ్లి చేసుకోలేదూ? అనుకుంది. నోరు జారడం ఎంత సేపు!

అక్కగారు ఏం మాట్లాడకపోవడం చూసి, మళ్లీ తనే "ఇంతకీ నా దగ్గరికి ఎప్పుడు వస్తావు? నువ్వు ఎప్పుడు వస్తావో తెలిస్తే నీకు టికెట్ పంపుతాను" అన్నాడు.

"దినేష్‌తో మాట్లాడి చెపుతాను. నా ప్రయాణం కూడా దగ్గరికి వచ్చింది" అంది.

"సరే, రెండు రోజులాగి నేనే ఫోన్ చేస్తాను. అప్పుడు చెప్తే టికెట్ పంపుతాను" అన్నాడు.

సాయంకాలం దినేష్ ఆఫీస్‌నుంచి వచ్చాక ఈ విషయాలన్నీ చెప్పాలనుకుంది. కోడలు కూడా లీవ్ పూర్తి అయ్యి ఆఫీసుకు వెళ్లడం మొదలు పెట్టింది. తను వెళ్లిపోయాక ఎలాగా అన్నదానికి మొగుడూ పెళ్లాలు తర్జనభర్జనలు పడుతున్నారు. బాబునేం చేస్తారో? లిండా చెప్పింది డేకేర్‌లు ఉంటాయిట. ఉద్యోగాలు చేసేవాళ్లు ప్రొద్దున్న పిల్లల్నక్కడ దింపి సాయంకాలం ఆఫీసునుంచి వచ్చేటప్పుడు తెచ్చుకుంటారట. వీళ్లు కూడా అలాగే చేస్తారేమో! బుజ్జికన్న బాగా అలవాటయ్యాడు. నాన్నమ్మ లేకుండా ఎలా ఉంటాడో? అనుకుంది మంజరి.

ఆ సాయంకాలం కొడుకు ఆఫీసునుంచి వచ్చాక కాఫీ ఇచ్చి, "నేను వెళ్లేలోపు మావయ్య దగ్గరకు ఒకసారి వెళ్లివస్తానురా" అంది.

తల్లి చెప్పేదాకా మావయ్య గుర్తు రానందుకు బాధపడ్డాడు. అమెరికా వచ్చిన కొత్తలో మావయ్యకు ఫోన్ చేస్తూ ఉండేవాడు. చాలాసార్లు మావయ్య వాళ్ల ఊరు రమ్మన్నా ఏవో కారణాలు చెప్పి వెళ్లలేదు. తాను నిలదొక్కుకునే తాపత్రయంలో మావయ్య గురించి ఎక్కువ ఆలోచించలేదు.

“మావయ్యకు నువ్వు ఫోన్ చేశావా?” అన్నాడు.

“అవును వచ్చినప్పట్నుంచీ ఫోన్ చేద్దామనుకుంటూనే బద్ధకించాను. ఇంక వెళ్లే రోజులు దగ్గరకు వస్తున్నాయి కదా! వెళ్లే లోపల మావయ్యను ఒకసారి చూస్తే బాగుంటుంది” అంది.

దినేష్ వైశాలికి ఈ విషయం చెప్పాడు.

“నేను మీ ఇద్దరి మాటలు వింటున్నాను. నువ్వెప్పుడూ మీ మావయ్య ఇక్కడ ఉన్నట్లు చెప్పలేదు. ఏం మీ మావయ్య అంటే నీకిష్టం లేదా?” అంది.

“అదేం కాదు. మా మావయ్య చాలా ఏళ్లయ్యింది ఇక్కడకు వచ్చి... నేను పుట్టక మునుపు నుంచి ఇక్కడే ఉన్నాడు. నాలాగే చదువు కోసం వచ్చి, ఇక్కడే పెళ్లిచేసుకుని సెటిల్ అయ్యాడు.”

“దట్ మీన్స్ హి ఈజ్ సిటిజన్. అంటే మీ మావయ్య యు.ఎస్. సిటిజన్. నాకింతవరకూ నువ్వు ఈ విషయం చెప్పలేదు. మీ మదర్‌కి ఏ ప్రాబ్లమ్ లేదు. మీ మావయ్య ద్వారా మీ అమ్మగారికి గ్రీన్ కార్డ్ వస్తుంది. ఇప్పుడు ఆవిడకు గ్రీన్ కార్డు అప్లై చేస్తే ఆవిడ అది వచ్చేదాకా ఇక్కడ ఉండవచ్చు. మన ప్రాబ్లమ్ సాల్వ్ అయినట్లే” అంది వైశాలి.

దినేష్‌కు ఇంకా అంతగా ఈ వివరాలు తెలియవు. వాళ్ల ఫ్రెండ్స్ ద్వారా కొన్ని విషయాలు తెలుసుకున్నాడు. ఒక ఫ్రెండ్ గ్రీన్ కార్డ్ కోసమే పెళ్లి చేసుకుని ఆ తరువాత విడాకులు తీసుకుందుకు ఒప్పందం కుదుర్చుకున్నారు. ఎందుకో దినేష్‌కు అది అంతగా నచ్చలేదు. వైశాలిని పెళ్లిచేసుకోవడంలో గ్రీన్ కార్డ్ పాత్ర కొంతవరకే.

“ఏంటి? నేనేదో అడుగుతుంటే నువ్వేదో ఆలోచిస్తున్నావు?”

“అమ్మకు మావయ్య ద్వారా గ్రీన్ కార్డు అప్లై చెయ్యవచ్చన్న సంగతి నాకు తెలియదు” అన్నాడు.

“నీకు కూడా మీ మావయ్య ద్వారా గ్రీన్ కార్డు వచ్చి ఉండేది. వీసాల్లో

హెచ్.వన్, ఎల్.వన్ వీసాలు ఉన్నట్లే, గ్రీన్‌కార్డులో రకాలు ఉన్నాయి. అందులో నీది ఎఫ్ టూ కేటగిరీ. మీ అమ్మగారిది ఎఫ్ ఫోర్. ఇక్కడ సిటిజన్‌గా ఉన్న మనిషి తన అన్నదమ్ముల్ని కానీ, అక్కచెల్లెళ్లను కానీ స్పాన్సర్ చేస్తే వాళ్లకు గ్రీన్ కార్డ్ వస్తుంది. మీ మావయ్యను రిక్వెస్ట్ చేసి మీ అమ్మగారు మన దగ్గర ఉండడానికి వీలుగా ఉంటుందని చెప్పి ఆయన ద్వారా గ్రీన్ కార్డ్‌కు అప్లై చేస్తే మన ప్రాబ్లమ్ సాల్వ్ అవుతుంది. అప్పుడు మీ అమ్మగారు ఇక్కడే ఉండిపోవచ్చు" అంది వైశాలి.

ఈ ఐడియా బాగా నచ్చింది దినేష్‌కు. తల్లిని దగ్గర కూర్చోబెట్టుకుని మంజరిని వాళ్ల తమ్ముడి దగ్గరకు పంపుతానని, ఆవిడ అతన్ని రిక్వెస్ట్ చేసి అతని ద్వారా గ్రీన్ కార్డ్ కోసం అప్లై చెయ్యమని చెప్పాడు. మంజరికి గ్రీన్ కార్డ్ ఏమిటో అది ఎందుకో అర్థం కాలేదు. అదే అడిగింది కొడుకును.

"నేను ఇంకా సిటిజన్ అయ్యేదాకా నీకు గ్రీన్ కార్డ్ అప్లై చెయ్యలేనమ్మా. మేం ఇక్కడ, నువ్వక్కడ ఎందుకు? నువ్వు కూడా మా దగ్గరే ఉంటే నాకు కూడా ఆనందంగా ఉంటుంది. నాన్నగారు ఎలాగూ లేరు. ఇండియాలో నువ్వు ఒక్కర్తివీ ఉంటే నాకు మనశ్శాంతిగా ఉండదు" అన్నాడు.

మంజరి కొడుక్కి తన మీద ఉన్న ప్రేమకు మురిసిపోయింది. నా కొడుకెంత మంచివాడు అనుకుంది. మురళికి ఫోన్ చేసి చెప్పింది తను వస్తున్నట్లు. టికెట్ కొడుకు కొంటాడని, తనని రిసీవ్ చేసుకుందుకు ఏర్‌పోర్ట్‌కు రమ్మంది.

మురళికి ఆ మాట విని చాలా ఆనందం కలిగింది. అమెరికా వచ్చి తన వాళ్లకు దూరమయ్యాడు. లేమిలో పుట్టినందుకు లేమిని పారదోలడానికి నిరంతరం శ్రమించాడు. ఆ శ్రమలో తానేం కోల్పోతున్నాడో గ్రహించేసరికి చాలా ఆలస్యమయింది.

తల్లిదండ్రులు ఉండగా అప్పుడప్పుడు ఇండియా వచ్చాడు. తన డబ్బుతో వాళ్ల అవసరాలు తీరుస్తున్నాననుకున్నాడు. తల్లితండ్రుల్ని అమెరికా రమ్మని ఎన్నిసార్లు చెప్పినా సున్నితంగా తిరస్కరించారు. వాళ్ల మరణానంతరం ఇండియా వెళ్లడం తగ్గించేశాడు.

తోబుట్టువుల జ్ఞాపకాలు కూడా మరుగున పడిపోయాయి. ఇక్కడికొచ్చి బాగానే సంపాదించాడు. కానీ తన వాళ్లెవరూ తన గడప తొక్కలేదు. అక్కలను ఎప్పుడూ ఆహ్వానించలేదు.

ఇన్నాళ్లకు తన వైభవం చూడడానికి అక్కగారు వస్తోంది. తండ్రిని ఒప్పించి

ఇంజనీరింగ్ చదివేలా చేసిన అక్కగారంటే మురళికి అభిమానం ఎక్కువే. ఈనాటి తన వైభవానికి కారణం చిన్నక్క అనుకున్నాడు మురళి.

టిక్కెట్టు కొని తల్లి చేతికిస్తూ వారం పదిరోజులు ఉండి గ్రీన్ కార్డ్ గురించి కూడా మాట్లాడమని చెప్పాడు.

మురళి చికాగోలో ఉన్నాడు. తమ్ముడి దగ్గరికి వెళ్లడానికి విమానం ఎక్కింది. మొదటిసారి ఉన్నంత భయం లేదిప్పుడు. మావయ్యకు ఫోన్ చేశానని భయం లేదని కొడుకు చెప్పాడు.

ఓహేర్ ఇంటర్నేషనల్‌లో ఫ్లైట్ ఆగింది. తన చిన్న సూట్‌కేస్ తీసుకుని బైటికి వచ్చింది మంజరి. ఆత్రుతగా ఎదురుచూస్తున్న కళ్లకు తమ్ముడి రూపం కనబడగానే ఆనందంతో కళ్లనీళ్లు తిరిగాయి. ఎన్నాళ్లయింది వాడ్ని చూసి! ఎంత పెద్దవాడైపోయాడు?

అక్కను చూసిన మురళికి చాలా ఆశ్చర్యం వేసింది. అక్కకు, తనకు రెండేళ్లు తేడా. అక్క ఇంకా చిన్నపిల్లలా ఎంత బాగుంది! అక్క ముందు తనే పెద్దవాడిలా ఉన్నాననుకున్నాడు. అక్కగారి చేతిలో పెట్టి తను తీసుకుని కార్ పార్కింగ్ దగ్గరికి నడిచాడు.

మురళి సూట్‌కేస్ కారు డిక్కీలో పెడుతుంటే కార్ డోర్ తీసుకుని ముందు సీట్‌లో కూర్చుని బెల్ట్ పెట్టుకుంటున్న అక్కగార్ని ఆశ్చర్యంగా చూసి, అక్క అమెరికాకి బాగానే అలవాటు పడింది అనుకున్నాడు.

ఇంటి ముందు కారు ఆపి సూట్‌కేస్ బైటపెట్టాడు. కారు శబ్దం విని చిత్ర బయటకు వచ్చింది. నవ్వుతూ ఆడపడుచును పలకరించింది "బాగున్నారా?" అంటూ.

చిత్ర మంజరి కన్నా ఆరేళ్లు చిన్నది. ఇండియా వచ్చినప్పుడు చూడడం మూలంగా ఇద్దరికీ పరిచయం ఉంది. మురళి ఉంటున్నది సొంత ఇల్లు. చాలా విశాలంగా ఉంది. పెద్ద ఇల్లు. చుట్టూ ఎన్నో ఎకరాల స్థలం అంతా తనదే అని చెప్పాడు. చుట్టూ అందమైన గార్డెన్, అందమైన పూబాలలు రారమ్మని పిలుస్తున్నాయి. మంజరికి తెలియని పూలు చాలా ఉన్నాయి. మా గురించి తెలుసుకోవా అన్నట్లుగా ఒక భావన కలిగింది. "అక్కా! నీకు పూలమొక్కలంటే చాలా ఇష్టం కదా! నిన్నే పోలింది నా కూతురు. దానికి కూడా చాలా ఇష్టం. సమయం దొరికనప్పుడల్లా గార్డెన్‌లో గడుపుతుంది" అన్నాడు మురళి.

ఆ పువ్వుల అందాలన్నీ ఆస్వాదించాలని మనసు కోరుతుంటే తమ్ముడి మాటలు వింటూ లోపలికి అడుగుపెట్టింది మంజరి.

"వదినగారూ మీ పెట్టె గెస్ట్‌రూమ్‌లో పెట్టాను. ఇలా సోఫాలో కూర్చోండి. కాఫీ చేసి తీసుకువస్తాను" అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది చిత్ర.

డొమెస్టిక్ ఫ్లైట్‌లో ఏమీ ఇవ్వరు. మంజరికి కొంచెం ఆకలిగా కూడా అనిపించింది. ఆమె సంగతి తెలిసినట్లు, కాఫీతోబాటు సమోసాలు తెచ్చింది చిత్ర. వేడిగా ఉన్న సమోసాల్ని చూసి "ఇంత తొందరగా ఎలా చేశావమ్మా" అంది.

"నేను చెయ్యలేదు. ఇవి రెడీమేడ్‌వి. మనం కావాలన్నప్పుడు నూనెలో వేయించుకోవచ్చు. లేకపోతే ఓవెన్‌లో బేక్ చేసుకోవచ్చు" అంది.

అవును ఇక్కడ ఎవరికీ టైమ్ లేదు. అన్నీ రెడీమేడ్‌గా దొరుకుతాయి అనుకుంది మంజరి.

కాఫీ తాగాక ఇల్లంతా చూపించాడు మురళి. కింద కిచెన్, దాని పక్కనే లాండ్రీ రూమ్. కాజువల్ డైనింగ్ రూమ్, ఫార్మల్ డైనింగ్ రూమ్, ఇంకో బెడ్ రూమ్ కింద ఉన్నాయి. పైన మేడ మీద నాలుగు బెడ్‌రూమ్స్, టాయిలెట్స్, డ్రెస్సింగ్ రూమ్ అన్నీ చూపించాడు. మంజరికి అలాంటి ఇళ్లు కూడా ఉంటాయని తెలియదు. బాత్‌టబ్, దానిలో ఉన్న జకోజీ అన్నీ వివరంగా తమ్ముడు చూపిస్తుంటే విస్మయంగా చూసింది.

ఇంట్లో ఉన్న నలుగురు మనుషులకు ఇంత ఇల్లు అవసరమా అనిపించింది. తమ్ముడి వైభవాన్ని చూసి పొంగిపోయింది. తల్లిగా తన కొడుకు కూడా కొన్నాళ్లకు ఇలాంటి ఇల్లు కట్టుకుంటాడులే అన్న చిన్న ఊహ, ఆశ.

డైనింగ్ రూమ్‌లు రెండెందుకో అర్థం కాలేదు. తమ్ముడ్ని అదే అడిగింది.

"గెస్ట్‌లు వచ్చినప్పుడు పెద్ద డైనింగ్ రూమ్ (ఫార్మల్)ది వాడతాము. రోజూ వాడుకుందుకు కాజువల్‌ది. ఇక్కడ అందరికీ ఇలాగే ఉంటాయక్కా" అన్నాడు.

ఇల్లంతా కార్పెట్, అందమైన కర్టెన్లు, ఖరీదైన సోఫాలు, ఇల్లంతా సిరి ఉట్టిపడుతోంది. అలాంటి ఇల్లు మంజరి తన జీవితంలో చూడలేదు. అక్కగారి ఇంటికి వెళ్లినా వాళ్ల ఊరు పల్లెటూరు కావటంతో డబ్బు ఉన్నవాళ్లయినా ఇలాంటి హంగులు లేవు. తన కొడుకు కూడా కొనుక్కుంటే అప్పుడు తను ఆ ఇంట్లో

కొడుకు, కోడలు, మనవలతో ఆనందంగా గడపవచ్చు. పాపం ఆదిత్యకే ప్రాప్తం లేదు అనుకుంది.

అక్కాతమ్ముళ్లు చిన్ననాటి కబుర్లు చెప్పుకున్నారు. మురళికి ఇద్దరు పిల్లలు. ఆడపిల్ల పెద్దది. డాక్టర్ చదువుతోంది. కొడుకు అండర్ గ్రాడ్యుయేషన్‌లో ఉన్నాడు.

"అమ్మాయికి ప్రజ్వల అని పేరు పెట్టాను అక్కా, అబ్బాయికి ఉల్లాస్ అని పేరు పెట్టాను."

"నీ కూతురికి పెళ్లి చెయ్యవేమిటిరా! మా దినేష్ కన్నా నాలుగేళ్లు చిన్నదేమో అంతే కదా!" అంది మంజరి.

"నా చేతిలో ఏం లేదక్కా. దాని చదువు పూర్తి అయి అది ఎవరిని చేసుకుంటానంటే వాళ్లనే" అన్నాడు.

"అదేమిట్రా చదువు ఇంకా పూర్తవకపోవటమేమిటి? అదే ఇండియాలో ఈపాటికి పూర్తి అయి ఉండేది" అంది మంజరి.

"ఇండియాకి ఇక్కడికీ చాలా వ్యత్యాసం ఉందక్కా. ఇక్కడ చదువే లేట్‌గా మొదలవుతుంది. మనదేశంలోలాగా పిల్లలకు హోంవర్క్ స్ట్రెస్ ఉండదు. ఆరేళ్లు నిండితే కానీ ఒకటో క్లాస్‌లోకి రారు. స్కూల్ అయ్యాక మెడిసిన్ చదవాలంటే ప్రీ మెడికల్ కోర్స్ చెయ్యాలి. ఇంకా చాలా తతంగాలు ఉన్నాయిలే" అంటూ ఆపేశాడు.

"నువ్వంతా మన తెలుగు మాట్లాడుతున్నావు. ఒకట్లోకి రావడమేమిట్రా? ఇక్కడ అంతా గ్రేడ్స్ అంటారట కదా!" అంది.

అక్కకు చాలా విషయాలే తెలుసనుకున్నాడు.

"ఈవిడ మాకేం అవుతారు డాడీ" అంది ప్రజ్వల.

ఇంగ్లీష్‌లోనే మాట్లాడుతున్న వాళ్లను చూసి తమ్ముడ్ని అడిగింది మంజరి.

"ఏరా మీరు ఇంట్లో కూడా ఇంగ్లీష్‌లోనే మాట్లాడుకుంటారా?" అని.

"ఏదో అలా అలవాటయిపోయింది. చిత్ర అప్పటికీ అంటూనే ఉంటుంది తెలుగులో మాట్లాడమని. నేనే నిర్లక్ష్యం చేశాను" అన్నాడు.

ప్రజ్వలను, ఉల్లాస్‌ను పిలిచి పక్కన కూర్చోబెట్టుకుంది. "నేను మీకు అత్తనవుతానమ్మా. మీ నాన్న నాకు తమ్ముడు" అంది.

"అంటే జస్ట్ లైక్ ఉల్లాస్ టు మీ" అంది.

"ఎస్ కరెక్ట్. నీకు తెలుగు బాగా అర్థం అవుతోంది" అంది మంజరి.

"నాకు అర్థమవుతుంది. మాట్లాడాలంటే బోర్" అంది.

అది విన్న మంజరికి పార్క్‌లో కలిసిన ముసలాయన మాటలు గుర్తుకు వచ్చాయి. ఇంకా చలి మొదలవ్వలేదు కాబట్టి, కొడుకు, కోడలు ఇంట్లో ఉన్నప్పుడు బైట వాకింగ్‌కి వెడుతూ ఉంటుంది. అలా ఒక రోజున వెడుతూ ఉంటే మనవరాలి పక్కన పరిగెడుతున్న ఒక ముసలాయన కనిపించాడు. మంజరిని చూడగానే ఆనందంతో "ఆర్ యూ ఇండియన్" అని అడిగాడు.

అవునన్నట్లుగా తల ఊపింది. అతను ఉత్తర హిందుస్థానం నుండి వచ్చాడట. కొడుకు ఇక్కడే ఉన్నాడని వచ్చాడు. అతని బాధ సగం హిందీలోనూ, సగం ఇంగ్లీషులోనూ చెప్పుకున్నాడు. మంజరికి హిందీ రాదు కానీ కాస్త అర్థం చేసుకోగలుగుతుంది. ఆయన చెప్పిన కథ...

ఆయనకు పెద్దగా ఇంగ్లీష్ రాదు. చిన్న ఊరునుంచి వచ్చాడు. ఎక్కువ చదువుకోలేదు. కిరాణా కొట్టు ఉండేది. కొడుకును కష్టపడి చదివించాడు. అదృష్టవశాత్తు కొడుకు బాగా చదువుకుని పైకి వచ్చి ఇక్కడ ఉద్యోగంలో ఉన్నాడు. ఇంట్లో కొడుకు, కోడలు ఇంగ్లీష్‌లో మాట్లాడుకుంటారు. దాంతో మనవరాలికి ఇంగ్లీష్ తప్ప హిందీ రాదు. హిందీ మాట్లాడాలంటే బోర్ అంటుంది. ఆ మనవరాలి కోసం ఈయనే అవస్థపడి ప్రయత్నిస్తున్నాడు. ఇంతకీ ఆయన బాధ మాతృభాష చచ్చిపోతుందని.

"మనం ఎక్కడున్నా మన భాషని మన సంస్కృతిని సజీవంగా ఉంచాలి. కానీ నా మాట ఎవరు వింటారు? కొన్నాళ్లకు నేను కూడా ఈ ఇంగ్లీష్‌కు అలవాటు పడిపోతానేమో!" అన్నాడు.

ఆ విషయం జ్ఞాపకం వచ్చి చిన్నగా నవ్వుకుంది మంజరి.

"ఎందుకు నీలో నువ్వే నవ్వుకుంటున్నావు?" అన్నాడు మురళి.

"ఏం లేదు" అంటూ మాట మార్చింది.

భోజనాలయ్యాక తనకు చూపించిన రూమ్‌లోకి వెళ్లబోతుంటే ఉజ్వల తనతో పడుకోమని గొడవ పెట్టింది. ఉజ్వలకు మంజరి చాలా నచ్చింది.

మర్నాడు వీలు చూసుకుని, మురళితో గ్రీన్ కార్డ్ గురించి ప్రస్తావించింది. మంజరి చెప్పినది విన్న మురళి అది సబబుగానే ఉందని ఆలోచించాడు. కొడుకు ఇక్కడ ఉన్నప్పుడు అక్క ఒక్కర్తే అక్కడ ఉండడంలో అర్థం లేదు. ఆమె కూడా ఇక్కడకు వచ్చేస్తే దినేష్‌తో బాటు తనకూ ఆనందంగా ఉంటుంది.

“అలాగే అక్కా! నువ్వు ఒంటరిగా అక్కడ ఎందుకు? ఇక్కడే ఉందువుగానీ, నీ పాస్‌పోర్ట్ డిటైల్స్ అన్నీ ఇయ్యి. నేను గ్రీన్ కార్డ్ ప్రొసీజర్ స్టార్ట్ చేస్తాను” అన్నాడు.

ఈ గ్రీన్‌కార్డ్ మంజరి జీవితంలో ముందు ముందు ఏ మార్పులు తేబోతోందో ఎవరూ ఊహించలేదు.

ఒక పదిరోజులు తమ్ముడి దగ్గర ఆనందంగా గడిపి, కొడుకు దగ్గరకి తిరిగి వచ్చింది. తిరిగి వచ్చాక ఇంటిపని, చంటివాడితో అసలు టైమ్ తెలియటం లేదు. సాయంకాలం ఆఫీసునుంచి వచ్చాక ధీరజ్‌తో కొడుకు, కోడలూ ఆడుకోవడం చేస్తారు.

దానితో మంజరికి సాయంకాలం కొంచెం తీరుబాటు చిక్కుతుంది. కానీ ఏం చెయ్యాలో అర్థం కాదు. చదవడానికి తెలుగు పుస్తకాలు దొరకవు. టీవీ చూద్దామన్నా తనకు ఏమీ అర్థం కాదు.

* * *

చలి మొదలుపెట్టింది. మంచు కురవడం మొదలయ్యింది. ఎప్పుడూ మంచు చూడని మంజరికి కొత్తలో కురుస్తున్న మంచు చూస్తే చాలా ఆనందంగా ఉండేది. ఇళ్ల కప్పుల మీద కురిసిన మంచు తెల్ల దుప్పటి కప్పినట్లుగా కనిపించేది. కోనిఫర్ చెట్లు మీద పడిన మంచుతో తెల్లని పువ్వులతో వికసించిన చెట్టులా అందంగా కనిపించేవి. పడ్డ మంచును అప్పటికప్పుడు రోడ్ల మీద నుంచి తవ్వి రోడ్డు పక్క గుట్టల్లా పోస్తుంటే ఆ గుట్టలు హిమాలయాల్లా దర్శనమిస్తున్నాయి. మంజరి హిమాలయాలు కూడా ఎప్పుడూ చూడలేదు.

చలి పెరిగాక లాండ్రీకి బట్టలు తీసుకువెళ్లడం చాలా కష్టంగా ఉండేది. అందుకే ఒక రోజు కొడుకుతో చెప్పింది. ఇదివరకులా వాళ్లనే చేసుకోమని. వైశాలి క్లీనింగ్ పనులు చెయ్యదుట. ఆ సోప్‌లు, డిటర్జెంట్‌లు ఆమెకు పడవుట. మంజరి రానప్పుడు దినేష్ ఆ పనులు చేసేవాడుట.

ఇద్దరూ ఇప్పుడు సుఖానికి అలవాటు పడ్డారు. పని చెయ్యాలంటే బద్ధకం. నేను చేస్తానంటాడు కానీ దినేష్ చెయ్యడు. అడిగితే రేపు చేస్తానంటాడు. ఆ రేపు ఎప్పుడూ రాదు. తన బట్టలు, బాబు బట్టలు మాత్రం ఉతికి, కొన్నాళ్లు వాళ్ల బట్టలు వెయ్యడం మానేసింది.

లాండ్రీ బుట్టలో బట్టలు పేరుకుపోతున్నాయి. పదిహేను రోజులు గడిచాయి. ఒక రోజు ఆఫీసుకు వెడదామంటే బట్టలు లేవు దినేష్‌కు. ఏం చెయ్యాలో తెలియలేదు. తల్లి ఉతకనని చెప్పింది.

"నాకు మీటింగ్‌లు ఉన్నాయి. అమ్మ అన్ని పనులూ చేస్తోంది కదా! కాబట్టి లాండ్రీ పని నువ్వు చూడవచ్చు కదా!" అన్నాడు దినేష్.

"నేను ముందే చెప్పాను నేను క్లీనింగ్ పనులు చెయ్యనని. నాకు డిటర్జెంట్స్‌తో ఎలర్జీ" అంది వైశాలి.

"గ్లౌజు వేసుకుని చెయ్యవచ్చు కదా! ఇక్కడ అందరూ అదేగా చేస్తారు" అన్నాడు.

"నీకు మీటింగ్‌లు ఉంటే నాకు లేవా? నేనూ నీతో ఈక్వల్‌గా పనిచేస్తున్నాను. నేనేం పాతకాల వైఫ్‌ని కాదు" అంది వైశాలి.

ఇద్దరి మధ్య చిరాకులు, పరాకులు, దెబ్బలాటలు మొదలై రోజు రోజుకూ ఎక్కువ అయ్యాయి. అవన్నీ వినలేక విసిగి మళ్లీ తానే చెయ్యడం మొదలుపెట్టింది మంజరి. మంజరి అలా చేస్తుందని తెలిసి చేశారో లేక మరే కారణంతో చేశారో కానీ మొత్తానికి వాళ్లిద్దరికీ మంజరి మూలంగా ప్రశాంతత చిక్కింది. ఇద్దరి మధ్య దెబ్బలాటలు ఆగిపోయాయి.

దినేష్ ఉన్న ఏరియాలో ఇండియన్ స్టోర్ లేదు. ఇండియన్ సరుకులు, కూరలు కొనాలంటే ఇండియన్ స్టోర్‌కు వెళ్లాల్సిందే. అందుకే వారానికొకసారి తల్లిని ఎడిసన్‌లో ఉన్న ఇండియన్ మార్కెట్‌కు తీసుకువెళ్లేవాడు. వారానికి సరిపడా కూరలు, సరుకులు అన్నీ షాప్‌లో చూసి కావాల్సినవి ట్రాలీలో నింపి వేస్తే చివరగా వచ్చి దినేష్ క్రెడిట్ కార్డుతో బిల్ పే చేసి సరుకులు కారులో లోడ్ చేసి ఇంటికి తీసుకువచ్చేవాడు.

అమెరికా వెళ్లిన కొత్తలో అలా షాపింగ్‌కి వెళ్లినప్పుడు షాప్‌లో అందంగా దేనికి దానికి విడిగా పేర్చి దాని ముందు బోర్డ్ అలా అన్నీ అందంగా కనబడేటట్లు

చూస్తే చాలా ముచ్చటగా అనిపించింది. కానీ ప్రతిదీ డాలర్ కన్నా ఏదీ తక్కువ లేదు. టమాటాలు ఒక పౌండు ఒకటి లేక ఒకటిన్నర డాలరు. పౌండ్ అంటే నాలుగు వందల గ్రాములు. ఆ ధరలు చూసి మొదటి రోజు ఏం కొనలేక చాలా ఖరీదుగా ఉన్నాయిరా" అంది కొడుకుతో.

"అమ్మా! నువ్వు డాలర్‌ను రూపాయల్లోకి మార్చుకుంటూ కూర్చుంటే అన్నీ ఖరీదుగానే ఉంటాయి. మనకి రూపాయి ఎలాగో ఇక్కడ డాలర్ అలాగ" అన్నాడు కొడుకు.

అవును నిజమే అన్నీ రూపాయల్లోకి పోల్చుకుంటూ కూర్చుంటే తిండి తినడం కష్టం అవుతుంది. అమెరికాలో దొరకని వస్తువు లేదు. గోంగూర, చింతకాయలు అన్నీ సీజన్ అన్నది లేకుండా దొరుకుతున్నాయి. పాలు, ఫ్రూట్ జ్యూస్‌లు అన్నీ కాన్‌లలో వారానికి సరిపడా తెచ్చుకోవడం విచిత్రంగా అనిపించినా కాలక్రమేణా అలవాటు అయిపోయింది.

అమెరికాలో చాలా మటుకు ఇండియన్ మార్కెట్ అంతా గుజరాతీలు ఎక్కువగా నడుపుతారు. గుజరాతీలు ఎన్నో రకాలుగా అక్కడకు వచ్చి బిజినెస్‌లో పాతుకుపోయారు. అందులో పటేల్స్ ఫేమస్. వాళ్ల చైన్ ఆఫ్ షాప్స్ అమెరికా అంతా వ్యాపించి ఉన్నాయి. అందులో మన ఇండియన్స్‌కి దొరకని వస్తువు లేదు.

అలా ఒక రోజు షాపింగ్‌కి వెళ్లినప్పుడు వైశాలి కూడా వచ్చింది. ఆమె ఎప్పుడూ షాపింగ్‌కి రాదు. ఎప్పుడైనా పార్లర్ వెళ్లాలంటే మాత్రం తను కూడా వస్తుంది. ఇండియన్స్ నడిపే పార్లర్‌లు కొంచెం అందుబాటులో ఉంటాయి. అందుకే వైశాలి అక్కడికే వెడుతుంది.

పనంతా పూర్తయ్యాక ఆకలి వేస్తోందని, పక్కనే ఉన్న రెస్టారెంట్‌కి వెళ్లారు. బాబును ప్రామ్‌లో కూర్చోబెట్టి లోపలికి అడుగుబెట్టారు. కూర్చున్నాక దోశ ఆర్డర్ ఇచ్చారు.

సడన్‌గా 'అత్తా' అన్న పిలుపునకు వెనుతిరిగి చూసింది మంజరి. తమ వెనుక సీట్‌లో నళిని. తల్లిని అత్తా అని పిలిచిన మనిషి ఎవరా అని వింతగా చూస్తున్నాడు దినేష్. అమెరికాలో అమ్మకు తెలిసినవాళ్లు ఉన్నారా? అని.

నళిని దగ్గరకు వచ్చి "అత్తా! నేను నమ్మలేకపోతున్నాను. నేను చూస్తున్నది నిన్నేనా అని" అంది.

"నమ్మలేకపోవడానికేముంది? నువ్వు చూస్తున్నది నన్నే. వీడు నా కొడుకు దినేష్. ఈమె నా కోడలు వైశాలి. నా మనవడు ధీరజ్. నువ్వు అమెరికాలో ఉన్నావని తెలుసు కానీ, ఇక్కడని నాకు తెలియదు. నువ్వున్నావు కాబట్టి మీ అమ్మానాన్నా వస్తారు. అలాగే నా కొడుకు ఇక్కడ ఉన్నాడు కాబట్టి నేను ఇక్కడకు వచ్చాను" అంది మంజరి.

"అదీ నిజమే! నేను పెళ్లయి ఇక్కడకు వచ్చాను. మా ఇల్లు ఇక్కడికి దగ్గరే. నువ్వు తప్పకుండా మా ఇంటికి రావాలి" అంది.

"తప్పకుండా వస్తాను. కానీ ఇప్పుడు కాదు. ఇంకో రోజు దినేష్‌కు వీలున్నప్పుడు నన్ను తీసుకువచ్చి దింపుతాడు" అంది.

"నువ్వు వస్తానంటే నేను వచ్చి తీసుకువెడతాను. నీతో పూర్తిగా ఒక రోజు గడపాలని ఉంది. ఎన్నాళ్లయ్యిందో నిన్ను చూసి."

"అలాగే! నీ ఫోన్ నెంబరు ఇయ్యి. నా వీలుని బట్టి ఫోన్ చేస్తాను" అంది మంజరి.

"అలాగే తప్పకుండా రావాలి" అంటూ ఫోన్ నెంబరు ఇచ్చి వెళ్లిపోయింది.

ఈలోగా ఆర్డర్ ఇచ్చిన దోశ వచ్చింది. తిని బిల్ పే చేసి బైటకు వచ్చారు. కారులో కూర్చున్నాక దినేష్ అడిగాడు "ఎవరమ్మా ఈమె? నువ్వు ఈమెకు ఎలా అత్త అవుతావు?"

"నళిని మీ నాన్నగారికి బాబయ్య మనవరాలు. అంటే నళిని వాళ్ల అమ్మ నాన్నగారి బాబయ్య కూతురు. చెల్లెలవుతుంది. నీకు గుర్తుందా రాణి అత్తయ్య అని మన ఇంటికి తరచూ వస్తూ ఉండేది. ఈ అమ్మాయి ఆవిడ కూతురు" అంది మంజరి.

వెనుక సీట్లో పిల్లవాడితో కూర్చున్న వైశాలి, శ్రోతలా తల్లీకొడుకుల మాటలు వింటోంది. మంజరి కొడుకుతో ముందు సీట్లో కూర్చుంది.

తల్లి చెప్పగా రాణి అత్తయ్య గుర్తుకు వచ్చింది. ఆదిత్యకు చిన్నప్పుడే తండ్రి పోవడంతో తోబుట్టువులెవరూ లేరు. రాణి బాబయ్య కూతురైనా చిన్నప్పట్నుంచీ ఆదిత్యతో సొంత అన్నయ్యలా అభిమానంగా ఉండేది.

"నువ్వు వర్కింగ్ డే నాడు వాళ్లింటికి వెళ్లొచ్చు. ఆ అమ్మాయి వచ్చి తీసుకు వెడతానంటోంది కదా! నేను ఆఫీసు నుంచి వస్తున్నప్పుడు నిన్ను పికప్ చేసుకుంటాను. మేం ఇద్దరం ఆఫీసుకి వెళ్లిపోయాక నీకు బోర్‌గా ఉంటుంది కదా!" అన్నాడు.

"అలా అయితే శుక్రవారం నళినిని వచ్చి తీసుకువెళ్లమంటాను. ఎలాగా సాయంకాలం షాపింగ్ చెయ్యాలి కాబట్టి నువ్వు వస్తే మనం సరుకులు కూడా కొనుక్కోవచ్చు" అంది మంజరి.

"సరే, అలాగే చేద్దాం" అన్నాడు.

ఇల్లు సమీపించడంతో మాటలు ఆపేశారు. కారు పార్క్ చేసి ముందుగా కారు సీట్లో ఉన్న పిల్లవాడ్ని తీసుకుని ఇంటివైపు అడుగులు వేశాడు. మంజరి కార్లో ఉన్న పాలకాన్‌లు తీసుకుని ఇంటివైపు అడుగులు వేసింది.

ఇంట్లోకి రాగానే బట్టలు మార్చుకుని "భోజనం చేస్తారా?" అని కొడుకుని, కోడల్ని అడిగింది.

"నాకయితే ఆకలి లేదు మమ్మీ. మీరిద్దరూ కావాలంటే తినండి. నేను కాస్సేపాగి కొంచెం పాలు తాగుతాను" అంది వైశాలి.

"నేను ఒక గంట పోయాక కొంచెం మజ్జిగా అన్నం తింటాను. ఈ లోపల కావాలంటే నువ్వు తినెయ్యి" అన్నాడు దినేష్.

మంజరికి కూడా అంతగా ఆకలి లేదు. వంటింట్లోకి వెళ్లి తెచ్చిన సామాన్లు అన్నీ సర్దడం మొదలుపెట్టింది. తెచ్చిన సరుకులు సర్దడం గంట, గంటన్నర పడుతుంది. ఒక్కసారిగా తెచ్చుకోవడంతో ఏది ముందు వండాలో ఏది తరువాత వండాలో నిర్ణయించుకుని దాని ప్రకారం ఫ్రిజ్‌లో పెడ్తుంది మంజరి. పళ్లు అన్నీ ఒక అరలో, కూరలు క్రిస్పర్‌లో, పాలు, జూస్ కాన్‌లు డోర్‌లోను అమరుస్తుంది. పద్ధతిగా అన్నీ అమర్చుకుంటే ప్రొద్దున్న హడావుడి ఉండదు.

రాత్రి భోజనాలు లేవు కాబట్టి దినేష్ కోసం పెరుగు, అన్నం టేబుల్ మీద పెట్టి పడుకుందుకు తన రూమ్‌లోకి వెళ్లింది. ఇదివరకు ఒక గంట పూజా, యోగా అన్నీ చేసేది. ఇప్పుడు పూర్తిగా అన్నీ పోయాయి. ఇంతకు ముందు ఉన్న సమయం అంతా తన కోసం ఖర్చు పెట్టేది. ఇప్పుడు తన కోసం సమయం వెతుక్కోవాల్సి వస్తోంది.

ఇదివరకు వారానికొకసారి నలుగుపెట్టి నీళ్లు పోసుకునేది. ఇప్పుడు స్నానం చేయడానికి టైమ్ లేదు. ధీరజ్‌ను ఒంటరిగా వదిలిపెట్టలేక వాళ్లు ఉన్నప్పుడే స్నానం చేస్తుంది. వైశాలి తను మాత్రం అరగంట స్నానం చేస్తుంది. కానీ మంజరి స్నానానికి వెడుతున్నప్పుడు మీరు తొందరగా రండి. బాబు ఏడుస్తాడు అనేది. చిన్న చిన్న విషయాలకు గొడవ ఎందుకని అడ్జస్ట్ అయిపోయేది.

లలితా సహస్రనామం చదువుకుందామని కూర్చుంది. పగలు దీపం పెట్టడమే అపురూపమైపోతోంది. దీపం పెట్టింది లగాయతు కొడుకు అమ్మా చూస్తున్నావా? ఫైర్ అంటుకుంటుంది జాగ్రత్త అంటాడు. నిజమే చెక్క ఇళ్లు కాబట్టి ఏమరుపాటుగా ఉంటే ప్రమాదం జరగవచ్చు కానీ దీపం పెట్టిన లగాయతు నస పెడితే చికాకుగా ఉంటుంది. అలాగని దీపం పెట్టకుండా మానలేదు.

నోటికి వచ్చినా పుస్తకం పక్కన పెట్టుకుంటుంది. మనసు సరిగా ఉండనప్పుడు క్రమం తప్పుతుంది. చదువుతోందన్న మాటే గానీ మనసు నిలకడగా లేదు. ఎలాగో పూర్తి చేసి మంచం మీద వాలింది.

* * *

నాలుగు రోజుల్లో మళ్లీ ఫోన్ చేసింది నళిని. "అత్తా ఎప్పుడు వస్తావు?" అంటూ.

ఏదో ఒక శుక్రవారం వస్తే తనతో వస్తానని చెప్పింది. శుక్రవారం రాగానే ప్రత్యక్షమైంది నళిని. చుట్టుపక్కల అంతా తిరిగి ఈ ఏరియాలో అద్దెలు ఎక్కువ అంది. ధీరజ్‌ను తనే ఎత్తుకుని, కార్ సీట్లో పడుకోబెట్టడానికి బయలుదేరుతూ తాళం వేసి కార్ దగ్గరికి రమ్మని చెప్పింది. పక్కవాళ్లనడిగి కార్ సీట్ ఫిక్స్ చేసుకుని వచ్చింది తన కారులో. మంజరి అడిగితే అదే చెప్పింది.

ధీరజ్‌కు అవసరమైనవి తీసుకుని తాళం వేసి వచ్చింది మంజరి. కారులో కూర్చుని బెల్ట్ వేసుకుని నళిని డ్రైవ్ చేస్తుంటే వింతగా చూస్తుంది. దినేష్ ఉండగా వైశాలి ఎప్పుడూ డ్రైవ్ చెయ్యదు.

ఎక్కడో ఆంధ్రదేశంలో చిన్న ఊర్లో పుట్టి పెళ్లికోసమో లేక ఉద్యోగాల కోసమో అన్నట్లుగా డిగ్రీ పూర్తిచేసిన పిల్లలు ఈ దేశం వచ్చి అన్నీ నేర్చుకుని ఇక్కడి జీవనశైలిలో ఇమిడిపోతున్నారు. మానవుడు బ్రతుకుతెరువు కోసం వలస వెళ్లడం నాడూ ఉంది. నేడూ ఉంది.

"చాలా చక్కగా డ్రైవ్ చేస్తున్నావు. ఇక్కడ దార్లన్నీ నీకు తెలుసా?" అంది మంజరి.

"ఇక్కడ కార్ డ్రైవింగ్ రాకపోతే చాలా కష్టమత్తా! ఇండియాలోలా పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్ అంతగా ఉండదు. మరీ దూరాలైతే ట్రైన్ ఫెసిలిటీ ఉంది. ఎక్కువగా అందరూ కారు మీదే ఆధారపడతారు. ఇంక దారి తెలియడం అంటావా జి.పి.ఎస్. అది కార్లో ఉంటే మనం ఎక్కడికి వెళ్లాలో దాని ద్వారా వెళ్లిపోవచ్చు. అది మనకు డైరెక్షన్స్ ఇస్తుంది. ఇంతకీ చెప్పు నువ్వు వచ్చి ఎన్నాళ్లయింది? నీకు అమెరికా నచ్చిందా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

గలగలా మాట్లాడుతున్న నళినినే చూస్తోంది. పరాయి దేశంలో తన మనిషి కనబడితే ఎంత ఆనందంగా ఉంటుందో అనిపించింది మంజరికి.

కార్ ఇంటికి కొంచెం దూరంలో పార్క్ చేసింది. బాబును తీసుకుని ఇద్దరూ ఇంట్లోకి నడిచారు. ఇల్లు చక్కగా బాగుంది. అది కూడా టూ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్.

"కూర్చో అత్తా!" అంటూ బాబును కార్ సీట్లో నుంచి తీసింది. అప్పుడే నిద్ర లేచిన వాడు కొత్త మొహం చూసి ఏడుపు మొదలుపెట్టాడు. వాడ్ని మంజరి ఒళ్లోకి తీసుకుంది. నాన్నమ్మను చూడగానే బోసినవ్వులు కురిపించాడు. బాగ్‌లోంచి వాడి బాటిల్ తీసి ఓపెన్ చేసి తినిపించడం మొదలుపెట్టింది. బేబీ ఫుడ్ బాటిల్స్‌లో అమ్ముతారు. కారెట్, ఏపిల్ చాలా రకాలు ఉంటాయి. అన్నం పెట్టేదాకా వాడికి మధ్యలో పాలు కాక ఇది పెడుతుంది మంజరి.

"నీతో చాలా మాట్లాడాలత్తా. ఇక్కడ ఎవరి పనులు వాళ్లకి ఉంటాయి. మన ఊళ్లోలాగా మాట్లాడ్డానికి ఎవరూ ఉండరు. అప్పటికీ అమ్మావాళ్లకు వారానికొకసారి ఫోన్ చేస్తాను" అంది.

"నీ పెళ్లయ్యి రెండేళ్లయ్యింది కదా! ఇలాంటి చక్కని బాబును కంటే నీకు మంచి కాలక్షేపం అవుతుంది కదా!" అంది మంజరి.

"ఇంకో రెండేళ్ల దాకా ఆ ప్రసక్తే లేదు" అంది.

"అదేంటమ్మా ఎందుకు ఆలస్యం చేస్తున్నారు?" అని అడిగింది మంజరి.

"మా బాధ్యతలు తీరి మేం ఇల్లు కొనుక్కున్నాక అప్పుడు ఫ్యామిలీ ప్లాన్ చేద్దామంటున్నాడు శ్రీకర్."

"అదేంటి? ఇదేదో సముద్రంలో కెరటాలు తగ్గాక స్నానం చేస్తాను అన్నట్లుగా ఉంది."

"నీకు వివరంగా చెప్తే కానీ అర్థం కాదు. ఆమెరికా ఏదో భూతల స్వర్గమనీ, ఇక్కడికొస్తే డబ్బులు బాగా సంపాదించుకోవచ్చని చాలామందికి భ్రమ. ఇక్కడ వచ్చే జీతాల్ని మన రూపాయిల్లోకి మార్చుకుని మావాడికి ఇన్ని లక్షలు జీతం అని చెప్పుకుంటారు. ఈ డబ్బు అంతా మిగుల్చుకుని, ఇండియా పట్టుకెళితే లక్షలవుతాయి. కానీ ఇక్కడే ఖర్చు పెట్టుకుంటే అవి లక్షలు కావు. మనకి రూపాయి ఎంతో ఇక్కడ డాలర్ అంతే అయినప్పుడు, ఇక్కడ ఖర్చు పెట్టినప్పుడు డాలర్లు ఖర్చు పెడతాం కదా!

డబ్బు పిచ్చి ఉన్న తల్లితండ్రులు నువ్వు అమెరికాలో బాగా సంపాదిస్తున్నావు కదా! నిన్ను కష్టపడి చదివించాము. మాకు డబ్బు పంపండి అని డిమాండ్ చేస్తారు. మంచి కొడుకైతే వాళ్ల డిమాండ్ పూర్తిచెయ్యడానికి నానా కష్టాలు పడి మిగిల్చి వాళ్లకు డబ్బు పంపుతాడు. వాళ్లక్కడ మావాడు అమెరికాలో లక్షలు సంపాదిస్తున్నాడని గొప్పలు పోతారు.

ఇక్కడ కొత్తగా ఉద్యోగానికి వచ్చినవాడికి మహా అంటే ఐదువేల డాలర్లు వస్తుంది. ఇందులోనే ఇంటద్దె, కారు కొనుక్కుంటే కార్ లోన్ అన్నీ చూసుకోవాలి. తన అవసరాలు తీర్చుకుని ఎంతో కష్టపడితేనే కానీ డబ్బు మిగల్చడానికి అవదు. నిజంగా డబ్బు అవసరం ఉన్న తల్లిదండ్రుల కోసం డబ్బు మిగిల్చి పంపడంలో తప్పు లేదు. వీళ్లిక్కడ ఏదో గొప్పగా సంపాదిస్తున్నారన్న అపోహతో వాళ్ల జల్సాలకు, గొప్పలకు డబ్బు పంపమనడంలో ఏం న్యాయం ఉంది చెప్పు?" అంది నళిని.

"ప్రతిదాన్లోనూ కష్టసుఖాలు ఉన్నాయమ్మా! ఇక్కడి వర్కింగ్ కండిషన్స్ బాగుంటాయని, వాళ్ల కెరియర్‌లో ప్రోగ్రెస్ అవడానికి ఎక్కువ అవకాశాలు ఉన్నాయని ఇక్కడకు వస్తున్నారు. మన దేశంలో ప్రతిభ కన్నా రికమెండేషన్‌కి ఎక్కువ విలువ ఉంది. పై చదువుల విషయంలో కూడా వాళ్ల మార్కులు ప్రొఫెసర్ మీద ఆధారపడి ఉన్నాయి. ఒకసారి ఇక్కడి సుఖాలకు అలవాటుపడ్డాక తిరిగి ఇండియాకి రావడానికి ఇష్టపడక వాళ్లు ఇక్కడ పడే ఇబ్బందులకు కూడా అలవాటు పడిపోతున్నారు. ఇక్కడ ఏ పని చేసి డబ్బు సంపాదించినా ఫరవాలేదు. ఎవరూ పట్టించుకోరు. మనదేశంలో అలా కాదే. ఇంతకీ మీ అత్తగారూ వాళ్లూ అంత లేనివాళ్లు కాదు కదా!" అంది మంజరి.

“నేను ఇప్పుడు చెప్పిన ఉపోద్ఘాతమంతా మా అత్తగారి గురించే. కొడుకు ఇక్కడ లక్షలు సంపాదిస్తున్నాడని గొప్పలు చెప్పుకుని బతికేస్తుంది. దాంతో మా ఆడపడుచులు ఏ డబ్బు అవసరమైనా ఈయన్ని పంపమంటారు. మా పెద్దాడపడుచు కొడుకు ఇంజనీరింగ్ చదువుతున్నాడు. వాడి ఫీజులన్నీ ఈయనే కడుతున్నారు. ప్రైవేట్ కాలేజీలో డొనేషన్ కట్టి మరీ చేర్పించారు. అక్కడి నుంచి ఫోన్ రావడం తరువాయి బాంక్ నుంచి డబ్బులు వెళ్లిపోతాయి. ఆయనకు వాళ్ల వాళ్లంటే అమితమైన ప్రేమ.”

“నీ పెళ్లిలో మీ నాన్న అమెరికా సంబంధం నా అల్లుడికి లక్షల్లో జీతం, కోట్లు నిలవేస్తున్నాడంటే నిజమే కామోసు అనుకున్నాను. ఏదైనా చూస్తే కానీ తెలియదు. పోనీ మీ ఆయన నిన్ను బాగా చూసుకుంటాడా?” అంది మంజరి.

“చాలా బాగా చూసుకుంటారు. అది లేకపోతే ఎప్పుడో అతనికి బైబై చెప్పి ఉండేదాన్ని. మెల్లిగా ఆయనను మార్చడానికి ప్రయత్నిస్తున్నాను. ఎవరైనా మనను అవసరానికి వాడుకుంటే నాకు చిర్రెత్తుతుంది. ఈయన అమాయకత్వాన్ని వాళ్లు క్యాష్ చేసుకుంటున్నారు. వాళ్ల మాయనుంచి బైటకు తీసుకురావడానికి  నాకు కొంచెం సమయం కావాలి. అప్పుడే మా మధ్య పిల్లలత్తా!”

దూరపు కొండలు నునుపంటారు ఇదే కాబోలు అనుకుంది మంజరి. కాసేపు ఆడుకున్న చిన్నవాడు నాన్నమ్మ ఒళ్లో నిద్రపోయాడు. వాడ్ని ఎత్తుకుని పక్కమీద పడుకోబెట్టింది నళిని.

“నువ్వేం తింటావో చెప్పు. నా మాటలతో కడుపు నింపినట్లున్నాను. ఒక్క అరగంటలో వంట చేస్తాను” అంది.

“ఇక్కడికొచ్చాక జాణవైనట్టున్నావు. ఇంతకు ముందు నీకు వంట వచ్చా?” అంది మంజరి.

“లేదత్తా! ఏనాడూ మా అమ్మ ఒక్క పని చెయ్యనివ్వలేదు. అలాంటిది ఇక్కడికి వచ్చి అన్ని పనులూ నేర్చుకున్నాను. బాత్రూమ్‌లు కూడా కడుగుతున్నాను డబ్బులు మిగులుతాయని. ఇదిగో ఇవే మా నాన్న కలగన్న సుఖాలు. కూతురు అంగరంగవైభోగాలు అనుభవిస్తుందని మురిసిపోతున్నట్లున్నాడు” అంటూ వంటింట్లోకి దారితీసింది. ఇంకో కప్పు కాఫీ ఇచ్చి, అన్నట్లుగానే అరగంటలో వంట పూర్తి చేసింది.

టేబుల్ మీద ఉన్న పదార్థాలు చూసి “ఇన్నెప్పుడు చేశావే?” అంది.

“మా కోసం పొద్దున్న ఒక కూర, పప్పు చేశాను. నువ్వొచ్చావని అన్నం కుక్కర్‌లో పెట్టి ఇంకో కూర, పచ్చడి చేశాను. తిని నా వంట ఎలా ఉందో చెప్పు” అంది.

నోట్లో పెట్టుకుని రుచిగా ఉన్న పదార్థాలను మెచ్చుకుంది. “వంట చాలా బాగా చేశావమ్మా! నిజం చెప్పాలంటే నాకన్నా బాగా చేశావు” అంది.

“మరీ ములగచెట్టు ఎక్కించకత్తా. మా ఆయన తరువాత నా వంట మొట్టమొదటిసారి తింటున్నది నువ్వే. మా వాళ్లెవరూ ఇంకా రాలేదు. వాళ్లు వస్తామన్నా ఖర్చని మేమే రానియ్యటం లేదు” అంది.

“నిజంగా చాలా బాగుందిరా వంట. నాకు కూడా వేరేవాళ్లు చేస్తే తినడం చాలా ఏళ్ల తరువాత అవకాశం దొరికింది. మా అమ్మ పోయాక అసలు ఆ అవకాశం రాలేదు. ఇన్నాళ్లకు ఆప్యాయత పంచి నా కంచంలో ఇంత ముద్ద పెట్టిన నిన్ను చూస్తే మా అమ్మ గుర్తుకు వచ్చింది” అంది మంజరి.

చాలాసేపు ఇద్దరూ ఒకరి ఆప్యాయతలో ఒకరు ఓలలాడారు. ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. వాళ్ల కబుర్లు పూర్తి కాకుండానే దినేష్ వచ్చాడు. తల్లిని తీసుకుని, షాపింగ్ చేసుకుని, ఇంటికి వెళ్లారు.

నళిని అత్తతో చెప్పటానికి మొహమాటపడ్డ విషయం బైటకెళ్లి ఉద్యోగం చెయ్యలేక మొగుడి ఆజ్ఞ మేరకు ఇంట్లోనే బేబీ సిట్టింగ్ చేసి డబ్బు సంపాదిస్తోందని. ఆ రోజు నళిని చూసే బేబీ వాళ్లమ్మకు సెలవు. అందుకే ఆమె పాపను పంపలేదు. కార్ డ్రైవింగ్ వచ్చిన నానీకి కొంచెం డిమాండ్ ఎక్కువే. ఒకవేళ చెప్పినా మంజరి ఆమెను అర్థం చేసుకుని ఉండేది.

* * *

కాస్త చలి తగ్గేసరికి బాబుకు పది నెలలు వచ్చాయి. బైట తిరగడం అంత కష్టం కాదు కాబట్టి తల్లికి సైట్ సీయింగ్ చేయించాలనుకున్నాడు దినేష్. ఒక వీకెండ్ కార్‌లో న్యూయార్క్ బయలుదేరారు. లింకన్ టన్నెల్‌లోంచి కార్ వెడుతుంటే, లైట్లతో దేదీప్యమానంగా వెలిగిపోతూ స్పీడ్‌గా వెడుతున్న కార్లు, కార్లో ప్రయాణం ఒక కొత్త ప్రపంచాన్ని చూస్తున్నట్లుగా ఉంది మంజరికి. కొడుకు చెబుతున్నాడు...

"ఈ టన్నెల్ కింద పారుతున్న నదిని హడ్సన్ రివర్ అంటారు. ఈ రివర్ మీద రెండు టన్నెల్స్ కట్టారు. ఒకటి లింకన్, రెండవది హోలెండ్ అంటారు. దీని పొడుగు 1.5 మైళ్లు. కి.మీ.లో 2.4. దీన్ని 1937వ సంవత్సరంలో 22 డిసెంబరున ఓపెన్ చేశారు. అప్పుడు దీన్ని కట్టడానికి అయిన ఖర్చు 85,000,000 డాలర్లు."

కొడుకు చెప్తున్నవన్నీ వింటూ ఆ టన్నల్‌ని మంత్రముగ్ధురాలిలా చూస్తోంది. ఇలాంటి కట్టడాలు, అందమైన రోడ్లు, సౌకర్యాలు చూశాక ఇది నిజంగా భూతల స్వర్గంలా అనిపించడంలో ఆశ్చర్యం లేదు. ఇంత విశాలంగా నీట్‌గా ఉన్న రోడ్ల మీద అలవాటుపడ్డ వాళ్లకి ఇండియాలో ఆ గతుకుల రోడ్ల మీద కారు డ్రైవ్ చేయడం చాలా కష్టమైన పనే. ముందుగా స్టాట్యూ ఆఫ్ లిబర్టీ చూడ్డానికి వెళ్లారు. ఇది న్యూయార్క్ బే భాగంలో లిబర్టీ ఐలాండ్‌కి దక్షిణంలో ఉంది. లిబర్టీ స్టాట్యూ అమెరికన్స్‌కి వాళ్ల స్వాతంత్ర్యం గుర్తుగా ఫ్రాన్స్ గిఫ్ట్‌గా ఇచ్చింది. ఈ విగ్రహం రోమన్ గాడెస్ లిబర్టాస్‌ను రిప్రజెంట్ చేస్తుంది. ఈ ఐలాండ్‌కు వెళ్లాలంటే ఫెర్రీలో వెళ్లాలి. అది చూశాక తిన్నగా ఎంపైర్ స్టేట్ బిల్డింగ్‌కు వెళ్లారు.

నూట రెండు అంతస్తులు, 1,250 అడుగుల రూఫ్ హైట్‌తో గగనాన్ని తాకుతున్నట్లుగా ఉన్న ఆ బిల్డింగ్ చూపరులను ఇట్టే ఆకట్టుకుంటుంది. 86వ అంతస్తులోనూ 102వ అంతస్తులోనూ ఉన్న అబ్జర్వేషన్ డెక్ నుంచి న్యూయార్క్ సిటీ అందాలను చక్కగా చూడవచ్చు. ప్రపంచంలోని వింతల్లో ఇదీ ఒకటి అనిపిస్తుంది.

ఆ తరువాత మన్‌హటన్‌లోనే ఉన్న సెంట్రల్ పార్క్‌కి వెళ్లారు. ఇది 843 ఎకరాల విస్తీర్ణంలో వ్యాపించి ఉంది. పార్క్ బైట ముష్టివాళ్లు (అలా అనకూడదేమో!) రకరకాల వాయిద్యాలు వాయిస్తూ అడుక్కుంటున్నారు. మొట్టమొదటిసారి అక్కడ అలాంటి వాళ్లను చూసి ఈ దేశంలో కూడా అడుక్కుంటారా అనుకుంది మంజరి.

ఈ పార్క్ ప్రపంచంలోనే పెద్ద పార్క్ కింద పరిగణింపబడుతుంది. మధ్య మధ్యలో ఉన్న లేక్‌లు, చలి తరువాత పుష్పిస్తున్న చెట్లతో చాలా అందంగా ఉంది వాతావరణం. జనం విపరీతంగా ఉన్నారు. అమెరికాలో ఉన్న జనసందోహమంతా అక్కడే ఉందా అన్నట్లు నిండి ఉంది పార్క్.

అప్పటికే అలిసిపోయారు. ఇంటి నుంచి తెచ్చుకున్నది తినడం ఆరంభించాలి. ఆత్మారాముడు గోల పెడుతున్నాడు. ఖాళీగా ఉన్న జాగా చూసి

పచ్చని గడ్డి ఉన్న చోట దుప్పటి పరిచి, ఇంటినుంచి చేసి పట్టుకొచ్చినవి ప్లేట్లలో పెట్టి కొడుకు, కోడలికి ఇచ్చి తాను కూడా తీసుకుంది.

“ముందు మీరిద్దరూ తినండి. వాడికి బేబీ ఫుడ్ పెడతాను” అంది వైశాలి.

“ఇందాకా కూడా అదే పెట్టావు కదా! నేను వాడికోసం పప్పు, అన్నం తెచ్చాను. అది పెడతాను. అది పెడితే కాస్త కడుపు నిండుతుంది. ఆ తరువాత ఒక అరటిపండు పెడితే ఆకలి తీరుతుంది. అస్తమానూ ఆ సీసాల భోజనం ఎందుకమ్మా?” అంది మంజరి.

ఎదుగుతున్న బిడ్డకు ఆహారం కూడా పెంచాలన్న జ్ఞానం ఉన్నా ఈజీగా అయిపోతుందని రెడీమేడ్ ఫుడ్ ప్రిఫర్ చేస్తుంది వైశాలి. అత్తగారు శ్రద్ధగా వాడికి అన్నీ పెడుతుంటే ఏమనలేక నోరు మూసుకుంటుంది.

మంజరి తను వడ్డించుకున్న ప్లేట్ పక్కన పెట్టి మనవడ్ని ఒళ్లో కూర్చోబెట్టుకుని, పప్పన్నం తినిపించింది. తనతో ఆడుకునే నాన్నమ్మ అంటే ప్రాణం వాడికి. వాడికి రోజూ పుస్తకాలు చూపిస్తూ, బొమ్మలు చూపిస్తూ అన్నం పెడుతుంది. మారుతున్న కాలంతో తానూ మారుతూ ముందుకు సాగిస్తోంది తన జీవితాన్ని.

మంజరిని ముందు అమ్మా అనేవాడు. కోడలు బాధపడుతుందని వైశాలిని చూపించి అమ్మ అనాలని నేర్పింది. పిల్లలు ఎవరి దగ్గర ఎక్కువ సమయం గడుపుతారో వాళ్లనే అమ్మ అనుకునే అవకాశం ఉంది. అందుకే ఇదివరకు రోజుల్లో గొప్పవాళ్ల ఇళ్లల్లో పిల్లల్ని పెంచే పనివాళ్లను ఆయమ్మ అనడం పరిపాటి. ఇప్పుడిప్పుడే మంజరిని ‘మామ్మ’ అని అనడం మొదలుపెట్టాడు.

* * *

మంజరికి గ్రీన్‌కార్డ్ వచ్చేసింది. దినేష్‌కు ఒక టెన్షన్ రిలీజ్ అయ్యింది. మంజరి వచ్చి ఏడాది దాటిపోయింది. బాబుకి ఏడాది నిండబోతోంది. పుట్టిన రోజు పండగకు సన్నాహాలు మొదలయ్యాయి. వైశాలి అమ్మా, నాన్నా కూడా వచ్చారు. అందరూ కూర్చుని ఎవర్ని పిలవాలో లిస్ట్ రాసుకున్నారు.

మొత్తానికెలా అయితేనే పుట్టినరోజు గ్రాండ్‌గా జరిగింది. వైశాలి రానంటే తల్లిని తీసుకుని కావాల్సినవన్నీ కొనడానికి షాపింగ్‌కి వెళ్లాడు. రిటర్న్ గిఫ్ట్స్ అంటూ ఏవేవో కొన్నాడు.

"రిటర్న్ గిఫ్ట్స్ అంటే ఏమిటిరా?" అని అడిగింది.

"ఫంక్షన్‌కు అందరూ వస్తారు కదా అమ్మా! అందరూ చిన్నపాపలు, బాబులు ఉంటారు. వాళ్లు గిఫ్ట్ ఇచ్చినందుకు తిరిగి మనం ఇచ్చేదాన్ని రిటర్న్ గిఫ్ట్ అంటారు."

"ఇక్కడ అలా ఇస్తారా?" అని ఆశ్చర్యపోయింది. తనకు తెలియనివి చాలా ఉన్నాయి అనుకుంది మంజరి.

వైశాలి తన లోడ్ తగ్గించుకుందుకు బాబుకు బట్టలు, కేక్ తప్ప మిగిలినవన్నీ దినేష్‌కు అప్పజెప్పింది.

పార్టీ బైట అరేంజ్ చేసినా కొంతమంది ఫ్రెండ్స్ ఇంటికి వస్తారని వాళ్లకు తినడానికి కొన్ని స్నాక్స్, కూల్‌డ్రింక్స్ కూడా తెచ్చారు. వైశాలి, అపర్ణ కలిసి ఇల్లు అందంగా డెకరేట్ చేశారు.

అత్తగారూ, మావగారూ వచ్చారని తల్లిని డ్రాయింగ్ రూములో పడుకోమన్నాడు దినేష్. మంజరి పడుకునే బెడ్‌రూమ్‌లో అపర్ణ, భర్త పడుకున్నారు. మంజరి డ్రాయింగ్ రూమ్‌లో సోఫాలో పడుకుంది.

పొద్దున్నే అందరి కన్నా ముందు లేచి, అందరికీ బ్రేక్‌ఫాస్ట్ తయారుచేసింది. ధీరజ్ లేచాక వైశాలితో వాడికి నూనె పెట్టించి తల్లీకూతుళ్లను హారతి ఇమ్మంది. ఎవరూ అనకపోయినా ఏ శుభకార్యానికీ తను ముందు రాకుండా వీలయినంత వరకూ వెనకే ఉంటుంది. ఇక్కడ అవన్నీ ఎవరూ పట్టించుకోరన్నా వినిపించుకోదు.

కొత్తబట్టల్లో ముద్దుగా ఉన్న మనవడ్ని చూసి మురిసిపోయింది. ఎందుకో మళ్లీ ఈ రోజు ఆదిత్య జ్ఞాపకానికి వచ్చాడు. 'తొందరగా పోయి ఈ ఆనందాన్ని నన్నొక్కర్తినీ అనుభవించమని వెళ్లిపోయారు' అనుకుంది.

అందరూ కబుర్లు చెప్పేవాళ్లే. కానీ పని చేసేవాళ్లు ఎవరూ లేరు. వైశాలి మంజరి రాక మునుపు పనులు చేసేది. ముందునుంచీ ఇక్కడే పెరగడం వలన, తల్లి కూడా ఉద్యోగస్తురాలవడం మూలంగా వాళ్ల పనులు వాళ్లు చేసుకోవడం, ఇంటిపనుల్లో కూడా వాళ్లు సహాయపడటం అలవాటు చేసింది అపర్ణ.

మంజరి అన్ని పనులూ చేయడం మొదలుపెట్టేసరికి బద్ధకం పెరిగింది. కూతుర్ని చూసి అపర్ణ కూడా తన ఇంట్లో ఎలాగా చేసుకోవాలి. ఇక్కడకు వచ్చినప్పుడైనా కాస్త రెస్ట్ దొరుకుతుందని మానేస్తోంది. అలవాటు లేక ధీరజ్

అపర్ణ దగ్గరకు వెళ్లడం లేదు. దానికి తగ్గట్టు పిల్లలిద్దర్నీ చిన్నప్పట్నించీ డే కేర్‌కు పంపడం అలవాటైన అపర్ణకు పిల్లల్ని భరించే ఓపిక లేదు.

నాన్నమ్మ దగ్గర అలవాటు మూలంగా వాడు అన్నింటికీ నాన్నమ్మ మీదే ఆధారపడతాడు. తాతగారంటే కొంచెం ఇష్టం. ఆయన వాడ్ని తీసుకుని పార్క్‌కు వెడతారు. పార్క్‌లో తొట్టెలా ఉన్న ఉయ్యాలలో కూర్చోబెట్టి వాడ్ని ఊపుతారు. వాడికి అది చాలా ఇష్టం.

* * *

చలి తగ్గింది కాబట్టి జనాలందరూ జైలులోంచి బైట పడ్డట్టుగా పిల్లలని తీసుకుని, పక్కన ఉన్న పార్క్‌కి పిల్లల్ని తీసుకువస్తారు. మంజరి ధీరజ్‌ను తీసుకుని రోజూ వెడుతుంది. సాయంకాలం నాలుగయ్యేసరికి మంజరి చీర పట్టుకుని లాగి క్లోజెట్ దగ్గరికి తీసుకెళ్లి చెప్పులు చూపిస్తాడు. పూర్తిగా మాటలు రావు కాబట్టి చెప్పులేసుకుంటే బైటికి వెళ్లవచ్చని వాడి ఉద్దేశం. మంజరి నవ్వుకుంటూ వాడ్ని తయారుచేసి, తను కూడా తయారై బయలుదేరుతుంది.

వాళ్లిద్దరికీ అది ఆటవిడుపు. బైటికి రావడం మొదలుపెట్టాక లిండాతో మాటలు పెరిగాయి. ఆమె వయసు అంచనా వేయడం చాలా కష్టం. నిరంతరం పనిచేస్తూ ఉంటుంది. మాటల్లో తన వయసు అరవై సంవత్సరాలని చెప్పింది. లిండా చెప్పిన ఆమె కథ మంజరి ఊహకందని విషయాలు.

లిండా తల్లి ఐరిష్ వాసి. చదువు కోసం ఆమెరికా వచ్చి, లిండా తండ్రితో ప్రేమలో పడి, పెళ్లి చేసుకుంది. లిండా తండ్రి అమెరికన్. ఐదేళ్లలో ఇద్దరు పిల్లలకు తల్లి అయ్యింది. లిండా తరువాత లీసా. లీసాకి మూడేళ్ల వయసులో వాళ్లిద్దరి మధ్య గొడవలు మొదలయ్యాయి. తల్లితండ్రుల గొడవల మధ్య పిల్లలిద్దరికీ ఏం చెయ్యాలో అర్థం అయ్యేది కాదు. ఏడాదిపైగా సాగిన గొడవలతో ఇద్దరూ విసిగిపోయి విడాకులు తీసుకున్నారు.

పిల్లలిద్దర్నీ తల్లికి వదిలేసి అతను వేరే పెళ్లి చేసుకుని వేరే ఊరు వెళ్లిపోయాడు. వీళ్లిద్దరినీ పెంచడానికి లిండా తల్లి చాలా కష్టాలు పడింది. లిండాకు పదిహేనేళ్ల వయసులో లిండా తల్లి మళ్లీ పెళ్లిచేసుకుంది.

అతను లిండా తల్లి కన్నా పదేళ్లు చిన్నవాడు. పిల్లలు తనతో ఉండటానికి ఒప్పుకున్నాడని అతనితో పెళ్లికి అంగీకరించింది. అతని అసలు ఉద్దేశం

గ్రహించలేకపోయింది. ఎదుగుతున్న లిండా మీద అతని కళ్లు ఉండేవి. ప్రేమగా మాట్లాడుతూ ఆమెను రకరకాలుగా తాకటం మొదలుపెట్టాడు.

తల్లితో చెబుతామనుకుని తల్లి బాధపడుతుందని చెప్పకుండా కొన్నాళ్లు దాచింది. ఆమె ప్రతిఘటించలేకపోవడంతో అది ఆమె ఇష్టంగా భావించి తన వెకిలి చేష్టలు ఎక్కువ చేశాడు. వీలయినంతవరకూ అతని నుంచి తప్పించుకుందుకు చిన్నారి లిండా నానా అవస్థలు పడేది. పదహారేళ్లు నిండేదాకా అతని చేష్టలు భరిస్తూ అతన్ని దగ్గరకు రానీకుండా చేస్తూ గడిపింది. చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ వీలయినంతవరకూ బైటే గడుపుతూ స్కూల్ చదువు పూర్తిచేసింది. నానీ కోర్స్ ట్రైనింగ్ అయితే ఎవరి ఇంట్లోనైనా బేబీ సిట్టర్‌గా గడపవచ్చని ప్రయత్నించి సఫలీకృతురాలైంది.

కూతురు ఉద్యోగం వెతుక్కోవడం లిండా తల్లికి కొంచెం బాధ కలిగించింది. "ఇంత చిన్న వయసులో సంపాదించాల్సిన అవసరం ఏం వచ్చింది? నేను చదివిస్తాను చదువుకో" అంది.

ఇప్పటికే నీమీద భారం పెరిగింది. ఇంకా లీసా బాధ్యత కూడా ఉంది కదా!" అంటూ అసలు విషయం చెప్పలేదు.

ఒక డాక్టర్ ఇంట్లో బేబీ సిట్టర్‌గా ఉద్యోగం దొరికింది. వాళ్లు బేస్‌మెంట్‌లో ఉండడానికి అనుమతి ఇచ్చారు. అలా ఉద్యోగంలో చేరిపోయింది. ఇంకా చదవాలని ఉన్నా చదవలేకపోయింది.

లిండా బైటికి వెళ్లిపోయేసరికి సవతి తండ్రి లీసా మీద దుర్మార్గం చేయబోయాడు. లీసా అక్కలా ఊరుకోకుండా తల్లికి ఫిర్యాదు చేసింది. లిండా ఎందుకు ఇంట్లోంచి వెళ్లిపోయిందో అప్పుడు అర్థం అయ్యి, కోపం వచ్చి అతనితో విడాకులు తీసుకుని ఒంటరి జీవితం గడపడం ప్రారంభించింది. తల్లి నుంచి విడిగా బతకడం మొదలుపెట్టిన లిండా కొన్నాళ్లు స్వేచ్ఛాజీవితం గడిపి, తన బాయ్ ఫ్రెండ్‌తో కొన్నాళ్లు తిరిగాక ఇద్దరూ పెళ్లిచేసుకున్నారు. ఆమెకు ఇద్దరు కూతుళ్లు, ఇద్దరు కొడుకులు. అతనితో ఎన్నాళ్లు కాపరం చేసిందో చెప్పలేదు.

అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన విషయం ఇప్పుడున్న లిండా భర్త ఆమె కన్నా చిన్నవాడు. ఇతను ఆమె మూడవ భర్త. వీళ్లు ఇలాగ ఎన్ని పెళ్లిళ్లైనా చేసుకుంటారా? డ్రెస్సులు మార్చినట్లుగా భర్తలను మార్చేస్తారా? అనుకుంది మంజరి.

వీళ్లకి మనకున్నట్లు సెంటిమెంట్స్, ఎథిక్స్ లేవా? హాయిగా ఎవరి పెళ్లి వాళ్లు చేసుకుంటారు. తమ దేశంలోలాగా తల్లితండ్రులు రెక్కలు ముక్కలుచేసుకుని, డబ్బులు దాచి, కట్నాలు ఇచ్చి పెళ్లి చేయాల్సిన అవసరం లేదు. మొగుడు కొట్టినా, తిట్టినా, వ్యసనపరుడైనా అతనితోనే జీవితం అంతా గడపాల్సిన అవసరం లేదు.

స్వతంత్రంగా తను అనుకున్నట్లుగా బ్రతికే స్వేచ్ఛ ఆడదానికి ఇక్కడ ఉంది. ప్రతి క్షణం ఎవరేమనుకుంటారో అన్న భయంతో బ్రతుకు కొనసాగించక్కరలేదు.

ఆదిత్య పోయి ఇన్నాళ్లైనా ఏనాడూ పెళ్లి గురించి ఆలోచించలేదు. అతను పోయేనాటికి ఆమె వయసు ఇరవై ఆరు సంవత్సరాలు. మగతోడు లేకుండా కూడా జీవనాన్ని సాగించవచ్చని తన జీవితం చెప్తోంది. అడుగడుగునా మగతోడు అవసరం అన్నట్లుగా లిండా జీవితం చెప్తోంది. ఏ మార్గం సరి అయినది అన్నది వాళ్ల ఇష్టాన్ని బట్టి ఉంటుంది.

తన మనసులోని సందేహాల్ని లిండా ముందు పెట్టకుండా ఉండలేక పోయింది. "నీకు నలుగురు పిల్లలు, ఇప్పుడున్న భర్త నీ మూడవ భర్త అని చెప్పావు. నీ పిల్లలెప్పుడూ నీ పెళ్లి గురించి అభ్యంతరం తెలుపలేదా? ఈ నలుగురు పిల్లలూ నీ మొదటి భర్త పిల్లలా?" అని అడిగింది.

చిన్నగా నవ్వింది లిండా. "ముగ్గురు పిల్లలు నా మొదటి భర్త సంతానం. నా ఆఖరి కూతురు నా రెండవ భర్త సంతానం. ఇక్కడ చాలామంది ఇలా చేసుకుంటారు. అదీకాక నేను నా పిల్లల్ని నెగ్లెక్ట్ చేయలేదు. మా అమ్మ రెండో పెళ్లితో నేను ఎదుర్కొన్న పరిస్థితి నా పిల్లలకు రాకుండా చూసుకున్నాను."

"నీ పిల్లలు పెద్దవాళ్లయిపోయారు కదా! మళ్లీ మూడో పెళ్లి ఎందుకు చేసుకున్నావు?" అంది మంజరి.

"ఏమో! రాబర్ట్ పెళ్లిచేసుకుంటానంటే నాకేమీ అభ్యంతరం కనబడలేదు. అందుకే చేసుకున్నాను. అతని సంపాదన అతనిది. నా సంపాదన నాది. కలిసి ఉంటాము" అంది లిండా.

అలా అడిగి ఆమెను బాధపెట్టానేమో అనుకుంది మంజరి. మౌనంగా ఉన్న మంజరిని చూసి, "నీకెప్పుడూ మళ్లీ పెళ్లి చేసుకోవాలనిపించలేదా?" అంది లిండా.

ఆ మాట వినగానే ఏదో తప్పు మాట విన్నట్లుగా కంగారుపడింది. మంజరి కళ్లల్లోని బెదురు చూసి, ఏమయ్యిందన్నట్లుగా చూసింది.

"మా సంప్రదాయంలో స్త్రీకి పునర్వివాహం లేదు. ఒకసారి పెళ్లి అయ్యిందంటే ఆ బంధానికి కట్టుబడి ఉంటాము. భర్త పోయినా, భర్త వదిలేసినా ఆడది మిగిలిన జీవితాన్ని ఒంటరిగానే ప్రయాణం సాగిస్తుంది" అని చెప్పింది మంజరి.

"మరి వయసులో ఉన్న కోరికలు?" అడిగింది లిండా.

"వాటిని భర్త చితితోనే కాల్చివేస్తాము."

మంజరికి అంత బాగా ఇంగ్లీష్ రాకపోయినా లిండాతో పరిచయం ఆమె ఇంగ్లీష్ నేర్చుకునేటట్లుగా చేసింది. ఎవరూ తోడు లేకుండా, మాట్లాడేవారు లేకుండా బ్రతకడం కష్టం. అందుకే కొడుకు, కోడలు మాట్లాడుకుంటుంటే శ్రద్ధగా వినేది. కొత్త పదాలు దొర్లితే వాటి అర్థం తెలుసుకుందుకు ప్రయత్నించేది. అలా మెల్లిగా ఆమె తన ఇంగ్లీష్ పరిజ్ఞానాన్ని పెంచుకునేందుకు కృషిచేసింది. ఆమె ఈ ప్రయత్నం ముందు ముందు ఎంతో లాభదాయకంగా పరిణమిస్తుందని అప్పుడు ఆమెకు తెలియదు. లిండా కూడా మంజరి కోసం మెల్లిగా ఆమెకు అర్థమయ్యే రీతిలో మాట్లాడడానికి ప్రయత్నించేది.

* * *

మంజరికి ఇండియా వెళ్లాన్న కోరిక కలిగింది. వచ్చి చాలా రోజులయ్యింది. అక్కని, పుట్టి పెరిగిన దేశాన్ని చూడాలన్న కోరిక తీవ్రంగా మొదలయ్యింది.

"నాకు ఇండియా వెళ్లాలని ఉందిరా" అంది కొడుకుతో.

తల్లి ఇండియా వెడతానంటే గుండెల్లో రాయి పడింది. ఆమె అలా వెళ్లాల్సిన అవసరం రాకూడదని మేనమామ ద్వారా గ్రీన్ కార్డ్ సాధించాడు. తల్లి ఉండబట్టి తామిద్దరూ హాయిగా ఉద్యోగాలు చేసుకోగలుగుతున్నారు. బాబును డేకేర్‌లో వేయడం, వాడికి ఒంట్లో బాగుండకపోతే సెలవులు పెట్టడం, ఇలాంటి బాదరబందీలు లేకుండా జీవితం ఆనందంగా గడిచిపోతోంది.

తల్లి మూలంగా శారీరకంగా, ఆర్థికంగానూ చాలా లబ్ధిపొందుతున్నాడు. ఇంటి క్లీనింగ్ ఖర్చులు, వంటమనిషి ఖర్చు, బాబును చూసుకునే నానీ ఖర్చు అన్నీ మిగులుతున్నాయి. ఆల్ ఇన్ వన్‌గా అన్ని పనులూ ఆమె ఒక్కర్తే చేస్తోంది.

బాబు గురించి నిశ్చింత. ఆమె వెళ్ళిపోతే అన్ని సౌకర్యాలూ పోతాయి. “ఇప్పుడు ఇండియా వెళ్లి ఏం చేస్తావమ్మా?” అన్నాడు.

“ఇల్లు మూతపెట్టి ఏడాది గడిచిపోయింది. నువ్వు రమ్మనగానే హడావుడిగా వచ్చాను. ఆరునెలల్లో వెళ్లిపోతాననుకున్నాను. ఇల్లు ఎలా ఉందో ఒకసారి చూసుకోవాలిరా” అంది.

“అయినా నువ్వు ఒక్కర్తివీ అక్కడ ఉండడం ఎందుకమ్మా? బాబుకు నువ్వు బాగా అలవాటు అయ్యావు. వాడు నువ్వెళ్లిపోతే బెంగపెట్టుకుంటాడేమో! ఇంటి సంగతి దొడ్డమ్మకో లేకపోతే మీ ఫ్రెండ్స్ ఎవరికైనా అప్పజెపుదాము. మనం సహాయం చెయ్యమంటే ఆ మాత్రం చెయ్యరా?” అన్నాడు.

“అంటే నీ ఉద్దేశం నన్ను పర్మినెంట్‌గా నీ దగ్గరే ఉండిపొమ్మనా?”

“నా దగ్గర ఉండిపోతావనే కదా నీకు గ్రీన్ కార్డ్ చేయించింది. ఒక్కర్తివీ అక్కడెలా ఉంటావు?”

“మరి ఇల్లు, సామాను అలా వదిలేస్తే పాడయిపోతాయి కదా!”

ఊళ్లో మావగారి కాలం నాటి పాత ఇల్లు మూడు వందల గజాల స్థలంలో ఉంది. సొంత ఇల్లు ఉండబట్టే తన ఉద్యోగంతో కొడుకుని ఇంజనీరింగ్ చదివించగలిగింది.

“ఫోన్ చేసి మీ ఫ్రెండ్స్ ఎవరికైనా చెప్పు. ఆ ఇల్లు ఖాళీ చేసి, ఆ సామానంతా అమ్మేయమను. ధర వస్తే ఇల్లు కూడా అమ్మేయమను. నీ చీరలూ అవీ వాళ్లింట్లో పెట్టుకుంటే నువ్వు వెళ్లినప్పుడు తెచ్చుకోవచ్చు. ఇల్లెవరికైనా అద్దెకిమ్మని చెప్పు” అన్నాడు.

“అలా ఫోన్‌లో పనులయిపోతాయా? ఒకసారి వెళ్లొస్తే బాగుంటుందని ఉంది” ఏం చెయ్యాలో పాలుపోక వెళ్లకుండా పనులవ్వవన్నట్లుగా గొణిగింది.

“పోనీలే అంతగా కావాలంటే నెక్స్ట్ ఇయర్ వెళ్లి అప్పుడు ఆ ఇల్లు కూడా అమ్మేద్దాం” అన్నాడు.

ఇల్లు అమ్మడం ఇష్టం లేదు మంజరికి. సరే ఇంకో సంవత్సరం అంటున్నాడు కదా! అప్పుడు వెళ్లి రావచ్చు. ఇల్లు ఏం చెయ్యాలన్నది అప్పుడు ఆలోచించవచ్చు అనుకుంది.

ప్రతిమకు ఫోన్ చేసి కొడుకంటున్న మాటలు చెప్పింది. ప్రతిమకెందుకో మంజరి కోసం గ్రీన్ కార్డ్ అప్లై చెయ్యడంలో దినేష్‌కు ఏ స్వార్థం లేదనిపించడం లేదు. ఆమెను రానీకుండా మనవడి పేరు మీద ఆమెను అక్కడే ఉంచడం కూడా నచ్చలేదు.

ఆ విషయమే భర్త దగ్గర వ్యక్తపరిచింది. "నీవన్నీ అనుమానాలు ప్రతిమా! ఎంత లేదన్నా అతను ఆవిడ కొడుకు కదా! తల్లిని తన దగ్గర ఉంచుకోవా లనుకోవడంలో తప్పేముంది?"

"ఎందుకో అతను స్వార్థపరుడేమో అనిపిస్తోంది. అంత తల్లిమీద ప్రేమ ఉన్నవాడు తల్లికి చెప్పకుండా ఎలా పెళ్లి చేసుకుంటాడు?"

"మనిషి ప్రవర్తన సమయంతో బాటు మారుతుంది ప్రతిమా! బహుశా అప్పుడు చిన్నతనం మూలాన పెళ్లి విషయంలో తొందరపడి ఉంటాడు. ఇప్పుడు బహుశా రియలైజ్ అయి ఉంటాడు" అన్నాడు.

"పోనీలెండి. ఎక్కడో ఉన్న ఆ తల్లీకొడుకుల గురించి మనిద్దరం వాదన పెంచుకోవడం అనవసరం. ఆమె అదృష్టం ఆమెను ఎక్కడికి తీసుకువెడితే అక్కడకు వెడుతుంది" అంది ఆ ప్రస్తావన అక్కడితో ఆపడానికి.

అప్పటికీ తన వంతుగా మంజరిని హెచ్చరించింది. గ్రీన్‌కార్డ్ అప్లై చేస్తున్నప్పుడు కూడా తొందరపడుతున్నావేమో ఆలోచించుకోమని హెచ్చరించింది. ఇప్పుడు కూడా బాగా ఆలోచించుకుని నిర్ణయించుకో. ఇది నీ జీవితానికి సంబంధించిన సమస్య. దేశం కాని దేశం అని.

మంజరి "నీకు నా మీద ప్రేమ ఎక్కువై అన్నీ విపరీతంగా ఆలోచిస్తున్నావు" అంది.

మంజరి చెప్పినట్లుగా ఇంట్లో సామానంతా అమ్మేసి, మంజరి బట్టలు, పుస్తకాలు పెట్టెల్లో సర్ది ఇంట్లో ఉన్న ఒక అలమారాలో పెట్టి తాళం వేసి ఇల్లు అద్దెకు ఇచ్చారు. ఒక సంవత్సరం తరువాత వచ్చి తన సామాను తీసుకువెడుతుందని అద్దెవాళ్లకు చెప్పింది ప్రతిమ. ఇల్లు విశాలంగా చుట్టూ పెరడుతో బాగుండబట్టి వాళ్లు ఆ సామాను గురించి అభ్యంతరం తెలుపలేదు.

* * *

అలారం మోగడంతో మంజరికి మెలకువ వచ్చింది. కళ్లు తెరిచిన మంజరి తన పక్కన పడుకున్న ధీరజ్‌ను చూసి, వీడెప్పుడు వచ్చాడనుకుంది.

అమెరికా వచ్చినా తన అలవాట్లు మార్చుకోలేదు. ధీరజ్ మరీ చిన్నపిల్లవాడిగా ఉన్నప్పుడు వాడు రాత్రుళ్లు నిద్రపోనప్పుడు వాడితోబాటు జాగారం చెయ్యాల్సి వచ్చేది. అందుకని పొద్దున త్వరగా లేవలేకపోయేది. ఇప్పుడు కొంచెం పెద్దవాడయ్యాడు.

రాత్రి పడుకుంటే పొద్దున లేస్తాడు. వాడు వాడి క్రిబ్‌లో పడుకుంటాడు కనుక అయిదున్నరకల్లా లేచి తన యోగా, మెడిటేషన్ చేసుకుని, ఆపైన తన పని ప్రారంభిస్తుంది. ధీరజ్‌ని బహుశా కొడుకు తీసుకువచ్చి పడుకోబెట్టి ఉంటాడనుకుంది. వాడు పడకుండా చుట్టూ తలగడాలు పెట్టి తన పని ప్రారంభించింది.

కొడుకు లేచాక చెప్పాడు. రాత్రి లేచి నాన్నమ్మ కావాలని ఏడ్చాడని.

"నేను మంచి నిద్రలో ఉండగా వాడి ఏడుపు విని లేచానమ్మా. ఏం కావాలంటే నాన్నమ్మ అన్నాడు. నిన్ను లేపడం ఎందుకని నీ పక్కలో పడుకోబెట్టాను. నిన్ను చూడగానే నిద్రపోయాడు. వాడికి నువ్వంటే చాలా అటాచ్‌మెంట్" అన్నాడు.

రోజంతా ఎవరితో ఉంటే వాళ్లతో అటాచ్‌మెంట్ ఉండదూ! పసిపిల్లల హృదయాలు పువ్వు కన్నా మెత్తన. కల్మషం తెలియని మనసులు. ఎవరు ప్రేమగా చూస్తే వాళ్లే తనవారన్న ధీమా.

దినేష్ చిన్నతనం వాడి ముద్దు మాటలూ ఎక్కువ రుచి చూడలేక పోయింది మంజరి. వాడు ఎక్కువగా నాన్నమ్మ దగ్గర పెరిగాడు. ఆవిడ ముచ్చటకు అడ్డు రావడమెందుకని వాడ్ని అత్తగారి పెంపకంలోనే వదిలేసింది. ఆ తరువాత ఉద్యోగ బాధ్యతలు. వాడి చిన్ననాటి ముచ్చట్లు అనుభవించనే లేదు. ఇప్పుడు వాడి కొడుకులో వాడి చిన్నతనాన్ని చూసుకుంటోంది.

రోజూలాగే ధీరజ్‌ను తీసుకుని పక్కనున్న పార్క్‌కి వెళ్లింది. ఆ ఏరియాలో ఇండియన్స్ ఎక్కువ లేకపోయినా దూరదూరంగా ఒకటీ అరా ఉన్నారు. అలా ఉన్నవాళ్లలో నమ్రత అన్న అమ్మాయితో పరిచయం అయ్యింది. ఆ అమ్మాయి

నార్త్ ఇండియన్ బిజినెస్ ఫ్యామిలీకి చెందినది. ఇద్దరు పిల్లలు చూడముచ్చటగా ఉన్నారు. ఒక పాప, ఒక బాబు.

రెండు రోజుల పరిచయంలోనే మా ఇంటికి రండి అంటూ తీసుకువెళ్లింది. వాళ్ల పిల్లలతో ధీరజ్ ఆడుకుంటాడులే అని తీసుకువెళ్లింది. ధీరజ్ వాళ్ల పిల్లలతో ఆడుకుందుకు ఇష్టపడ్డాడు. పిల్లలు ఆడుకుంటున్న సమయంలో టీ చేసి తీసుకువచ్చి మంజరికి ఇచ్చి తాను తాగుతూ మంజరి వివరాలు అడిగింది.

ఇప్పుడు మంజరి ఇంగ్లీష్ బాగానే మాట్లాడగలుగుతోంది. తన గురించి వివరాలు చెప్పింది. మనవడి కోసం ఇక్కడ ఉండిపోయానని, వాడ్ని విడిచి వెళ్లాలని లేదని చెప్పింది.

“నీ గురించి వివరాలు చెప్పమ్మా” అంది.

నమ్రత వాళ్లు ముగ్గురు ఆడపిల్లలు. పుట్టింటివారు, అత్తింటివారు అందరూ బిజినెస్‌లో ఉన్నారు. నమ్రత భర్త పంకజ్ గుప్తా మాత్రం మొదటినుంచీ చదువు అంటే ఇష్టంతో తండ్రి వద్దన్నా వినకుండా ఇంజనీరింగ్ చేసి పైచదువులకు అమెరికా వచ్చాడు.

అతని చదువు పూర్తి కాకుండానే పెళ్లి చేసుకోవాల్సి వచ్చింది. అమెరికా వచ్చే ముందే పెళ్లి చేసి పంపారు. చదువు పూర్తయిన వెంటనే ఉద్యోగం వచ్చింది. ఉద్యోగంలో చేరాక భార్యను తీసుకుని వచ్చాడు.

ఇంతకుముందు వాషింగ్టన్‌లో ఉండేవారుట. ఈ మధ్యనే న్యూజెర్సీ వచ్చారు. పంకజ్ ఆఫీసు ఈ ఏరియాకు దగ్గరని ఇక్కడ ఇల్లు తీసుకున్నారు.

“మరి అంత బిజినెస్ వదిలి ఇంత దూరం ఉద్యోగానికి రావాల్సిన అవసరం ఏమిటమ్మా?” అంది మంజరి.

“మా బిజినెస్ ఫామిలీస్‌లో చాలా ప్రాబ్లెమ్స్ ఉంటాయి ఆంటీ. ఒకటి పంకజ్‌కు బిజినెస్ అంటే ఇష్టం లేదు. అదీకాక మా ఆయన ఒక్కడే కొడుకు. ఇద్దరు అక్కలు. ఏదో వంక పెట్టి మా ఆడపడుచులు మా ఇంటికి వస్తూ పోతూ ఉంటారు. వాళ్లు ఈయనకు అక్కలవడం వలన మా అత్తగారితో బాటు నా మీద కూడబలుక్కున్నట్లు ఆంక్షలు విధిస్తారు.

వచ్చేపోయే చుట్టాలతో మా అత్తవారిల్లు ఒక సత్రవలా ఉంటుంది. నాకు ఏ విధమైన ఫ్రీడం ఉండదు. నా భర్తతో పగలు మాట్లాడడానికి అవకాశం

ఉండదు. ఇవన్నీ తప్పించుకుందుకే మేం అమెరికా వచ్చాం. అక్కడ పదిమంది నౌకర్లతో పని చేయించుకునే నేను, ఇక్కడ అన్ని పనులూ చేసుకుంటున్నాను. ఇక్కడ అలసట ఉన్నా నాకు స్వేచ్ఛ ఉంది. నేను, నా భర్త, పిల్లలు, నా ఇష్టం. ఆంక్షలు లేని జీవితం. మనిషికి డబ్బు అవసరమే కానీ స్వేచ్ఛ లేని జీవితం నరకప్రాయం కదా ఆంటీ" అంది.

స్వేచ్ఛ మనిషికి అవసరమే కానీ అది కావాలని కుటుంబం వద్దనుకుంటే ఎలాగా? వాళ్ల ఆంక్షలను అధిగమిస్తూ అక్కడ ఉండలేకపోయిందా? ఉన్న ఒక్క కొడుకూ దూరమైతే ఆ తల్లితండ్రుల మనస్థితి ఎలా ఉంటుంది? పొట్ట చేత పట్టుకుని వచ్చినవాళ్ల సంగతి అయితే పోనీలే అనుకోవచ్చు.

వాళ్ల ఆంక్షల మధ్య అనురాగం ఉందేమో! అది గ్రహించడానికి కొంత సమయం కావాలి. ఆ సమయం వచ్చిందాకా కూడా పరిస్థితులు మారకపోతే అప్పుడు ఈ నిర్ణయం తీసుకుని ఉంటే బాగుండేది. తన మనసులోకి వచ్చిన ఆలోచనను బైటపెట్టలేదు. ఇంత స్వల్ప పరిచయంలో ఆ అమ్మాయికి సలహా ఇవ్వడం అంత మంచిది కాదనుకుంది మంజరి.

ఈ దేశం కాని దేశంలో ఒక్కొక్కరికీ ఒక్కో కథ.

నమ్రత ఏదో వంకన మంజరి దగ్గరకు వస్తూ ఉండేది. "ఆంటీ! నాకు మీ వంటలంటే చాలా ఇష్టం. ఇడ్లీ, దోశ, సాంబార్ ఎలా చెయ్యాలో మీ దగ్గర నేర్చుకుంటాను" అనేది.

మంజరికి ఎవర్నీ వద్దనే స్వభావం కాదు. తనకొచ్చినది నలుగురికి నేర్పితే తప్పేమిటి? అనుకుంటుంది.

మొత్తానికి నమ్రత చాలా చలాకీ అయిన పిల్ల. రెండేళ్లయి ఉంటున్నా ఆ చుట్టుపక్కల అంతమంది ఇండియన్స్ ఉన్నట్లుగా మంజరికి తెలియదు. ఈ అమ్మాయి వచ్చిన రెండు నెలల్లోనే అందర్నీ కలిపి గెట్ టు గెదర్‌లూ, పాట్ లంచ్‌లూ అంటూ మొదలుపెట్టింది. ఆ అమ్మాయి ఉత్సాహం చూసిన మంజరి తను కూడా ఆమెతో సమానంగా చేస్తూ ఆ అమ్మాయిని ప్రోత్సహించేది.

ఒక రోజు సెలవు పెట్టి ఇంట్లో ఉన్న వైశాలి ఇలాంటి ప్రోగ్రామ్ ఉందని తెలిసి "నేను కూడా పార్టిసిపేట్ చేస్తాను మమ్మీ. ఈ ఆఫీస్ పనితో బుర్ర వేడెక్కిపోయింది. నాకెప్పుడూ ఇలాంటి అవకాశం దొరకదు" అంది.

సరదాగా తన గ్రూప్‌లో కోడలు కూడా పాల్గొంటానందని మంజరి ఎంతో మురిసిపోయింది. ధీరజ్ ఆనందం ఇక చెప్పనే అక్కరలేదు. పొద్దస్తమానూ జైల్‌లో ఉన్నట్లుగా ఇంట్లోనే ఉండాలంటే వాడికి విసుగే. ఇలా అందరూ కలవడంతో పిల్లలకు కూడా కంపెనీ దొరికి చక్కగా ఆడుకోవడం మొదలుపెట్టారు.

అందరూ కలిపి తంబోలా ఆడారు. పాటలు వచ్చినవాళ్లు పాటలు పాడారు. నమ్రత పిల్లలతో రకరకాల ఆటలు ఆడించింది. ఆటలు, పాటలతో అలిసిపోయాక అందరూ కలిపి వాళ్లు చేసి తెచ్చిన వంటలు తిన్నారు. మంజరి పెరుగు గారెలు, అల్లం పచ్చడి చేసింది. అందరూ తెగ మెచ్చుకున్నారు. పోటీల మీద నాకు నేర్పండి నాకు అంటూ మొదలుపెట్టారు. అందరికీ నేర్పుతానంది మంజరి.

ఇవన్నీ తెలిసిన లిండా నిష్టూరంగా మాట్లాడింది. "ఇదివరకు నేనొక్కర్తినే నీ ఫ్రెండ్‌ని. ఇప్పుడు మీ ఇండియన్ ఫ్రెండ్స్ దొరికేసరికి నన్ను మర్చిపోయావా?" అని.

మంజరి బాధపడుతూ, "అదేమీ లేదు నిన్ను మర్చిపోవటం అంటూ జరగదు. ఈ గడ్డ మీద అడుగుపెట్టాక నాకు దగ్గరగా వచ్చిన మనిషివి నువ్వు. నిజం చెప్పాలంటే నీ తరువాతే ఎవరైనా. నువ్వు నా బెస్ట్ ఫ్రెండ్‌వి" అంది.

లిండా మొహంలో నవ్వు. "ఊరికే జోక్‌గా అన్నాను" అంది. నిజమైన స్నేహానికి భాష, వయసు అడ్డురావని నిరూపించుకున్నారు లిండా, మంజరి.

* * *

ధీరజ్ పెద్దవాడవుతున్నాడు. అందుకే కొంచెం సమయం దొరుకుతోంది మంజరికి. మెల్లిగా కొడుకు తెచ్చే లైబ్రరీ పుస్తకాలు చదవడం మొదలుపెట్టింది. తల్లి, తాతలాగా దినేష్‌కు పుస్తకాలు చదివే అలవాటు ఉంది. దగ్గర్లో ఉన్న లైబ్రరీ నుంచి పుస్తకాలు తెస్తూ ఉంటాడు. కాలక్షేపం కోసం మెల్లిగా ఆ పుస్తకాలు తిరగవెయ్యడం మొదలుపెట్టింది మంజరి. ముందు అంతగా అర్థం అయ్యేవి కావు. చదవగా చదవగా ఇంగ్లీష్ సాహిత్యంలో అభిరుచి పెరిగింది. 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్న సామెత గుర్తు చేసుకుంటూ ఉంటుంది.

తన ప్రయాణం ఎక్కడ మొదలుపెట్టింది? ఇప్పుడు ఎక్కడకు చేరుకుంది? అని ఆలోచిస్తే అవసరం మనిషికి అన్నీ నేర్పుతుంది. ఈ వయసులో నేర్చుకుంటున్న విద్యలు తనను ఎక్కడకు తీసుకువెడతాయి?

అనాదిగా మానవుడు సంతోషానికి నిచ్చెనలు వేయడంలో ఉయ్యాల నుంచి కాటిదాకా ప్రయత్నిస్తూనే ఉన్నాడు. దానికోసం ఎంతో కష్టనష్టాలకు కూడా లోనవడానికి తాపత్రయపడతాడు. అలాంటి తాపత్రయమే నేటి ఎన్నో ఆవిష్కరణలకు మూలమయ్యింది. మానవుడు తన మేధస్సుకు పదును పెట్టడం మూలంగా నేడు అది ప్రపంచంలోని ఎన్నో ఆవిష్కరణలకు స్వాగతం పలికింది.

* * *

మంజరి జీవితంలో ఆమె ఊహించని మార్పు రాబోతోంది. ధీరజ్ నాలుగేళ్ల వాడయ్యాడు. దినేష్‌కు మంజరి అవసరం అంతగా కనిపించటం లేదు. బిజినెస్ మేన్‌లా లెక్కలు మొదలుపెట్టాడు.

అమెరికాలో అందరూ భయపడేది మందులు, డాక్టర్లు. మెడికల్ ఇన్స్యూరెన్స్ చాలా తక్కువకు తీసుకున్నాడు. అనుకోకుండా ఏదైనా పెద్ద రోగం వస్తే కష్టం. అలా దినేష్ ఫ్రెండ్స్ కొంతమంది అప్పుల్లో మునిగిపోయారు.

ఒక రోజు మాటల్లో...

"అమ్మా! మా ఫ్రెండ్ నీలేష్ ఉన్నాడు కదా! ధీరజ్ పుట్టినరోజుకు వచ్చాడు జ్ఞాపకం ఉందా?" అన్నాడు.

ఈ సంభాషణ దేనికి ఉపోద్ఘాతమో తెలియలేదు. సడన్‌గా నీలేష్ గురించి చెప్తున్నాడంటే ఏమయ్యిందో అని భయపడింది మంజరి.

"ఏమయ్యింది నాన్నా! అందరూ బాగున్నారు కదా!" అంది.

"అరె! అలా భయపడుతున్నావు ఎందుకు? నేను చెప్పేది మంచి మాటలే. భయం అవసరం లేదు. నీలేష్ ఇల్లు కొనుక్కున్నాడు.

ఇప్పుడున్న అపార్ట్‌మెంట్ చిన్నది కదా! వాళ్ల అమ్మా, నాన్నా కూడా అతనితోనే ఉంటున్నారు" అన్నాడు.

"అమ్మా, నాన్నా, కొడుకు కలిసి ఉండడానికి ఎంతో పెట్టి పుట్టాలి. మీ నాన్నగారు కూడా ఉంటే నీకు కూడా ఆ అదృష్టం కలిగి ఉండేది" అంది మంజరి.

తను చెప్పదల్చుకున్న విషయం పక్కదోవ పడుతున్నట్లుగా అనిపించింది దినేష్‌కు.

"అది కాదమ్మా! వాళ్లు చాలా పెద్ద ఇల్లు కొనుక్కున్నారు. వాళ్లింట్లో అందరూ

కష్టపడతారు. వాళ్ల అమ్మా, నాన్నా ఇద్దరూ బేబీ సిట్టింగ్ చేస్తారు. అదికాక వాళ్లమ్మగారు రొట్టెలు చేసి అమ్మడం లాంటివి కూడా చేసి డబ్బు సంపాదిస్తారు. ఇక్కడ మెడికల్ చాలా కష్టమమ్మా. ఒకసారి సిటిజెన్‌షిప్ వస్తే గవర్నమెంట్ చాలా ఫెసిలిటీస్ ఇస్తుంది. కానీ మామూలు వాళ్లకు కష్టమే. రోగాలు వచ్చినప్పుడు చాలామంది అప్పులపాలయిపోతారు. అందుకే కొంతమంది ముందు జాగ్రత్తగా ఉద్యోగం చేసి డబ్బు కూడబెడతారు. వీళ్లు కూడా కొడుక్కు కష్టం కలగకూడదని వాళ్ల ఖర్చుకు వాళ్లు డబ్బు సంపాదించుకుంటున్నారు" అన్నాడు.

మంజరేం అమాయకురాలు కాదు. కొడుకు ఉద్దేశం చూచాయగా అర్థం అయ్యింది. 'అంటే ఈ వయసులో తనను కూడా ఉద్యోగం చెయ్యమనా! తన ఖర్చుకు తను డబ్బు సంపాదించుకోమనా! తన అనుమానమేనా? లేక నిజంగా వాడి ఉద్దేశం అదేనా?' అని అనుకుంది.

"మంచిది కదా! ఇంట్లో అందరూ కష్టపడ్డం చాలా మంచిది. ఒక్కడి కష్టం మీద అందరూ తినడం అంత మంచిది కాదు. మనిషి ప్రోగ్రెస్ అవడం కష్టం. తినే చేతులు ఎక్కువ, సంపాదించే చేతులు తక్కువ ఉన్నప్పుడు ఆ కుటుంబం ఆర్థికంగా ముందుకు వెళ్లలేదు. ఆ కారణంగానే నేను కూడా ఉద్యోగం చేసేదాన్ని.

అలా చదువుకుని నేను ఉద్యోగం చెయ్యబట్టే మీ నాన్నగారు పోయిన తరువాత మన సంసారనౌక కుంటుపడకుండా సాగింది. ఇంతకీ వాళ్లు మన తెలుగువాళ్లేనా? అలా అయిన పక్షంలో వాళ్లను నిజంగా అభినందించాలి. కష్టపడి కొడుకును చదివించాం. మనం వాడి నుంచి మనం ఖర్చుపెట్టిన డబ్బు వసూలు చేసుకుందాం అని అనుకోకుండా ప్రవర్తిస్తున్నందుకు వాళ్లను అభినందించాలి" అంది మంజరి.

"వాళ్లు తెలుగువాళ్లు కాదు. గుజరాతీలు" అన్నాడు.

"అలాగా వాళ్లు ఇలాంటి పనిచేస్తున్నందుకు మీ నీలేష్ ఏం అనలేదా? చిన్నతనం ఫీలవలేదా!" అంది.

"ఇక్కడ అలాంటివన్నీ లేవమ్మా. వాళ్లల్లో అసలే అలాంటి ఫీలింగ్ లేదు. చాలామంది గుజరాతీలు ఇలా పనిచేస్తారు. వీళ్లల్లో కొంతమంది టూరిస్ట్ వీసామీద వచ్చి, ఉన్న ఆ ఆరునెలలూ సంపాదించుకుని వెళ్లిపోతారు" అన్నాడు.

"అలాగా చాలా బాగుంది" అంది మంజరి. కొడుకు ఉద్దేశం అర్థం అయినా అర్థం కానట్లుగా ఊరుకుంది.

అమ్మకు తను చెప్పినది అర్థమయ్యిందో లేదో అన్న దిగులు దినేష్‌కు.

మంజరి మంచంమీద పడుకున్నాక కొడుకు మాటలను పునశ్చరణ చేసుకుంది. తన కొడుకు, అవసరం తీరిపోయింది కనుక తనను వదల్చుకుందా మని చూస్తున్నాడా! పిల్లలకు తల్లితండ్రులు భారమైపోతారా? ప్రశాంతంగా గడుస్తున్న తన జీవితంలో అలజడి రేపటానికన్నట్లు ఇక్కడకు పిలిపించాడు.

అమ్మ కదా మనం ఎలా చెప్తే అలా వింటుంది. ఆమె ప్రేమ, శ్రమ తన హక్కు అనుకున్నాడా? ఇప్పుడు వాడి అవసరం తీరిపోయింది కాబట్టి, తన భారం మోయడానికి సిద్ధంగా లేడా?

మంజరికు ఎప్పుడో చదివిన వాక్యాలు గుర్తుకు వచ్చాయి.

The worst in life is ataachment... It hurts when you lose it. The best thing in life is lonliness.

కానీ అటాచ్‌మెంట్ దుఃఖాన్ని మిగులుస్తుందని తెలిసినా మానవుడు అది లేకుండా ఉండలేకపోతున్నాడు. ఈ అటాచ్‌మెంట్ అన్నది లేకపోతే భార్య, పిల్లలు, అమ్మ, నాన్న, అక్క, చెల్లి, అన్నదమ్ముల అనుబంధానికి అర్థం లేకుండా పోతుంది.

ఎవరికి వారే అన్నట్లుగా ఉంటే ఈ ప్రపంచం సాగుతుందా? పిల్లల్ని కని పెంచడం బాధ్యత అనుకుంటూనే తల్లీతండ్రీ అందులో ఆనందాన్ని అనుభవిస్తున్నారు. కాబట్టే వాళ్లకోసం అన్ని రకాల కష్టాలని అధిగమించాలని తాపత్రయపడుతున్నారు.

అదేవిధంగా పిల్లలకు కూడా అలాంటి అనుబంధం ఉండాలి కదా! తన పిల్లలు, సంసారం వచ్చాక అమ్మా, నాన్నా అక్కరలేని వస్తువుల కింద అనుకుంటే రేపు వాళ్ల పిల్లలు కూడా అలా అనుకోరా? ఇది ఒక విషవలయం. ఇలా నడుస్తూనే ఉంటుంది.

నువ్వు కూడా సంపాదన మొదలుపెడితే బాగుంటుందని ఒకచిన్న హెచ్చరిక లాంటిది చేసాడు. దీన్ని పాజిటివ్‌గా ఆలోచిస్తే వాడు కూడా ఇంకా జీవితంలో ఎదగాలి కాబట్టి, అందరూ కష్టపడితే ఆర్థికంగా ఇంకొంచెం బాగుపడవచ్చన్న ఉద్దేశం అయి ఉంటుంది.

అలా ఆలోచించిన మంజరి కొడుకు ఆలోచనకు ఒక రూపకల్పన చేయదల్చుకుంది. బైటికి వెళ్లకుండానే తన చేతిలో ఉన్న విద్యతో ఏదైనా చెయ్యగలిగితే బాగుంటుంది. నమ్రత ద్వారా ఇండియన్స్ ఎవరికైనా బ్లౌజు కావాలంటే కుట్టి ఇవ్వచ్చు. చాలామంది ఇండియా వెళ్లినప్పుడు కుట్టించుకుంటారని వింది. ముందుగా దీనికి ఒక సూయింగ్ మిషన్ కావాలి. లిండా సహాయంతో ఒక మిషన్ కొనుక్కుని పని ప్రారంభించవచ్చు.

కొడుకు ఉద్దేశం తెలిసింది. ఈ విషయంలో కోడలి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలని ఉంది మంజరికి. కానీ ఇదివరలో అయిన అనుభవంతో ఆ పని చెయ్యలేకపోయింది.

వైశాలి చాలా తెలివైనది. తనకు కావాల్సిన పనులు మంచిగా ఎదుటివారితో ఎలా చేయించుకోవాలో తెలుసు. అనవసర విషయాల్లో జోక్యం చేసుకోదు. దినేష్, మంజరిల మధ్య వీలైనంతవరకు తను కలుగజేసుకోకుండా దూరంగా ఉంటుంది. ఆమెకు కావాల్సిన పనులు కొన్ని డైరెక్ట్‌గా 'మమ్మీ' అంటూ ప్రేమగా మాట్లాడి చేయించుకుంటుంది. మిగిలిన విషయాలు దినేష్‌తో చర్చించి అతని ద్వారా చేయిస్తుంది.

ఇప్పుడు కొడుకు చెప్పిన మాటల్లో ఆమె అభిప్రాయం కూడా ఉందో లేదో తెలియదు. ఒక్క నిముషానికి ఇండియా వెళ్లిపోతే అనిపించింది. సొంత ఊరు, సొంత ఇల్లు, తెలుసున్న మనుషుల మధ్య ఎక్కువ సంఘర్షణ లేకుండా జీవితం సాగించవచ్చు. ఇదివరకటి ఉద్యోగం లేకపోయినా ఒక్క పొట్టకు సంపాదన పెద్ద కష్టం కాదు.

మనవడన్న పాశం మంజరిని వెనక్కు లాగింది. ఇన్ని రోజులు అలవాటైన వాడు, వాడి ముద్దు మాటలు లేకుండా తను ఉండగలుగుతుందా! అక్కడికెళ్లినా కొడుకు తన జరుగుబాటుకు డబ్బు పంపుతాడన్న గ్యారంటీ లేదు. అక్కడ పడే కష్టం ఇక్కడే పడితే తనవాళ్ల మధ్య ఉన్నానన్న సంతృప్తి మిగులుతుంది. ఈ అనుబంధాలు పీటముళ్ల లాంటివి. విప్పుకుందామన్నా సాధ్యంకానివి. ఈ బంధాల్లో మనిషి శ్లేష్మంలోని ఈగలా బైటికి రాలేడు.

కొడుకుతో వెళ్లి మిషన్ కొని తెచ్చుకుంది. తనకొచ్చిన విద్యతో ఇంట్లోనే ఉండి సంపాదించదల్చుకుంది. బైటికి వెళ్ళాలంటే కారూ వ్యవహారం అదంతా పెద్ద తలకాయ నొప్పి. అయినా తన చదువుకు ఇక్కడ ఏ ఉద్యోగం దొరుకుతుంది?

నమ్రత ద్వారా ఇద్దరు ముగ్గురు దొరికారు. లిండా దగ్గర కొన్ని చేతిపనులు నేర్చుకుని డైపర్ పాడ్స్, పుస్తకాలు తయారుచెయ్యడం మొదలుపెట్టింది. మంజరి చేతి పనితనానికి త్వరలోనే మంచిపేరు తెచ్చుకోగలిగింది. చీరలు కట్టుకునే వాళ్లకు బ్లౌజ్ సమస్య తీరింది.

* * *

జీవితం ఒడిదుడుకులు లేకుండా సాగితే అది జీవితం అనిపించుకోదు. ఆ ఒడిదుడుకుల నుంచి తనకు తానే బైటపడాలి తప్ప ఎవరో మనను బైట పడవేస్తారనుకోవడం భ్రమ. ఆ బాధలనుంచి బైటికి వచ్చి కొత్త జన్మతో ఆవిర్భవించాలి. మంజరి జీవితం దీనికి తార్కాణం.

అమె జీవితంలో అడుగడుగునా కొత్త సమస్యలు, అవరోధాలు. చిన్నప్పట్నించీ సమరయోధురాలిలాగా జీవితంలో పోరాడుతూనే ఉంది. సమస్యల కొలిమిలో కాలుతూనే ఉంది. ఆమె నమ్ముకున్న దేవుడు ఆమెకు ఆత్మస్థైర్యాన్ని కల్పించాడు.

జీవితమనే వైకుంఠపాళీలో ఆమె నిచ్చెనల కన్నా, పాముల నోట్లో ఎక్కువగా పడుతూ ముందుకు సాగాల్సివచ్చింది.

వైశాలికి షాకింగ్ న్యూస్. ఆమె తమ్ముడు, తండ్రి కార్ యాక్సిడెంట్‌లో చనిపోయారన్న కబురు. ఏడుస్తున్న కోడల్ని ఓదార్చింది మంజరి. అపర్ణ ఏడుస్తూ ఫోన్ చేసింది. ఒంట్లో బాగులేక ఆ రోజు వాళ్లతో వెళ్లలేదుట.

వైశాలి తమ్ముడు మరీ పెద్దవాడేమీ కాదు. వైశాలికీ, తమ్ముడుకీ మధ్య చాలా అంతరం ఉంది. వైశాలి తల్లితండ్రులు వాషింగ్టన్‌లో ఉంటున్నారు. కబురు తెలిశాక వైశాలి, మంజరి, ధీరజ్, దినేష్ కారులో బయలుదేరారు. వీళ్లు చేరేదాకా అపర్ణ ఫ్రెండ్స్ తోడుగా ఉన్నారు.

మంజరి, అపర్ణను, వైశాలిని అనుక్షణం కనిపెట్టుకుని ఉంటూ వాళ్లని జాగ్రత్తగా చూసుకుంది. ధీరజ్ చిన్నపిల్లవాడవడంతో బెంబేలెత్తిపోయాడు. జరగవలసిన కార్యక్రమాలు అయిపోయాక వైశాలి, దినేష్ సెలవు లేదంటూ తిరుగు ప్రయాణమయ్యారు. అపర్ణను తమతో రమ్మన్నారు.

కానీ ఆమె నిరాకరించింది. మంజరికి ఆమె బాధ అర్థమయ్యింది. ఆ అవస్థ ఎలాంటిదో ఆమెకు తెలుసు. అపర్ణ దురదృష్టవంతురాలు. ఒకేసారి భర్తను,

కొడుకునూ పోగొట్టుకుంది. పగవాళ్లకు కూడా ఇలాంటి స్థితి రాకూడదని అనుకుంది మంజరి.

అందరి మనసులూ వికలం అయిపోయాయి. న్యూజెర్సీ తిరిగి వచ్చినా మామూలు మనుష్యులు కాలేకపోయారు. 'జాతస్య మరణం ధ్రువం' అని తెలిసినా అకాల మరణాన్ని జీర్ణం చేసుకోవడం చాలా కష్టం. జీర్ణమయిన వస్త్రాన్ని విసర్జించడంలో అర్థముంది కానీ నూతన వస్త్రాన్ని విసర్జించడం ఎలా సాధ్యం?

తప్పనిసరిగా ఆఫీస్‌కు వెడుతున్నా వైశాలి ఆ ఘటనను మర్చిపోలేక పోతోంది. తల్లి ఒంటరిగా ఉందన్న బాధ కూడా ఎక్కువగానే ఉంది. ఫోన్ చేసిన ప్రతిసారీ తల్లిని ఇక్కడికి వచ్చెయ్యమని అడుగుతోంది. ఆమె ఒప్పుకోవటం లేదు. మూడు నెలల కాలం దొర్లిపోయింది. అపర్ణకు ఒంట్లో బాగులేదని తెలిసి, వైశాలి, దినేష్ చూడడానికి వెళ్ళారు.

ఈసారి మంజరి రానంది. ధీరజ్ లాంగ్ డ్రైవ్‌లో అలిసిపోతాడని, వాడితోబాటు తను ఇక్కడే ఉంటానంది. తల్లి చెప్పినది సబబుగా అనిపించింది. అందుకే ఆమె నిర్ణయాన్ని హర్షించాడు. బాబుకు మంజరి దగ్గర అలవాటు కనక తల్లితండ్రులు లేకపోయినా పేచీ పెట్టలేదు.

ఒక వారం రోజులు గడిపి వెనక్కి వచ్చారు. వచ్చినప్పట్నించీ ముభావంగా ఉన్న కొడుకు, కోడల్ని చూసి ఏం జరిగిందోనని భయపడటం మొదలుపెట్టింది. అడగడానికి ధైర్యం చాలలేదు. వాళ్ళే చెప్తారని ఊరుకుంది. ఒక రోజు రాత్రి దినేష్ మంజరితో అన్నాడు.

"అమ్మా! నీతో మాట్లాడాలి" అని. మళ్ళీ ఏం సమస్య వచ్చిందో అర్థం కాలేదు. ఏదో గంభీర సమస్య వస్తే కానీ కొడుకు తనతో మాట్లాడాలని అనడు. "చెప్పు" అంది మంజరి.

"మేం వాషింగ్టన్ షిఫ్ట్ అయిపోదామనుకుంటున్నాము."

'మేం' అన్న పదంలో తను లేనని అనుమానం వచ్చినా పూర్తిగా కొడుకు ఏం అంటాడోనని, "చాలా బాగుందిరా వాషింగ్టన్. ఈ ఊరు బోర్ కొట్టింది" అంది.

" మేం అంటే నేను, వైశాలి, ధీరజ్. మా అత్తగారికి ఒంట్లో బాగుండటం లేదు. అసలే భర్తను, కొడుకును పోగొట్టుకుంది. వంటరిగా ఉండడం చాలా

కష్టంగా ఉంది. అందుకే మేం అక్కడికి షిఫ్ట్ అయిపోదామని చూస్తున్నాము. ఇప్పుడు మామావగారి ఆస్థికి ఏకైక వారసురాలు వైశాలే కదా! అందుకని మేం మా అత్తగార్ని దగ్గరుండి చూసుకోవాలి" అన్నాడు.

"అలాగా! మరి నా మాటేమిటి?"

"నువ్వు ఒక్కర్తివీ ఎలా ఉంటావు? మాతో ఉండడం సాధ్యం కాదు. మా అత్తగారి ఇంట్లో నువ్వు ఉండడం బాగుండదు. అందుకని నువ్వు ఇండియా వెళ్లిపో. ఎలాగా అక్కడైతే నీకు ఇల్లు కూడా ఉంది" అన్నాడు.

కొడుకు చెప్పిన మాటలకు ఏం సమాధానం చెప్పాలో తెలియ లేదు. అత్తగారు భర్తను పోగొట్టుకుని ఒంటరిగా ఉండలేదని బాధపడుతున్న కొడుకు తన తల్లి కూడా ఒంటరి అన్న సంగతి గ్రహించలేదా! అత్తగార్ని చూడ్డం తన బాధ్యత అయినప్పుడు, కన్నతల్లిని చూడ్డం తన బాధ్యత కాదా! ఇదంతా అత్తగారి మీద ప్రేమా! లేక ఆవిడ వెనకాతల ఉన్న డబ్బుమీద ప్రేమా?

మొన్నటిదాకా నువ్వు మాతోనే ఉండాలని అన్నవాడు ఒక్కసారిగా ఇలా మాట్లాడుతున్నాడు. కొడుకు స్వార్థపరుడంటే మనసు ఒప్పుకోవటం లేదు. స్వార్థం కానప్పుడు దీని అంతరార్థం ఏమయి ఉంటుంది? అన్నది ప్రశ్న.

"మొన్నటిదాకా ధీరజ్ నేను లేకుండా ఉండలేడన్నావు. ఇప్పుడు ఆ సమస్య తల ఎత్తదా! నన్ను ఇండియా వెళ్ళొద్దని, ఇక్కడే నీ దగ్గరే ఉండమని, అందరూ కలిసి ఉందామని నాకు గ్రీన్ కార్డు వచ్చేటట్లు చేశావు. ఇప్పుడు నన్ను వెళ్లిపొమ్మంటున్నావు..." అంటూ అర్థోక్తిలో ఆగింది.

"వాడిప్పుడు పెద్దవాడయ్యాడమ్మా. ఇంక వాడ్ని స్కూల్లో వేస్తాము. స్కూల్‌కి వెళ్లడం మొదలుపెడితే నీ కొంగు పట్టుకు తిరుగుతాడా! మెల్లిగా వాళ్ల అమ్మమ్మకు అలవాటు అవుతాడు. ధీరజ్ కళ్లముందు ఉంటే ఆవిడ తన దుఃఖం కొంచెం మర్చిపోతుంది."

కొడుకు మాటలు విన్న మంజరి తను ఇంకా ఎందుకు బతికి ఉన్నానా అని బాధపడింది. అత్తగారి మీద ఉన్న ప్రేమలో వీసమెత్తు ప్రేమ కూడా తనమీద లేదా?

త్యాగరాజుగారన్నట్లు, 'సమయానికి తగు మాటలాడెనె' తన కొడుకు చాలా తెలివైనవాడు. సమయనుకూలంగా ప్రవర్తించడం బాగా నేర్చుకున్నాడు. ఇంత

స్వార్థపరుడు తన కొడుకా? వీడ్ని నేను కన్నానా? నా పెంపకంలో ఏదో లోపం ఉందనుకుంది.

"నువ్వెప్పుడు వెడతావో తెలిస్తే టిక్కెట్ కొంటాను" అన్నాడు దినేష్. అంటే నువ్వు ఇక్కడినించి వెళ్లిపోవచ్చు అని వార్నింగ్ ఇచ్చినట్లనిపించింది.

"వెంటనే చెప్పాలా? నన్ను ఆలోచించుకోనీ" అంది.

"నీకు కావాల్సినంత సమయం తీసుకో. మాకు కూడా వెళ్ళాలంటే ఎంత లేదన్నా మూడు నెలలు పడుతుంది" అన్నాడు.

సంభాషణ అక్కడితో ఆగిపోయింది. ఇంక ఏం జరగాలో ఆలోచించాలి. అప్పటికీ ప్రతిమ చెపుతూనే ఉంది 'నీ కొడుకు పిలుస్తున్నాడంటే ఏదో కారణం ఉండే ఉంటుంది. తొందరపడకు' అంటూ. తానే పిచ్చిదానిలా కొడుకు మీద ప్రేమతో పరుగున ఇక్కడకు వచ్చింది. ఏ మొహం పెట్టుకుని తిరిగి వెడుతుంది? ఈ కాస్త సౌభాగ్యానికేనా తనను గ్రీన్‌కార్డులో బంధించాడు. ఇండియా వెళ్లడం అంటే గ్రీన్‌కార్డు వదులుకోవాలి. ప్రతీ ఆర్నెల్లకు టిక్కెట్ పెట్టుకుని ఎవరికోసం రావాలి?

మురళికి ఫోన్ చేసి చెప్పింది. పరిస్థితి ఇలా వచ్చిందని. అక్కగారి బాధ అర్థం అయినా ఆమె బాధ్యత తను తీసుకోగలడా? సిటిజెన్‌షిప్ ఫరవాలేదు. మెడికల్ ఫ్రీ, గవర్నమెంట్ ఇచ్చే డబ్బులతో హాయిగా ఇక్కడే ఉండిపోవచ్చు. అప్పటిదాకా ఆమె ఇక్కడ ఉండడం సబబవునా కాదా అన్నది నిర్ణయించుకోలేక పోయాడు.

"పోనీ అక్కా వాడు చెప్పినట్లు ఇండియా వెళ్లిపో. అక్కడైతే మనవాళ్లు, మనదేశం. అదీకాక అన్నీ చవక కూడానూ. వయసు వస్తున్న కొలదీ రోగాలు వస్తాయి. ఇక్కడ అన్నిటికన్నా ఖరీదు వైద్యసదుపాయం" అన్నాడు.

'ఇక్కడ నా వాళ్లనుకున్నవాళ్ళే నా వాళ్లు కానప్పుడు ఇండియాలో నావాళ్లని ఎవర్ని అనుకోవాలి? అమ్మా, నాన్నా, భర్త, అత్తగారూ కాలగర్భంలో కలిసిపోయారు. ఇక ఉన్నది అక్క ఒక్కర్తే. అన్న ఎక్కడ ఉన్నాడో తెలియదు. తమ్ముడేదో సహాయపడతాడనుకుంటే వాడు కూడా ఇండియా వెళ్లిపొమ్మంటున్నాడు. ఒంటరిగా ఇండియాలో బతికినది ఇక్కడ ఎందుకు బతకలేదు? అక్కడికన్నా ఇక్కడ డబ్బు సంపాదించే మార్గాలు ఎక్కువ ఉన్నాయి. తనకొచ్చిన విద్యల్లో ఏదో ఒకదానితో తాను బ్రతకలేదా!

అన్నిటికన్నా ముందు ఉండడానికి ఇల్లు కావాలి. ఒంటరిగా ప్రయాణం సాగించినా కొన్నాళ్లు ఎవరిదైనా అండదండలు కావాలి. ఎవర్ని సహాయం అడగాలి? నళిని మనసులో మెదిలింది. కానీ అడగాలా? లేదా? అడిగితే ఏమనుకుంటుందో? అన్న సంకోచం.

భర్తచాటు పిల్ల. ఆమెకెన్ని సమస్యలున్నాయో తెలియదు. పరిచయమైన కొత్తలో రెండు మూడు సార్లు వెళ్లింది. కొడుకును దింపమంటే ఏదో సాకు చెప్పేవాడు. ఆ తరువాత రెండు మూడు సార్లు ఫోన్ చేస్తే తరువాత మాట్లాడుతానని ఫోన్ పెట్టేసింది. అందుకే ఇప్పుడు ఆమె సహాయం అడగాలా లేదా! అన్నది ప్రశ్న.'

ఆలోచనలతో సతమవుతోంది మంజరి. మళ్ళీ తనలో తాను అనుకుంది 'ఇలా ఎక్కువగా ఆలోచించి మొహమాటపడితే తన సమస్యకు పరిష్కారం దొరకదు. ఎక్కడో అక్కడ మొదలుపెట్టాలి' అనుకుంది.

మర్నాడు నళినికి ఫోన్ చేసింది.ముందుగా యోగక్షేమాలు అడిగింది. ఆ తరువాత "నిన్ను ఒకసారి కలవాలి. వీలవుతుందా?" అని అడిగింది.

"అలాగే రా అత్తా! ఇదివరకు నువ్వు ఫోన్ చేసినప్పుడు బిజీగా ఉండి, నీతో మాట్లాడలేదు. ఇప్పుడు నా ప్రాబ్లెమ్స్ అన్నీ సాల్వ్ అయ్యాయి. నీ కొడుకు దింపుతాడేమో అడుగు. లేకపోతే నేను వచ్చి నిన్ను పికప్ చేసుకుంటాను" అంది.

"నువ్వు రానక్కరలేదు. దినేష్‌ను దింపమంటాను. ఈ వీకెండ్‌లో వస్తాను" అంది.

మర్నాడు కొడుకుతో చెప్పింది, "శుక్రవారం సాయంకాలం నళిని ఇంటికి వెళ్ళాలి, ఆఫీస్‌నుంచి వచ్చాక దింపు. ఇండియా వెళ్ళేలోపు నళినితో కాస్త సమయం గడపాలని ఉంది" అని. అలాగే దింపుతానన్నాడు కొడుకు.

* * *

శుక్రవారం కొడుకు ఆఫీస్ నుంచి వచ్చేసరికి రెడీగా ఉంది మంజరి. పర్స్ కాక తల్లి చేతిలోఉన్న బేగ్ చూసి అదేమిటని అడిగాడు.

"నేను సోమవారం వస్తాను. ఒకటి రెండు కూరలు చేసి ఫ్రిజ్‌లో పెట్టాను. మేనేజ్ చేసుకోండి. ఎలాగూ నేను లేకుండా అలవాటు చేసుకోవాలి కదా!" అంది.

తల్లి అన్న విధానానికి కొంచెం మనసు చివుక్కుమంది. కానీ ఇలాంటి చిన్న విషయాలు పట్టించుకుంటే లాభం లేదనుకున్నాడు.

కొడుకు వెంట కారుదాకా నడిచి, కారులో కూర్చుంది. కూర్చున్నాక అడిగింది "కూరలు కొనాలా? కొనాలా అని ఎందుకు అడుగుతున్నానంటే ఇకమీదట నేను ఉండను కదా! ఈ పనులన్నీ మీరే చేసుకోవాలి. ఈ రోజుకు నన్ను కొనమంటే కొంటాను. తీసుకువెళ్లు" అంది.

మాట్లాడకుండా కారు అప్నాబజారు ముందు ఆపాడు. కారు దిగి, బైటినుంచి ట్రాలీ తీసుకుని, పర్స్‌లోంచి లిస్ట్ తీసుకుని, లిస్ట్ ప్రకారం వరసగా అన్నీ ట్రాలీలో నింపడం మొదలుపెట్టింది. మంజరి ట్రాలీ నింపే సమయానికి కౌంటర్ దగ్గరకు చేరుకున్నాడు.

కొడుకును చూసి, "ఇదుగో ట్రాలీ. నాకు కారు తాళాలు ఇయ్యి నేను కారులో కూర్చుంటాను.నువ్వు బిల్ పే చేసి కారు దగ్గరకు రా" అంది.

తల్లిలోని మార్పును పసిగట్టాడు. కానీ ఏం మాట్లాడలేదు.

దినేష్ చేతిలోంచికారు తాళాలు తీసుకుని, కారు ఓపెన్ చేసి, కారులో కూర్చుని కొడుకు వచ్చేదాకా ఎదురుచూసింది. సామానంతా తీసుకొచ్చి కారులో పెట్టాడు. కారు సీట్లో కూర్చుని డ్రైవింగ్ వీల్ మీద చెయ్యి వేస్తూ పక్కకు తిరిగి తల్లి మొహంలోకి చూశాడు.

మంజరి మొహంలో ఏ భావం కనబడలేదు. సరుకులన్నీ జాగ్రత్తగా ఫ్రిజ్‌లో పెట్టమని అనబోయి, తనకెందుకులే అని నోరు మూసుకుంది. కారు నళిని ఇంటిముందు ఆగగానే నళిని బైటికి వచ్చింది. కారు దిగి, తన బాగ్‌తో నళినితోబాటు ఇంట్లోకి వెళ్లిపోయింది. తనవైపు తిరిగి కూడా చూడని తల్లిని చూస్తూ రెండు నిముషాలు మౌనంగా ఉండి, కారు స్టార్టు చేశాడు.

సోఫాలో కూర్చుంటూ "మీ ఇంట్లో రెండు రోజులు ఉందామని వచ్చాను. వద్దనవు కదా!" అంది.

"అదేంటత్తా అలాఅంటావు! దేముడు వరమిస్తానంటే వద్దనే పూజారి ఉంటాడా? నీ ఇష్టమైనన్నాళ్లు మా ఇంట్లో ఉండు" అంది.

" నేను దేముడ్ని కాదు, నువ్వు పూజారీ కాదు. ఒక మంచి కాఫీ ఇస్తే సంతోషిస్తాను" అంది మంజరి.

'అత్తలో ఏదో మార్పు వచ్చింది. ఆ మార్పు ఏమిటో అర్థం కాలేదు. ఇదివరకటి కన్నా చాలా మార్పు కనబడుతోంది' అనుకుంటూ కాఫీ తేవడానికి లోపలికి వెళ్లింది.

కాఫీ తాగుతూ, "ఇప్పుడు చెప్పు అత్తా! నీ కబుర్లేమిటి? సడన్‌గా మా ఇంటికి రావాలని నీకెలా అనిపించింది? ధీరజ్‌ని తీసుకురాలేదేం?" అని అడిగింది.

"ప్రశ్నలన్నీ అయిపోయాయా? లేక ఇంకేమైనా మిగిలాయా?" అంటూ నవ్వింది.

"ఏం లేదు నీ ముద్దుల మనవడు లేకుండా వచ్చావేమిటని ఆశ్చర్యంగా ఉంది."

"వాడు ఉంటే మన మాటలకి ఇబ్బందని తీసుకురాలేదు. అదీకాక నువ్వు ఏ ఇబ్బందుల్లో ఉన్నావో అని" అంది.

"అది కాదత్తా! మధ్యలో నువ్వు రెండు సార్లు ఫోన్ చేస్తే నేను నీతో సరిగా మాట్లాడలేదు. నా గొడవల్లో నేను ఉండి అలా చెయ్యాల్సి వచ్చింది. అదీకాక నీ కొడుకు, కోడలికి మేము రావడం అంత ఇష్టం ఉన్నట్లుగా అనిపించలేదు. అందుకని రావడంతగ్గించాను.

నీకు ఇదివరకు చెప్పలేదు. మా బాధ్యతలు తీరేదాకా నేను కూడా సంపాదించాలి. నేను ఎక్కువగా చదువుకోలేదు. బి.ఎ. పాసయ్యాను. నాకేం ఉద్యోగం దొరుకుతుంది? అందుకే ఇంట్లోనే ఇద్దరు పిల్లల్ని పెట్టుకునేదాన్ని. మన ఇండియన్స్, మనకు తెలిసినవాళ్ల పిల్లల్ని. బైట డేకేర్లో పెట్టాలంటే కొంచెం ఖరీదు. అదీకాక వాళ్లు మనం ఇచ్చే తిండి సరిగా తినిపించరు. మాలాంటివాళ్ల దగ్గర పర్సనల్ కేర్ ఉంటుంది.

డబ్బు తక్కువని పిల్లల్ని మా దగ్గర వదులుతారు. ఎక్కువగా గుజరాతీలు ఇలాంటి పనులు చేస్తారు. వాళ్లకు ఇలాంటివి చెయ్యకూడదన్న భేషజం లేదు. మనవాళ్లకే ప్రతీదానికీ ఎవరేమనుకుంటారో అన్న భావనతో సగం జీవితం గడిపేస్తారు. ఇప్పుడిప్పుడే నాలాంటివాళ్లు కూడా మొదలుపెట్టారు. ఇదివరలో నీకు ఈ విషయం చెప్పడానికి సిగ్గుపడ్డాను" అంది.

నళిని చెప్పినది నిజమే. దినేష్‌కు ఎడిసన్ ఏరియాలో ఉన్నవాళ్లందరూ డబ్బు కక్కుర్తివాళ్లన్న భావన ఉంది. అందుకే నళిని అంటే ఒకవిధమైన చిన్నచూపు ఉంది. ఆమె ఏ పరిస్థితుల్లో ఉందన్నది అతనికి తెలియదు.

"అదేం మాటమ్మా! నువ్వేం తప్పు పని చెయ్యనప్పుడు ఇందులో సిగ్గుపడాల్సిన అవసరం ఏం ఉంది? పనిలో చిన్నా పెద్దా తారతమ్యాలు లేవు. అన్నీ మనం అనుకోవడంలో ఉంది. అందరూ డెస్క్‌జాబ్‌లే కావాలంటే మిగిలిన పనులు చేసేవాళ్లు కూడా ఉండాలి కదా! ఇదివరలో నువ్వు ఇలా చేస్తున్నావని తెలిసినా నేనేం అనుకుని ఉండేదాన్ని కాదు. నువ్వు చెప్పకపోయినా నేను గ్రహించాను. నువ్వు ధీరజ్ పట్ల చూపించిన జాగ్రత్తలు చూసి బహుశా ఇలాంటిదేదో చేస్తున్నావన్న అనుమానం నాకు వచ్చింది"

"ఆ తరువాత ఆలోచించాను అత్తా! ఇలా బేబీ సిట్టర్‌గా ఎన్నాళ్లు చేసినా ఎదుగుదల ఉండదు. అందుకే అకౌంట్స్‌లో కోర్స్ చేశాను. ఇప్పుడు నేను ఏదైనా ఆఫీస్‌లో అకౌంట్స్ సెక్షన్లో పనిచేయవచ్చు. ఇప్పుడు కోర్స్ పూర్తయ్యింది. ఇంక జాబ్ వెతుక్కోవాలి"

"జాబ్ వెతుక్కుంటావా! అల్రెడి జాబ్‌లో ఉన్నావు కదా!" అంది.

"ఏ జాబ్? అలాంటిదేమీ లేదే!" అని సడన్‌గా తన కడుపు చూసుకుని "అదా!" అంది.

"ఆ అదే. ఎన్నో నెల అమ్మా! అమ్మావాళ్లకు చెప్పావా!"

"ఐదోనెల అత్తా. అమ్మకు, మా అత్తగారికి చెప్పాను. అమ్మ రాగలుగుతుందో లేదో తెలియదు. అదే టైమ్‌లో చెల్లికి కూడా డెలివరీ టైమ్. నేను లేట్ చేశానని కోప్పడింది. సరే చూద్దాం అని ఊరుకున్నాను. అంతా నా సోది చెప్తున్నాను. నీ సంగతి చెప్పు" అంది.

"నేను నీతో పని ఉండి వచ్చాను. ఈ దేశంలో ఎవర్ని సహాయం అడగాలో నాకు తోచలేదు" అంటూ దినేష్ చెప్పిన వివరాలన్నీ చెప్పింది.

"అయితే నువ్వు ఇండియా వెళ్లిపోతావా?" అని అడిగింది నళిని.

"ఇండియా వెళ్ళేటట్లైతే నీ సహాయం ఎందుకమ్మా! నా కొడుకు టిక్కెట్ కొంటాడు. విమానం ఎక్కి ఇండియాకి తుర్రుమని ఎగరడమే."

“మరైతే ఏం చేద్దామనుకుంటున్నావు?”

“నాకు గ్రీన్‌కార్డ్ ఉందని తెలుసు కదా! అంటే లీగల్‌గా నేను ఈ దేశంలో ఉండవచ్చు. ఉద్యోగం చేయవచ్చు. అత్త ఈ వయసులో ఏం ఉద్యోగం చేస్తుందని నువ్వు అనుకోవద్దు. నా కొడుకు రమ్మన్నాడని వచ్చాను. కానీ పొమ్మంటే నేను పోవడానికి సిద్ధంగా లేను. అలా వెళ్లిపోతే నేను చేతకానిదాన్ని, పిరికిదాన్నని నిరూపించినట్లు అవుతుంది. ఇప్పటిదాకా జీవితంలో ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా ఎదుర్కొన్నాను. నాలో ఇప్పటికీ ఆ శక్తి ఉందని నా నమ్మకం. ఆడది తలుచుకుంటే ఏమైనా చెయ్యగల్గుతుందని నా అభిప్రాయం. నన్ను నేను నిరూపించుకోవాలి. నేను అబలను కాదు సబలనని నిరూపించుకోవాలి.

భయపడి పారిపోవడం ఎందుకు? ఇదేమీ జనారణ్యం కాదు. మీరందరూ బతకగలిగినప్పుడు నేనెందుకు బతకలేను? అందుకే...”

“అత్తా! యూ ఆర్ గ్రేట్. నీలా అందరూ ధైర్యంగా ఉంటే మనలని ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఇంతకీ నేను నీకు ఏ విధంగా సహాయపడగలను?” అంది.

“నాకు ప్రస్తుతానికి ఉండడానికి జాగా కావాలి. అద్దె తక్కువలో అయితే బాగుంటుంది. సంపాదన ఎలా ప్రారంభించాలో ఆలోచించలేదు” అంది.

“నీకు వేరే ఇల్లు దొరికేదాకా మా ఇంట్లో ఉండవచ్చు. మా ఇల్లు చూసావు కదా! కింద ఒక బెడ్రూమ్, పైన రెండు బెడ్రూమ్స్ ఉన్నాయి. ఈ మధ్యే మేము ఈ ఇల్లు కొనుక్కున్నాము. నువ్వు కింద బెడ్రూమ్‌లో ఉండవచ్చు.”

“నీ భర్త పర్మిషన్ తీసుకోకుండా చెప్పేస్తున్నావు. అతను వద్దంటే.”

“ఆ మాత్రం మా మధ్య అవగాహన ఉంది అత్తా. శ్రీకర్ వద్దనరు. నాకు తెలుసు.”

“సరే శ్రీకర్ వచ్చాక అతనితో కూడా ఒకసారి చెప్పి చూడు. నేను ఇక్కడ ఒంటరిగా బతకాలంటే ఎంత సంపాదిస్తే నాకు గడుస్తుంది, ఉండడానికి చవకలో ఎంతలో ఇల్లు దొరుకుతుంది? అన్నీ ఎస్టిమేషన్ వేసి చెప్పు, కష్టపడడం నాకు కొత్త కాదు. నాలుగు రకాలుగా కష్టపడి నన్ను నేను పోషించుకుంటాను” అంది దృఢనిశ్చయంతో.

“కొంతమంది ఇంట్లో ఉండే నానీ(nany) కావాలంటారు. అపార్ట్‌మెంట్ వాళ్లు ఇష్టపడరు కానీ సొంత ఇళ్లవాళ్లు అలాంటివాళ్లను అడుగుతారు. మనం

అప్నా బజార్, పటేల్స్‌లోనూ నీ గురించి వివరాలు ఇచ్చి మన కాంటాక్ట్ నెంబరు ఇస్తే అవసరం అయినవాళ్లు మనను వచ్చి కలుస్తారు. వర్కింగ్ కపుల్స్ చాలామంది వీకెండ్స్‌లో వారానికి సరిపడ వంట వండించుకుంటారు. దానికి గంటకు ఇంత అని డబ్బులు ఇస్తారు. నీ ఓపికను బట్టి చేసుకోవచ్చు" అంది.

"నాకు జాకెట్లు కుట్టడం కూడా వచ్చమ్మా. ఇప్పుడు అక్కడ ఆ పని చేస్తున్నాను. ఇద్దరు,ముగ్గురు దొరికారు" అంది.

"అది ఎక్కువగా వర్కవుట్ అవదత్తా. ఎందుకంటే ఇక్కడ చలికి చాలామంది పాంట్స్ వేసుకుంటారు. ఇండియన్ ఫంక్షన్స్ ఉన్నప్పుడే చీరలు కడతారు. దానికి కొంతమంది ఇండియా వెళ్లినప్పుడు చీరలు కొన్నప్పుడే కుట్టించుకుని తెచ్చుకుంటారు. ఇక్కడ ప్రతీ బిజినెస్‌లోనూ గుజరాతీలు, ఆపైన పంజాబీలూ ఇలాంటివన్నీ ఎప్పుడో మొదలుపెట్టారు. ఇదికాక నీకు ఓపిక ఉంటే ఏదైనా కోర్స్ చేయవచ్చు" అంది నళిని.

"దానికి నా బేసిక్ క్వాలిఫికేషన్ సర్టిఫికెట్స్ కావాలి కదా! అవన్నీ నేనెక్కడ తెచ్చుకున్నాను?"

"అవి తెప్పించడం అంత ప్రాబ్లెమ్ కాదు. మీ ఫ్రెండ్స్ ఎవరికైనా చెప్పి కొరియర్ ద్వారా తెప్పించుకోవచ్చు. నా డెలివరీకి అమ్మ వస్తే అమ్మతో తెప్పించుకోవచ్చు" అంది.

నళిని మాటలతో కొండంత ధైర్యం వచ్చింది. తాననుకున్నది సాధించ గలనన్న నమ్మకం కలిగింది.

సాయంకాలం శ్రీకర్ ఆఫీస్ నుంచి వచ్చాక మంజరిని చూసి "బాగున్నారా!" అంటూ పలకరించాడు. సరదాగా ముగ్గురూ కబుర్లు చెప్పుకున్నారు. మంజరి తను వంట చేస్తానంటే ఒప్పుకోలేదు నళిని. "మీ అబ్బాయి, నువ్వు కబుర్లు చెప్పుకోండి. చిటికెలో వంట చేసేస్తాను" అంది.

నళిని వంట పూర్తయ్యేలోపల శ్రీకర్ సరదాగా తన చిన్నతనం, చదువు, అక్కల దగ్గర ఎంత సరదాగా, గారాబంగా ఉండేవాడో చెప్తూంటే అతని కలుపుగోరుతనానికి ఎంతో ఆనందం కల్గింది. కన్నతల్లితో మాట్లాడినంత చనువుగా మాట్లాడాడు.

తన సొంతకొడుకైన దినేష్ కూడా ఇంత చక్కగా తనతో ఎప్పుడూ మాట్లాడలేదు. దేనికైనా పెట్టి పుట్టాలి. తన జీవితంలో అన్నీ అసంపూర్తి ఘడియలే. చిన్నతనంలో అక్క, అన్నయ్యలతో అంత అనుబంధం ఉండేది కాదు. కాస్త మురళితోనే ఉండేది.

పెళ్లయ్యాక అక్కకూ, తనకూ మధ్య అనుబంధం పెరిగినా అది పంచుకునే అవకాశం అంతగా దొరకలేదు. ఆదిత్యకూ, తనకూ ఉన్న అనుబంధం చాలా తొందరగా ముగిసిపోయింది. ఆదిత్యలాంటి మంచి భర్త దొరికినందుకు మంజరి ఎంత సంతోషించిందో, ఆదిత్య కూడా మంజరిని భార్యగా పొందినందుకు అంతగానూ ఆనందించాడు. కానీ విధి ఆ అనుబంధాన్ని కూడా ఎక్కువకాలం లేకుండా చేసింది. చివరికి కన్నకొడుకు విషయంలో కూడా అలా అవడం మంజరి మనసుకు చాలా బాధ కల్గించింది.

అందరితో అనుబంధాలు, ఆప్యాయతలు పంచుకోవాలని, పెంచుకోవాలని అనుకునే తనకు విధి వాటిని ఎందుకు దూరం చేస్తోందో అర్థం కావడం లేదు. "అత్తా" అన్న పిలుపుతో తన ఆలోచనలనుంచి బైటికి వచ్చింది. వంట పూర్తిచేసి అన్నీ టేబుల్ మీద పెట్టింది నళిని.

"చేతులు కడుక్కుని భోజనానికి రండి ఇద్దరూ. కబుర్లు అయ్యాయా?" అంది నవ్వుతూ.

టేబుల్‌మీద పదార్థాలు చూసి, "ఇన్నెందుకు చేసావమ్మా! రాత్రిపూట ఎక్కువ తింటే అరగదు" అంది మంజరి.

"ఎక్కువేమీ చెయ్యలేదు. రాకరాక మా ఇంటికి వచ్చావు" అంటూ ఆప్యాయంగా వడ్డించింది. ఇలా ఆప్యాయంగా పట్టెడన్నం తిని ఎన్నాళ్లయ్యిందో. అత్తగారు పోయాక ఇలా పెట్టినవాళ్లే లేరు. దినేష్ స్కూల్ పోతుందని తల్లి పిలిచినా వెళ్లేది కాదు.

ఎంత వద్దనుకున్నా తన కోడలు ఒక్కనాడన్నా ఇలా చేసి పెట్టిందా, అని అనుకోకుండా ఉండలేకపోయింది. ఏమిటో ఈ రోజు మనసు మరీ చెప్పిన మాట వినకుండా పోతోంది. ఎలాంటి ఆలోచనలు చెయ్యడం తనకిష్టం లేదో అలాంటివన్నీ మనసులో దూరి గొడవ చేస్తున్నాయి.

"ఏమిటాలోచిస్తున్నావత్తా!" అన్న నళిని మాటలకు మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది.

భోజనాలయ్యాక సరదాగా పేకాట ఆడుకుందామంది నళిని.

"నాకు రాదమ్మా" అంటున్న మంజరితో "ఒక్క అయిదు నిముషాల్లో నీకు నేర్పుతాను. ఇదేం బ్రహ్మవిద్యేం కాదు" అంటూ ఎలా ఆడాలో చెప్పింది.

నాలుగు ఆటలు అయ్యాక మంజరి ఆట గెలవగానే "చూసావా! అసలు ఆటరాదని చెప్పి, ఆట గెలిచావు. చూడండి మా అత్త ఎంత తెలివైనదో" అంది శ్రీకర్‌తో.

"అవును నీ అత్త కదా!" అన్నాడు వేళాకోళంగా.

"మీకు నేనేం మాట్లాడినా వేళాకోళంగా ఉంటుంది" అంటూ మూతి ముడుచుకుంది. ఆ వాతావరణం ఎంతో ఆహ్లాదంగా అనిపించింది. తన కొడుకు, కోడలూ ఎందుకు ఇలా ఉండరు? ఒకే ఇంట్లో ఉంటున్నా అపరిచిత వ్యక్తుల్లా ఉండడం. అవసరానికి మాట్లాడుకోవడం. ఆ తరువాత ఎవరి పనుల్లో వాళ్ళు వెళ్ళిపోవడం.

పొద్దస్తమానూ ఒళ్ళో లాప్‌టాప్. నవ్వుతూ సరదాగా కబుర్లు చెప్పుకోవడం ఎప్పుడూ చూడలేదు. ప్రపంచంలోని భారమంతా వాళ్ళే మోస్తున్నట్లుగా ఉంటుంది ఇద్దరి ప్రవర్తన. ఇదేనా జీవితం? ఉప్పులేని పప్పులాగా సారంలేని జీవితాలు.

ఏమిటి! నళిని సంసారాన్ని చూసి తాను ఈర్ష్యపడుతోందా! తప్పు తనకు అలాంటి ఉద్దేశ్యం లేదు. ఎంతో ఆనందంగా ఉంది.

దాంపత్యం అంటే ఇలా ఉండాలి. ఎందుకొచ్చిన జీవితంరా అంటూ ప్రపంచంలోని బరువు బాధ్యతలు తామే మోస్తున్నట్లుగా ఉంటే జీవితంలో ఏం ఆనందం ఉంటుంది?

"ఇంక చాలు నళినీ పడుకుందామమ్మా. పొద్దుటనుంచీ చేసి చేసి నువ్వు, ఆఫీస్‌లో అతనూ అలిసిపోయి ఉంటారు" అంది.

"ఇంకొంచెంసేపు ఆడుకుందాము. రేపెలాగా సెలవు కదా! ఫరవాలేదు" అంటూ ఇంకో రెండు ఆటలు ఆడేదాకా ఊరుకోలేదు.

బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి మంచంమీద కూర్చున్నాక శ్రీకర్‌తో చెప్పింది నళిని అసలు విషయం. సంగతంతా విన్న శ్రీకర్‌కు షాక్‌లా అనిపించింది. కన్నకొడుకు

అంత సెల్ఫిష్‌గా ఎలా ప్రవర్తించగలుగుతున్నాడని. నమ్మశక్యం కావటం లేదు.

"అత్తకు ఉద్యోగం, అకామడేషన్ దొరికేదాకా మన ఇంట్లో ఉండమన్నాను. మీకేం అబ్జెక్షన్ లేదు కదా!"

"నాకెందుకు అబ్జెక్షన్‌రా. అదేం లేదు. ఆ ఇల్లాలి పరిస్థితి చూస్తుంటే బాధ వేస్తోంది. మనకు వీలైనంత సహాయం చేద్దాము."

* * *

శ్రీకర్‌కి తన తల్లి గుర్తుకు వచ్చింది. కొడుకంటే ప్రేమ ఉంది తల్లికి. దిగువ మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన అతనికి తల్లి సపోర్టే లేకపోతే ఇంజనీరింగ్ చదివే అవకాశం ఉండేది కాదు.

తండ్రి మామూలు చిన్న ఉద్యోగి. ముగ్గురు పిల్లలు. మొదట ఇద్దరూ ఆడపిల్లలు. అందరి ఆడవాళ్లలాగే మగపిల్లవాడంటే అమితమైన ప్రేమ, ముద్దు. తల్లి మురిపెంగా చూస్తోందని అక్కలు కూడా ఎంతో ప్రేమగా, గారంగా చూసేవారు. ఎక్కడ కందిపోతాడో అన్నంత అపురూపంగా.

తండ్రికి ప్రేమ ఉన్నా అంతగా వ్యక్తపరిచేవాడు కాదు. చిన్నప్పట్నించీ బాగా చదువుకుంటూ క్లాస్‌లో ఫస్ట్ వచ్చే శ్రీకర్ అంటే అందరికీ ముద్దే. వాళ్లమ్మ ఎప్పుడూ అనేది 'నా కొడుకు తెలివైనవాడు' అని.

ఇంజనీరింగ్ చదువుతానన్న కొడుక్కు 'నాకంత స్తోమత లేదురా' అన్న తండ్రితో దెబ్బలాడి, వాడ్ని ఇప్పుడు చదివిస్తే ముందు ముందు మనకి అంతా లాభమే అంది తల్లి. అప్పట్లో ఆ లాభానికి అర్థం తెలియదు శ్రీకర్‌కు. ఇంజనీరింగ్ చదవడమే తన లక్ష్యం.

"కాదే వాడికన్నా పెద్దవాళ్లు ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారు. వాళ్లకు పెళ్లిళ్లు, పురుడు, పుణ్యాలు, ఇవన్నీ ఎలాగా తప్పవు. వీడ్ని పెద్ద చదువులు చదివించాలంటే ఎక్కడ్నించి డబ్బు తేను?" అన్నాడు శ్రీకర్ తండ్రి.

"అందరి తల్లులూ వాళ్ల పిల్లలు చదువుకోవటం లేదని బాధపడ్తారు. అలాంటిది మన అదృష్టం కొలదీ తెలివైన పిల్లవాడు పుట్టాడు. వాడ్ని చదివిస్తే వాడు బాగా సంపాదిస్తే ముసలికాలంలో మనని, వాడి అక్కల్నీ ఆదుకుంటాడు" అంది.

తల్లి పట్టుపట్టి ఉండకపోతే శ్రీకర్ ఇంజనీరింగ్ చదివి ఉండేవాడు కాదు.

దాని ప్రతిఫలం ఆమె ఇప్పుడు కొడుకునించి ఆశిస్తోంది. అతని చదువు మూలంగా కూతుళ్లకు కూడా అన్యాయం చెయ్యవలసి వచ్చింది కనుక ఇప్పుడు శ్రీకర్ వాళ్లను ఆదుకోవాలి.

శ్రీకర్ సంపాదనను వాళ్లు రూపాయల్లో లెక్కించుకుని, అంత డబ్బు సంపాదిస్తున్నాడు కాబట్టి వాళ్లకు పంపడంలో తప్పులేదన్న భావనలో ఉన్నారువాళ్లు. అందుకే ప్రతీ అవసరానికి తల్లీ, అక్కలూ ఫోన్ చేసి ఇంత డబ్బు పంపమంటే పంపుతున్నాడు. కాదనలేని బలహీనత. ఇక్కడ ఈ తల్లి కొడుకు మూలంగా నిలవనీడ వెతుక్కోవాల్సిన అవసరం. ఒక తల్లి బాధపడ్తోంది. ఒక తల్లి బాధపెడ్తోంది.

శని ఆదివారాలు నళిని, శ్రీకర్‌ల కంపెనీలో మంజరి చాలా ఆనందంగా గడిపింది. ఆదివారం సాయంకాలం రాగానే బెంగ మొదలయ్యింది. తను ఒంటరి ప్రయాణానికి సన్నద్ధురాలవాలి అనుకుంది.

రాత్రి పడుకోబోయే ముందు శ్రీకర్ అన్నాడు "ఆంటీ మీరు మా ఇంట్లో నిరభ్యంతరంగా ఉండవచ్చు. రేపు నళినితో వెళ్లి మీ సామాను తెచ్చేసుకోండి" అన్నాడు.

కొడుకు ఉండీ పరాయివాళ్ల పంచన ఉండి, వాళ్ల సహాయం పొందాల్సి వస్తోంది. కానీ తప్పదు. మర్నాడు ప్రొద్దున మంజరి, నళిని కారులో బయలుదేరారు.

ఆఫీస్ టైమ్ అవుతోందని దినేష్ కంగారుపడుతున్నాడు, వైశాలి ప్రొద్దునే మీటింగ్ ఉందని ట్రైన్‌లో న్యూయార్క్ వెళ్లింది. లోపలికొచ్చిన తల్లిని చూసి "అమ్మయ్య నువ్వు వచ్చేసావా! నేనింక ఆఫీస్‌కు వెళ్లిపోతాను" అన్నాడు.

ధీరజ్ "నాన్నమ్మా" అంటూ కాళ్లకు చుట్టుకున్నాడు. వాడ్ని ప్రేమగా పక్కకు తప్పించి, "నేను వెళ్లిపోతున్నాను" అంది ఏ ఉపోద్ఘాతం లేకుండా.

"అకస్మాత్తుగా ఎక్కడికివెళ్లిపోతున్నావు? నేనింకా టిక్కెట్ కొనలేదు కదా!" అన్నాడు.

"నేను ఇండియా వెళ్లడం లేదు. వెళ్లను కూడా. నీ ఇంట్లోంచి వెళ్లిపోతున్నాను. నా అవసరం తీరిపోయాక నన్ను డిస్కార్డ్ చేద్దామనుకున్నావు. హాయిగా ఇండియాలో బతుకుతున్న నన్ను నీ అవసరానికి పిలిపించుకున్నావు. కొడుకువన్న భ్రమలో నేను కూడా పిచ్చిదాన్నయ్యాను. బంధాలన్నీ అవసరానికి వాడుకునేవని

నిరూపించావు. నీలాంటి స్వార్థపరుడైన కొడుకులున్న వాళ్లు కుంగిపోకుండా తలెత్తుకుని ఎలా బతకవచ్చో నిరూపించదలచుకున్నాను. విజయం సాధిస్తానో లేదో తెలియదు కానీ ప్రయత్నం మాత్రం చేస్తాను" అంది.

లోపలికి వెళ్లి గబగబా క్లోజెట్‌లోంచి తన బట్టలు తీసి బైటపెట్టింది. సూట్‌కేసు తీసి బట్టలు అందులో వేసి లాక్ చేసింది. గబగబా పెట్టెలు రెండూ తెచ్చి వీధిలో పెట్టింది. లోపలికొచ్చి సూయింగ్ మిషను కూడా తీసుకుంది.

నాన్నమ్మ ఏం చేస్తోందో అర్థం కాలేదు. నాన్నతో కోపంగా మాట్లాడుతోంది. పెట్టెలో బట్టలు ఎందుకు సర్దుకుంటోంది. ఎప్పుడు తనను చూసినా నా బుజ్జికన్నడు అంటూ ఎత్తుకునే నాన్నమ్మ ఇప్పుడు తనను పక్కకు తప్పించింది. ఇప్పుడు ఏం చెయ్యాలి అని చిన్న బుర్రలో ఆలోచనలు. నాన్నమ్మను డాడీ ఏమైనా అన్నారా! నాకెలా తెలుస్తుంది?

"అన్నీ నా వస్తువులే తీసుకున్నాను. సూయింగ్ మిషన్ అవసరం లేదు నీకు. అయినా ఇది నా డబ్బుతో కొనుక్కున్నదే. నిజం చెప్పాలంటే నేను ఇన్నాళ్లూ చేసిన సేవకు విలువ కడితే ఇంకా నువ్వే నాకు బాకీ ఉన్నావు. ఏనాడో నేనే నీకు బాకీ ఉండి ఇన్నాళ్లూ నీ ఇంట్లో పని చేశాననుకుంటాను. ఇంక నీ డిక్షనరీలోంచి అమ్మ అన్న పదాన్ని తీసెయ్యి" అంటూ బైటికి నడిచింది.

ఈ మాటలు అని బైటికి వచ్చేసరికి నళిని పెట్టెలు రెండూ కారు దగ్గరికి చేర్చింది. వెనక్కి తిరిగి వస్తూ మంజరి చేతిలోని మిషన్ అందుకోపోతున్న నళినిని వారించి, "నువ్వెందుకు మోశావమ్మా పెట్టెలు! నేను వస్తున్నాను కదా! నువ్వు బరువులు మొయ్యకూడదు. నేను కారులో పెడతాను కదా!" అంది మంజరి.

"నేను బరువు ఎత్తలేదత్తా! వీల్స్ ఉన్నాయి కదా కారు దాకా తెచ్చిపెట్టాను" అంటూ డిక్కీ తెరిచింది. ఇద్దరూ కలిపి సామాను వెనక పెట్టారు. "ఒక్క నిముషం ఇప్పుడే వస్తాను" అంటూ పరుగున లిండా అపార్ట్‌మెంటు దగ్గరికి వచ్చి, బెల్ కొట్టింది. బైట నుంచున్న దినేష్ తల్లి చర్యలను ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

తలుపు తీసిన లిండా మంజరిని చూసి "వాట్ హేపెండ్" అని అడిగింది. మీ ఫోన్ నెంబరు కావాలి అని అడిగింది. ఎందుకో అర్థం కాకపోయినా చిన్న కాగితం మీద ఫోన్ నెంబరు రాసి ఇచ్చింది. "ఫోన్‌లో అన్ని విషయాలూ మాట్లాడుతాను. ఇప్పుడు నేను కంగారులో ఉన్నాను" అని చెప్పి హడావిడిగా బయలుదేరింది.

లిండాకు ఏమీ అర్థం కాలేదు. దినేష్ వాళ్ల అపార్ట్‌మెంటు ముందు నించున్నాడు. హడావుడిగా ఎక్కడికో వెడుతున్నారని అనుకుంది. తీరా చూస్తే దినేష్ అక్కడే ఉన్నాడు. మంజరి వెళ్లిపోయింది. ఏం జరిగిందో తెలియలేదు.

తల్లి ప్రవర్తనకు షాక్ తిన్న దినేష్ లిండా ఏమైనా అడుగుతుందేమో అని లోపలికి వెళ్లిపోయాడు. తల్లి అలా వెళ్లిపోతుందని ఊహించలేదు. ఇప్పుడు ధీరజ్‌ను ఎక్కడ వదలాలి? ఆ రోజు ఆఫీస్‌కి రానని ఫోన్ చేసి చెప్పాడు.

లోపలికి వచ్చిన తండ్రిని చూసి "డాడీ నాన్నమ్మ ఏది?" అని అడిగాడు. కొడుక్కు ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు.

తెలివిగా సామానంతా డిస్పోజ్ చేశాక వాషింగ్టన్ వెళ్ళేముందు తల్లిని ఇండియా విమానం ఎక్కిద్దామనుకున్నాడు. తన ప్లాన్‌ను తల్లి ఇలా తలకిందులు చేస్తుందనుకోలేదు. ఇప్పటిదాకా తను అనుకున్నవి అనుకున్నట్లుగా జరిగాయి. ఇప్పుడు జరిగినది అతను ఊహించనిది.

అమ్మ ఇండియా వెళ్లకపోతే ఇక్కడ ఎలా ఉంటుంది? నళిని కూడా ఎన్నాళ్లు సపోర్ట్ చేస్తుంది? జీవితాంతం చెయ్యదు కదా. అలా ఇచ్చే అవకాశం మావయ్యకు ఉన్నా మావయ్య కూడా ఇవ్వలేదు. సొంతవాళ్లకి ఆశ్రయం ఇవ్వడానికే పదిసార్లు ఆలోచించే ఈ రోజుల్లో నళినికిందులో స్వార్థం ఏమైనా ఉందా? ఏ స్వార్థం లేకుండా అమ్మకు ఎందుకు సహాయం చేస్తుంది? అన్నీ ప్రశ్నలే. సమాధానం దొరకని ప్రశ్నలు.

ఏభైఏళ్ల వయసులో అమ్మ ఏ ధైర్యంతో ఇక్కడ ఉండగలననుకుంటోంది? ఆమె ప్రణాళికలు ఏమిటి? ఇలా అర్థాంతరంగా ఆవిడ వెళ్లిపోతుందని ఊహించలేదు. ఇప్పుడు ధీరజ్‌ను ఎవరు చూసుకుంటారు? రెండు మూడు నెలలకు ఏ డే కేర్లో పెట్టాలి?

"డాడీ నాకు ఆకలి వేస్తోంది" అన్నాడు ధీరజ్.

"ఏం తింటావు? పాలు ఇవ్వనా?"

"ఐహేట్ మై మిల్క్" అన్నాడు.

"మరైతే ఏం కావాలో చెప్పరా నాయనా" అన్నాడు.

"ఎందుకలా కోపం చేస్తావు? నాన్నమ్మ నన్ను ఎప్పుడూ కోప్పడదు.

నాన్నమ్మకు అన్నీ తెలుసు. నాన్నమ్మను పిలువు నాన్నమ్మకు తెలుసు నాకేం కావాలో" అన్నాడు.

"నాన్నమ్మ వెళ్లిపోయింది"

"ఎక్కడికి వెళ్లిపోయింది? వెళ్లి తీసుకురా" అన్నాడు. దీనికి అతని దగ్గర సమాధానం లేదు.

పిల్లవాడు నాన్నమ్మ కావాలన్నప్పుడు కూడా అతను చేసిన తప్పు అతనికి తెలియలేదు. పెద్దవాళ్ల కుతంత్రాలతో పనిలేని చిన్నవాడు, తనను ప్రేమించే నాన్నమ్మ తనను వదిలి ఎక్కడకు వెళ్లిందన్న ప్రశ్న వచ్చినా పెద్దవాళ్లు తనకు సమాధానం ఇస్తారా!

దినేష్‌కు ఒక్కసారిగా పిచ్చి ఎక్కినట్లుగా ఉంది. వీడ్ని ఇప్పుడు ఎలా హాండిల్ చెయ్యాలి? నిజమే అమ్మకు అన్నీ తెలుసు. ఇప్పుడు నాన్నమ్మ లేదు. ఆవిడ ఇంత సడన్‌గా వెళ్లిపోతుందని ఊహించలేదు. తాను ఊహించినట్లు కాకుండా పరిస్థితులు ఇంకోలా అవుతాయని ఊహించని మూర్ఖత్వం.

అసహాయత వెన్నాడుతుంటే ఏం చెయ్యాలో తెలియక కొడుకును ఎత్తుకుని వంటింట్లోకి తీసుకువెళ్లి, "నువ్వేం తింటావో నాకు తెలియదు. నాన్నమ్మ పనిమీద వెళ్లింది. ఆవిడ వచ్చేదాకా గుడ్ బాయ్‌లా నువ్వు రోజూ తినేది నాకు చూపించాలి" అన్నాడు.

"సరే నాన్నమ్మ వచ్చాక వేరేది తింటాను. నాన్నమ్మయితే చాలా రకాలు చేసి పెడుతుంది. ఇప్పుడు పాన్ కేక్ తింటాను. ఫ్రిజ్‌లో ఉంటుంది. మైక్రోవేవ్‌లో వేడిచేసి ఇవ్వండి" అన్నాడు.

ఫ్రిజ్ అంతా వెతికాడు. కనబడలేదు. 'అక్కడకాదు' అంటూ ఫ్రీజర్లో ఉంటుందన్నట్లు చూపించాడు ధీరజ్.

మైక్రోవేవ్‌లో ఎన్ని నిముషాలు పెట్టాలో తెలియదు. లక్కీగా డబ్బామీద వివరంగా రాసి ఉంది. అది చదివి వేడిచేసి ప్లేట్లో పెట్టి ఇచ్చాడు.

"ఐవాంట్ సాస్" అన్నాడు.

"టమాటో సాస్ కావాలా!" అన్న తండ్రి మాటలకు వాడు పకపకా నవ్వాడు. నీకీ మాత్రం తెలియదా అన్నట్లు. కొడుకు నవ్వు చూసి మొహం చిన్నబోయింది.

అమ్మ మూలంగా ఈ రోజు కొడుకు ముందు చిన్నబోవాల్సి వచ్చిందనుకున్నాడు. ఫ్రిజ్ తెరిచి మాపెల్ సిరప్  బాటిలు చూపించాడు ఇది కావాలన్నట్లు." ఇది సాస్ కాదురా బాబూ" అన్నాడు దినేష్.

"ఐడోంట్ నో నాన్నమ్మ ఇదే వేస్తుంది. నాకు ఇదే కావాలి" అన్నాడు.

"అమ్మబాబోయ్! వీడ్ని ఒక్క గంట భరించడానికే తనకు నీరసం వస్తోంది. అలాంటిది అమ్మ వీడ్ని ఎలా పెంచుతోందో! ఒక్కనాడు కూడా వాడిమీద కంప్లైంట్ చెయ్యలేదు" అనుకున్నాడు దినేష్.

ధీరజ్ తింటూంటే వైశాలికి ఫోన్ చేసి అసలు జరిగిన విషయం చెప్పాడు. వైశాలికీ అత్తగారి ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. 'ఆవిడ గురించి తాము అండర్ ఎస్టిమేట్ చేసినట్లున్నారు. ఇంత ముందుగా చెప్పకుండా టిక్కెట్ కొన్నాక చెప్పి వుండవల్సింది' అనుకుంది.

అన్నిటికన్నా ముందు ఇప్పుడు ధీరజ్‌ను ఎక్కడ ఉంచాలన్న సమస్య. వాడు పుట్టినప్పట్నించీ నాన్నమ్మ ఒళ్లో పెరిగాడు. ఆవిడ పెంచుతుంటే వాడి బాధ్యత పూర్తిగా ఆవిడమీద వదిలి తామిద్దరూ నిశ్చింతగా ఉన్నారు. ఇప్పుడు ఈ పరిస్థితి రాకపోతే ఆవిడ్ని తమ దగ్గర ఉంచుకుంటే లాభం ఉంటుందని ఆలోచించారు.

జీతం బత్తెం లేని పనిమనిషి దొరికింది. తమ జీవితాల్లో తోచనప్పుడు ఆడుకునే ఒక బొమ్మగా మాత్రమే వాడ్ని చూశారు.

ఇప్పుడు వాడ్ని ఆవిడనుంచి దూరంగా ఉంచడానికి ప్రిపేర్ చెయ్యకుండా చాలా పొరపాటు చేశారు. కలలో కూడా ఆవిడ ఇలాంటి నిర్ణయం తీసుకుంటుందని ఆలోచించలేదు.

ఇప్పుడు ఆఫీస్‌లో కూర్చుని ఆలోచించినా అంత తొందరగా సాల్వ్ అయ్యే ప్రాబ్లమ్ కాదు. ఏం చెయ్యాలో ఇంటికి వెళ్ళాక ఆలోచిద్దామని ఊరుకుంది. దినేష్‌తో ఈ రోజుకు ఎలాగో మానేజ్ చెయ్యమని చెప్పింది.

వాళ్లనుకున్నంత సులువు కాలేదు ధీరజ్‌ను సముదాయించడం. 'నాన్నమ్మ' కావాలని పేచీ పెట్టేవాడ్ని ఎలా ఊరుకోపెట్టాలో అర్థం కాలేదు.

"ఏం చేద్దాం? పోనీ అమ్మను తీసుకువచ్చెయ్యనా!" అన్నాడు.

"చిన్నపిల్లాడిలా మాట్లాడకు. కాస్త ఆలోచించు. నువ్వు అన్న మాటలకు

ఆవిడ నొచ్చుకోబట్టే ఆవిడ ఈ నిర్ణయం తీసుకుని మనకు అవకాశం ఇవ్వకుండా వెళ్లిపోయారు. దాన్నిబట్టే తెలుస్తోంది ఆవిడ ఎంత స్ట్రాంగ్ పర్సనాలిటీనో. అందుకని నువ్వెళ్లి పిలిచినా ఆవిడ రాకపోవచ్చు. రెండో సంగతి, ఆవిడ్ని ఎలాగా మన దగ్గర ఉంచుకోదల్చుకోలేదు. మనం చేసిన పొరపాటల్లా ముందుగా మనం ధీరజ్‌ను దీనికి ప్రిపేర్ చేసి ఉండకపోవడం. మనం కూడా ఆవిడ మీద బాగా ఆధారపడ్డాము. ఇప్పుడు జరగవల్సింది చూడడమే" అంది.

"వాడు బెంగపెట్టుకుంటేనో?"

"పిల్లలు ఎంత తొందరగా అటాచ్ అవుతారో అంత తొందరగా మర్చి పోతారు. ఇప్పుడు మనం చెయ్యవల్సిందల్లా వాడ్ని మనవైపు తిప్పుకోవడమే. వాడ్ని డేకేర్లో జాయిన్ చేస్తే అక్కడ ఉన్న పిల్లలతో ఆడుకుంటూ నాన్నమ్మను మర్చిపోతాడు" అంది.

"అయితే దాని సంగతి చూడు. ఇంటికి దగ్గరో లేక మన ఆఫీసుకు దగ్గరో చూస్తే బెటర్" అన్నాడు.

ఆ తరువాత కూడా వాళ్ల సమస్య అంత సులభంగా పరిష్కరింపబడలేదు. ఏ పనీ కూడా ఊహించడానికీ, చెయ్యడానికీ చాలా తేడా ఉంటుంది. చేసేదాకా ఇదెంత అనిపించినది అంత తొందరగా చెయ్యడానికి సాధ్యపడదు. కాలక్రమేణా మంజరి తమ జీవితాల్లో ఎంతగా చొచ్చుకుపోయిందో అవగతమవడం మొదలయ్యింది.

* * *

ఆ రోజు రాత్రి మంజరికి నిద్రపట్టలేదు. తను చేస్తున్నది సరిఅయిన పని అవునా! కాదా! అన్న మీమాంస. ఈ దేశంలో తను నిలదొక్కుకోగలదా! నళిని సహాయం కూడాఎక్కువ రోజులు తీసుకోకూడదు. ధీరజ్ ఎలా ఉన్నాడో?

ఒక్కసారిగా తాను ఒంటరినన్న భావన ఆమె మనసులో చోటుచేసుకుంది. ఆదిత్య పోయినప్పుడు కూడా ఆమెకింత ఒంటరితనం, నిరాసక్తత చోటు చేసుకోలేదు. అప్పుడు బతకటానికి, ముందుకు పయనించడానికి ఒక ఆలంబన ఉంది.

ఇప్పుడు ఏ ఆలంబన ఉందని ముందుకు సాగాలి? ఇన్నేళ్ల తరువాత ఆదిత్య తన పక్కనఉంటే అన్న భావం మనసులో ఒక పిల్లతెమ్మెరలా వచ్చింది.

ఈ పాతికేళ్ళూ అతని జ్ఞాపకాలని జోకొట్టింది. అతని ఆలోచన, స్పర్శ, భావన, ఆత్మీయత అన్నీ గుండె లోతుల్లో దాచేసి ఇన్నాళ్లూ ఎలా బ్రతికింది?

ఇప్పుడు ఈ క్షణంలో అతని కౌగిలిలో వెచ్చగా తలదాచుకుందామని, తన బాధను అతనితో పంచుకుంటే అన్న భావం ఆమెను కుదిపేసింది. ఆమె మనసును కల్లోలం చేసింది. ఆదిత్య తన గుర్తుగా దినేష్‌ను ఇచ్చాడని, వాడు చివరిదాకా తనకు ఆలంబనగాఉంటాడని భ్రమపడింది.

ఈ అనుబంధాలూ, మమకారాలూ మనుష్యజాతికే. సృష్టికర్త సృష్టించిన ప్రాణులన్నిటిలో జీవంకాక, బుద్ధి, మనసు, అన్నవి మనిషికి మాత్రమే ఇచ్చాడు. అందుకే మిగిలిన ప్రాణులకన్నా భావోద్వేగాలకు లోనవుతాడు మనిషి. అవే లేకపోతే పక్షిపిల్లలు రెక్కలొచ్చి ఎగిరిపోతే పక్షి ఎలా బాధపడదో మనిషి కూడా బాధపడడు. పక్షి ఏం ఆశించి తన పిల్లలకు ఆహారం సంపాదించి పెడుతుంది?

కానీ పక్షుల్లా మనిషి ఉండగలడా? పక్షి ఎగరగలుగుతుంది. మనిషి ఎగరలేడు. పక్షికి ఆలోచన లేదు. మనిషికి ఆలోచన ఉంది. తరతరాలుగా కుటుంబం, దాని కట్టుబాట్లు, బంధాలకు కట్టుబడ్డాడు మానవుడు. దానిని వదిలేయగలడా? ఈ బంధాలన్నవి లేకపోతే ఎవరికివారే యమునా తీరే.

అవసరాలకోసం వాడుకునే బాంధవ్యాలను ఏ పేరుతో పిలవాలో. మందులకు ఎక్స్‌పైరీ డేట్ ఉన్నట్లుగా బాంధవ్యాలకు కూడా వర్తింపజేస్తే ఇప్పుడు అందరూ తానున్న పరిస్థితుల్లో ఉండాల్సి వస్తుంది. ఈ పరిస్థితి రేపు దినేష్‌కు కూడా రావచ్చేమో?

ఉలిక్కిపడింది మంజరి. ఏమిటి తన ఆలోచనలు ఇలా వక్రమార్గాన సాగుతున్నాయి? తనకీనాడు ఎదురైన పరిస్థితి తన కొడుక్కు కూడా రావాలని తల్లిగా అనుకోవడం ఎంత పొరపాటు? తాను మనస్థైర్యం కోల్పోకూడదు. ఎవరో చెప్పినట్లు సమస్య వెంటే పరిష్కారం కూడా ఉంటుంది. బేలలా సమస్యకు భయపడకుండా పరిష్కారం వెదుక్కోవాలి. తాను నమ్మిన దేవుడు ఆ పరిష్కారం చూపిస్తాడు.

ఆలోచనలో మునిగిన మంజరికి తెల్లవారు ఝామున నిద్రపట్టింది. నళిని లేచి తన పనులు చేసుకుంది. శ్రీకర్ ఆఫీసుకు వెళ్లిపోయాడు. అత్త లేచేదాకా లేపడమెందుకని కూర్చుంది.

తొమ్మిది గంటలకు నిద్ర లేచిన మంజరి సిగ్గుపడుతూ రూమునుంచి బైటకు వచ్చింది. సోఫాలో కూర్చున్న నళినిని చూసి "బాగా నిద్ర పట్టేసింది. చాలా ఆలస్యంగా లేచాను కదూ!" అంది.

"ఫర్వాలేదత్తా! నేను కావాలనే నిన్ను లేపలేదు. ఎన్ని రోజుల తరువాత ప్రశాంతంగా నిద్రపోయి ఉంటావో? బ్రష్ చేసుకుని రా ఇద్దరం కాఫీ తాగి ఆ తరువాత బ్రేక్‌ఫాస్ట్ చేద్దాం" అంది.

తను పడుకున్న గదిలోకి వెళ్లి బాగ్‌లోంచి బ్రష్ తీసుకుని, రూముకున్న అటాచ్డ్ బాత్‌రూములో బ్రష్ చేసుకుని మొహం తుడుచుకుని బైటికి వచ్చింది. ఈ లోపల నళిని వేడిగా రెండు కప్పుల కాఫీ తెచ్చి, ఒకటి మంజరికిచ్చి ఒకటి తను తీసుకుంది.

"రాత్రి చాలాసేపు నిద్ర పట్టలేదు. బుర్రనిండా రకరకాల ఆలోచనలు. ఎంత తోసేద్దామన్నా నే చెప్పిన మాట వినకుండా ఆవరించుకున్నాయి. తెల్లవారు ఝూమున కాబోలు నిద్ర పట్టింది" అంది మంజరి.

"నువ్వు నీ భవిష్యత్తు గురించి దిగులు పెట్టుకోకు. నా సహాయం నీకు ఉంటుంది. పైన భగవంతుడు ఉన్నాడు. నేను ఈ రోజు నెట్లో ఎవరికైనా లివ్ ఇన్ నానీ కావాలేమో చూస్తాను. శుక్రవారం సాయంకాలం లోపల నీ గురించి రాస్తూ, మా ఫోన్ నెంబరు ఇచ్చి, కాంటాక్ట్ చేసేటట్లుగా నోట్ తయారుచేసి షాప్‌ల దగ్గర అంటిస్తే మన సమస్య తీరుతుంది. ఇక్కడ చాలామంది అలాగే చేస్తారు" అంది నళిని.

"అలాగేనమ్మా! నా చదువు ఇక్కడ పనికిరాదు. ఇదే ఇండియాలో అయితే మళ్లీ ఏదో స్కూల్లో జాయిన్ అవడమో ట్యూషన్లు చెప్పుకునో బ్రతికేదాన్ని. ఇక్కడ ఏ పనైనా చేస్తాను" అంది.

"సరే, స్నానం చేసి పూజ చేసుకోవాలంటే చేసుకో. ఇద్దరం కలిసి టిఫిన్ తిందాము. నీ కోసం తెలుగు సినిమా డి.వి.డి పెడతాను. చూస్తూ కూర్చో. నేను కొంచెం నా పనులు పూర్తి చేసుకుంటాను" అంది నళిని.

"నా మూలంగా నువ్వు నీ టైమ్ టేబుల్ మార్చుకోవద్దు. మీ ఇద్దరూ ఇదివరకులా యధాతథంగా మీ పనులు చేసుకోండి. ఇంటి పనుల్లో నీకు నేను సహాయం చేస్తాను. నేను ఉన్నన్నాళ్లూ వంట నేనే చేస్తాను. అసలే కడుపుతో ఉన్న పిల్లవు. నీకేదైనా తినాలని ఉంటే చెప్పు చేసి పెడతాను" అంది మంజరి.

"అలాగే అత్తా! అమ్మలా ఈ సమయంలో నువ్వు చేసిపెడతానంటే వద్దంటానా!"

భోజనం అయ్యాక విష్ణుసహస్రనామం చదువుకుంటున్న మంజరి, ఎప్పుడు వచ్చి పక్కన కూర్చుందో నళినిని చూడలేదు. పుస్తకం చదువుతుంటే తనను తాను మర్చిపోతుంది.

"ఏం చదువుతున్నావత్తా!" అన్న నళిని మాటలకు పుస్తకంలోంచి తలెత్తి చూసి, "నువ్వెప్పుడొచ్చావు?" అంది.

"నేను వచ్చి అరగంట అయ్యింది."

"భోజనం చేసావా?"

"తిన్నానత్తా! ఇంతకీ ఏం చదువుతున్నావు?" అంది.

"విష్ణుసహస్రనామానికి వివిధ పండితులు, రకరకాల భాష్యాలు చెప్పారు. అవి చదువుతుంటే ఒక విధమైన అలౌకిక ఆనందం. ఇప్పుడు నేను చదువుతున్నది 38వ శ్లోకంలో ఉన్న 'పద్మగర్భః పద్మనాభః'. ఈ పదాల్లో తల్లి గర్భంలో పడుకున్న పిల్లవాడి ఎనాటమీ గురించి మనకు తెలుపుతుందట. పద్మగర్భుడన్నా, పద్మనాభుడన్నా పాలసముద్రంలో పవళించిన విష్ణుమూర్తే.

తల్లిగర్భంలో ఉన్న బిడ్డ కూడా అలాగే ఉంటాడు. తల్లిగర్భంలో పిల్లవాడు బొడ్డుతాడుతో తల్లినాభికి కలపబడి ఉంటాడు. తల్లిగర్భం పద్మం అనుకుంటే బొడ్డుతాడు కమలానికున్న కాడ. తల్లికీ, బిడ్డకూ బొడ్డుతాడుతో అనుబంధం ఎలా ఉంటుందో పద్మనాభుడికీ భక్తులకూ అదే విధమైన అనుబంధం. నారాయణుడి నాభిలోంచి వచ్చిన వికసిస్తున్న కమలంలో సృష్టికర్త అయిన బ్రహ్మ తల్లిగర్భంలో ఉన్న శిశువుకు ఉదాహరణ. భగవంతుడైన విష్ణుమూర్తి తన భక్తుల మనసులో ఒక పద్మంలా నివసిస్తాడు. పద్మం మన సంస్కృతికి సంప్రదాయానికి చిహ్నం. అందుకనేనేమో మన జాతీయ పుష్పంగా కమలాన్ని ఎన్నుకున్నారనిపిస్తుంది" అంది మంజరి.

"నీదగ్గర నేర్చుకోవాల్సినవి చాలా ఉన్నాయి అత్తా" అన్న నళిని మాటలకు అడ్డుపడుతూ, "ఇది నా గొప్ప కాదమ్మా మన శాస్త్రాలూ, మన ఉపనిషత్తుల్లో మన వేదాల్లో ఎన్నో ఉన్నాయి. భూగోళం, ఖగోళం, విజ్ఞానశాస్త్రం, వైద్యం అన్నీ

మన పురాణాల్లో ఉన్నాయి. మన నిత్యకృత్యాల్లో మనం చేయవలసిన విధుల గురించి కూడా విష్ణుసహస్రనామంలో చెప్పబడ్డాయి. దాన్ని వెలికితీసే ప్రయత్నం విజ్ఞులు చేస్తున్నారు."

"మా అత్త విజ్ఞానగని" అంటూ దగ్గరకు తీసుకుంది నళిని. ఆడపిల్లలు లేని మంజరి నళినిలో తన కూతుర్ని చూసుకుందుకు ప్రయత్నించింది. 'ఏమిటో ఈ బంధాలు' అనుకోకుండా ఉండలేకపోయింది. ఒక చోట పెరిగిన మొక్కను ఇంకో చోటికి మారిస్తే ఎలా ఉంటుందో అలా ఉంది మంజరి పని ఇప్పుడు.

ఆమె జీవితంలో రాబోయే మలుపులు కాలమే నిర్ణయించాలి.

* * *

ఎక్కువ కాలం ఎదురుచూడకుండానే సౌత్ బ్రౌన్స్‌విక్‌లో ఒక ఇండియన్ ఫ్యామిలీకి ఇంట్లో ఉండే నానీ కావాలని తెలిసింది. నళిని ఫోన్లో వాళ్లతో మాట్లాడి, మంజరిని వాళ్లింటికి తీసుకువెళ్లింది.

వాళ్లు చాలా ఆప్యాయంగా మాట్లాడారు. భార్యాభర్తలిద్దరూ డాక్టర్లు. భార్య పంజాబీ, భర్త తెలుగతను. వాళ్లకొక చిన్నపాప రెండేళ్లది. ఆ పాపను చూసుకోవాలి. ఇద్దరూ డాక్టర్లవడంతో బిజీగా ఉంటారు. డేకేర్లో ఉంచడం ఇష్టం లేదు. కనీసం స్కూలుకు వెళ్ళేదాకా మంచి నానీ అవసరం ఉంది వాళ్లకు.

ఇంతకు ముందు పిల్ల నాన్నమ్మ కొన్నాళ్లు చూసుకున్నారు. తరువాత ఇద్దరు, ముగ్గురు నానీలు మారారు. నాన్నమ్మ ఆరునెలల కన్నా ఎక్కువ ఉండడానికి వీలులేదు. పాప ఎవరితోనూ అడ్జెస్ట్ అవలేకపోతోంది. నాన్నమ్మలా ప్రేమగా చూసుకునే వాళ్లు కావాలి.

మంజరి ఇంటి దగ్గరే చెప్పింది నళినికి, తనకు కొడుకు ఉన్నట్లూ, వాడు పొమ్మన్నట్లుగా చెప్పవద్దని, నళినికి దూరపుచుట్టమని. అనుకున్న ప్రకారం వాళ్ల ఇంటికి వెళ్ళారు. మంజరికి గ్రీన్ కార్డ్ ఉందని చెప్పడంతో వాళ్లు చాలా సంతోషించారు. సగం భారం తీరినట్లుగా అనిపించింది.

చాలామంది ఇల్లీగల్ అని తెలిసినా టూరిస్ట్ వీసాలతో అక్కడ ఇలాంటి పనులు చేస్తారు. మొత్తానికి మంజరికి ఉద్యోగం దొరికింది. ఆమె ఏ రోజునుంచి వస్తానంటే వాళ్లు కార్లో వచ్చి ఆమెను తీసుకువెడతామని చెప్పారు.

మంజరికి, నళినికి వాళ్లు మంచివాళ్లన్న భావన కలిగింది. మంజరి చెప్పిన రోజుకు భార్యాభర్తలిద్దరూ వచ్చి ఆమెను తీసుకువెళ్ళారు.

మంజరి జీవితంలో మరో కొత్త అధ్యాయం ప్రారంభమయ్యింది.

తమ్ముడు మురళి ఇల్లు చూసి ఆశ్చర్యపోయిన మంజరి వీళ్ల ఇల్లు, ఆ చుట్టూ ఉన్న స్థలం, తోట చూసి ఇంకా ఆశ్చర్యపోయింది. ఒకటి రెండు ఎకరాల స్థలం ఉంటుందేమో!

ఇల్లు కూడా చాలా విశాలంగా ఉంది. ఒక పాతికమంది కలిసి ఉన్నా ఇరుకు అనిపించనంత విశాలంగా ఉంది.

నాలుగువేల అడుగుల వైశాల్యం ఉండవచ్చు. పెద్ద డ్రాయింగ్ రూమ్. దాంట్లోంచి పైకి వెళ్లడానికి కార్పెట్ పరచిన అందమైన మెట్లు. కింద ఒక సన్‌రూమ్, ఫ్యామిలీ రూమ్, కిచెన్, పెద్ద టి.వీ, సోఫా, అన్నీ ఉన్నాయి. కిచెన్ ఆనుకుని చెఫ్‌రూమ్‌ట. పార్టీలూ అవీ అయినప్పుడు ఎవరైనా వంటవాడ్ని పిలుస్తే అతను వాడడానికి వీలుగా అన్ని ఉపకరణాలతో ఉంది.

లాండ్రీ రూమ్, బేస్‌మెంట్ అన్నీ ఇంకా ఏవో చాలా ఉన్నాయి. ముగ్గురు మనుషులకు ఇంత ఇల్లు అవసరమా అనిపించింది. ఏదో పాలెస్‌లోకి వచ్చినట్లుగా అనిపించింది మంజరికి. అందుకే అన్నారు పెద్దలు 'విత్తం కొలదీ వైభవం' అని.

సన్ రూమ్ పక్కన ఒక గెస్ట్ రూమ్ ఉంది. అది మంజరికి ఎలాట్ చేశారు. తనపెట్టె, సూయింగ్ మిషన్ రెండూ తన గదిలో పెట్టుకుంది.

"నా పేరు ప్రభాత్. నా భార్య పేరు రశ్మి. పాప పేరు స్మృతి. నేను తెలుగువాడ్ని. ఆవిడ పంజాబీ అమ్మాయి. తెలుగు కొంచెం వచ్చు. మనంత బాగా మాట్లాడలేదు. పాపకు తెలుగు రాదు.ఎక్కువగా ఇంగ్లీష్ మాట్లాడుతుంది. అమ్మ ఉన్నన్ని రోజులూ తెలుగు మాట్లాడేది. ఎందుకంటే అమ్మకు ఇంగ్లీష్ రాదు. అందుకే నా భార్య కూడా తెలుగు నేర్చుకుంది. కానీ నానీల దగ్గర ఉండడం మొదలుపెట్టాక తెలుగు మర్చిపోయింది" అన్నాడు.

"నాకు అంత బాగా ఇంగ్లీష్ రాదు. కానీ ఫరవాలేదు. కొంచెం మానేజ్ చెయ్యగలను. నాతో మీరు తెలుగు నేర్చుకోండి, లేకపోతే నేను ఇంగ్లీష్ నేర్చుకోక తప్పదు సర్" అంది.

" అదేమిటి నన్ను సర్ అనక్కరలేదు. మీకన్నా కొంచెం చిన్నవాడ్ని అయి

ఉండవచ్చు. నన్ను పేరు పెట్టి పిలవండి. మిమ్మల్ని కూడా మేం ఆంటీ అంటాము. అలా అయితే కొంచెం ఫ్రీగా ఉండవచ్చు. మీరు మా దగ్గర ఉద్యోగం చేస్తున్నట్లుగా కాక ఫ్యామిలీ మెంబర్లా ఉండండి” అన్నాడు ప్రభాత్.

ఎందుకో మంజరిని చూడగానే అతనికి సద్భావన కలిగింది.

“రశ్మిగారు పాప ఏం తింటుందో, ఆమె అలవాట్లు అన్నీ నాకు చెపితే రెండు మూడు రోజుల్లో పాపను మాలిమి చేసుకుంటాను” అంది మంజరి.

“ఆహా, నో రశ్మిగారు. ఓన్లీ రశ్మి. ప్రభాత్, రశ్మి అంతే” అంది అప్పుడే అక్కడకు వచ్చిన రశ్మి. “నేను మా అలవాట్లు, స్మృతి అలవాట్లూ అన్నీ చెపుతాను. మేం ఇద్దరం బిజీ డాక్టర్లం. కేసులున్నప్పుడు మాకు ఒక టైమ్ ఉండదు. ప్రొద్దున బ్రేక్‌ఫాస్ట్ కింద సిరియల్ కానీ, బాయిల్డ్ ఎగ్ కానీ తింటాము. వారానికొకసారి కుక్ వచ్చి కొన్ని కూరలు, పప్పు చేసి వెడుతుంది. కొన్నిసార్లు రొట్టెలు ఆమే చేస్తుంది. లేనప్పుడు బైటనుంచి తెచ్చుకుంటాము.

మీరు మా గురించి పట్టించుకోకండి. బేబీకి మాత్రం అన్నీ ఫ్రెష్‌గానే వండిపెట్టాలి. అది ఒక్కొక్కసారి బాగా పేచీ పెడుతుంది. తిండి దగ్గర చాలా గొడవ చేస్తుంది” అంది రశ్మి.

మంజరికి ధీరజ్ కళ్ల ముందు కదిలాడు. ఎలా వున్నాడో? అనుకుంటూ “పిల్లలందరూ అలాగే ఉంటారమ్మా. మారాము చేస్తారు. వాళ్లను మాటల్లో మభ్యపెట్టి భోజనం పెట్టాలి. నాకలవాటే” అంది.

ఆమె ఇంతకుముందు ఎక్కడ పని చేసిందో వివరాలు అడుగుదామని అనుకుని నళిని హెచ్చరిక గుర్తువచ్చి అడగలేదు. నళిని మంజరి గురించిన వివరాలు అడగవద్దని, జీవితంలో ఎదురుదెబ్బలు తిన్న మనిషని, భర్త లేక అయినవాళ్లు ఆమె అవసరం తీరాక ఆమెను ఒంటరిని చేశారని చెప్పింది. ఆ అయినవాడు కన్నకొడుకని తెలిస్తే వాళ్లు ఏమనుకుని ఉండేవారో?

తరువాత వంటింట్లోకి, పాంట్రీలోకీ తీసుకువెళ్లి అన్నీ చూపించింది. ఒక చిన్న మినీ బజార్లా ఉంది అక్కడ. ఎన్ని రకాలో! కొడుకు ఇంట్లో ఉండి కొన్ని నేర్చుకున్నా తను తెలుసుకోవాల్సినవి చాలా ఉన్నాయన్న సంగతి అర్థమయ్యింది.

“మిమ్మల్ని ఆంటీ అని పిలవచ్చునా!” అంది రశ్మి.

“తప్పకుండా అనొచ్చు. అందులో ఏమీ అభ్యంతరం లేదు” అంది మంజరి.

"మన ఇండియన్స్‌లో ఈ కాన్సెప్ట్ ఉంది కానీ ఇక్కడ ఎంతవాళ్లనయినా పేరుతోనే సంబోధిస్తారు" అంది రశ్మి.

ఆ విషయం మంజరికి తెలుసు. లిండా తనకన్నా పదిహేనేళ్లైనా పెద్ద అయి ఉండవచ్చు. అయినా పేరు పెట్టి పిలవమంది. ఒకావిడకు తన సొంత మనవరాలు అమ్మమ్మ అనడం ఇష్టం లేక పేరు పెట్టి కానీ, లేక ఆంటీ అని కానీ పిలవమందిట. (ఆవిడ భారతీయురాలే).

ప్రతీ మలుపులో కొత్త పాఠాలు నేర్చుకుందుకు దొరుకుతున్నాయి. చివరి అంకం దాకా ఇంకా ఎన్ని పాఠాలు నేర్చుకోవాలో?

"ఇంకొక విషయం కుక్ చేసిన వంట మీకు నచ్చితే అదే వేడి చేసుకుని తినండి. లేకపోతే మీకిష్టమైనది చేసుకుని తినవచ్చు. మీరు పాపను బాగా చూసుకుంటే చాలు" అంది రశ్మి.

"అలాగేనమ్మా" అంది మంజరి. రెండు రోజుల్లో ఆ ఇంటి వాతావరణానికి అలవాటు పడింది. మెల్లిగా స్మృతికి దగ్గరవడానికి ప్రయత్నాలు మొదలుపెట్టింది. ధీరజ్‌తో బాగా అలవాటయిన మంజరికి స్మృతికి దగ్గరవడానికి ఎక్కువ సమయం పట్టలేదు.

ఒక వారం రోజుల్లో వాళ్లిద్దరి మధ్యా సాన్నిహిత్యం పెరిగింది. ఇదివరకు భోజనం చెయ్యాలన్నా, పాలు తాగాలన్నా గొడవ చేసే స్మృతి ఇప్పుడు మంజరి ఏం పెట్టినా తింటుంది. కొత్త రకాల వంటలు చెయ్యడం, ఆడుతూ, పాడుతూ పెట్టడంతో ఇదివరకటి కన్నా పాప ఆరోగ్యంగా తయారయ్యింది. రశ్మి, ప్రభాత్‌ల ఆనందం ఇంతా అంతా కాదు. మంజరిలో పనిపట్ల ఉన్న శ్రద్ధ వాళ్లకు బాగా నచ్చింది. ఏదో డబ్బుకోసం చేస్తున్నట్లు కాక తన వారి కోసం చేస్తున్న భావన ఆమెలో.

మంజరిని పెట్టుకుని తాము మంచిపని చేశామన్న భావన వాళ్లల్లో. మొదటి నెల జీతం పదిహేను వందల డాలర్లు ఆమె చేతిలో పెట్టాడు ప్రభాత్. ఒక్కసారిగా అంత డబ్బు చూడగానే ఏం చెయ్యాలో అర్థం కాలేదు. అమెరికా వచ్చి మూడేళ్లపైనే అయ్యింది. వచ్చినప్పుడు మూడొందల డాలర్లు తెచ్చుకుంది. అవెప్పుడో ఖర్చు అయిపోయాయి. ఆ తరువాత కొడుకు తన ఖర్చుకు సంపాదించుకోమని చెప్పాక వంద రెండొందల డాలర్లు తప్ప ఇంత మొత్తం కళ్ల చూడలేదు. అవసరం కూడా కలగలేదు.

బజారు పనులు వాళ్లే చేసుకునేవారు. ఒంటరిగా ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లలేదు. ఒక్క లాండ్రీరూమ్‌కి వెళ్లినప్పుడు క్వార్టర్‌లు అందులో వెయ్యాలి కాబట్టి కొన్ని కాయిన్స్ డబ్బాలో వేసి ఉంచేవారు.

ఇప్పుడు ఈ డబ్బు ఏం చెయ్యాలి? తనకంటూ ఏ ఖర్చూ లేదు. అన్నీ వాళ్లే చూస్తున్నారు. అందుకే ప్రభాత్‌తో అంది "ఈ డబ్బు నీ దగ్గరే ఉంచు బాబూ నాకు కావాల్సినప్పుడు తీసుకుంటాను" అంది.

"కొంతడబ్బు మీ దగ్గర పెట్టుకోండి. మిగిలినది బాంక్‌లో వేస్తాను. మీబాంక్ అకౌంట్ చెప్తే అందులో వేస్తాను" అన్నాడు.

"నాకు బాంక్ అకౌంట్ లేదు" అంది మంజరి .

"నో ప్రాబ్లమ్. నేనో, రశ్మినో మీకు అకౌంట్ ఓపెన్ చేసి, అందులో మీ డబ్బు జమ చేస్తాము. మీకు క్రెడిట్ కార్డు తీసుకుంటే మీరు ఏమైనా కొనుక్కోవాలంటే కార్డుతో పే చెయ్యవచ్చు" అన్నాడు.

ఒక వారంలో మంజరి పేరు మీద బాంక్ అకౌంట్ ఓపెన్ చేసి క్రెడిట్ కార్డు కూడా ఇచ్చాడు ప్రభాత్. స్మృతి మంజరిని ఆంటీ అని పిలిస్తే వద్దని అమ్మమ్మ అనమంది మంజరి. మంజరి పుణ్యమా అని ఇప్పుడు తెలుగు బాగా మాట్లాడుతోంది. చిన్న చిన్న తెలుగు పద్యాలు కూడా నేర్పుతోంది మంజరి.

* * *

ఆ రోజు హాస్పిటల్ నుంచి తొందరగా వచ్చిన ప్రభాత్ బాక్ యార్డ్‌లోంచి ఇంట్లోకి అడుగుపెట్టాడు. అతని చెవులకు విందుగా స్మృతి నోట

'చేత వెన్నముద్ద – చెంగల్వ పూదండ
బంగారు మొలత్రాడు – పట్టుదట్టి
సందిట తాయెతులు – సరిమువ్వ గజ్జెలు
చిన్నికృష్ణ నిన్ను– చేరి కొలుతు'

అంటూ ముద్దుగా చేతులు తిప్పుతూ చెప్తోంది. అది విన్న ప్రభాత్ ఆనందం పట్టలేక కూతుర్ని కౌగలించుకుని ముద్దాడాడు. కూతురి చేష్టలతో అతనికి అతని చిన్నతనం గుర్తుకు వచ్చింది. పల్లెటూర్లో పుట్టిన ప్రభాత్‌కు ఇవేమీ కొత్త కాదు. చదువుల ఒరవడిలో పడి ఇవన్నీ కనుమరుగయ్యాయి.

దేశంకాని దేశం. భాష కాని భాష. పొట్టకూటి కోసం ఇంగ్లీష్‌ను ఆశ్రయించక తప్పదు. మాతృభాష మరుగునపడింది. తనే చాలామటుకు తెలుగు మర్చిపోయాడు. అమ్మ వచ్చినప్పుడు తప్ప ఇంగ్లీషేలోనే సంభాషణ. కొంతమంది తెలుగువాళ్లు అమెరికాలో ఉండి కూడా తెలుగు సంస్కృతిని, భాషను కాపాడడానికి ప్రయత్నిస్తున్నారు. కానీ తామిద్దరూ బిజీగా ఉండడం ఒక కారణమైతే, తమ భాషలు వేరవడం కూడా ఇంకో కారణం. ఇన్నాళ్లకు ఈవిడ ధర్మమా అని తన కూతురు చక్కని తెలుగు పద్యాలు చెప్తోంది.

"చాలా థాంక్స్ ఆంటీ! మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను. మేం మర్చిపోతున్న భాషను, సంప్రదాయాల్ని మీరు మాకు గుర్తుచేస్తున్నారు. ఇంకా ఏం నేర్పారు పాపకు?" అన్నాడు.

"నాకు చాలా వచ్చు. బుర్రుపిట్ట బుర్రుపిట్ట చెప్పనా" అంది. తండ్రి సమాధానం చెప్పే లోపలే చేతులూ, కళ్ళూ తిప్పుతూ చెప్పడం మొదలుపెట్టింది. మళ్లీ ముద్దుల వర్షం. స్మృతికి ఇదంతా చాలా బాగుంది.

తమకొచ్చిన విద్యను, ప్రతిభనూ ఎవరైనా మెచ్చుకుంటే పెద్దవాళ్లకే ఎంతో ఆనందంగా ఉంటుంది. అలాంటిది చిన్నపిల్లల సంగతి వేరే చెప్పాలా!

"నాకు ఇంగ్లీష్ పోయమ్స్ రావు. అందుకే తెలుగువే నేర్పుతున్నాను" అంది మంజరి.

"ఇంగ్లీష్ రావడం కష్టం కాదండీ మనం వద్దన్నా అదే వస్తుంది. మన తెలుగులో ఉన్న మధురిమలు మీద్వారా నాకూతురికి అందుతున్నాయి. అదే నాకు ఆనందం" అన్నాడు ప్రభాత్.

కాస్సేపు కూతురితో ఆడుకున్నాడు. మంజరి కాఫీ చేసి తెచ్చింది. బాగుందంటూ కాఫీ తాగి తన గదిలోకి వెళ్లిపోయాడు.

* * *

అప్పుడప్పుడు నళిని ఫోన్ చేస్తూ ఉంటుంది. మంజరి తనకిక్కడ బాగానే ఉందని, సొంతకొడుకింట్లో కన్నా సౌకర్యంగా ఉందని చెప్పింది. స్మృతి కబుర్ల గురించైతే లెక్కలేదు. "చూడగా స్మృతి నీ గుండెకాయ అయిపోయినట్లుందే" అంటూ నళిని వేళాకోళం చేసేది.

వంటమనిషి చేసిన వంట నచ్చక తన వంట తానే చేసుకునేది. ఒకసారి

అలా చేసిన కూర, సాంబార్ అప్పుడే వచ్చిన ప్రభాత్, రశ్మి 'వావ్' అంటూ మూతలు తీసి చూసారు. వెంటనే మంజరి "రండమ్మా! భోజనం చేద్దురు గాని. అన్నం నాకొక్కదానికే వండుకున్నాను. రొట్టెలు వేడి చేస్తే సరిపోతుంది. ముందు మీరు తినెయ్యండి, నేను తరువాత తింటాను" అంది.

"ఊరికే అన్నాము. మీరు తినండి. మేం ఫ్రిజ్‌లో ఉన్నది వేడిచేసి తింటాము. మాకది అలవాటే"

"ఆ పాత వంట ఎందుకు? ఇప్పుడు వండినది కడుపునిండా తినండి" అంటూ గబగబా కంచాలు పెట్టి, వడ్డించింది.

"మీరు కూడా కూర్చోండి ఆంటీ" అన్నారు ఇద్దరూ. " వద్దమ్మా! నా చేత్తో వడ్డిస్తాను. కడుపునిండా తినండి" అంటూ ప్రేమగా వడ్డిస్తున్న మంజరిని చూసి ఇద్దరి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఆ రోజు రోజూకన్నా ఎక్కువే తిన్నారు.

"ఇంత మంచి భోజనం చేసి ఎన్నాళ్లయిందో! మీరు వంట బాగా చేస్తారాంటీ" అన్నారు ఇద్దరూ. "మీరు తినే ఈ పట్టెడు మెతుకులకు వంటమ్మాయి ఎందుకమ్మా. మీరు ఎప్పుడు వస్తారో తెలియదు. ఆమె వండిన వంట సగం డస్ట్‌బిన్లో పడేస్తున్నారు. మీరేమీ అనుకోకపోతే ఆ కుక్‌ను మానిపించేయండి. మీరు రోజూ భోజనానికి వస్తానంటే నాతో బాటే మీకు కూడా వండుతాను. లేదంటే మీరొక్క గంట ముందు చెపితే మీకు వంట రెడీ చేస్తాను" అంది మంజరి.

"వద్దు ఆంటీ! మీకు భారం పెరిగిపోతుంది."

"నాకిది అలవాటే" అని నోరు జారబోయి, "ఏం భారం కాదమ్మా! స్మృతి పడుకుంటే నాకేం తోచదు. అప్పుడు చేసెయ్యవచ్చు. అదీకాక నాకోసం ఎలాగా చేసుకుంటున్నాను కదా!" అంది.

అలా మంజరి చేతి వంటకు, ఆమె ఆప్యాయంగా వండి వడ్డించే వంటకూ అలవాటుపడిపోయారు.

మంజరి, ఆమె అలవాట్లూ వాళ్లకు బాగా నచ్చాయి. ప్రతీదీ ఒక క్రమపద్ధతిలో చేస్తుంది. ప్రొద్దునే తమకన్నా ముందే లేచి యోగా, ధ్యానం, పూజ అన్నీ పూర్తి చేసుకుంటుంది.

అంత పద్ధతిగా ఉండి క్రమశిక్షణతో యోగా అన్నీ చేస్తుంది కాబట్టి ఆమె

వయసు చెప్పడం కష్టం. కొత్తలో ఆమెను ఆంటీ అనాలంటే ఏదోలాగా ఉండేది కాలక్రమేణా అలవాటయ్యింది.

ఒక రోజు ఆవిడ రూమ్‌లో సూయింగ్ మిషన్ చూసి స్మృతి అడిగింది "ఇదేంటి అమ్మమ్మా?" అని. "దీనితో ఫ్రాకులు, నేను వేసుకునే బ్లౌజులు కుట్టుకోవచ్చు" అంది.

"అయితే నాకు కూడా ఫ్రాక్ కుడతావా!" అంది.

"అలాగేనమ్మా! ఈసారి బజారు వెళ్ళినప్పుడు బట్ట తెచ్చి కుడతాను" అంది. శుక్రవారం సాయంకాలం కానీ, శనివారం ప్రొద్దున కానీ మార్కెట్‌కి వెళ్ళి కావాల్సిన సరుకులు, కూరగాయలు, పాలు, పళ్లు తెచ్చుకుంటారు. గురువారం రాత్రి భోజనాల దగ్గర చెప్పింది మంజరి...

"ఈసారి షాపింగ్‌కి వెళ్ళినప్పుడు నన్ను సాన్ జోస్ షాప్‌కి తీసుకెళ్లమ్మా. కొంచెం ఫాబ్రిక్ తీసుకోవాలి" అంది.

"మీకేమైనా బట్టలు కావాలా ఆంటీ? మీకు సాన్ జోస్ ఎలా తెలుసు?" అని అడిగింది రశ్మి.

"నాకు కుట్టుపనులంటే చాలా ఇష్టం. ఇంతకు ముందు ఉన్నచోట ఒక అమెరికన్ ఫ్రెండ్‌తో ఆ షాపుకు వెళ్ళాను. అక్కడ మనకు కావాల్సిన ఊలు, ఫాబ్రిక్, ఊలు అల్లే సూదులు అన్నీ దొరుకుతాయి" అంటూ లిండా చేసే పనులు, ఆవిడ కుట్టేవన్నీ తను కూడా నేర్చుకున్నట్లు చెప్పింది.

"ఇంతకీ మీకు బట్ట మీ బ్లౌజ్‌లకు కావాలా? చీరలైతే అక్కడ దొరకవు. కొన్ని ఫాబ్రిక్స్ చీర లెంగ్త్ ఉంటాయి. వాటిని మనకు కావాల్సినంత తీసుకుని చీరలా కట్టుకోవచ్చు. ఎడిసన్‌లో అయితే ఇండియన్ షాప్స్ ఉన్నాయి. అందులో చీరలు దొరుకుతాయి. మీకు కావాలంటే అక్కడకు వెడదాము" అంది రశ్మి.

రశ్మి అనేదాకా తన చీరల గురించి ఆలోచించలేదు. ఇండియానుంచి తెచ్చుకున్న చీరలతోనే కాలక్షేపం చేస్తోంది. ఇక్కడ చీరలు ఎంతలో ఉంటాయో! ఒకటి రెండు కొనుక్కుంటే సరి. లేకపోతే నళినికి చెప్పి ఎవరిద్వారానైనా ఇండియానుంచి తెప్పించుకుంటే సరి అని అనుకుని రశ్మి అన్నదానికి సమాధానంగా.. "నాకోసం కాదమ్మా. స్మృతి తనకి ఫ్రాక్ కుట్టమని అడిగింది. నాకొచ్చినట్లు కుడతాను. చిన్నపిల్ల అడిగింది కదా!" అంది.

"ఎందుకాంటీ! మీకు శ్రమ. ఏదో దానికి తెలియక అడిగి ఉంటుంది" అంది.

"నాకేం శ్రమ లేదు. నాకిష్టమైన పనే. ఈసారి ఎడిసన్ వెళ్లినప్పుడు చూద్దాం! చీరలు బాగుంటే కొనుక్కుంటాను" అంది మంజరి.

వీకెండ్లో షాపింగ్‌కి వెళ్లినప్పుడు తనకోసం రెండు చీరలు తీసుకుంది. తన క్రెడిట్ కార్డు వాడబోతుంటే రశ్మి వాడనియ్యలేదు. ఆ తరువాత సాన్ జోస్ షాప్‌కి వెళ్ళారు. కాటన్ మంచి ప్రింట్ ఉన్న బట్ట, కొంచెం ఊలు తీసుకుంది. ఇక్కడ మాత్రం రశ్మిని డబ్బు ఇవ్వనివ్వలేదు. తన కార్డు వాడి పేమెంట్ చేసింది. మొదటిసారిగా అమెరికాలో తన సంపాదన ఖర్చు పెట్టింది.

నాలుగైదు రోజుల్లో అందమైన ఫ్రాకులు తయారుచేసింది. ఆ ఫ్రాకులు చూసి స్మృతి ఎంత ఆనందించిందో చెప్పనలవి కాదు. రశ్మికి రోజు రోజుకీ మంజరిని చూస్తుంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ఈవిడలో ఎన్ని టాలెంట్స్ ఉన్నాయి? ఏ పని చేసినా ఎంత పెర్ఫెక్ట్‌గా చేస్తుంది! ఇంత మంచిమనిషి, ఇంత టాలెంట్ ఉన్న మనిషికి దేముడు ఎవరూ లేకుండా ఎలా చేసాడో? దేముడు నిర్దయుడా! అలా అనుకోవటానికి లేదు. ఆయన లీలలు ఎవరికీ అర్థం కావు.

తెచ్చిన ఊలుతో అందమైన స్వెట్టర్ అల్లింది. స్మృతి "వావ్! అమ్మమ్మ గ్రేట్" అంది. ఆ ఇంట్లో ఆమె జీవితం చీకూ చింతా లేకుండా గడుస్తోంది.

* * *

నళినికి డెలివరీ టైమ్ దగ్గర పడుతోంది. ఎవరైనా సహాయానికి వచ్చారో! లేదో! ఆమె మనసులోని ఆత్రుత తెలుసుకున్నట్లుగా ఒక రోజు నళిని ఫోన్ చేసింది.

"అత్తా! నేను నళినిని మాట్లాడుతున్నాను. అమ్మ ఇంకో పదిహేను రోజుల్లో ఇక్కడకు వస్తోంది. బహుశా ఆరునెలలు ఉంటుందేమో! అమ్మ ఉన్నన్నాళ్ళూ నేను నీకు ఫోన్ చెయ్యను. నువ్వు నాకు చెయ్యవద్దు. నేను ఇలా అంటున్నానని అనుకోవద్దు. నువ్వు ఇక్కడ ఉన్నావంటే అమ్మ అన్ని వివరాలూ అడుగుతుంది. నీకు జరిగిన అన్యాయాన్ని ఎంత సానుభూతితో అర్థం చేసుకుంటుందో నాకు తెలియదు. పలు అర్థాలు తీసి ఇండియా వెళ్లినప్పుడు నీ గురించి చెడుగా మాట్లాడే అవకాశం ఉంది. నిన్ను, దినేష్‌ను కూడా నీచంగా చూడవచ్చు. అది నాకిష్టం

లేదు. నువ్వంటే నాకు ప్రేమ, గౌరవం. నిన్ను ఎవరైనా అవమానించినా, చిన్నపరిచినా నేను భరించలేను. నా వీలుని బట్టి అమ్మ లేనప్పుడు నేనే ఫోన్ చేస్తాను" అంది.

"థాంక్స్ అమ్మా! ఈ అత్త మీద ఇంత ప్రేమ ఉన్నందుకు. ఇండియా నుంచి వచ్చేవాళ్ళెవరైనా ఉంటే నాకు రెండు మూడు చీరలు తెప్పించి పెట్టు ముందు మీ అమ్మతో తెప్పించుకోవచ్చనుకున్నాను. ఇప్పుడది కుదరదు కదా!" అంది మంజరి.

"దానికేం ప్రాబ్లమ్ లేదత్తా! ఫ్రెండ్స్ ఎవరికో కావాలి అని తెప్పించుకోవచ్చు. నీకెలా ఉంది? వాళ్లింట్లో సౌకర్యంగా ఉందా!"

"చాలా మంచివాళ్లమ్మా. సొంత ఇంట్లో ఉన్నట్లుగా ఉంది. నా జీతం అంతా బాంక్‌లో వేస్తున్నారు".

"రెండు మూడేళ్ల తరువాత ఈ డబ్బు తీసుకుని ఇండియా వెళ్లిపోవచ్చుత్తా" అంది నళిని.

"ఎప్పుడేమవుతుందో ఎవరికి తెలుసమ్మా! ఇంకా నేను ఎన్ని చూడాలని ఆ విధాత నిర్ణయించాడో? చూద్దాము."

దేముడు ఆమె నోట పలికించినట్లుగా ఆ తరువాత మంజరి జీవితంలో చాలా మార్పులు వచ్చాయి.

నళినికి కొడుకు పుట్టాడు.

తల్లి లేనప్పుడు చూసి మంజరికి ఫోన్ చేసింది. మంజరి చాలా సంతోషించింది. నళిని కొడుకు కోసం తన దగ్గర ఉన్న ఫాబ్రిక్‌తో ఎ.బి.సి.డిలు, కలర్స్ తెలిపే చిన్న చిన్న పుస్తకాలు తయారుచేసింది. అవి చూసి రశ్మి తనకు కొన్ని పుస్తకాలు తయారుచేయమని అడిగింది. ఎవరికైనా గిఫ్ట్ ఇవ్వాలన్నా, పేషెంట్‌గా పిల్లలు తన దగ్గరకు వచ్చినప్పుడు వాళ్లను మరిపించడానికి చాలా ఉపయోగకరంగా ఉంటాయని చెప్పింది. "కానీ మీకు ఇబ్బంది లేకపోతేనే" అన్న మాటలకు..

"మనిషికి ఇష్టమైన పనులు చేసినప్పుడు అలసట, విసుగు ఉండవమ్మా. అందుకని నాకేం ఇబ్బంది లేదు" అంది నవ్వుతూ.

రకరకాల పుస్తకాలు తయారుచేసింది. బొమ్మల క్లాత్‌తో చిన్న స్టోరీ తయారుచేసింది. చిన్న చిన్న కథలు బొమ్మలు చూపిస్తూ చెప్పడానికి వీలుగా ఉన్నాయి. స్మృతికైతే చెప్పనక్కరలేదు. ఏది అడిగితే అది వెంటనే చేసి ఇస్తుంది మంజరి. "ఆంటీ! మీరు దాన్ని మరీ గారాబం చేస్తున్నారు" అంటుంది రశ్మి.

* * *

కాలం గడిచిపోతోంది. ఒక రోజు రశ్మి అంది "అమ్మ వస్తున్నారాంటీ" అని.

అమ్మ వస్తున్నారు అన్న పదంతోనే అర్థమయ్యింది. వచ్చేది ప్రభాత్ తల్లి అని. అలవాటు ప్రకారం ప్రభాత్ తల్లిని కూడా 'అమ్మా' అనే అంటుంది. కాకపోతే మన్నన ఉంటుంది.

"ఆవిడ కొన్నాళ్లు ఉంటారు. మీకేమీ ఇబ్బంది ఉండదు" అంది రశ్మి.

'రశ్మి మంచితనం కాకపోతే తనకేం ఇబ్బంది. వాళ్లు ఎంత ప్రేమగా చూసినా తను వాళ్ల క్రింద పనిచేస్తున్న మనిషి. వాళ్లింటికెవరు వచ్చినా తనెవరు? ఇబ్బంది పడడానికి, వద్దనడానికీ' అనుకుంది మంజరి.

అనుకున్న రోజుకు ప్రభాత్ తల్లి సుభద్రగారు వచ్చారు. స్మృతి నాన్నమ్మను మర్చిపోయింది. మంజరి వెనక మొహం దాచుకుని, ఎంతసేపు పిల్చినా వెళ్లలేదు.

"రెండు రోజులు ఆగితే మీ దగ్గరకు వచ్చేస్తుంది లెండి. ఎంతలేదన్నా రక్తసంబంధం కదా!" అంటూ నవ్వింది మంజరి.

"పిల్లలంతే ఎంత తొందరగా మాలిమి అవుతారో అంత తొందరగా మర్చిపోతారు" అంది సుభద్ర.

సుభద్రకు కూడా మంజరి చాలా నచ్చింది. మంచికుటుంబంలోంచి వచ్చినట్లుంది. ఇలాంటి ఉద్యోగానికి అదీ అమెరికా రావాల్సిన అవసరం ఏం వచ్చిందో? ఆడవాళ్ల గుండెల వెనకాతల ఎన్నో కన్నీటిగాథలు.. గుండె కెలికితే గోదావరిలాగా ఉప్పొంగుతుంది. సుభద్ర వయసు అరవై పైమాటే.

వయసు నేర్పిన పాఠాలతో మంజరి వెనక ఏదో చరిత్ర ఉండే ఉంటుందని గ్రహించింది. మనసులో ఎన్నో ప్రశ్నలు వస్తున్నా కోడలి హెచ్చరిక గుర్తు ఉండబట్టి, మంజరిని ఏమీ అడగలేదు.

రెండు రోజుల్లోనే "నాన్నమ్మా" అంటూ సుభద్ర దగ్గరకు రావడం

మొదలుపెట్టింది స్మృతి. మంజరి సంరక్షణలో అందంగా పెరుగుతున్న మనవరాల్ని చూసి మురిసిపోయింది సుభద్ర.

"సోఫాలో కూర్చోండి" అంటూ ఇద్దర్నీ కూర్చోబెట్టి, "అమ్మమ్మ, నాన్నమ్మ టూ గ్రాండ్ పేరెంట్స్. ఐయామ్ సో లక్కీ" అంటూ ఇద్దర్నీ బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

ప్రభాత్‌కు తండ్రి లేడు. ఇద్దరు అక్కలు, ఒక అన్న. అందరిలోకీ చిన్నవాడు. తండ్రి అర్థాంతరంగా చనిపోతే అన్నగారు బాధ్యతను భుజస్కంధాల మీద వేసుకుని, సంసారాన్ని సక్రమంగా ఒడ్డుకు చేర్చాడు. చెల్లెళ్లిద్దరికీ పెళ్లిళ్లు, తమ్ముడి డాక్టరు చదువు అన్నీ తానే అయి పూర్తిచేసాడు.

తల్లి అన్నా తోబుట్టువులన్నా అమితమైన ప్రేమ. తమ్ముడికి, చెల్లెళ్లకు, అన్నమీద భక్తి, అచంచల విశ్వాసం. అతనికి తగ్గ ఇల్లాలు తులసి. ఆ ఇంటికి వచ్చిన కొద్దిరోజులకే ఆ ఇంటి పరిస్థితిని ఆకళింపు చేసుకుంది.

ఈ వివరాలన్నీ సుభద్ర నోట వింది మంజరి. ఆ ఇంటి కథ విన్నాక లోకంలో ఇంకా మంచివాళ్లు, మంచితనం ఉన్నాయన్న విశ్వాసం కలిగింది. అందరూ స్వార్థపరులే ఉండరుగా అనుకుంది మంజరి.

స్మృతి ఒక రోజు ఆల్బమ్ చూద్దామని గొడవ పెట్టింది. స్టడీరూమ్‌లో ఉన్న ఆల్బమ్ తెచ్చి చూడ్డానికి ఇచ్చింది. అందులో స్మృతి పుట్టినప్పట్నుంచి ఇప్పటిదాకా వివిధ కోణాల్లో, సందర్భాల్లో తీసిన ఫోటోస్ ఉన్నాయి.

అలా తాను చూస్తూ నాన్నమ్మకు, మంజరికి చూపిస్తున్న సమయంలో ఒక ఆల్బమ్‌లోంచి ఒక ఫోటో జారిపడింది. ఆ ఫోటో చేతిలోకి తీసుకున్న మంజరి ఫోటోలో ఉన్న రశ్మిని గుర్తు పట్టింది. ఆమె పక్కన ఉన్న యువకుడెవరో తెలియదు.

ఆ ఫోటో సుభద్రకు చూపించి, "ఇతను ఎవరు? రశ్మి బ్రదరా?" అంది.

ఆ ఫోటో చూసిన సుభద్ర గబగబా ఫోటో దాచేసింది. స్మృతి ఫోటోలు చూడ్డంలో బిజీగా ఉండి, వీళ్లవైపు చూడలేదు. మంజరికి తను తప్పు చేసానేమో అన్న అనుమానం.

మంజరికే వినపడేటట్లుగా "ఈ ఫోటో మెల్లిగా లోపలెక్కడో పెట్టేయండి. నేను తరువాత మెల్లిగా వివరాలు చెప్తాను" అంది.

ఆ ఫోటో తీసుకువెళ్లి స్టడీరూమ్‌లో ఎక్కడో పెట్టి వచ్చింది.

ఆ తరువాత సుభద్ర చెప్పిన కథ విన్నాక ప్రపంచంలో ఇలాంటివాళ్లు కూడా ఉంటారా అనుకుంది మంజరి. ఆ ఫోటోలో ఉన్నది రశ్మి భర్త.

పంజాబ్‌లో హోషియార్‌పూర్‌లో పుట్టిన కర్తార్ సింగ్ తరతరాలుగా వ్యవసాయంలో ఉన్న కుటుంబంలో పుట్టినా మొదటినుంచీ దేశసేవ చెయ్యాలన్న ఉద్దేశంతో మిలిటరీలో చేరాడు.

కర్తార్ ఒక్కడే వాళ్లింట్లో చదువుకుని ఉద్యోగంలో ఉన్నవాడు. ఉద్యోగరీత్యా ఎన్నో ఊళ్లు తిరిగాడు. అతని భార్య ఆడపిల్లను ప్రసవించింది. అత్తగారు మగపిల్లవాడు పుట్టలేదని సతాయిస్తుంటే తల్లిని ఎదిరించి, ఈ రోజుల్లో ఆడ, మగ భేదం లేదని ఆడపిల్లలు కూడా వంశానికి పేరు తెస్తారని, నచ్చచెప్పాడు.

కర్తార్‌కు రశ్మి ఒక అపరూపమైన వరంలాగా అనిపించేది. ఆమెను బాగా చదివించాలని నిర్ణయించుకున్నాడు. చిన్నతనంనుంచే చదువులో ఎంతో శ్రద్ధ కనబరచేది. ఆమె ప్రతి ఆటా, మాటా తండ్రికి ఆనందదాయకంగా ఉండేది.

ఎప్పుడూ చదువులో ముందు ఉండే రశ్మిని, డాక్టర్ చెయ్యాలని కలలు కన్నాడు. అతని కలలమేరకు రశ్మి, డాక్టర్ చదువుకు నాంది పలికింది. కర్తార్ ఇంట్లో రశ్మి చదువు దుమారం లేపింది. ఆడపిల్ల పొయ్యికే అంకితం అన్న ఆలోచనలనించి బైటికి రాలేదు. అలాంటిది పైచదువులు, అందులో డాక్టర్ అంటే వాళ్లు అంత సుముఖత చూపలేదు.

రశ్మి తండ్రి మాత్రం పట్టుపట్టి ఆమెను డాక్టర్ చేసాడు. రశ్మి ఎం.బి.బి.ఎస్ పూర్తి చేసింది. పైచదువులకు అమెరికా వెళ్ళాలన్న కోరిక ఉంది. తండ్రితో చెప్పగానే ఆమె చదువుకు తన అభ్యంతరం ఏమీ లేదని తెలిపాడు. తల్లి, తాత, నాన్నమ్మలు పెళ్లి చెయ్యమని గొడవపెట్టారు. రశ్మి చదువులో మునిగిపోవాలని అనుకున్న తరుణంలో ఆమె జీవితం అనుకోని మలుపు తిరిగింది. స్కూల్ మేట్స్ అప్పుడప్పుడు కలుసుకుని పార్టీలు చేసుకోవడం చాలా కామన్‌గా జరుగుతుంది. అలా ఒక రోజు పార్టీలో రాకేష్ కలిశాడు.

రాకేష్ ఇంజనీరింగ్ తరువాత ఎమ్.ఎస్. చెయ్యడానికి అమెరికా వెళ్లిపోయాడు. చదువు పూర్తయి ఇండియా వచ్చినప్పుడు పాత స్నేహితులందరూ పార్టీలో కలుస్తున్నారని తెలిసి తను కూడా వచ్చాడు.

రశ్మిని చూసిన రాకేష్ కళ్లు తిప్పుకోలేక పోయాడు. ట్వెల్త్ తరువాత మళ్ళీ ఇప్పుడే చూస్తున్నాడు. స్కూలుకు స్కర్ట్ వేసుకువచ్చేది. ఫ్రెండ్స్ పార్టీల్లో రాకేష్ అంత తరుచుగా వచ్చేవాడు కాదు.

ఈ రోజు చీరలో ఎంతో అందంగా చేయి తిరిగిన శిల్పి మలచిన శిల్పంలా ఉంది. పచ్చని పసిమిఛాయ, సోగతేరిన కళ్లు, దానిమ్మపూవులాంటి పెదవులు, పొడుగాటి జుట్టు.

పార్టీ హోస్ట్ చేస్తున్న సుహానా అందర్నీ ఒకరికొకర్ని పరిచయం చేసింది. చాలారోజుల తరువాత కలిస్తే వయసు తెచ్చిన మార్పులతో గుర్తుపట్టడం కష్టమే. అక్కడ ఉన్నంతసేపూ రాకేష్ రశ్మి చుట్టూ తిరుగుతూనే ఉన్నాడు.

అతని భావం అర్థంచేసుకోలేనంత అమాయకురాలు కాదు రశ్మి. ఆ రోజు తరువాత కూడా ఏదో కారణంతో ఆమెను కలవడానికి ప్రయత్నించేవాడు. రశ్మికి కూడా అతనిపట్ల ఆకర్షణ మొదలయ్యింది. చివరికి రాకేష్ ఆమె ముందు పెళ్లి ప్రపోజల్ పెట్టాడు. అభ్యంతరం చెప్పడానికి కారణం దొరకలేదు.

ఇంట్లో తల్లి, నాన్నమ్మవాళ్లు పెళ్లికి తొందర చేస్తున్నారు. తనకి పైచదువులకు అమెరికా వెళ్ళాలని ఉంది. ఈ పెళ్లి చేసుకుంటే ఇద్దరి కోర్కెలూ తీరుతాయి.

ముందుగా విషయం తండ్రితో చెప్పింది. కర్తార్ ఒక్కసారి కంగారుపడ్డాడు. అప్పుడే తన చిన్నబేబీ పెళ్లికెదిగిందా! పెళ్లిచేసుకుని తనను వదిలి వెళ్లిపోతుందా! అతని భయం విన్న భార్య, నవ్వి " మా నాన్న కూడా అలా భయపడితే నేను మిమ్మల్ని ఎలా పెళ్లిచేసుకునేదాన్ని. ఆడపిల్లకు పెళ్లిచేసి పంపడం ప్రపంచంలో అందరి ఇళ్లల్లోనూ జరుగుతుంది" అంది.

ఇంకా ఎక్కువ మాట్లాడితే భార్య ఆట పట్టిస్తుందని ఊరుకున్నాడు. ఆ తరువాత ఆలోచించాడు. పెళ్లికి అభ్యంతరం తెలపడానికి ఏ కారణం లేదు. పిల్లవాడి చదువు, రూపం అన్నీ బాగున్నాయి. తమ జాతివాడే కాబట్టి తల్లితండ్రులను ఒప్పించడం సులువైనపని.

ఇరుపక్షాలవారు మాట్లాడుకున్నారు. సంప్రదింపుల తరువాత పెళ్లికి ముహూర్తం నిశ్చయించారు. రశ్మి, రాకేష్‌లు వివాహబంధం అనే పవిత్రబంధంలో ముడిపడ్డారు. ఇద్దరూ అమెరికా వచ్చారు. రాకేష్ ఉద్యోగంలో చేరాడు. రశ్మి చదువులో పడింది. కొత్తకాపరం ఆనందంగా సాగింది. రాకేష్ ప్రేమలో ఆరు నెలలు ఆరు నిముషాలుగా గడిచిపోయింది.

అందమైన సంసారజీవితంతోబాటు తన డాక్టర్ చదువు కూడా పూర్తిచేసి, తను కూడా సంపాదన మొదలుపెట్టాక తమ జీవితం ఇంకా ఆనందంగా ఉంటుందని కలలు కంది రశ్మి. ఎదర తమ దాంపత్యంలో విషం పొంచి ఉందని తెలియదు.

అత్తగారు రావడంతో వారి చల్లని దాంపత్యంలో కలకలం రేగింది. అప్పటిదాకా ఎంతో ప్రేమగా చుసుకునే రాకేష్ తల్లి రాగానే ఏం చెప్పిందో అతని ప్రవర్తనలో మార్పును స్పష్టంగా గ్రహించింది రశ్మి.

ఏదో వంకన ఆమెలో తప్పులెంచడం మొదలుపెట్టాడు. ఆఫీస్ టెన్షన్ అని ఊరుకుంది. అత్తగారు వంట ఏ పూటకా పూట చెయ్యాలన్న నియమం. ఇల్లు బాగా పెట్టుకోవటం లేదన్న సతాయింపు. ఇలా రోజూ ఏదో ఒక గొడవ చెయ్యడం మొదలుపెట్టారు.

ఆవిడకు సమాధానం చెప్పి ఇంట్లో గొడవలు కల్పించడం ఇష్టంలేక వీలైనంత వరకు సర్దుకుపోవడం, తన చదువులో మునిగిపోవడం మొదలుపెట్టింది. అయినా తల్లీకొడుకులు కసిగా ఆమెను టార్చర్ పెట్టడమే వారి ఉద్దేశంగా ప్రవర్తించడం మొదలుపెట్టారు.

సహనానికి కూడా ఒక హద్దు ఉంటుంది. ఒక రోజు ఆగలేక రాకేష్‌కు జవాబు ఇచ్చింది. “కోరి పెళ్లిచేసుకున్నావు. ఇప్పుడెందుకు ఇలా ప్రవర్తిస్తున్నావు?” అని.

దానికి సమాధానం అత్తగారి దగ్గరినించి వచ్చింది.

“డాక్టర్ చదువుకుని అందంగా ఉన్నావని నా కొడుకు నీ వలలో పడ్డాడు. నీ డాక్టర్ చదువుతో మాకు ఒరిగేదేమీ లేదు. మీ నాన్న నిన్ను ఒట్టి చేతులతో పంపాడు. నా కొడుక్కు రావాల్సిన కట్నకానుకలు సరిగా ఇవ్వలేదు.” అంటూ మొదలుపెట్టింది.

అసలే చెక్క ఇళ్లు. ఒకరి మాటలు ఒకరికి వద్దన్నా వినబడతాయి. భాష రాకపోయినా మాట్లాడే విధానంతో ఎవరైనా గ్రహిస్తారు ఇంట్లో ఏదైనా గొడవ జరుగుతోందని. పక్క అపార్ట్‌మెంట్ వాళ్లు డిస్టర్బెన్స్‌గా ఉందని కంప్లైంట్ చేస్తే అపార్ట్‌మెంట్ మానేజ్‌మెంట్ నోటీసు పంపుతుంది.

గారాబంగా పెరిగింది రశ్మి. మెత్తని మనసు. ఇలాంటి సాధింపులు ఉంటాయని తెలియదు. పల్లెటూరిదయినా ఆమె నాయనమ్మ కూడా ఎప్పుడూ తల్లిని ఇలా నిందించడం చూడలేదు.

రోజు రోజుకీ టార్చర్ ఎక్కువైపోతోంది. రాకేష్ ఎందుకు ఇలా మారిపోయాడో అర్థం కావటం లేదు. ఏం చెయ్యాలో తెలియని నిస్సహాయత. ఆఖరికి డిప్రెషన్‌లోకి వెళ్లిపోవడం మొదలుపెట్టింది. అమెరికా వెళ్లినా మారని మనస్థత్వాలను ఎలా బైటపెట్టగలదూ!

చాలా రోజులు తల్లితండ్రులకు తెలియకుండా దాచడానికి ప్రయత్నించింది. కానీ ఒక రోజు తల్లి ఫోన్ చేసినప్పుడు అంతకుముందు అయిన గొడవ మూలంగా డిస్టర్బ్ అయిఉందేమో! ఒక్కసారిగా ఏడ్చేసింది. తల్లి కంగారుపడి ఏమయ్యిందని అడిగింది. రశ్మి అదృష్టవశాత్తూ ఆ సమయంలో తల్లీకొడుకూ ఇంట్లో లేరు.

తల్లికి జరిగిందంతా చెప్పింది. విషయం తెలిసినా అంత దూరంలో ఉండి ఆమె ఏం చెయ్యగలుగుతుంది. తండ్రికి తెలిసి వాళ్ల అంతు చూస్తానన్నాడు. చిలికి చిలికి గాలివాన అయ్యింది. వాళ్ల బాధ పడలేక విడాకులివ్వమంటే తనకు ఇష్టం లేకున్నా ఒప్పుకుంది.

సున్నితమనస్కురాలైన రశ్మి ఇది తట్టుకోలేకపోయింది. ఆమె రాకేష్‌ను అమితంగా ప్రేమించింది. అందుకే ఆమె ఒక్క ఫోన్ కాల్ రాకేష్‌ను జైలుపాలు చేస్తుందని తెలిసినా ఆ పని చెయ్యలేదు. డిప్రెషన్లో ఒక రోజు స్లీపింగ్ పిల్స్ మింగింది. సమయానికి ఆమె స్నేహితురాలు చూసి స్టమక్ వాష్ చేసి ఆమెను హాస్పిటల్లో అడ్మిట్ చేసింది.

ఆ సమయంలో ప్రభాత్ ఆమెకు ట్రీట్‌మెంట్ ఇవ్వడం జరిగింది. రశ్మి స్నేహితురాలి ద్వారా ఆమె కథ విన్నాడు. ఈ రోజుల్లో కూడా ఇలాంటి మనుషులున్నారంటే నమ్మబుద్ధి కాలేదు.

కొంచెం కోలుకున్నాక తాను గర్భవతినని తెలిసింది. అబార్షన్‌కు తలపడితే ప్రభాత్ వారించాడు. మొదట చూసినప్పుడే ఆమెపట్ల ఒక విధమైన ఆకర్షణ కలిగింది. అమాయకమైన ఆమెను అలాంటి స్థితికి తీసుకురావడానికి వాళ్లకు మనసెలా ఒప్పిందో?

ప్రభాత్ ఆమెను వివాహం చేసుకుంటానన్నాడు. ఆమె నిరాకరించింది. ఆమె మనసు వివాహంపట్ల భయాన్ని నింపుకుంది. మళ్ళీ ఎవర్నీ నమ్మాలని

లేదు. వివాహబంధాన్ని ఎంతో అపురూపంగా ఊహించుకుని కోటి కలలతో అడుగుబెట్టిన ఆమెకు జీవితం చేదుజ్ఞాపకాలను మిగిల్చింది.

అందుకే ప్రభాత్ ఆహ్వానాన్ని స్వీకరించలేకపోయింది

కానీ ప్రభాత్ ఊరుకోలేదు. " మీరు ఏ కారణంతో నన్ను నిరాకరిస్తున్నారో నాకు తెలియదు. మీమీద జాలితో నేను పెళ్లిచేసుకోవటం లేదు. మీ అందం అంతకన్నా కాదు. మీలో ఉన్న మానవత్వాన్ని ప్రేమిస్తున్నాను. ప్రేమతత్వాన్ని ఇష్టపడుతున్నాను. మీ భర్తను మీరు ఎంత ప్రేమించకపోతే మీరు అతనిపట్ల చట్టరీత్యా ఏ చర్యా తీసుకోకుండా వదిలేశారు? ఇక్కడ చట్టం మీకు నిజంగా సహాయపడి ఉండేది. అతన్ని జైలుకు పంపడం మీకు సాధ్యమయ్యే పనే. ఇండియాలోలాగాకాదు. మీరు కంప్లైంట్ చేసిన మరుక్షణమే అతను కటకటాల వెనక ఉంటాడు. కానీ మీరు చెయ్యలేదు. ఈ సంఘటనతోనే మీ మనస్తత్వం అర్థం అయ్యింది" అన్నాడు.

అతని మాటల్లోని నిజాయితీని శంకించాలనిపించ లేదు.

"మీ ఇంట్లోవాళ్లు ఒప్పుకుంటారా!" అంది.

"ఒప్పుకుంటారన్న ధైర్యం నాకుంది. మావాళ్లందరూ ఇండియాలో ఉన్నారు. నా నిర్ణయాన్ని కాదనరన్న ధైర్యం, మిమ్మల్ని మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తారన్న నమ్మకం నాకున్నాయి. మీరు తగినంత సమయం తీసుకుని, మీవాళ్లను సంప్రదించి మీ నిర్ణయాన్ని నాకు తెలుపండి. మీ పుట్టబోయే పాపకు నాన్నగా మారడానికి నాకు అభ్యంతరం లేదు. జీవితంలో ఎప్పుడూ మీరు మీ నిర్ణయానికి పశ్చాత్తాపపడే క్షణం రాదని హామీ ఇస్తున్నాను" అన్నాడు ప్రభాత్.

"ఇండియాలో ఉన్న తల్లి, అన్నలతో తన అభిప్రాయం చెప్పాడు. అతని నిర్ణయాన్ని ఆమోదిస్తూ అందరూ తమ సమ్మతిని తెలిపారు. లోకంలో ఇంకా మంచితనం ఉందని రుజువయ్యింది. ఇప్పుడు రశ్మి జీవితంలో అంతా ఆనందమే.

సుభద్ర నోట కథ విన్నాక, ప్రభాత్, సుభద్రలు రక్తసంభంధం లేని నాన్న, నాన్నమ్మలన్న విషయం తెలిసింది. కానీ ఇన్నాళ్లల్లో ప్రభాత్ ఎప్పుడూ స్మృతికి కన్నతండ్రి కాదన్న భావన ఏనాడూ కలగలేదు. అసలు ఈ కథ తెలియకపోతే మంజరికి ఎప్పటికీ ప్రభాత్ కన్నతండ్రి కాదన్న విషయం తెలిసి ఉండేది కాదు.

"ఈ విషయం స్మృతికి ఏనాడూ తెలియడానికి వీలులేదు. ఆ ఒక్క ఫోటో ఎలా ఉండిపోయిందో తెలియదు. స్మృతి పుట్టాక రశ్మి పాతజ్ఞాపకాలు

తుడిచెయ్యడానికి అన్ని ఫోటోలూ, పెళ్లిఫోటోలు సహితం తగలపెట్టేసింది. ఈ బంగారుతల్లి మా రక్తం కాదన్న భావన మాలో ఏనాడూ తల ఎత్తకుండా చూసుకుంటున్నాము. మీకు కూడా ఆ ఫోటో కనబడకపోతే చెప్పి ఉండేదాన్ని కాదు. ఇది మీ నోటి వెంట మరొకరికి తెలియకూడదు" అంది సుభద్ర.

"నా మీద ఉన్న నమ్మకంతో మీరు నాకు చెప్పారు. ఈ విషయం నా పెదవి దాటదు. ఇంకా లోకంలో మంచితనం మిగిలి ఉందని తెలియచెప్పడానికి తార్కాణం మీలాంటి మనుష్యులే" అంది మంజరి.

"ఆధునీకరణను, ఆవిష్కారాలను ఆహ్వానిస్తున్నాడంటే మనిషి ప్రగతిపథంవైపు పయనిస్తున్నట్లే కదా! అది మనం వాడే వస్తువుల్లోనే కాదు మన మనసుల్లోనూ, ప్రవర్తనలోనూ రావాలి. పైకి మోడరన్ డ్రస్ వేసుకుని మనసు లోపల పాచిపట్టిన బూజు భావాలు వుంటే దానికి అర్థం లేదు. ఏది జరిగినా శిక్ష ఆడదే ఎందుకు అనుభవించాలి? ఇందులో రశ్మి తప్పు ఎంత? జరిగినదానికి ఆమె ఎంతవరకు బాధ్యురాలన్నది ఆలోచించాలి.

తప్పు చేసినవాడికి శిక్షపడడంలో అర్థం వుంది కానీ ఏ తప్పూ చెయ్యనివాళ్లు శిక్ష ఎందుకు అనుభవించాలి? కాలం మారినా మనం మారకపోవటం అన్యాయం. మనుధర్మశాస్త్రంలో 'నస్త్రీస్వాతంత్రమర్హతి' అని స్త్రీ ఎప్పుడూ మగవాడి పర్యవేక్షణలో ఉండాలని చెపుతూ ఆమెలో ఉన్న శక్తిని అణగదొక్కడానికి ప్రయత్నిస్తున్నారు. అదే మనుధర్మశాస్త్రం ఇంకోటి కూడా చెప్పింది. 'యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతా' అని. ఎక్కడయితే స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు నివసిస్తారని.

జీవనయానంలో స్త్రీ పురుషులిద్దరూ సమానమే. ఒకరు లేక ఒకరు అసంపూర్తే. అలాంటప్పుడు ఎక్కువ తక్కువల ప్రసక్తి ఎక్కడిది? ప్రకృతికి స్త్రీ పురుషులిద్దరూ మూలమే. ఇదే బైబిల్ ప్రకారం ఆడం ఈవ్ అన్నారు" అంది సుభద్ర.

"మీరేం చదువుకున్నారు? జీవితంపట్ల ఇంత చక్కని విశ్లేషణ ఉంది. మీరు చెప్పినది అక్షరసత్యాలు" అంది మంజరి

"డిగ్రీలు కొలమానమైతే నేనేం చదువుకోలేదు. జ్ఞానం సముపార్జించు కుందుకు ప్రపంచాన్ని అధ్యయనం చేసాను. మహామహుల రచనలు చదివాను.

ప్రతీ మనిషీ తనను తాను సంస్కరించుకుంటే సమాజం దానంతటదే సంస్కరింపబడుతుందన్నది నా విశ్వాసం."

"మీరు చెప్పినవన్నీ నిజాలేనమ్మా కానీ ఉపన్యాసాలు ఇవ్వడానికి చాలామంది ముందుకు వస్తారు. ఆచరణలో పెట్టడానికి ఎంతమంది ముందుకు వస్తున్నారన్నది ప్రశ్న. అలాగే చట్టాలు కూడా ఆడవారికి ఎంత న్యాయం చేకూరుస్తున్నాయి? రాతల్లో కన్నా చేతల్లో ఆచరించినప్పుడే దేనికైనా ప్రయోజనం ఉంటుంది. మీలాంటి సంస్కారవతి అయిన తల్లి కడుపున పుట్టారు కాబట్టే ప్రభాత్‌గారిలో ఆ ఆలోచనా విధానం కలిగింది. తన తల్లి తన చర్యకు ఆమోదం తెలుపుతుందన్న నమ్మకం కూడా ఉంది. రశ్మి, స్మృతిలు ఎలాగా అదృష్టవంతులు. నేను కూడా అదృష్టవంతురాల్ని కాబట్టే మీలాంటివారి సాంగత్యం దొరికింది" అంది మంజరి.

వాళ్లిద్దరి మాటల్లో స్మృతి ఎప్పుడు లేచి వచ్చిందో చూసుకోలేదు. టి.వి. ఆన్ చేసికార్టూన్ పెట్టుకుని చూస్తోంది.

"స్మృతికి పాలు కలిపి మనిద్దరికీ టీ పెడతాను" అంటూ లేచింది మంజరి.

పాలు తాగాక "గార్డెనింగ్ చేద్దామన్నావు కదా అమ్మమ్మా" అంది స్మృతి.

రశ్మికి పూలమొక్కలంటే చాలా ఇష్టం. చలికాలం మంచు మూలంగా ఏ మొక్కలూ వెయ్యడానికి అవకాశం ఉండదు. వసంతకాలం మొదలవగానే నర్సరీకి వెళ్లి తెచ్చిన రకరకాల మందారాలు, డాలియా, రోజెస్ రకరకాల రంగుల్లో టులిప్స్, ఆర్చిడ్స్ డైసీ అన్ని రకాలూ వాళ్ల గార్డెన్లో చోటుచేసుకుంటాయి.

మంజరి కొంచెం జాగాలో కిచెన్ గార్డెన్ వేసింది. మెంతికూర, ముల్లంగి, బీన్స్, వంకాయలు, టమాటాలు లాంటివి. కొంచెం కాసినప్పుడల్లా రశ్మికి చూపించి మురిసిపోతూ ఉంటుంది.

* * *

నళిని మధ్యలో ఒకసారి వచ్చి బాబును చూపించింది. బాబు బొద్దుగా ముద్దుగా ఉన్నాడు. మంజరి తను వాడికోసం తయారుచేసినవన్నీ ఇచ్చి, ఒక ఐదువందల డాలర్లు కూడా ఇచ్చింది.

"ఇంత డబ్బు ఎందుకత్తా" అంటూ వారించింది నళిని.

"దాన్ని నువ్వు రూపాయల్లోకి మార్చి చూడకు. అలా చూస్తే చాలా ఎక్కువగా అనిపిస్తుంది. అదే ఇక్కడి రూపాయిగా చూస్తే పెద్ద మొత్తం కాదు. నాకు మాత్రం

ఇప్పుడు ఎవరున్నారు? నువ్వు నాకు చేసిన సహాయానికి ఇది ప్రతిఫలం కాదు. నువ్వు నాదానివన్న సంతృప్తితో ఇస్తున్నాను” అంది మంజరి.

తల్లితో తెప్పించిన చీరలు. దానితోబాటు ఒక కంచిపట్టు చీర కూడా ఇచ్చింది. అది చూసి మంజరి “ఇదేమిటమ్మా! నేను పట్టుచీర అడగలేదే” అంది.

“అది నా తరఫున నీకు కానుక” అంది.

మొహమాటపడ్డా వద్దంటే నళిని నొచ్చుకుంటుందని మాట్లాడకుండా తీసుకుంది. నళిని వద్దంటున్నా నళిని తెప్పించిన చీరలకు డబ్బు ఇచ్చేసింది. నళిని కాస్సేపు కూర్చుని వెళ్లిపోయింది.

* * *

ఈ ఇంటికి వచ్చి రెండేళ్ల కాలం పూర్తవుతోంది. ‘ఒక వేళ వీళ్లు వెళ్లిపోమంటే ఏం చెయ్యాలన్న భయం మంజరి మనసులో మెదులుతూ ఉంటుంది. అయినా ఎల్లకాలం ఇలా నానీలా పనిచేస్తూ బ్రతుకు గడపాలా? లేక నళిని చెప్పినట్లు డబ్బు కూడబెట్టుకుని ఇండియా వెళ్లిపోవాలా? తన జీవితం ఎలాంటి మలుపులు తిరగబోతోంది? జీవితచరమాంకం దాకా ఇలా తోడు లేకుండా గడిపెయ్యాలా? కొంతమంది జీవితాల్లో దేముడు అన్నీ కష్టాలే రాసి పెడ్తాడా! తనకన్నా కష్టజీవులు ప్రపంచంలో ఇంకా ఉండి ఉండవచ్చు. ప్రతీదానికీ ఇలా ఆలోచిస్తూ ఉంటే జీవితం సాగించడం కష్టం’ అనుకుంది మంజరి.

మంజరి భయాన్ని నిజం చేస్తున్నట్లుగా రశ్మి, ప్రభాత్‌లు కాలిఫోర్నియా వెళ్లిపోతున్నట్లు చెప్పారు. ఒక్కసారి నెత్తిన పిడుగు పడ్డట్లు అయ్యింది. మళ్లీ జీవనోపాధి వెతుక్కోవాలి. మంజరి మనసులో ఆలోచన.

“ఆంటీ! మీరు మాతో రావచ్చు. మాకేం అబ్జెక్షన్ లేదు. ఇక్కడిలాగే అక్కడా కంటిన్యూ అవవచ్చు” అంది రశ్మి.

స్మృతి పెద్దదయ్యింది. స్కూలుకు వెళ్లడం మొదలయ్యాక తన అవసరం అంత ఉండకపోవచ్చు. వచ్చిననాటికన్నా జీతం పెంచారు. కానీ పని తగ్గాక ఇంత జీతంతో వాళ్లు తనను ఎందుకు ఉంచుకుంటారు? అదీకాక కొత్తఊరు వెళ్లి తను ఉండగల్గుతుందా! అన్న ఆలోచన మంజరి మనసులో.

ఆ రోజు రాత్రి మళ్లీ భవిష్యత్తు గురించిన ఆలోచనతో నిద్ర లేని రాత్రిగా

గడిచింది మంజరికి. మనసు ఊగిసలాటలో ఉంది. ఇక్కడే ఉండి బ్రతుకుతెరువు వెతుక్కోవాలా! వాళ్లతో వెళ్ళాలా? జగన్నాటక సూత్రధారి తన జీవితంతో బాగానే ఆడుకుంటున్నాడు రకరకాల పరీక్షలు పెట్టి, తను గెలుస్తుందా! ఓడుతుందా! అని చూస్తున్నాడు.

ఆపద్బాంధవా! ఇంకా ఎన్నాళ్లయ్యా నాకీ పరీక్ష. దీనికెప్పటికైనా అంతు ఉందా! చివరిదాకా అలుపెరగని సైనికుడిలా జీవితంతో పోరాడాలా?

రాత్రంతా నిద్ర లేకపోయినా ప్రొద్దున మామూలు వేళకు తెలివి వచ్చి లేచి తన నిత్యకృత్యాల్లో మునిగిపోయింది. రశ్మి హాస్పిటల్‌కు వెడుతూ కొంత డబ్బు మంజరి చేతిలో పెట్టి, “బాత్‌రూమ్ టాప్ పాడయ్యింది. ప్లంబర్ వచ్చి బాగు చేస్తాడు. అతను ఎంత అడుగుతాడో తెలుసుకుని ఇవ్వండి” అని చెప్పి హాస్పిటల్‌కు వెళ్లిపోయింది. ప్రభాత్ రాత్రి డ్యూటీ చేసి వచ్చి బెడ్‌రూమ్‌లో పడుకున్నాడు.

రశ్మి ఇచ్చిన డబ్బులు పర్స్‌లో పెట్టడానికి పర్స్‌లో తెరిచిన మంజరికి ఒక విజిటింగ్ కార్డు కనబడింది. అది తీసి చూసింది. మల్లికార్జున్ రెడ్డి అని ఉంది. ఆ కార్డు తన పర్స్‌లో ఎందుకుంది అని ఆలోచించిన మంజరికి గుర్తుకు వచ్చింది.

రశ్మి, ప్రభాత్‌లు వీలున్నప్పుడల్లా సరదాగా పార్టీలు ఇవ్వడం అలవాటు. రశ్మి కేకులు చాలా బాగా చేస్తుంది. డిఫరెంట్ వెరైటీస్ చెయ్యడం, దానిమీద ఐసింగ్ చెయ్యడం అన్నీ చాలా బాగా చేస్తుంది. వంటకు మాత్రం బైటనుంచి ఎవరినైనా పిలుస్తారు.

మంజరి వచ్చాక అలా పిలవడానికి ఒప్పుకోలేదు. ఇంట్లోనే అన్ని రకాలూ తయారుచేసేది. పాకశాస్త్రం కూడా ఒక కళ అన్నది మంజరి వంట తిన్నవాళ్లకు అనిపిస్తుంది.

పార్టీనాడు అన్నీ తయారుచేసి, మైక్రోవేవ్‌లో పెట్టడానికి వీలుగా ఉన్న కంటైనర్స్‌లో అందంగా అమర్చింది. వచ్చిన గెస్ట్‌లంతా ఆ రోజు వంటను మెచ్చుకున్నారు. అందులో ఒకరు కేటరర్ పేరు చెప్పండి. నెక్స్ట్ మేము కూడా వాళ్లనే పిలుస్తాము అన్నారు.

రశ్మి అప్పుడు మంజరిని చూపించి జోక్‌గా “మంజరీ కేటరర్స్” అంది. పార్టీ అయిపోయాక మల్లికార్జునరెడ్డి మంజరి దగ్గరకు వచ్చి, తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"నా పేరు మల్లికార్జున్. నేను హోటల్ స్టార్ట్ చేయాలనుకుంటున్నాను. మీరు నాతో కలిస్తే మనిద్దరం పార్ట్‌నర్స్‌గా హోటల్ స్టార్ట్ చేయవచ్చు. మీకు సమ్మతమవుతే నాతో చెప్పండి" అని తన కార్డ్ ఇచ్చాడు.

ఈ కార్డ్ అప్పుడు అతను ఇచ్చినదే. అదంతా జ్ఞాపకం వచ్చింది మంజరికి. ఇప్పుడు అతనికి ఫోన్ చేసి ఇంకా ఆ ఆఫర్ ఉందో లేదో కనుక్కుంటేనో అనిపించింది. మళ్లీ భయం. అతను సీరియస్‌గా అనలేదేమో! క్షణికంగా మాట్లాడిన మాటలు కాదు కదా! అయినా అవసరం తనది. ఫోన్ చేసి కనుక్కుంటే అతను ఉందంటే ఇది కూడా ట్రైచేసి చూడవచ్చు. ఇంకా జీవితం ఏఏ మలుపులు తిరగబోతోందో!

రెండు రోజులు బాగా ఆలోచించుకున్నాక అతనికి ఫోన్ చెయ్యడానికే నిర్ణయించుకుంది.

ఫోన్ చెయ్యగానే అతనే ఫోన్ ఎత్తాడు. తన పేరు పరిచయం, ఎక్కడ కలుసుకున్నదీ, అన్నీ వివరంగా చెప్పి, "ఇదివరలో మీరు చెప్పిన ప్రపోజల్ ఇంకా ఉంటే నేను మీతో జాయిన్ అవ్వడానికి రెడీ" అని, రశ్మివాళ్లు ఊరు మారుతున్నట్లు చెప్పింది.

మంజరి ఒప్పుకున్నందుకు అతను చాలా సంతోషించి, వెస్ట్‌విండ్సర్‌లో జాగా చూసి ఆమెను కలుస్తానన్నాడు.

* * *

మంజరి జీవితంలో మరో అధ్యాయం మొదలయ్యింది. ఇద్దరు ముగ్గురు పనివాళ్లతో ఇండియన్ రెస్టారెంట్ 'స్వాద్' అన్న పేరుతో మొదలయ్యింది. కొలదికాలంలోనే పేరు రావడంతో కస్టమర్లు పెరిగారు.

మంజరి స్టూడియో అపార్ట్మెంట్ అద్దెకు తీసుకుంది. బిజెనెస్ బాగా నడవడంతో ఆమె షేర్ మనీ ఆమెకు బాగానే ముడుతోంది. మల్లికార్జున్ సలహాతో సెకండ్ హాండ్ కారు కొనుక్కుని డ్రైవింగ్ నేర్చుకుంది.

నళిని, ఆమె భర్త మంజరి సాధించిన ఈ విజయాన్ని మనస్ఫూర్తిగా హర్షించారు. ప్రభాత్, రశ్మి కాలిఫోర్నియా నుంచి ఎప్పుడు న్యూజెర్సీ వచ్చినా 'స్వాద్'లో టిఫిన్ తింటామని, ఆమె ఎప్పుడు కావాలన్నా వాళ్ల ఇల్లు ఆహ్వానం పలుకుతుందని చెప్పారు.

మంజరి సలహా మేరకు వీకెండ్స్‌లో బఫే లంచ్ ఇంట్రడ్యూస్ చేశారు. స్వచ్ఛమైన ఆంధ్రాభోజనం, గోంగూర, కందిపొడి, ఆవకాయ సమేతంగా సర్వ్ చేయడం మొదలుపెట్టేసరికి రెస్పాన్స్ బాగా వచ్చింది. ఆవకాయ, గోంగూరకు, ఆమడదూరమైనా పరిగెట్టడానికి సిద్ధమన్న సంగతి నిరూపించారు అక్కడున్న ఆంధ్రులు.

సమయంతో పాటు పరుగులు పెడుతూ పోయే నాగరిక ప్రపంచానికి అలవాటు పడుతున్న యువతకు రుచులు కావాలి కానీ చేసుకునే ఓపికా, సమయం లేదు. ఇదివరకులా ఆడపిల్లలు వంట చెయ్యకుండా అది మాదే కాదు మీది కూడా అనే పరిస్థితి వచ్చింది

అలాంటి వాతావరణం ఏర్పడినప్పుడు ఇలాంటి హోటళ్లకు డిమాండ్ తప్పకుండా ఉంటుంది. ఇండియాలో వీధివీధికీ వెలిసిన కర్రీ పాయింట్స్, స్వగృహ ఫుడ్స్ దీనికి తార్కాణం. ఇప్పుడు నళినిని కలవడానికి వెళ్లాలంటే కారు డ్రైవ్ చేసుకుంటూ ప్లైన్స్‌బరోనుంచి ఎడిసన్‌కు వెడుతుంది. రూట్‌మ్యాప్ పెట్టుకుని.

ఎన్నో ఏళ్ల అనుభవం ఉన్నదానిలా డ్రైవ్ చేస్తోంది. ఇదివరలో కొడుకు పక్కన, నళిని పక్కన కూర్చుని వాళ్లు డ్రైవ్ చేస్తుంటే అన్నీ చాలా విచిత్రంగా అనిపించేది.

ఫలానా చోటుకి వెళ్ళాలంటే రూట్ నెంబర్లు ఏ రోడ్డునుంచి వెళ్ళాలో మధ్యలో వచ్చే టోల్‌గేట్లు, టర్న్‌పైక్‌ల గురించి మాట్లాడుకుంటుంటే అన్నీ విచిత్రంగా వినే మంజరి, ఇప్పుడు అవన్నీ తనూ నేర్చుకుంది. చెప్పగలుగుతుంది. మొట్టమొదట ఫ్లైట్ ఎక్కడానికి భయపడిన ఆమె, ధైర్యం కూడదీసుకుని జీవితగమనంలో ఎవరూ ఊహించనంత ముందుకు సాగిపోయింది.

అవసరం మనిషికి అన్నీ నేర్పుతుంది. జీవితంలో ముందుకు సాగాలంటే నిత్యవిద్యార్థిలా పాఠాలు నేర్చుకుంటూ పోవడమే.

మల్లికార్జున్‌కు సుమారు నలభై ఐదు సంవత్సరాలు ఉంటాయి. ఇండియాలో కొంచెం పొలాలు ఉన్నా చదువుమీద శ్రద్ధతో ఇంజనీరింగ్ పూర్తిచేశాడు. తండ్రికి చిన్నపాటి బిజినెస్ ఉంది. తండ్రి తన బిజినెస్ చూసుకోమంటే కాదని ఉద్యోగానికి అమెరికా వచ్చాడు.

కొన్ని రోజులు ఉద్యోగం చేశాక అతను ఆశించిన థ్రిల్ దొరకలేదు. ఏదో చెయ్యాలన్న తపన. తన సొంత బిజినెస్ స్టార్ట్ చెయ్యాలనుకున్నాడు. అలా ప్రయత్నిస్తున్న తరుణంలో మంజరిని కలవడం, అతని మనసులో ఎప్పటినుంచో ఉన్న కోరిక ఆమె ముందు పెట్టడం జరిగింది. వెంటనే రెస్పాన్స్ ఇవ్వకపోయినా కొద్దికాలంలోనే ఆమెనుంచి రెస్పాన్స్ రావడం, బిజినెస్ స్టార్ట్ చెయ్యడం జరిగింది.

అనుకున్నదానికంటే మంచి లాభాలు రావడంతో ఇంకా పెంచాలన్న ఆలోచనలో ఉన్నాడు మల్లికార్జున్. అతని ఆలోచనల గురించి మంజరికి తెలియదు. ఆమె జీవితం ఊహించిన దానికన్నా బాగానే ఉంది. కొన్నాళ్లదాకా రేపు ఏమవుతుందన్న భయం లేదు.

కాదంటే ఇంకొద్ది రోజుల్లో సిటిజన్ షిప్‌కు అప్లై చేయవచ్చు. సిటిజన్ షిప్ వస్తే గవర్నమెంటునుంచి కొంత డబ్బు రూపేణా సహాయం అందుతుంది. మెడికల్ ఫ్రీ కాబట్టి అంత ప్రాబ్లమ్ ఉండదు.

ఇంకా నచ్చకపోతే ఈ కూడబెట్టిన డబ్బుతో ఇండియాలో హాయిగా బ్రతకవచ్చు. కష్టాలు మనిషిని రాటు తేలుస్తాయన్న దానికి నిదర్శనం మంజరి జీవితం. ఎన్నో కష్టాలు ఎదుర్కొంది. ఎన్నో మలుపులు తిరిగింది ఆమె జీవితం. అయినా చెక్కుచెదరని ఆత్మస్థైర్యంతో ముందుకు సాగుతోంది.

మంజరికి గీతలో శ్లోకం గుర్తుకువచ్చింది...

'బ్రహ్మణ్యాధాయకర్మణి, సంగంత్యక్త్వా కరోతియః

లిప్యతేన సపాపేన, పద్మపత్ర మివాం భసా'

ఎవడైతే ఆసక్తిరహితమైన కర్మలన్నింటిని భగవదార్పణంగా ఆచరిస్తున్నాడో అట్టివాడు తామరాకు మీద నీటిబొట్టులాగా పాపముచేత అంటబడకుండా ఉంటాడు.

ఇప్పటిదాకా భగవంతుడ్ని నమ్ముకుని, సన్మార్గంలో తాను చేసే పనిలో శ్రద్ధాసక్తులతో పనిచేస్తూ పోయింది. తన మనస్సు తన ఆధీనంలో ఉంటే తామరాకు మీద నీటిబొట్టులా జీవనం సాగించడం పెద్ద కష్టమేమీ కాదు.

* * *

శనివారం బఫేలంచ్‌లో ఒక ఫారినర్‌ను చూసి ఆశ్చర్యపోయింది మంజరి. అప్పుడప్పుడు ఇండియన్ రెస్టారెంట్స్‌కు విదేశీయులు వస్తారని వింది. చూసింది

కూడా. కానీ ఆవకాయ, గోంగూరను రెలిష్ చేసే మనిషిని మొదటిసారి చూసింది.

"మంజరీ! మీట్ మై ఫ్రెండ్ మిస్టర్ జాన్" అన్నాడు మల్లికార్జున్.

చేతులు జోడించి "నమస్కారం" అన్నాడు.

మంజరికి మరో షాక్. ఆమె ముఖకవళికలు పరీక్షించిన జాన్ అన్నాడు...

"అంతగా ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు. ఐ లైక్ తెలుగు" అన్నాడు.

"జాన్ తల్లి అమెరికన్. తండ్రి తెలుగువాడు. జాన్ తండ్రి చాలా ఏళ్ల క్రితం అమెరికా వచ్చేసిన వాళ్లలో ఒకరు. ఇక్కడికొచ్చాక డబ్బు బాగానే సంపాదించాడు. జాన్ తల్లితో ప్రేమలో పడి పెళ్లిచేసుకున్నాడు. వాళ్ల వివాహ జీవితం వయసు పదేళ్లు. జాన్‌కు ఎనిమిదేళ్లు ఉండగా అతని తల్లితండ్రులు విడిపోయారు.

జాన్ మాత్రం తండ్రితో ఉండిపోయాడు. జాన్ తండ్రి మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. ఈసారి ఇండియన్ డైవోర్సీని. ఆమెకు జాన్ పట్ల ప్రేమ లేక నిర్లక్ష్యంగా చూసేది. ఇది భరించలేని తండ్రి జాన్‌ను బోర్డింగ్ స్కూల్లో పెట్టి చదివించాడు.

జాన్ కాలేజీ చదువు పూర్తిచేసేసరికి, లంగ్ కాన్సర్‌తో సవితితల్లి కాలం చెయ్యడం జరిగింది. ఈ సంఘటన తరువాత తండ్రి, జాన్‌ను తన దగ్గరే ఉంచుకున్నాడు. తండ్రీ, కొడుకుల మధ్య అనుబంధం పెరిగింది. అమెరికా వచ్చి ఇన్ని రోజులయినా జాన్ తండ్రికి తన సంస్కృతి, భాష పట్ల విపరీతమైన అభిమానం.

తండ్రి ద్వారా జాన్ కూడా తెలుగుభాష, సంస్కృతిల పట్ల వ్యామోహం పెంచుకున్నాడు. అందుకే అతనికి తెలుగు భోజనం అంటే కూడా చాలా ఇష్టం. మా ఇద్దరికీ ఒక ఇండియన్ రెస్టారెంట్లో పరిచయం అయ్యింది. నేను రెస్టారెంట్ పెట్టానని తెలిసి ఇక్కడకు వచ్చాడు" ఇదీ అతని గురించిన వివరాలు సంక్షిప్తంగా అంటూ ముగించాడు మల్లికార్జున్.

ఆ తరువాత అతని రాకపోకలు ఎక్కువయ్యాయి.

మల్లికార్జున్ మంజరి కన్నా పదేళ్లు చిన్న అయినా ఎప్పుడూ ఆంటీ అన్న పిలుపు కాక పేరు పెట్టే పిలుస్తాడు. మంజరి కూడా దానికెప్పుడూ అభ్యంతరం

తెలుపలేదు. ఎవరు ఎలా పిలిచినా ఆమెకు పట్టింపులేదు. పిలుపులో ఏముంది? పిలిచే మనసులో ఉండాలి కానీ అన్న భావన ఆమెది.

రెస్టారెంట్‌కు జాన్ రాకపోకలు ఎక్కువయ్యాయి. ఎందుకొస్తున్నాడో తెలియదు. మంజరి ముందు పట్టించుకోలేదు. మల్లికార్జున్ ఫ్రెండ్ కాబట్టి అతనికోసం వస్తున్నాడనుకుంది.

కస్టమర్లు లేనప్పుడు మల్లికార్జున్, ఆమె మాట్లాడుకుంటూ కూర్చుంటారు. మల్లికార్జున్ ప్రస్తుత ప్రపంచం, మనుష్యులు, జరుగుతున్న సంఘటనల గురించి, మాట్లాడుతాడు. ఆమె వింటుంది. ఆధ్యాత్మికత వైపు ఆమె ఎక్కువ మొగ్గ చూపుతుందని తెలుసుకుని, అప్పుడప్పుడు భగవద్గీత, పూజలు, వాటి వైశిష్ట్యం కూడా మాట్లాడతాడు.

ఒక రోజు మల్లికార్జున్ మాట్లాడిన విషయం మీద చాలాసేపు చర్చ జరిగాక మంజరి అంది.

"ఎవరైతే ఒక లక్ష్యం లేకుండా ఊరికే పనులు చేసుకుంటూ పోతారో వారు బాధలకు గురిఅవుతారు. అంటే అపజయాలు ఎదురవుతాయి. అలాగే తనకోసం కాకుండా డాంబికం కోసం, లోకం దృష్టిలో పడడం కోసం, తనను ఎవరైనా పొగడాలన్న తాపత్రయంతోనూ పనిచేస్తారో వారికి బాధలు తప్పవు.

"జీవితం అన్నాక ప్రతీ మనిషికీ ఒక లక్ష్యం ఉండాలి. దాన్ని సాధించడానికి సరియైన మార్గం అన్వేషించి దానిగుండా ప్రయాణం చేయాలి. ఎదుటివాడి మెప్పుకోసం, పొగడ్తకోసం తాపత్రయ పడకూడదు. ఈ రోజుల్లో భక్తికూడా ఒక డాంబికంగా తయారయ్యింది.

అందుకే అడుగడుగుకూ బాబాలు అవతారాలు ఎత్తుతున్నారు. మనని మనం సన్మార్గంలో నడిచేటట్లు చెయ్యడానికి మతం కానీ, దేముడి పేరుమీద వ్యాపారాలు చెయ్యడానికి, స్త్రీలను వాడుకుందుకు కాదు. ఈ ముసుగులు వేసుకోవడం ఎంతవరకు సమంజసమో నాకు అంతుబట్టదు. ఏ కోణంనుంచి చూసినా ప్రతీదాంట్లో స్త్రీ అన్నివిధాల ఎక్స్‌ప్లాయిట్ చెయ్యబడుతోంది."

అప్పుడే అక్కడకు వచ్చిన జాన్ "మీరు ఆధ్యాత్మిక పుస్తకాలు ఎక్కువ చదువుతారనుకుంటాను" అన్నాడు.

“నేను ప్రపంచాన్ని చదువుతాను. మన చుట్టూ ఉన్నది అర్థంచేసుకోవాలి కదా! నా చదువంతా ఇండియాలో ఉన్నప్పుడు చదివినదే. ఇప్పుడు జీవితసమరంతో సరిపోతోంది కొంచెంసేపు పూజ, ధ్యానం చేసుకునే సరికే సమయం గడిచి పోతోంది. ఇప్పుడు పుస్తకాలూ లేవు. పుస్తకపఠనం లేదు” అంది మంజరి.

“ఇఫ్ యూ వాంట్ మా ఇంట్లో ఉన్నాయి. మా ఫాదర్‌కి చాలా ఇంట్రెస్ట్. ఆయన చాలా పుస్తకాలు కలెక్ట్ చేశారు. ఈ మధ్యనే నా ధ్యాస కూడా ఇండియన్ ఫిలాసఫీ మీదకు మళ్లుతోంది. ఐ యామ్ ట్రైయింగ్ టు అండర్‌స్టాండ్ భగవద్గీత” అన్నాడు జాన్.

“అయితే మీ గీతాపఠనం ఎక్కడిదాకా వచ్చింది? ఎంతవరకు అర్థం చేసుకున్నారు?” అంది మంజరి.

“నాకు ఆరవ అధ్యాయంలో పదిహేడవ శ్లోకం బాగా నచ్చింది...

‘యుక్తాహార విహారస్య, యుక్త చేష్టస్య కర్మసు
యుక్త సప్నావబోధస్య, యోగో భవతీ దుఃఖః’

మితమగు ఆహారము, నడత, నిద్ర, మెలకువలతో ఉచితరీతిన నడిచే మనిషికి దుఃఖనాశకమగు ధ్యానయోగము సిద్ధిస్తుంది. ‘అతి సర్వత్ర వర్జయేత్’ అంటారు కదా! అంటే మానవుడికి తృప్తి అన్నది అవసరమని అర్థం.

మన ఇంద్రియాల ప్రభావం మనసు మీద పడుతుంది. అందుకే దాని నియంత్రణ ముఖ్యమైనది. మన శారీరకశ్రమను బట్టి మనం భోజనం చెయ్యాలి. దురదృష్టవశాత్తు జరిగేదేమిటంటే శ్రమజీవికి ఆహారం ఎక్కువ కావాలి కానీ అది అతనికి తక్కువ దొరుకుతోంది పేదరికంవల్ల.

గీతలో చెప్పేది మన నిత్యజీవితంలో అన్వయించుకోవాలి అనిపిస్తుంది. యుక్తాహారము అంటే మనకు సరిపడినంత అనే కదా అర్థం. మామూలు భాషలో చెప్పాలంటే శ్రామికజీవికి ఎక్కువ కాలరీలు కావాలి. శ్రమ చెయ్యని వాడికి తక్కువ. కానీ ఇది రివర్స్ అవడంతో ఇద్దరూ రోగగ్రస్థులవుతున్నారు.

నేను ఇంకా డీప్‌గా చదవలేదు. బహుశా ఇరవై ఆరో శ్లోకంలో అనుకుంటా ‘మనశ్చంచలమస్థిరమ్’ మనస్సు చంచలము, స్థిరత్వము లేనిదని చెపుతోంది గీత. ఆ మనసును నిగ్రహించి మన వశంలోకి తెచ్చుకుంటే మన ఆత్మ మన వశంలో ఉంటుంది.

కాని ఎంతమంది కృష్ణభగవానుడు చెప్పినది అర్థం చేసుకుంటున్నారు? ప్రవచనాలు అందరూ వింటారు. ఆ విన్నవి అన్నీ ఆచరణలో పెడితే ఈ ఈర్ష్యలు, అసూయలు, హింసాకాండలు, దోపిడీలు, మానభంగాలు ఇవన్నీ ఉండవనిపిస్తుంది.

మనని మనం సంస్కరించుకుందుకు ఇది ఒక మార్గదర్శిగా తోడ్పడుతుంది. కానీ చాలామంది గీత చదవడమే కాక ఆత్మబోధ కూడా చేసుకోవాలని నా అభిప్రాయం.

నాకు తెలియకుండానే చాలా మాట్లాడేశాను. రోజు రోజుకీ మా నాన్నగారి ప్రభావం నామీద కలుగుతోంది. అందుకే గీత, ఉపనిషత్తులు, పురాణాల ప్రసక్తి వస్తే నన్ను నేను మర్చిపోతాను” అన్నాడు జాన్.

అమెరికాలో ఉంటూ భారత సంస్కృతి సంప్రదాయాలపట్ల అతని అభిరుచి, విజ్ఞానం మంజరికి ఆశ్చర్యంతోబాటు ఆనందాన్ని కూడా కలుగజేసింది.

* * *

రోజులు గడుస్తున్న కొలదీ మంజరి జాన్‌ల మధ్య వారి ఇద్దరికీ ఇష్టమైన హిందూ సంపద, ఆకర్షణ పెంపొందింపజేసింది. ఆకర్షణ అన్నది ఎప్పుడు ఎందుకు ఏర్పడుతుందంటే దానికి సమాధానం ఎవరి దగ్గరా ఉండదు.

మంజరిలో ఏదో తెలియని శక్తి సూదంటురాయిలా జాన్‌ను ఆకర్షణకు లోను చేస్తోంది. మంజరి కోసమే రోజూ రెస్టారెంటుకు వస్తున్నాడు. మల్లికార్జున్ జాన్ ఎందుకు వస్తున్నాడో ఊహించుకున్నాడు. అందుకే అతన్ని హెచ్చరించడం మంచిదనుకున్నాడు.

జాన్ నువ్వేమీ అనుకోనంటే ఒక మాట. నువ్వు రోజూ రెస్టారెంటుకు వచ్చేది మంజరికోసమే కదా! ఆమె నీకన్నా వయసులో పెద్దది. నువ్వు ఏమి ఆశిస్తున్నావో నాకు తెలియదు” అన్నాడు.

“నీకేమిటి? నాకే తెలియదు. కానీ ఆమెలో ఏదో ఆకర్షణ నన్ను ఆమెవైపు లాగుతోంది. బహుశా అది పారలౌకికమేమో! నాకు తెలియదు. ఆమె ఎదురుగుండా కూర్చుని మాట్లాడుతుంటే నాకు బాగుంటుంది. అంతకన్నా ఆమెనుంచి నాకు ఏమీ ఆశలు లేవు.

నీకు తెలుసు కదా! నాన్న సంసారజీవితం చూశాక నా మనసెప్పుడూ పెళ్లివైపు మొగ్గు చూపలేదు. ఏ ఆడదానితోనూ సంబంధమూ పెట్టుకోలేదు. కానీ మంజరివైపు ఎందుకు ఆకర్షితుడ్ని అవుతున్నానో నాకు తెలియదు. ఆమె నాకన్నా అయిదారేళ్లు పెద్దదై ఉండవచ్చు. అనుకోకుండా మా అభిరుచులు కలిశాయి. చూద్దాం! ఏం జరుగుతుందో!" అన్నాడు జాన్.

జాన్ దగ్గర్నుంచి పుస్తకాలు తెచ్చుకుని ఇదివరలో తను వదిలేసిన అలవాటును మళ్లీ పునరుద్ధరించింది. పుస్తకాలు చదివాక దానిమీద ఇద్దరూ కూర్చుని విశ్లేషణ చేసేవారు. వాళ్లిద్దరి వాదప్రతివాదాల్లో ఇంకా లోతుగా సత్యాన్వేషణ కోసం తాపత్రయపడే శోధకుల్లా గోచరిస్తారు. ఇద్దరికీ ఆ వాదప్రతివాదనల్లో కాలం తెలియటం లేదు.

రెస్టారెంట్లో బాగుండదని, మల్లికార్జున్‌కూ ఇష్టముండదేమో అని, ఒకసారి మంజరి ఇంటిదగ్గర ఇంకోసారి జాన్ ఇంటి దగ్గర కలుసుకునేవారు. చివరికి ఒక రోజు ఆగలేక జాన్ మంజరిని అడిగాడు "మన ఇద్దరి అభిరుచులూ కలిశాయి కదా! మనం ఇద్దరం ఎందుకు పెళ్లిచేసుకోకూడదూ!" అని.

మంజరి దెబ్బతిన్నదానిలా చూసింది. 'ఈ వయసులో పెళ్ళా! ఎవరైనా వింటే నవ్వుతారు. ఆడది, విధవరాలు, ఏభై ఐదేళ్ల వయసులో పెళ్లి అవసరమా! ఇన్నాళ్లూ ఒంటరిగా బ్రతికినది ఇప్పుడు తోడు అవసరమా!' ఆలోచనలో పడింది మంజరి.

మంజరి ఏం మాట్లాడకపోవడము చూసి ఆమెకు కొంత సమయం ఇవ్వడం అవసరం అనుకున్నాడు. అందుకే ఆమెను వదిలేసి వెళ్లిపోయాడు.

మంజరి మనసులో అలజడి. మగవాడు కాబట్టి బైటపడ్డాడు. నిజంగా తనకు మాత్రం అతనంటే ఇష్టం లేదా! అది శారీరక ఆకర్షణ అవునో కాదో తెలియదు. కానీ అతన్ని చూసినప్పుడు తన మనసు స్పందించడం తెలుస్తోంది.

ఏమిటి ఈ వయసులో ఈ ఆలోచన ఏమిటి? ఒంటరి బ్రతుకు విసుగు కలిగి తోడు కోరుకుంటోందా! ఎవరైనా అనుకుంటారనుకోకపోతే తన మనసు దీనికి అంగీకరించడానికి సిద్ధంగా ఉందా! దీని పరిణామం ఎలా ఉంటుంది?

మగవాడి విషయంలో అనాదినుంచీ పునర్వివాహం ఉంది. భార్య పోయిన పదమూడో రోజు పెళ్లిచేసుకోవచ్చు. అతని వివాహానికి వయసుతో సంబంధం

లేదు. ఏ వయసులోనైనా వివాహార్హత ఉంది. కాలం మారి ఆడవాళ్లు మళ్ళీ పెళ్లిచేసుకుంటున్నా భారతీయులలో నడివయసు దాటాక పెళ్లిచేసుకోవడం ఎక్కడా చూడలేదు. సంఘం హర్షిస్తుందా! అన్న అనుమానం.

ఇక్కడ ఇది కొత్త విషయం కాదు. లిండా రెండు పెళ్లిళ్లు చేసుకుంది. అలా అని ఆమె నడిచిన బాటలో నడవడానికి మనసు నిరాకరిస్తోంది. ఇక్కడ తనను వద్దని కానీ వెక్కిరించేవాళ్లు కానీ ఎవరూ లేరు. సలహా ఇచ్చేవాళ్ళూ లేరు. అంతా అగమ్యగోచరంగా ఉంది.

"మంజరీ! ఏం ఆలోచించావు?" అంటూ మళ్లీ వారం తరువాత వచ్చి అడిగాడు. ఆ మాత్రం సమయం ఆమెకు ఆలోచించుకుందుకు కావాలని.

"ఈ వయసులో నాకు మళ్లీ పెళ్ళేమిటి? రెండోది నేను నీకన్నా పెద్దదాన్ని".

"నీ వయసు ఏభై ఐదు, ఇక్కడి ప్రకారం అది పెద్దవయసు కాదు. నేను నీకన్నా చిన్నవాడ్ని అన్నదానికి ఇక్కడ అది కూడా పెద్ద అభ్యంతరకరమైనది కాదు. బహుశా ఇండియాలో ఇది తప్పయి ఉండవచ్చు. నీనుంచి నేను ఏమీ ఆశించి పెళ్లిచేసుకోవటం లేదు. కోరికల కోసం పెళ్లిచేసుకునే వాడినయితే ఎప్పుడో పెళ్లిచేసుకునేవాడ్ని.

నువ్వు ప్రేమైకమూర్తివి. నీ సమక్షంలో ఒక విధమైన ప్రశాంతత కలుగుతుంది. మనిద్దరి భావాలూ కలిశాయి. ఏ బంధం లేకుండా ఇలా గంటల తరబడి మాట్లాడుకుంటూ కూర్చోలేం. ఒక ఇంట్లో కలిసి ఉండలేము. నాకు నీ సన్నిధి, నీ చల్లనిమాట కావాలి. మనం ఇద్దరం పథికులం కలిసి నడుద్దాం. ఒంటరితనాన్ని పోగొట్టుకుందాము" అన్నాడు.

మంజరి కూడా తనకొక తోడు కావాలని అభిప్రాయపడింది. దేముడు ఏం కోరి తన ముందు ఈ ప్రస్తావన వచ్చేటట్లు చేశాడో! జీవితంలో వచ్చిన ఎన్నో అనుకోని మార్పుల్లో ఇదీ ఒకటి. ఒంటరి ప్రయాణంతో అలిసిపోయింది. జాన్ మోసగాడిలా అనిపించటం లేదు. మోసం చెయ్యడానికి తన దగ్గర డబ్బా! యవ్వనమా! రెండూ లేవు.

* * *

చాలా రోజుల తరువాత ప్రతిమకు ఫోన్ చేసింది. ఇన్నాళ్ళూ ఫోన్ చెయ్యడానికి ధైర్యం చాలలేదు. ఆమె ముందునుంచి హెచ్చరిక ఇచ్చినా ఆమెవన్నీ

అనుమానాలని కొట్టిపడేసింది. తన జీవితంలో ఈ ఐదేళ్లలో జరిగిన మార్పులు ఆమెకు తెలియదు. తన ఫోన్ నెంబరు తెలియక ఆమె కూడా తనను సంపర్కించే అవకాశం లేదు. ఇన్నాళ్లూ తన మాట వినక కష్టాలు కొనితెచ్చుకుంది. ఇప్పుడు ఆమె సలహా తీసుకోవడం మంచిదనిపించింది.

ఫోన్ చేసిన ప్రతిమ మంజరి గొంతు వింటూనే, "బ్రతికే ఉన్నావా!" అంది.

ఆమెకు కోపం వచ్చిందని గ్రహించి, నవ్వుతూ "బ్రతికే ఉన్నాను. అందుకే నీతో మాట్లాడుతున్నాను" అంది.

"సంతోషం! ఇప్పటికైనా మేము గుర్తుకువచ్చాము" అంది.

ఈ మధ్యకాలంలో తన జీవితంలో జరిగిన సంఘటనలన్నీ ఏకరువు పెట్టింది. "నీ మాట విననందుకు దేముడు నాకు తగినశిక్ష వేశాడు. కానీ ఆ దేముడే తట్టుకునే శక్తి కూడా ఇచ్చాడు" అంది.

"నేను బతికి ఉన్నానన్న విషయం ఇప్పుడు గుర్తుకువచ్చినట్లుగా ఇదివరలో గుర్తుకు రాలేదా!" అంటూ ఒక్కసారి గొల్లుమంది.

దేశంకాని దేశంలో ఎన్ని కష్టాలు పడిందో అన్న ఊహ ఆమె దుఃఖానికి కారణం అయ్యింది.

"ఏయ్ పిచ్చీ! ఎందుకు ఏడుస్తున్నావు? ఇప్పుడు అంతా బాగానే ఉంది కదా!" అంది మంజరి.

"నీ కొడుకు వద్దన్నాక వాడికో లెంపకాయ తగిల్చి ఇండియా వచ్చేయాల్సింది. ఇక్కడ మేమందరం ఆ మాత్రం నిన్ను ఆదుకోలేకపోదుమా! నీకు కొడుకుమీద ఉన్న నమ్మకం నామీద లేదు. పోనీలే ఇప్పుడు చెప్పు ఎందుకు ఫోన్ చేసావు?" అంది ప్రతిమ.

అప్పుడు వివరంగా తన జీవితంలో ఇప్పటిదాకా జరిగినదంతా చెప్పుకొచ్చింది. తన హోటల్ బిజినెస్ అంతా చెప్పింది. జాన్ గురించి, అతను తనను పెళ్లిచేసుకుంటాననడం చెప్పి ఆమె సలహా కోరింది.

"నా సలహా ఎప్పుడూ వద్దనుకున్నదానివి ఇప్పుడెందుకు అడుగుతున్నావు?"

"ఇదివరలో నీ సలహా వినకపోవడంతో చాలా దెబ్బలు తిన్నాను. ఇప్పుడు ఇంక దెబ్బలు తినే ఓపిక లేదు. ఈ ఒంటరి ప్రయాణం ఇంక చెయ్యలేననిపిస్తోంది.

కానీ ఈ వయసులో పెళ్లిచేసుకోవడానికి భయం. దానిమూలంగా మళ్ళీ ఏమైనా సమస్యలు వస్తే భరించే ఓపిక నాకు లేదు. అందుకే నీ సలహా అడుగుతున్నాను" అంది.

"నువ్వు చెప్పినదంతా విన్నాక మంచి వ్యక్తిలాగే ఉన్నాడు. ఇన్ని ప్రయత్నించావు. ఇది కూడా ప్రయత్నించు. నువ్వు నమ్ముకున్న భగవంతుడు నీకు బహుశా ఈ విధంగా నీకు మంచి చేద్దామనుకుంటున్నాడేమో! నీ దురదృష్టవశాత్తూ ఇందులో కూడా నీకు అపజయం ఎదురవుతే నేను నీకు ఉన్నానన్న సంగతి మాత్రం మర్చిపోకు. దేముడు నీకు మంచిరోజులు వచ్చేటట్లుగా చెయ్యాలని కోరుకుంటున్నాను" అంది ప్రతిమ.

చాలా రోజులు ఆలోచించి చివరకు జాన్‌తో పెళ్లికి అంగీకరించింది. గుళ్ళో దండలు మార్చుకుని, రిజిస్టర్ ఆఫీసులో సంతకాలు పెట్టుకుందుకు నిర్ణయించుకున్నారు. మల్లికార్జున్ మనస్ఫూర్తిగా అభినందించాడు.

భయపడుతూనే మంజరి ఈ విషయం నళినికి, రశ్మికి ఫోన్ చేసి చెప్పింది. వాళ్లిద్దరూ ఈ వయసులోనే తోడు అవసరమని మంజరి చేస్తున్నది మంచిపని అని, పెళ్లికి తాము తప్పకుండా వస్తామని చెప్పారు. లిండాకు కూడా ఫోన్ చేసి చెప్పింది. "మంచిపని చేస్తున్నావు. ప్రతీదానికీ భయపడి ఎన్నాళ్లు బతుకుతావు?" అంది.

* * *

మంజరి జీవితంలో ఇంకో అధ్యాయం మొదలయ్యింది.

ఒక మంచిరోజు బ్రిడ్జ్ వాటర్ ఏడుకొండల స్వామి ఆలయంలో సన్నిహితుల మధ్యలో దండలు మార్చుకున్నారు. రిజిస్ట్రార్ ఆఫీసులో సంతకాలు పూర్తయ్యాయి. యు.ఎస్ మ్యారేజ్ యాక్టు ప్రకారం వారి వివాహం పూర్తయ్యింది.

రశ్మి, నళిని, మంచి పట్టుచీరలు కొన్నారు. "ఈ పెళ్లి మీ జీవితంలో అన్ని సుఖాలూ తేవాలని కోరుతున్నాను" అంటూ చిన్న నెక్లెస్ ప్రెజెంట్ చేసింది రశ్మి. మంజరి ఎంత వద్దన్నా వినలేదు.

మల్లికార్జున్ రెస్టారెంట్‌లో డిన్నర్ అరేంజ్ చేసాడు. మల్లికార్జున్ భార్య కూడా పెళ్లివేడుకల్లో ఆనందంగా పాల్గొంది. ఆ రోజు అందరూ ఎంతో ఆనందంగా గడిపారు.

మంజరి తన అపార్ట్‌మెంట్ ఖాళీ చేసి జాన్ ఇంటికి మారిపోయింది. రెండేళ్ల క్రితం జాన్ తండ్రి మరణించాడు. తండ్రి మరణం తరువాత అతన్ని వంటరితనం వేధించడం మొదలుపెట్టింది. అతని తల్లిని చేసుకుని తండ్రి ఎక్కువ సుఖపడలేదు. ఇద్దరికీ ఎప్పుడూ భేదాభిప్రాయాలు. బహుశా కల్చర్ డిఫరెన్స్ మూలాన్నేమో!

ఒక రోజు లైబ్రేరీలో పుస్తకాలు చూస్తున్న మంజరి ఒక పుస్తకం మీద ఉన్న పేరు చూసి "ఇది ఎవరి పేరు మీ నాన్నగారి పేరా!"

"కాదు నా పేరే. అమ్మ పట్టుపట్టి నా పేరు జాన్ అని పెట్టింది. మా తాతగారి పేరు జనార్ధన్. అందుకని మా నాన్నగారు నా పేరు జనార్ధన్ అని పెట్టి ముద్దుగా జెన్నీ అని పిలిచేవారు" అన్నాడు.

"అలా అయితే నేనూ జెన్నీ అనే పిలుస్తాను" అంది మంజరి.

"నాకు ఎలా పిలిచినా అభ్యంతరం లేదు" అన్నాడు.

వాళ్లిద్దరూ సంఘం దృష్టిలో భార్యాభర్తలు. ఇద్దరూ స్నేహితులు, సహపాఠకులు, సహపథికులు. వారిమధ్య ఉన్న ప్రేమ అలౌకికమైన ప్రేమ.

ప్రొద్దున్నే లేవడం, యోగా, మెడిటేషన్, వాకింగ్, యోగాసనాల గురించి చర్చ, లేక పురాణాల్లోంచి కొన్ని భాగాలు తీసుకుని వాటిగూర్చి చర్చ. ఇదే వాళ్ల నిత్యకార్యక్రమం. ఇది కాక తోటపని, ఇంటిపని, వంటపనీ అన్నీ కలిసి చేసుకునేవారు.

ఇద్దరిదీ ఒకే మాట ఒకే బాట భగవత్తత్వాన్ని అర్థం చేసుకునే ప్రక్రియలో వారిద్దరూ భాగస్వాములు. రామకృష్ణపరమహంస భార్యలో కాళికాదేవిని దర్శించారట. వారిద్దరి సంబంధాన్ని మానవులు అర్థం చేసుకోలేదని భావించేవారుట. ఆమె అతని మొదటి శిష్యురాలు.

ఇక్కడ వాళ్లిద్దరూ రామకృష్ణపరమహంస, శారదామాయిలా అంటే కాకపోవచ్చు. కానీ వాళ్లు నడిచిన బాటను ఎన్నుకుని, భక్తిమార్గం వైపు పయనిస్తూ వాళ్ల బోధనలోని సారాన్ని గ్రహించి, మానవసేవే మాధవసేవ అన్నదాన్ని పాలిస్తూ ముందుకు సాగడానికి ప్రయత్నించడంలో తప్పు లేదు.

అదేవిధంగా జెన్నీ సాహచర్యంలో మంజరి ఇతర మతాలు, వాళ్ల ఫిలాసఫీ, కూడా అధ్యయనం చేయడం మొదలుపెట్టింది. దారులు, కొలిచే విధానం వేరు

కానీ సర్వమతాల సారం ఒకటే. ఆ మతగ్రంథాలు అవగాహన చేసుకునే విధానంలో అభిప్రాయభేదాలు కలిగి మతంలో చీలికలు శాఖలు ఏర్పడతాయి. దానితో అది కలహాలకు నాంది పలుకుతుంది. అన్ని జీవులలో దైవత్వాన్ని చూడగలగాలి. మానవజీవితంలో దాస్యకారకాలు కామము, స్వార్థము. దీన్ని జయించగలిగితే భగవంతుడ్ని దర్శించగలుగుతారు.

మంజరి మామూలుగా రెస్టారెంట్‌కు వెళ్లివస్తోంది. జాన్ యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాడు. పెళ్లయ్యాక వాళ్ల వృత్తులు సక్రమంగా చేసుకుంటూనే వారి కొత్త జీవితాన్ని వాళ్లు కోరుకున్న విధంగా జీవిస్తున్నారు. ఎక్కువ మార్పులు లేకుండా జీవితం ఆనందంగా సాగిపోతోంది.

* * *

నళినికి ఒక రోజు మార్కెట్లో దినేష్ కనిపించాడు. ముందుగా అతనే గుర్తుపట్టి పలకరించాడు. ఏదో పనిమీద న్యూజెర్సీ వచ్చినట్లుగా చెప్పాడు. సభ్యతకు ఇంటికి రమ్మని ఆహ్వానించింది.

దినేష్‌కు మనసులో తల్లి గురించి వివరాలు తెలుసుకోవాలని ఉంది. తను ఇండియా వెళ్లిపోమంటే వెళ్లకుండా తనమీద ప్రతీకారంతో ఈ దేశంలో జీవించడానికి నిశ్చయించుకుంది. అలాంటి ఆమె ఇప్పుడు ఏ స్థితిలో ఉందో తెలుసుకోవాలన్న కోరిక.

అందుకే నళిని ఆహ్వానాన్ని కాదనకుండా వెళ్ళాడు. నళిని ఏ భావం వ్యక్తపరచకుండా అతనికి మర్యాదలు చేసింది. శ్రీకర్ కూడా దినేష్‌తో బాగానే మాట్లాడాడు. కొద్దిసేపటికి నోరు విప్పి అడిగాడు.

"అమ్మ ఎలా ఉంది? మీ ఇంట్లో ఉందనుకున్నాను" అన్నాడు.

"దినేష్! నీకూ, నాకూ పెద్ద పరిచయం లేదు. అయినా మాట్లాడకుండా ఉండలేకపోతున్నాను. అత్త నీ కన్నతల్లి అయినా నువ్వు ఆమెను సరిగా అర్థం చేసుకోలేదు. ఆమె ఎవరిమీదా ఆధారపడే మనిషి కాదు. ఆవిడ సెల్ఫ్ మేడ్ ఉమన్. కొడుకువి నువ్వు కాదనుకున్నాక నా దగ్గర ఉంటుందని ఎలా అనుకున్నావు? ఆమె కొద్దిరోజులు కోసమే నా ఆశ్రయం కోరింది. ఆవిడ జీవితాంతం ఉంటానన్నా నేను ఉంచుకునేదాన్ని. పదిహేను రోజులకన్నా ఆమె నా దగ్గర ఉండలేదు. ఆ తరువాత ఉద్యోగం వెతుక్కుని వెళ్లిపోయింది. ఇప్పుడు

ఆమె మంచిస్థితిలోనే ఉంది. నువ్వు ఆసరా ఇవ్వనంత మాత్రాన ఆమె కృంగిపోలేదు" అంది నళిని.

"ఇంతకీ ఆమె ఎక్కడ ఉంది?" అని అడిగాడు.

"వెస్ట్ విండ్సర్‌లో 'స్వాద్' అని ఒక రెస్టారెంట్ ఉంది. అత్తని అక్కడ కలవచ్చు" అంది నళిని.

"ఇండియా వెళ్లకుండా ఆవిడ ఇక్కడ రెస్టారెంట్లో పనిచేస్తోందా!" అన్నాడు.

"ఏం పనిచేస్తే తప్పేముంది? బతుకుతెరువుకు ఏదో ఒక పని చెయ్యాలి. హిందూధర్మం ప్రకారం అయితే ఆమెకు భర్తకానీ, కొడుకుకానీ అండగా ఉండాలి. భర్త పైలోకాలకు వెళ్లిపోయాడు. కొడుకు తన బాధ్యత నుంచి చెయ్యి దులుపుకున్నాడు. అలాంటప్పుడు ఆమె ఏం చెయ్యాలి?" అన్నాడు శ్రీకర్.

శ్రీకర్ కూడా తనకు నీతులు చెపుతుంటే భరించలేక ఒక్కసారిగా లేచి "నేను వెడతాను" అంటూ బైటికి నడిచాడు.

దినేష్ వెళ్లగానే పగలబడి నవ్వింది నళిని. నళినికి అంత నవ్వు తెప్పించే విషయం ఏమిటో అర్థం కాలేదు శ్రీకర్‌కి. నళిని కొడుకు, తల్లి నవ్వుతుంటే ఎందుకో తెలియకపోయినా వాడూ పకపకా నవ్వాడు. నవ్వి నవ్వి కళ్లంట నీళ్లు వచ్చాయి.

"ఇప్పుడైనా నీ నవ్వుకు కారణం చెప్తావా!" అని అడిగాడు శ్రీకర్.

"చూడండి ఎంత అహంకారమో! తను డిస్కార్డ్ చేసిన తల్లి కృంగిపోకుండా తన కాళ్లమీద తను నిలబడిందన్న విషయం విని తట్టుకోలేకపోతున్నాడు. అక్కడికెళ్ళాక ఇంక అసలు విషయం తెలిశాక ఈయన ప్రవర్తన ఎలా ఉంటుందో చూడాలి. బంగారంలాంటి తల్లిని దూరం చేసుకున్నానని తెలియని మూర్ఖుడు.

మానవసంబంధాలు అవసరాన్ని బట్టి, అభిరుచిని బట్టి మారుతాయి. కానీ అవి బైటివారికి వర్తిస్తుంది కానీ రక్తసంబంధాలలో అలాంటి వాటికి తావు లేదన్న విషయం ఇతనికి తెలిసినట్లు లేదు. అవసరాలకు స్నేహాలు చేసి నిలుపుకున్నట్లే ఇక్కడ తల్లిపట్ల తన ప్రవర్తన చూపించాడు. తను వద్దనుకున్న తల్లి ఎంతవరకు విజయం సాధించిందో అన్న ఆత్రుత చూడండి.

నా ఆలోచన కరెక్ట్ అయిన పక్షంలో ఈపెద్దమనిషి అక్కడికెళ్ళాక కల్లు తాగిన కోతిలా చిందులు తొక్కుతాడు. వాళ్ల అమ్మ విజయాన్ని తట్టుకునే శక్తి

ఇతనికి ఉండకపోవచ్చు. అందుకే నవ్వాను. ఎదుటివాడు బాగుపడితే ఏడ్చిపోయేవాళ్లు ఈప్రపంచంలో చాలామందే ఉంటారు. కానీ ఇలాంటి కొడుకులు... ఏమో! నేను ఊహించలేను” అంది నళిని.

దినేష్ ‘స్వాద్’ రెస్టోరెంట్ చేరుకున్నాడు. అక్కడ కనిపించిన సర్వర్‌తో మంజరి గురించి అడిగాడు. “మాడమ్ ఇవ్వాళ రాలేదు” అన్నాడు. కౌంటర్లో కూర్చున్న వ్యక్తి ఇతన్ని చూస్తున్నాడు. అతను మల్లికార్జున్.

సర్వర్‌ను ఆమె ఎడ్రస్ అడిగాడు. మల్లికార్జున్ని చూపించి ఆయన్ని అడగమన్నట్లుగా చెప్పాడు. మల్లికార్జున్ దగ్గరకు వెళ్లి మంజరి ఎడ్రస్ అడిగాడు. “ఆవిడ ఇవ్వాళ రాలేదు. మీరు ఆవిడకు ఏం అవుతారు?” అన్నాడు.

మల్లికార్జున్ అడిగిన దానికి సమాధానం ఇవ్వకుండా “మీ రెస్టారెంట్ చాలా పెద్దగానే ఉంది. ఇదివరకు నేను ఇక్కడ ఉన్నప్పుడు లేదు. మంజరి కాక ఎంతమంది వంటవాళ్లు ఉన్నారు?” అని అడిగాడు.

“మంజరి ఇక్కడ వంట చేస్తుందని ఎవరు చెప్పారు? ఇనిషియల్ రోజుల్లో మేం ఇద్దరం చేసేవాళ్లం. ఆవిడ నా పార్ట్‌నర్. ఈ హోటల్లో ఆమెకూ భాగముంది. ఇంతకీ మీరెవరో చెప్పలేదు” అన్నాడు మల్లికార్జున్.

‘అమ్మ హోటల్ పార్ట్‌నరా!’ ఆశ్చర్యంతో నోట మాట రాలేదు. అమ్మ ఇంతగా ఎదిగిపోయిందా!’ అనుకున్నాడు.

“మిష్టర్ మీరు ఆమెకేమవుతారో చెప్పలేదు. నాకు తెలిసీ ఆవిడకు బంధువులెవరూ లేరు. అలా మాట్లాడకుండా ఉండిపోయారేమిటి?”

“మాకు దూరపుచుట్టం. పనిమీద ఇక్కడికి వచ్చాను. ఆవిడ ఇక్కడ ఉంటారంటే ఇక్కడ పనిచేస్తున్నారనుకున్నాను. ఆవిడ ఎడ్రస్ చెపుతారా! ఆవిడ్ని కలవాలి” అన్నాడు.

ఎడ్రస్ తీసుకుని, టాక్సీలో ప్లైన్స్‌బరోలో ఉన్న ఆ ఇంటి ముందు ఆగిన దినేష్‌కు బుర్ర తిరిగిపోయింది. ‘అమ్మ ఇంత పెద్ద ఇంట్లో ఉంటోందా!’ అనుకుని కాలింగ్‌బెల్ కొట్టాడు. తలుపు తీసిన మంజరి కొడుకును చూసి అబ్బురపడింది. ‘వీడిక్కడికి ఎలా వచ్చాడు? తను ఇక్కడ ఉన్నట్లు ఎలా తెలిసింది?’ అన్న ప్రశ్న మనసులో మెదిలింది. తల్లి మనసు కొంచెం రంగు తగ్గాడు అనుకుంది.

నవ్వుతూ "బాగున్నావా? లోపలకురా!" అంటూ లోపలికి దారితీసింది. ఆమెను అనుసరించి లోపలికి వెళ్ళాడు. సోఫా చూపించి కూర్చోమంది.

"మంచినీళ్లు కావాలా!" అంది. తలూపాడు. మంచినీళ్లు తేవడానికి లోపలికి వెళ్లింది.

మళ్ళీ ఎందుకు వచ్చాడు? అమ్మ ఇంకా బతికి ఉందా! లేదా! అని చూడడానికి వచ్చాడా! నేనిక్కడ ఉన్నట్లు ఎవరు చెప్పారు?

ఇల్లు, పరిసరాలు చాలా నిశితంగా చూస్తున్నాడు. ఇంత కొద్దికాలంలో అమ్మ ఇంత డబ్బు సంపాదించిందా! ఇదెలా సాధ్యం? తల్లి తెచ్చిన మంచినీళ్లు తాగి గ్లాస్ టేబుల్ మీద పెట్టాడు.

"కోడలు, ధీరజ్, మీ అత్తగారు అందరూ బాగున్నారా! నేనిక్కడున్నానని ఎవరుచెప్పారు?" అడిగింది మంజరి.

"ఆ బాగానే ఉన్నారు. మార్కెట్లో నళిని కనిపించింది. ఆమెనడిగితే రెస్టారెంట్‌లో దొరుకుతావని చెప్పింది. అక్కడికి వెడితే నువ్వు ఈ రోజు రాలేదని తెల్సింది. మీ పార్ట్‌నర్‌ను అడిగి నీ ఎడ్రస్ తెలుసుకున్నాను. ఇండియా వెళ్లకుండా ఇక్కడే ఉండి నా కన్నా బాగా సంపాదించినట్లున్నావు!"

"ఇది వెటకారమా! ప్రశంసా!"

"రెండూ కాదు కుతూహలం" అన్నాడు.

"రెస్టారెంట్‌లో పార్ట్‌నర్‌ని అది మాత్రం నిజం. ఇక ఈ ఇల్లు గురించైతే ఇది నాది కాదు. నా భర్త జెన్నీది.

"నీ భర్త అంటే నువ్వు మళ్ళీ పెళ్లిచేసుకున్నావా!"

"అవును తప్పేంటి?" అంది.

"నీకు సిగ్గు లేదూ. ఈ వయసులో నీకు పెళ్లి కావాల్సి వచ్చిందా!" అన్నాడు.

"తోడు కావాలనిపించినప్పుడు వయసుతో సంబంధం ఏమిటి? మగవాడికి లేని తప్పు ఆడదానికి ఎందుకు? వయసులో భర్తను పోగొట్టుకున్నా నీ భవిష్యత్తు దృష్ట్యా ఆ వయసులో పెళ్లిచేసుకోలేదు. నువ్వు కాదన్నావు. ఒంటరిగా కొన్నాళ్లు ప్రయాణం చేసాను. అలిసిపోయాను. ఆ సమయంలో జెన్నీ అందించిన చెయ్యిని కాదనడం మూర్ఖత్వం అనిపించింది" అంది.

"నువ్వు అమెరికా వచ్చి చాలా మారిపోయావు. మన సంప్రదాయాలు అన్నీ మర్చిపోయి ఇక్కడివాళ్లలా తయారయ్యావు" అన్నాడు.

"బి రోమన్ ఇన్ రోమ్ అన్నారు. అయినా నీకు మన సంప్రదాయాలు బాగా తెలిసినట్లున్నాయే. అందుకేనా నీ అవసరం తీరిపోయాక నన్ను నా దారి చూసుకోమన్నావు. నీ పిల్లవాడి పెంపకంకోసం గ్రీన్ కార్డు తెప్పించుకోమన్నావు. నీ మావగారి ఆస్తి కోసం నీ తల్లిని తిరిగి వెళ్లిపోమన్నావు.

నువ్వెప్పుడూ స్వార్థపరుడివే. ఆ స్వార్థమే నీ వివాహ విషయంలో చూపించావు. నీకు మానవ సంబంధాలు, వ్యాపారదృష్టితో చూడ్డం అలవాటయి పోయింది. జీవితం వ్యాపారం కాదు. పునర్వివాహం మగవాడికి సమ్మతమైనప్పుడు ఆడదానికెందుకు కాదు? మగవాడికో న్యాయం ఆడదానికో న్యాయం ఉండాలని ఏ శాస్త్రంలో చెప్పారు? స్త్రీని ఆదిశక్తి అంటారు. ఆమె లేకపోతే సృష్టి లేదంటారు. కానీ ఆమెను అన్నివిధాలా అణిచివేసి ఆమె పని అధోగతి చేస్తున్నారు. తనంతట తాను తల ఎత్తుకుని తిరిగితే సహించలేరు మీ మగజాతి" అంది.

"మళ్లీ ఆ మగజాతినే ఆశ్రయించావు కదా!" అన్నాడు వెటకారంగా.

"మగజాతి అందరూ ఒకలాగే ఉండరు. 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా!' అన్నట్లు నీలాంటి స్వార్థపరులున్నట్లే మీ నాన్నగారిలాంటివాళ్లు, జెన్నీలాంటివాళ్లు ఈ లోకంలో మిగిలిఉన్నారు. అంత మంచిమనిషి కడుపున నీలాంటి స్వార్థపరుడు పుట్టాడంటే నా పెంపకంలోనే ఏదో లోపం ఉంది" అంది మంజరి.

"ఏది ఏమైతేనేం కొడుకు లేకపోయినా బ్రతకగలనని నిరూపించావు కదా! నువ్వు నా తల్లి వంటే నాకు సిగ్గుచేటు. నీ పెళ్లి గురించి ఎవరైనా అడిగితే ఏమని చెప్పను? మా అత్తగారు ఏమంటారు?"

"చెప్పకు అసలు నీకు తల్లి ఉందన్న సంగతి చెప్పకు. ఎవరైనా అడిగితే మా అమ్మ చచ్చిపోయిందని చెప్పు. పీడా విరగడైపోతుంది."

ఉక్రోషంతో ఇంకా ఏదో అనబోతున్న దినేష్ అప్పుడే అక్కడకు వచ్చిన జెన్నీ "మిష్టర్ చాలు ఇప్పటిదాకా ఆవిడ్ని బాధ పెట్టినది చాలు. ఇంక నువ్వు వెళ్లవచ్చు" అన్నాడు.

"హూ ఆర్యూ?" అన్నాడు కోపంలో ఉన్న దినేష్.

మంజరిని చూపిస్తూ "ఆమె భర్తను. ఈ ఇంటి ఓనర్‌ను. నువ్వు నా ఇంట్లో న్యూసెన్స్ క్రియేట్ చేస్తే చూస్తూ ఊరుకోను" అన్నాడు.

దినేష్ కోపంగా వెళ్లిపోయాడు. దినేష్ వెళ్లిపోయాక ఏడుస్తున్న మంజరిని ఓదార్చాడు జెన్నీ. కన్నీళ్లు తుడుస్తూ...

"ఎందుకు ఏడుస్తావు? నీ జీవితంలో కన్నీటికి తావు ఉండకూడదు. ఇన్నాళ్లూ ఎంతో ధైర్యంగా జీవనాన్ని సాగించావు. ఇప్పుడు నీకు నేనున్నాను" అన్నాడు.

బ్రహ్మాండం బద్దలైనట్లు ఆమె కన్నీరు కట్టలు తెంచుకున్న నదిలా ప్రవహించింది. అతని భుజం మీద తలపెట్టి వెక్కి వెక్కి ఏడ్చింది. మనిషి దుఃఖాన్ని పంచుకుందుకు ఒక ఆసరా అవసరం అన్న సంగతి, దానిలో ఉన్న సాంత్వన ఆమె ఇన్నాళ్ల తరువాత పొందగలిగింది.

ఆదిత్య నిష్క్రమణ తరువాత ఆమె కన్నీటికి తలగడయే మూలమయ్యింది. దాన్నే ఆదిత్య భుజం అనుకుని కన్నీళ్లు కార్చేది. మళ్లీ ఇన్నాళ్ల తరువాత, తాను బలహీనురాలిగా మారుతున్న సమయంలో జెన్నీ రూపంలో దేముడు తనకు ఒక ఆసరా ఇచ్చాడు. మెల్లిగా నోరు విప్పింది."ఇలాంటి కొడుకునా! నేను కన్నది, పెంచింది అని ఏడుస్తున్నాను."

''ఇందులో నీ బాధ్యత ఎంత మాత్రమూ లేదు. నువ్వు కేవలం నిమిత్తమాత్రురాలివి."

* * *

"అమ్మా అమ్మా" అని ఎవరో తలుపు కొడుతున్న చప్పుడుకు మెలకువ వచ్చింది మంజరికి. కళ్లు తెరిచిన మంజరి చుట్టూ పరిసరాలు పరికించింది. తను న్యూజెర్సీలో లేదు. ఇండియాలో హైద్రాబాద్‌లో ఉంది.

ఇంతసేపూ తను గతం గూర్చి ఆలోచిస్తోందా! అనుకుంటూ లేచి వెళ్లి తలుపు తీసింది. గది బైట హర్షిత నిలబడి ఉంది.

"ఏంటమ్మా! ఎంతసేపయి తలుపు కొడుతున్నాను. ఎప్పటికీ తలుపు తెరవకపోతే నీకేమయిపోయిందో అని భయపడ్డాను. బ్రేక్‌ఫాస్ట్ కూడా రెడీగా ఉంది. నువ్వు రా అమ్మా!"

ముందురోజు జెన్నీతో దినేష్ కనబడ్డాడని చెప్పడం, ఆత్రుతగా తనను పిలుస్తూ వెంటబడడం, అన్నీ తన మనసును కలిచివేసాయి. రాత్రి అదే ఆలోచనలతో ఉండడంతో తనకు తెలియకుండానే గతంలోకి వెళ్లిపోయిం దన్నమాట!

బ్రష్ చేసుకుని వచ్చేసరికి డైనింగ్ టేబుల్ మీద తనకోసం పెట్టిన కాఫీ కప్పు కనబడింది. పిల్లలేరని లక్ష్మిని అడిగింది. పిల్లలు స్కూలుకు వెళ్లిపోయారని చెప్పింది.

"అరె, నన్ను లేపాల్సింది. నువ్వు ఒక్కర్తివీ పిల్లల్ని తయారుచేసి పంపావా!" అంది మంజరి.

"లేదమ్మా! హర్షిత పాప అచ్చు అన్నీ మీలాగానే చేసింది. మీరు నమ్మరు గానీ, అన్నీ మీరు చేసినట్లే చేస్తుంది. పిల్లలు కూడా అమ్మ లేవలేదా! అని అడిగి, మీకు ఒంట్లో బాగులేదేమో! అని అంటే గబగబా వాళ్ళే తయారయిపోయారు. పాప ఎలా చెపితే అలాగే విని స్కూలుకు వెళ్లిపోయారు" అంది లక్ష్మి.

"మీ అయ్యగారూ, హర్షిత ఏరి?" అంది.

"అయ్యగారు బ్రేక్‌ఫాస్ట్ చేసి పనుందని బైటికి వెళ్ళారు. పాప కాలేజీకి వెళ్లడానికి తయారవుతోంది" అంది లక్ష్మి.

"సరే నేను స్నానం చేసి వస్తాను. పూజకు అన్నీ అమర్చు" అంది మంజరి.

"అంతా రెడీగా ఉందండీ! మీరు స్నానం చేసి రావడమే ఆలస్యం."

మంజరి స్నానం చేసి, పూజ చేసుకుని టిఫిన్ తిని సోఫాలో కూర్చుంది. వీడి రాకతో ప్రశాంతంగా సాగుతున్న జీవితంలో మళ్ళీ అల్లకల్లోలం.

* * *

మళ్ళీ మనసు గతంలోకి వెళ్లిపోయింది...

దినేష్ మాటలతో గాయపడ్డ మంజరి నళినికి ఫోన్ చేసి, అడిగింది..

"వాడికి నా గురించి ఎందుకు చెప్పావమ్మా!" అంటూ.

"ఏమయ్యింది అత్తా, ఏమైనా గొడవ జరిగిందా! అనుకోకుండా నాకు మార్కెట్‌లో కలిశాడు. ఇంటికి రమ్మన్నాను. ఇంటికొచ్చాక నిన్ను గురించి అడిగాడు. నీకు కొడుకును చూడాలని ఉంటుందేమో! అనుకున్నాను. అదీకాక అతను

వదిలేసినా నువ్వు సాధించిన విజయం అతను కళ్లతో చూడాలన్న కోరిక నన్ను ఆ పని చేసేటట్లుగా చేసింది. ఒకవేళ నేను తప్పు చేస్తే క్షమించు అత్తా. నీ మనసు నొప్పించాలన్నది నా ఉద్దేశం కాదు" అంది.

"కన్నకొడుకే అర్థం చేసుకోలేని జన్మ అయిపోయింది. వాడు వద్దనుకున్నాక ఏమయిపోతేనేమిటి. మనకి అఖ్ఖర్లేని వాళ్లు ఎలా పోతే మనకేం అని ఉండలేమా! నేను ఎలా ఉన్నానో అని చూడడానికి వచ్చినవాడు నేను ఒక మనిషిగా నిలవడం భరించలేకపోయాడు.

నానా మాటలూ అని వెళ్ళాడు. ఈ వయసులో నీకు పెళ్లి అవసరమా! ఇంకా చాలా అన్నాడు. నేను కుంగిపోకుండా తల ఎత్తుకుని తిరగడం వాడు భరించలేకపోయాడేమో! ఏది ఏమైతేనేమి ప్రశాంతంగా ఉన్న నా మనసు వికలం అయిపోయింది. మెల్లిగా కోలుకుంటానులే దెబ్బలు తినడం నా కలవాటైపోయింది ఇందులో నీ తప్పేం లేదు" అంది మంజరి.

అన్యమనస్కంగా గడుపుతున్న మంజరిని జెన్నీ కొన్నాళ్లు చూసీ చూడనట్లుగా ఊరుకున్నాడు. ఆమెను ఈ స్థితినుంచి ఎలా బైటపడవెయ్యాలన్న ఆలోచన. మంజరినే అడిగితే ఆమె చెపుతుందేమో అని ఒకసారి అనుకున్నాడు. ఈ మధ్య తామిద్దరూ పుస్తకాల గురించి చర్చించుకోలేదు. మనసు మళ్లించడానికి ఏదైనా చర్చ జరిపితే మంచిదనిపించింది.

"మంజరీ! ఇన్ని పుస్తకాలు చదివి కూడా ఇంకా స్థితప్రజ్ఞత లేకుండా ఏమిటిది? విష్ణుసహస్రనామంలో చెప్పినట్లు 'కరణం కారణం కర్తా' అన్నీ ఆయనే కరణం–మనం చేసే ప్రతీ పనికీ అతనే పనిముట్టు అవుతున్నాడు. నిమిత్తకారణం అవుతున్నాడు.

కారణం– ఆ పని ముట్టు వస్తువు వాడడానికి అతనే కారణం అవుతున్నాడు. అతని నుంచే ప్రపంచం అంతా ఉద్భవిస్తోంది. కర్త – అతనే చేయించేవాడు. అదే ఇంకో విధంగా చెప్పాలంటే శివుడి ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టలేదంటారు.

సుఖదుఖాఃలు మానవజీవితంలో ఎంత అనివార్యమంటే చీకటివెలుగులాగే. వెలుగును ఆహ్వానించి ఆనందించినట్లుగానే చీకటిని కూడా ఆహ్వానించాలి. చీకటి లేకపోతే వెలుగు గొప్పదనం తెలియదు. జయాపజయాలు కూడా అంతే. ఓటమి లేకపోతే గెలుపులోని మధురిమ మనకు అర్థం కాదు.

మహాభారతంలో భీష్మపర్వంలో గీత వివరించబడింది. కఠోపనిషత్తులోని అనేక మంత్రాలలోని భావము ఏ మార్పూ లేకుండా గీతలో కనబడుతుంది. అదేవిధంగా జ్ఞానకర్మ ఈశోపనిషత్తుకు మూలమంటారు.

భగవద్గీత జ్ఞాన, భక్తి, కర్మయోగాలకు మార్గదర్శి. గీతలో ఉన్నది పరమాత్మ ప్రార్థన కాదు. నిరంతర సాధన. ఇది శాస్త్రీయగ్రంథము. ఈ గ్రంథము హిందువులకే పరిమితం కాదు. ఎందుకంటే ఇందులో కర్తవ్యబోధ, త్యాగనిరతి, సాధన, కృషి, దీక్ష, లక్ష్యసిద్ధిల తరతరాల అనుభవసారం ఉంది.

భారతంలో ధర్మ, అర్థ, మోక్షముల గురించి చెప్పబడింది. అందువలననే మహాభారతాన్ని పంచమ వేదంగా, ఇతిహాసపురాణంగా యోగశాస్త్రంగా చెప్పుకోవచ్చు" అని కాస్సేపు ఆగాడు జెన్నీ.

ముందు అనాసక్తంగా విని అనుకోకుండా అతని మాటలను మంత్ర ముగ్ధరాలిలా వినడం మొదలుపెట్టింది. అతను ఆగాక "ఆగిపోయావేమి ఇంకా చెప్పు" అంది.

అతని మాటలు ఒక ట్రాన్స్‌లోకి తీసుకువెడతాయి. అతను చదివిన పుస్తకాలలోని సారం చెప్తూ ఉంటే ప్రబోధాత్మకంగా ఉంటాయి.

"నువ్వసలు విన్నావా? దినేష్ వచ్చి వెళ్లినప్పట్నించి నువ్వు అదోలా అయిపోయావు. నువ్వు మళ్ళీ మామూలు మనిషిగా మారాలి. అందుకే ఇవన్నీ చెప్పాను. నువ్వు మళ్ళీ పూర్వపు మంజరిలా అవ్వాలన్నది నా కోరిక. దానికి నన్ను ఏం చెయ్యమంటావో చెప్పు. నువ్వు ఆనందంగా ఉండడమే నాకు కావాల్సినది. మూర్ఖత్వంతో దినేష్ అన్న మాటలను అంత సీరియస్‌గా తీసుకుని బాధపడితే దీనిమూలంగా నీకు ఒరిగేదేమీ లేదు. ఆరోగ్యం పాడవడం తప్ప" అన్నాడు జెన్నీ.

"నాకెందుకో ఇంక ఈ పరిసరాల్లో ఉండాలనిపించటం లేదు. ఇండియా వెళ్లిపోవాలనిపిస్తోంది. కానీ నీకు నచ్చకపోవచ్చు కదా! నువ్వెప్పుడూ అక్కడ ఉండలేదు. అక్కడి వాతావరణంలో నువ్వు ఇమడగలవా! అని నా అనుమానం" అంది.

"ఓస్ ఇంతేనా! నువ్వు ఈ ఆలోచన నీ మనసులో మెదిలిన వెంటనే నాకు చెప్పి ఉండాల్సింది. ఏమీ తెలియని నువ్వు ఇక్కడకు వచ్చి ఇక్కడ ఉండగల్గినప్పుడు

నీ తోడు ఉండగా నేనెందుకు ఉండలేను? నేను తలపెట్టిన సాధనకు ఈ అవకాశం ఇంకా దోహదపడుతుంది. హిందూ పురాణాలు ఉపనిషత్తులు, ఫిలాసఫీని బాగా స్టడీ చెయ్యడానికి నాకిదొక సదవకాశం దొరికిందన్నమాట.”

“మరి ఇక్కడ నీ ప్రాపర్టీ అదీ, నీ ఉద్యోగం అన్నీ ఏం చేస్తావు?”

“అన్నీ వైండప్ చేద్దాము. మనకున్న డబ్బు మనకు సరిపోతుంది” అన్నాడు.

ఇండియాకు వెళ్లిపోవడానికి నిశ్చయించుకున్నాక చెయ్యవల్సిన పనులు చకచకా సాగాయి. రెస్టారెంట్ పూర్తిగా మల్లికార్జున్‌ను తీసేసుకోమంది. ఆమె డబ్బు వద్దన్నా కొంత డబ్బు ఆమె షేర్‌గా ఆమెకు ఇచ్చేశాడు.

జెన్నీ తన ఆస్తులన్నీ అమ్మేసాడు. ఉద్యోగానికి రిజైన్ చేశాడు.

ముందుగా ఢిల్లీ వెళ్లి ఆగ్రా, తాజ్‌మహల్ చూద్దామన్నాడు జెన్నీ. తాజ్‌మహల్ చూడాలన్నది అతని చిరకాల వాంఛ. మంజరి కూడా ఒప్పుకుంది. ఆమె కూడా ఎప్పుడూ ఎక్కడకూ వెళ్లలేదు. ఇదివరలో అవన్నీ పుస్తకాలలో చదివింది కానీ చూడాలని ఉన్నా ఆర్థికస్తోమత లేక ఆమె చూడలేకపోయింది.

నువార్క్ లిబర్టీ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్‌లో ఢిల్లీకి డైరెక్ట్ ఫ్లైట్. పధ్నాలుగు గంటల ప్రయాణం. మొదటిసారి ప్రయాణం గుర్తుకు వచ్చింది. ఈ దేశం తనకు చాలా నేర్పింది. తనలోని భయాన్ని పారద్రోలింది. ధైర్యంగా తన ఆఖరి మజిలీకి ప్రయాణమయ్యింది మంజరి.

ఎంతో అనుభవం పొందిన మంజరి హుందాగా సీట్లో కూర్చుని సీట్‌బెల్టు పెట్టుకుంది. పక్కన జెన్నీ. ఎయిర్ హోస్టెస్ చెప్పేది ఇప్పుడు స్పష్టంగా అర్థం అవుతుంది. తనలో తానే నవ్వుకుంటున్న మంజరిని చూసి ఎందుకు నవ్వుతున్నావని అడిగాడు జెన్నీ.

తన మొదటి ప్రయాణం తన భయాలు అన్నీ చెప్పి, అవి తలుచుకుని నవ్వు వచ్చిందని చెప్పింది. చిన్నపిల్లలా నవ్వుతున్న మంజరిని నవ్వుతూ చూశాడు జెన్నీ.

ఢిల్లీ ఇందిరాగాంధీ ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్ట్‌లో విమానం లాండ్ అయ్యింది. కస్టమ్స్ క్లియరెన్స్ చేసుకుని ఇద్దరూ లగేజ్‌తో బైటపడ్డారు. టాక్సీ తీసుకుని సర్దార్ పటేల్ రోడ్లో ఉన్న తాజ్‌కు చేరుకున్నారు. స్నానం చేసి రెస్ట్

తీసుకున్నాక రిసెప్షన్లో మాట్లాడి వాళ్ల సహాయంతో ఢిల్లీ, మథుర, ఆగ్రా అంతా ఎలా తిరగాలో ప్లాన్ వేసుకున్నారు.

తాజ్‌మహల్ అందాలను పుస్తకాల్లో చదవడం తప్ప ఇన్నేళ్లల్లో ఎప్పుడూ చూడడం జరగలేదు, చూస్తానన్న ఆశ కూడా ఉండేది కాదు. ప్రొద్దున్నే బయలుదేరి తాజ్‌మహల్ చేరుకున్నారు. లోపలికి చెప్పులతో వెళ్లకూడదు. అందుకే చెప్పులు బైట వదిలి లోపలికి వెళ్ళారు. యమునాతీరాన కట్టిన పాలరాతి కట్టడం అది. ప్రపంచంలోని సెవెన్ వండర్స్‌లో ఒకటిగా పరిగణింపబడిన తాజ్‌మహల్, ప్రతీ ఒక్కరూ చూడాలని తహతహపడే తాజ్‌మహల్, ప్రేమకు ప్రతీకగా చెప్పుకోబడే తాజ్‌మహల్ ఎందుకో అందంగా కనిపించలేదు.

షాజహాన్ తన భార్య ముంతాజ్ బేగం జ్ఞాపకార్థం ఎన్నో శ్రమ ప్రయాసల కోర్చి కొన్ని కోట్ల డబ్బును వెచ్చించి కట్టిన దాని వైభవం, చుట్టూ నెలకొన్న ఫ్యాక్టరీల కాలుష్యంతో వన్నె తగ్గిపోయింది.

కవులు వర్ణించినంత గొప్పతనం ఏమీ కనిపించలేదు మంజరికి. పర్షియన్ శిల్పకళ మాత్రం కొట్టొచ్చినట్లు కనబడుతోంది. ఆమె మనోభావాల్ని చదివినట్లు, “కవుల వర్ణనలు ఊహాజనితాలు. అది అనుభవించాలంటే నువ్వు కూడా కవిత్వం వచ్చినదానివై ఉండాలి. కవిత ఒక భావన. వాస్తవం కాదు. వాళ్లు వర్ణించినంత సుందరంగా ఇదివరలో ఉండి వుండవచ్చు” అన్నాడు జెన్నీ. ఆ తరువాత ఆగ్రా ఫోర్ట్ వెళ్ళారు. ఆగ్రా ఫోర్ట్ సగం మిలిటరీ క్రింద ఉంది. మిగిలినదంతా చూశారు. పాలరాయి బొమ్మలు కొన్ని కొంది మంజరి.

తన ఊరి పొలిమేరలు కూడా దాటుతానని అనుకోని మంజరి ఇప్పుడు విదేశ దేశ పర్యటన చేస్తోంది.

ఫతేపూర్ సిక్రీకి బయలుదేరారు. అక్బర్ చిత్తోర్ , రణతంభోర్‌ల మీద విజయం సాధించాక తన రాజధానిని ఇక్కడకు మార్చదలచి ఈ కోటను నిర్మించాడు. దీనికి ఫతేబాద్ అన్ననామకరణం చేయబడింది. ఫతే అంటే విజయం అని అర్థం. ఆ తరువాత కాలక్రమేణా ఫతేపూర్ సిక్రీగా మారింది. కోట చాలా బాగుంది. ఎర్రరాతి కట్టడం.

చివరగా బృందావనం వెళ్ళారు. మథుర క్రిష్ణుడి జన్మస్థలమైతే అతని ఆటపాటలన్నీ బృందావనంలో గడిచాయంటారు. బృంద అంటే తులసి అని

అర్థం అక్కడ తులసివనం ఉండడాన్ని ఆ పేరు వచ్చిందని అంటారు. భాగవత పురాణ ప్రకారం క్రిష్ణుడు గోపబాలురతో కలిసి వెన్నదొంగతనాలు, అన్న బలరాముడితో కలిసి ఆటపాటలు, గోపికలతో రాసక్రీడలు ఇక్కడే చేసాడని చెపుతారు. ఇక్కడి క్రిష్ణలీలల భావతరంగాలే జయదేవుడిని అష్టపదులు రచించేటట్లు చేసిందని కూడా చెపుతారు.

అన్నీ ఒక గైడ్‌లా విశదంగా వివరిస్తున్న జెన్నీ, దాన్ని తన మనసులో ముద్ర వేసుకుంటున్న మంజరి. ఒక మధురానుభూతిని నింపుకుని తిరుగు ప్రయాణమయ్యారు.

ఢిల్లీలో మార్కెటింగ్ ఏదైనా చేద్దామని ఖాన్ మార్కెట్ వెళ్లారు. వెనుకనుంచి 'ఆంటీ' అన్న పిలుపుతో ఉలిక్కిపడింది మంజరి. వెనక్కి తిరిగి చూస్తే నమ్రత కనబడింది. "నువ్వు ఇక్కడేమిటి?" అని అడిగింది మంజరి.

"మేం ఇక్కడే ఉంటున్నాం. మా ఇంటికి రండి" అంది.

"అమెరికా వదిలేశావా?" అంది మంజరి.

"వదిలేశాము. అయినవాళ్లను వదిలేసి దూరపు కొండలు నునుపు అనుకున్నాను. ఆంటీ, ఏ ఆడపడుచులు నా మీద అధికారం చెలాయిస్తున్నా రనుకున్నానో, నాకు ఒంట్లో బాగులేదంటే అక్కడకు వచ్చి నాకు సేవ చేశారు. వాళ్ల తమ్ముడంటే వాళ్లకు ప్రాణం. నా బాగోగులు ఆ తమ్ముడి జీవితంతో ముడిపడి ఉన్నాయి. వాళ్ల అధికారంలో ఉన్న ఆప్యాయతను నేను గుర్తించలేదు. అది తెలుసుకున్నాక అక్కడ ఉండబుద్ధి కాలేదు. మా ఆయన ఇప్పుడు మా మావగారి బిజినెస్ చూసుకుంటున్నాడు" అని చెప్పింది.

బలవంతాన వాళ్ల ఇంటికి తీసుకువెళ్లి అతిథి మర్యాదలు చేసింది.

అన్నీ తిరగడం అయ్యాక ఇండియాలో ఎక్కడ సెటిల్ అవ్వాలన్న ప్రశ్న వచ్చింది. ఇద్దరూ ఆలోచించుకుని హైద్రాబాదు బాగుంటుందని నిర్ణయించు కున్నారు. అలా హైద్రాబాదులో అడుగుపెట్టడం జరిగింది.

ముందుగా ఒక చిన్న అపార్ట్‌మెంట్ అద్దెకు తీసుకున్నారు. మొదటినుంచీ విశాలంగా ఉండడం అలవాటుపడ్డ జెన్నీకి ఇంత చిన్న ఇంట్లో ఉండడం కష్టంగా ఉంది. పక్క అపార్ట్‌మెంట్‌ల ధ్వనులు అవన్నీ అతనికి కొంచెం చికాకు కలిగించడం మొదలుపెట్టాయి. అతనికి కావాల్సినది ప్రశాంత వాతావరణం. బంగళాలాంటి

ఇల్లు ఉంటే బాగుంటుందని అభిప్రాయపడ్డాడు. బ్రోకర్ ద్వారా తిరగ్గా ఎవరో సగం కట్టి ఆపేసిన ఇల్లు అమ్మేస్తున్నారని తెలిసి, ఇప్పుడున్న బంగళా చూడ్డం తటస్థించింది.

ఇంటికన్నా చుట్టూ ఉన్న స్థలం అతనికి బాగా నచ్చింది. ఇంటిప్లానును తమకనుగుణంగా మార్పించి అధునాతన పద్ధతిలో అన్ని సౌకర్యాలతో పూర్తి చేసాడు. చుట్టాలకు దూరంగా ఉండదల్చుకుంది. ఎంత కాలం మారినా తన వివాహాన్ని ఎంతవరకు ఆమోదిస్తారో తెలియదు. కొత్తవాళ్లుగా ఉండిపోతే ఆరాలు రావు. అందుకే చుట్టాలకు దూరంగా ఉంది.

ఉన్న చుట్టాలను కూడా వెతికి చూడాలి. బాబయ్యకు తమకూ ముందు నుంచీ రాకపోకలు లేవు. తమఇంట్లో ఏ శుభకార్యానికీ రాలేదు. తండ్రి ఉన్నన్నాళ్లూ తాపత్రయపడ్డా అతని స్వభావం తెలిశాక తమ్ముడికి దూరంగానే ఉన్నాడు. తండ్రి అక్క పెళ్లికి, తన పెళ్లికి ఇంటికి వెళ్లి పిలిచినా రాలేదు. తన పిల్లల పెళ్లిళ్లకు పిలవలేదు. ఆదిత్య తరపు బంధువులు ఎక్కువగా లేరు. నళిని తల్లి తప్ప. జెన్నీని పెళ్లిచేసుకోవాలా వద్దా! అని సలహా అడిగాక కొద్దిరోజులదాకా ప్రతిమకు ఫోన్ చెయ్యలేకపోయింది. ఇంక ఇండియా వచ్చేస్తామని నిశ్చయించుకున్నాక ప్రతిమకు ఫోన్ చేసింది.   మంజరి ఇండియా వచ్చేస్తున్నందుకు ఎంతో సంతోషించింది. వచ్చాక జెన్నీతో తమ ఊరు రమ్మని పిలిచింది.

అక్కడకు రావడానికి ఒప్పుకోలేదు మంజరి. “కాలం మారినా ఇంకా మనవాళ్లు ఎదగలేదు ప్రతిమా! తెలిసున్నవాళ్లు కనబడితే నన్ను విమర్శిస్తారు. ఆ విమర్శలను ఎదుర్కోలేను. నా జీవితం మానవసేవకు అంకితం చెయ్యదల్చుకున్నాను. ఇక్కడ నేను ఎవరికీ తెలియదు. మా చుట్టాలు కూడా నన్ను గుర్తుపట్టేవాళ్లు ఎంతమంది ఉన్నారో తెలియదు” అంది.

“అయితే నీ ఇల్లేం చేస్తావు? నువ్వు చెప్పకపోయినా నా బాధ్యతగా దాన్ని అవసరమైనప్పుడు బాగుచేస్తూ ఎవరో ఒకరికి అద్దెకి ఇస్తున్నాను. ఆ వచ్చిన అద్దె నీ బాంక్ అకౌంట్లో జమచేస్తున్నాను” అంది.

“పోనీ ఆ ఇంటిని ఏదైనా సత్కార్యానికి ఉపయోగిస్తే ఎలా ఉంటుంది?”

“బాగానే ఉంటుంది. దానికి ఏం చెయ్యాలో నువ్వేచెప్పు” అంది ప్రతిమ

ఇద్దరూ ఆలోచించి ఒక స్వచ్ఛంద సేవా సంస్థ స్థాపించి దాన్ని ప్రతిమ, ఆమె భర్త నడిపేటట్లు నిర్ణయంజరిగింది.

మంజరి చేసే ఏ పనికీ అడ్డు చెప్పడు జెన్నీ. తమిద్దరికీ ఎవరూ లేరు. అలాంటప్పుడు ఎవరికైనా సాయపడితే మంచిదన్న ఆలోచన మంజరి మనసులో మెదిలింది. డబ్బుకు లోటు లేదు. కొన్ని ఎన్.జి.వోలకు డొనేషన్స్ ఇవ్వడం ప్రారంభించింది.

ఒక రోజు వాకింగ్ నుంచి వస్తుంటే చెత్తకుండీలో ఒక చిన్నపాప ఏడుపు వినిపించింది. అక్కున చేర్చుకుంది మంజరి. అలా అలా వాళ్లింట హర్షితతో సహా ఆరుగురు పిల్లలు తయారయ్యారు. ఆమెలోని అమ్మతనం మళ్లీ పూలు పూసి కాయలు కాయడం మొదలుపెట్టింది.

ఇప్పుడు ఆమె చేసే పనిలో కానీ ప్రేమలో కానీ ఆశ, ప్రతిఫలాపేక్ష లేవు. అటాచ్‌మెంట్ అంతకన్నా పెట్టుకోదల్చుకోలేదు. ఆమె లక్ష్యం ఒకటే. తోటిమనిషికి కష్టాల్లో ఉన్నప్పుడు ఒక ఆలంబన కావాలి. ఆ ఆలంబన దొరకకపోతే ఆ బ్రతుకు నిర్వీర్యం అయిపోతుంది.

తనకవసరం అయినప్పుడు తను నమ్ముకున్న దేముడు ఏదో రూపంలో ఆలంబన చూపించాడు. దేముడు ప్రతీ మనిషిని ఏదో ఆశించి జన్మ ప్రసాదిస్తాడు. తన జన్మ ఎందుకో అని ఆలోచించి, శోధన చేసుకుంటూ వెళ్లడం నిజమైన ఆత్మదర్శనం.

* * *

"ప్లీజ్ కమిన్" అన్న మాటలతో తన ఆలోచనలనుంచి బైటికి వచ్చింది మంజరి.

దినేష్, జెన్నీ లోపలికి వచ్చారు. జెన్నీ కళ్లల్లోకి చూసింది మంజరి 'ఏమిటిది?' అన్నట్లు. 'మాట్లాడకు' అన్నట్లుగా కళ్లతో సమాధానం ఇచ్చాడు.

సోఫాలో ఉన్న మంజరి దగ్గరకు వచ్చి కాళ్లు పట్టుకున్నాడు. "నన్ను క్షమించమ్మా" అంటూ.

"నేను క్షమించడమేమిటి? నేనెవర్ని? నీకేమీ కాను కదా!"

"అలా అనకమ్మా నా తప్పు నాకు తెలిసింది. నేను మూర్ఖుడ్ని కాబట్టే

నీలాంటి అపురూపమయిన వ్యక్తిని భగవంతుడు నాకు తల్లిగా ఇస్తే గుర్తించలేక నిన్ను నేను దూరం చేసుకున్నాను. నువ్వు క్షమించానంటే నీ కాళ్లు వదులుతాను" అన్నాడు.

తెలియకుండానే మంజరి కళ్ల వెంట కారిన కన్నీరు దినేష్ తలమీద అక్షింతల్లా పడ్డాయి. తలెత్తి తల్లి కన్నీళ్లు చూసిన దినేష్ ఆమె ప్రక్కన కూర్చుని ఆమె కన్నీళ్లు తుడిచాడు.

జెన్నీకి బిర్లాటెంపుల్‌లో కనబడ్డాడు. ఇద్దరూ ఒకర్ని ఒకరు గుర్తుపట్టారు. అమ్మను పెట్టిన క్షోభకు దేవుడు తనకు తగిన శిక్ష వేశాడని చెప్పాడు. ' అమ్మ నన్ను క్షమిస్తుందా!' అని అడిగినదానికి 'తప్పకుండా' అని ఇంటికి తీసుకువచ్చాడు జెన్నీ.

"నువ్వు మీ అమ్మను సరిగా అర్థం చేసుకోలేదు. చిన్నతనం అనుకోవాలో లేక అవగాహన లేకపోవడమో నాకు తెలియదు. ఆమె పరిచయం అయినప్పుడు ఆమె గతచరిత్ర నాకు తెలియదు. కానీ ఆమె చిరునవ్వులో ఒక ప్రేమతత్వాన్ని చూశాను. ఆమెలో ఒక శారదామాయి, ఒక మదర్ థెరిసా నాకు గోచరించారు. ఇలా అంటున్నానని నన్ను పిచ్చివాడనుకున్నా ఫరవాలేదు.

ఆవిడ చిన్నప్పటి జీవితం నీకు తెలుసా! బహుశా మీ అమ్మ నీకెప్పుడూ చెప్పి ఉండదు. చిన్ననాటినుంచీ తనకోసం కాక ఎదటివారికై ఆమె తాపత్రయ పడింది. ఆమెను పూర్తిగా అర్థంచేసుకున్నవాళ్లు లేరని నా అభిప్రాయం. మీ నాన్నగారి సంగతి నాకు తెలియదు. ఎందుకంటే ఆయన జీవితకాలం చాలా చిన్నది.

పెళ్లికాక మునుపు మీ అమ్మమ్మ, తాతగార్లు ఎక్కడ కష్టపడతారో అనుకుంటూ చిన్నపిల్లయినా వాళ్లనుంచి ఏమీ ఆశించకుండా వాళ్లకు సహాయపడేది. అలాగే మీ మురళి మావయ్యను కూడా చదువుకోమని ప్రోత్సాహించి అతను చదువులో ముందుకు వెళ్లడానికి దోహదపడింది.

అనుక్షణం తనకు ఏం కావాలని ఆలోచించుకోకుండా ఎదటివాడికి తనవల్ల ఏం ఉపయోగం కలుగుతుందని ఆలోచించేది. ఇది అందరికీ సాధ్యమయ్యేది కాదు.

ఎదటివాళ్లకు ఇవ్వడమే కానీ తీసుకోవడం చేత కాదు. ఆశించే గుణం అంతకన్నా కాదు. ఇది మామూలు వాళ్లకు సాధ్యం కాదు. దీనికి కొంతవరకు ఆమె పూర్వజన్మ కారణం ఉండవచ్చు. ఇంకా వేదాంత చర్చలోకి వెళ్లి నిన్ను ఇబ్బందిపెట్టను.

ఒకటి మాత్రం నిజం. ఆమె అందర్నీ ప్రేమిస్తుంది. ఆమె ఒక చల్లని మాతృమూర్తి. లౌకికం నుంచి బైటపడితే ఆమె సమక్షం ఒక చల్లని వెన్నెల అనుభూతిని మిగులుస్తుంది.

నేను చిన్నతనం నుంచి ప్రేమకు నోచుకోలేదు. మరుజన్మ అంటూ ఉంటే నీ తల్లిలాంటి తల్లి కడుపున పుట్టాలని కోరుకుంటాను. ఆమె ఎంత ప్రేమమూర్తో తెలుసుకోవడానికి ఈ ఇంట్లో పెరిగే పిల్లలే దానికి తార్కాణం.

మా పెళ్లి గురించి నువ్వు తెలుసుకున్న తక్షణం ఆమెను నిందించావు కానీ ఆమె పెళ్లిచేసుకుంటే తప్పేమిటని అనుకోలేకపోయావు. మేం ఇద్దరం ఒక స్నేహితుల్లా గడుపుతాం అంటే సంఘం నమ్ముతుందా! అలనాడు రామక్రిష్ణ పరమహంస తన భార్యను పూజిస్తాడంటే నే నమ్మలేదు. అక్కడ రామక్రిష్ణ ఆమె గురువైతే ఇక్కడ మీ అమ్మ నాకు గురువు. ఎవరు నమ్మినా నమ్మకపోయినా ఇదే నిజం.

నేను చదివిన పుస్తకాలు నాకు ఇచ్చిన జ్ఞానం ప్రకారం ఎంతో పుణ్యం చేసుకుంటేనే కానీ మనుష్య జన్మ లభ్యం కాదు. ఈ జన్మ పవిత్రమైనది. దీన్ని దుర్వినియోగం చేసుకోకూడదు.

ఆత్మసాక్షాత్కారం పొందటానికి ఈ మానవజన్మే అత్యంత అనువైన సాధనం. మానవ దేహం దేవునికి ఆలయం. అందుకే ఈ అమూల్యమైన దేహాన్ని సద్వినియోగం చేసుకుని భగవత్సాక్షాత్కారం చేసుకోమని హిందూధర్మం బోధిస్తోంది." అన్నాడు జెన్నీ.

జెన్నీ మాటలను మంత్రముగ్ధుడిలా వింటున్నాడు దినేష్. అవును ఈ ఇల్లే ఒక దేవాలయం. అమ్మే ఈ ఇంటి అధిష్టానదేవత అనుకున్నాడు.

తల్లివైపు తిరిగి, "నువ్వు చెప్పినట్లు మేం ఇద్దరం స్వార్థపరులమే. ఇద్దరం ఏం పొందాలని దగ్గరయ్యామో అదే చివరికి మేం విడిపోవడానికి కారణ

మయ్యింది. ఆమె మాట విని నిన్ను కాదని వాషింగ్టన్ వెళ్లిపోయాను కదా! కొద్దిరోజులు బాగానే జరిగింది. వైశాలికి ఎంతసేపూ వాళ్ల అమ్మే. తెల్లవారి లేచిన దగ్గరినించి అమ్మకు ఇది కావాలి అది కావాలి అంటూ ఉండేది. నేనొకడ్ని ఆమె జీవితంలో ఉన్నానన్న భావన విస్మరించింది.

పోనీ కొన్నాళ్లు సర్దుకుందామని ఎదురుచూసాను. అక్కడ నాకొక అస్థిత్వం లేకుండాపోయింది. కాలం గడుస్తున్న కొలది మా మధ్య దూరం పెరగడం మొదలయ్యింది. ధీరజ్ కూడా నాకు దూరం కావడం మొదలుపెట్టాడు. ఇద్దరం ప్రేమించి పెళ్లిచేసుకున్నామని భ్రమపడ్డాము. కానీ మా మధ్య ఉన్నది ఆకర్షణ అని తెలిసింది. ఆ ఇంట్లో నేను పరాయిమనిషిని అయిపోయాను. మేం అక్కడకు వెళ్ళాక మా అత్తగారి ఆరోగ్యం బాగుపడి, ఆమె మళ్లీ తన ఉద్యోగంలో చేరింది.

ఆ ఆస్తి వాళ్లది. ఆ ఇల్లు వాళ్లది. నేను ఏం మాట్లాడినా తప్పుగా ఉండేది. ఏం ఆశించి మేమిద్దరం పెళ్లిచేసుకున్నామో తెలియదు. మా మధ్య మనస్పర్థలు మొదలయ్యాయి. చినికిచినికి గాలివాన అయ్యి విడాకులు తీసుకున్నాము.

ధీరజ్ తన దగ్గరే ఉంటానన్నాడు. అక్కడ ఉండలేకపోయాను. నిన్ను నొప్పించినందుకు నాకు దేముడు తగిన శాస్తి చేశాడు. వైశాలికి తల్లిమీద ఉన్న ప్రేమ చూశాక నా తల్లిని నేను ఎందుకు కాలదన్నుకున్నానన్న ఆత్మవిమర్శ మొదలైంది. న్యూజెర్సీ వెళ్లి నీ గురించి అడిగాను. హైద్రాబాదులో ఉన్నావని తెలిసింది. అందుకే ఇక్కడకు వచ్చేశాను. నీ కోసం వెతుకుతున్నాను. అనుకోకుండా ఆ రోజు అక్కడ కనబడ్డావు. నన్ను చూసి కూడా చూడనట్లు వెళ్లిపోయావు. నేను చేసిన తప్పుకు నువ్వు ఏ శిక్ష వేసినా సిద్ధమే. జెన్నీ అంతా చెప్పారు. నీ సేవా కార్యక్రమాల్లో నేనూ ఒక భాగాన్నవుతాను. ఇక్కడ పెరుగుతున్న అనాధల్లో ఈ అనాధను కూడా చేర్చుకో అమ్మా" అన్నాడు.

ఏమంటుంది? తనలో ఉన్న బలహీనతే అది. ఎవరినీ కాదనలేని బలహీనత. అది తనతో చివరిదాకా ఉంటుంది. అంతే.

మర్నాడు ప్రొద్దున "అమ్మగారూ! మీ కోసం ఎవరో వచ్చారు" అంది లక్ష్మి.

"లోపలికి తీసుకురా" అంది.

వచ్చిన వ్యక్తిని చూసి కళ్లనీళ్లు తిరిగాయి. ప్రసన్న ఎదురుగా నిలబడి ఉంది. వయసు తెచ్చిన మార్పు తప్ప ఏమీ లేదు.

"ఏం ఈ అక్క బతికి ఉందని మర్చిపోయావా!" అంటూ చెల్లెల్ని కౌగలించుకుంది.

అక్కచెల్లెళ్లిద్దరికీ మాటలు కరువయ్యాయి. ఎన్ని ఏళ్లు గడిచిపోయాయి ఒకరినొకరు చూసుకుని? అమెరికా వెళ్ళే ముందు కలుసుకున్నారు. తరువాత పనిలో పడి ఎక్కువగా అక్కగారికి ఫోన్ చెయ్యలేకపోయింది.

"అమెరికాలో ఎలా ఉన్నావో ఏం కష్టాలు పడ్డావో నాకు ఫోన్ చెయ్యాలని తోచలేదా! నేను, మీ బావగారు నీకు తోడు కాదనుకున్నావా!" అంది ప్రసన్న.

కళ్లనీళ్లు తుడుచుకుని, "అవన్నీ తరువాత చెపుతాను. నేనిక్కడున్నట్లు నీకెలా తెలుసు? ప్రతిమకు తప్ప ఎవ్వరికీ తెలియదు" అంది మంజరి.

"నేను చెప్పానమ్మా. నేను ఇండియా వచ్చాక దొడ్డమ్మ దగ్గరకు వెళ్ళాను. నీ సంగతి ఆవిడకు తెలుసేమో అని. ఆవిడ నా నోట ఈ విషయం విని చాలా ఆశ్చర్యపోయింది. నువ్వు ఇండియా వచ్చి ఇన్నాళ్లైనా తనను కలవలేదని బాధపడింది. నిన్న జెన్నీని కలిసినప్పుడు జెన్నీని అడిగి, మీ ఎడ్రెస్ ఫోన్ నెంబరు దొడ్డమ్మకు ఇచ్చాను. బహుశా వెంటనే బయలుదేరినట్లు ఉంది" అన్నాడు.

అక్కగార్ని చూసిన ఆనందం. ఏం మాట్లాడాలో తెలియదు. అక్క తను చేసిన పని హర్షించదని భయపడింది. ఎంత వద్దనుకున్నా రక్తసంబంధాలూ, తోడబుట్టువుల అనుబంధాలూ మన వెన్నంటి ఉంటాయి. అందరూ స్వార్థపరులే ఉండరు. అక్క తన గురించి తెలియక ఎంత బాధపడి ఉండి ఉంటుందో !

అప్పుడే అక్కడకు వచ్చిన జెన్నీని చూసి, "నమస్కారం మరిదిగారూ" అంది ప్రసన్న.

ప్రతి నమస్కారం చేసి, మంజరివైపు తిరిగి, "చూశావా! నీ వాళ్లందరూ నీ దగ్గరకు చేరుకున్నారు. ఇప్పుడైనా ఆనందంగా ఉందా!"

"పిచ్చిదానా! చిన్నప్పట్నించీ నిన్ను ఎరిగినదాన్ని నిన్ను తప్పు అర్థం ఎలా చేసుకుంటాననుకున్నావు? మా చెల్లెలి తెలితేటలమీద, నిర్ణయాల మీద నాకు అమిత విశ్వాసం ఉంది. మా చెల్లి ఎప్పుడూ తప్పటడుగు వెయ్యదు. మారుతున్న కాలంతో మనమూ మారడంలో తప్పులేదు. మనం ఒకరికి అపకారం చెయ్యనంతసేపూ మనం చేసే పనికి భయపడాల్సిన పనిలేదు. నువ్వు చేసిన పని నేను హర్షించనని భయపడి నన్ను దూరం చేసుకున్నావు.

నీకు ఒక తోడు కావాలనుకోవడంలో తప్పు లేదు. నీ గురించి అంతా తెలిశాక నా చెల్లెలు మామూలు వ్యక్తి కాదు. కారణజన్మురాలనిపిస్తోంది. నీలాంటిది నా చెల్లెలు అని చెప్పుకోవడానికి నేను గర్వపడుతున్నాను. అన్నీ అందినట్లుగా పొందిన జీవితంలో ఏం చేసినా గొప్పతనం లేదు. అన్యాయార్జితం చేసి పుణ్యంకోసం దానధర్మాలు చెయ్యడం గొప్పపని కాదు. తనకున్న దాంట్లోనే కొంచెం ఎదుటివాడికిచ్చి సహాయపడదామని చూసేవాడే నిజమైన మనిషి.

చిన్ననాటినుంచీ మా అందరిలో నువ్వే అన్ని రకాల కష్టాలూ చూశావు. అయినా ఏటికి ఎదురీదుతూ ముందుకు సాగిపోతూ అలుపులేకుండా ఇంకొకరికి సహాయపడాలన్న నీ తపన ఎవరికుంటుందమ్మా! నువ్వు నా బంగారుతల్లివి. తప్పు చేసినా తిరిగి నీ కొడుకు తప్పు తెలుసుకుని నీ దగ్గరకు వచ్చాడు. వాడ్ని ఆదరించి, నువ్వు, జెన్నీ హాయిగా గడపండి" అంది ప్రసన్న.

హర్షిత వచ్చి "అమ్మా! అందరూ బ్రేక్‌ఫాస్ట్‌కి రండి" అంది.

అందరూ డైనింగ్ టేబుల్ దగ్గరకు నడిచారు. మంజరి పిల్లలందర్నీ పరిచయం చేసింది. అందరిలోకీ చిన్నవాడైన, కేదార్ " అయితే అమ్మా ఇప్పుడు వీళ్లిద్దరూ మాకేమవుతారు?" అన్నాడు.

"వీడు అన్నయ్య, నేను దొడ్డమ్మ" అంది ప్రసన్న.

అందరూ నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ ఆనందంగా గడిపారు.

* * *

డ్రాయింగ్ రూములో కూర్చుని పేపరు చదువుతున్న దినేష్‌కు లక్ష్మి వచ్చి, "అన్నయ్యా! అమ్మగారి పేరు అడుగుతూ ఎవరో వచ్చారు. తీసుకురమ్మంటారా!" అంది.

"అలాగే, తీసుకురా. అమ్మను తెలిసినవాళ్లంటే బాగా దగ్గరవాళ్లే వుంటారు" అన్నాడు.

లోపలికొచ్చిన నళినిని గుర్తుపట్టాడు. "బాగున్నావా! కూర్చో" అన్నాడు.

"మొత్తానికి తల్లీకొడుకులు కలిసిపోయారన్నమాట. అత్తయ్యను పిలువు అడగాలి అసలు నిన్ను ఎలా క్షమించిందో?" అని మళ్లీ అతనికి కోపం వస్తుందేమో అన్నట్లుగా అతని మొహంలోకి చూసింది.

నవ్వుతూ, "ఇక్కడికెలా వచ్చావు? అమ్మ ఇక్కడుందని నీకు తెలుసా!" అన్నాడు.

"అత్త ఇండియా వచ్చాక ఒకటి రెండు సార్లు మాట్లాడాను. ఇక్కడకు వచ్చినప్పుడు తప్పక కలుస్తానని చెప్పాను. అత్తయ్యను పిలువు" అంది.

"నాతో రా మీ అత్తయ్యను చూపిస్తాను" అంటూ లోపలికి తీసుకువెళ్ళాడు. ఆ గదిలోకి అడుగుపెట్టిన నళిని నిర్ఘాంతపోయింది.

నిలువుటెత్తు ఫోటో చిరునవ్వులు చిందిస్తూ ఉంది. పెద్దపూలదండ వేళ్లాడుతోంది.

"ఇదెప్పుడు జరిగింది? నాకెందుకు తెలుపలేదు" అంది.

"నీ కాంటాక్ట్ నంబరు నా దగ్గర ఉంటే తప్పక తెలిపి ఉండేవాడ్ని" అంటూ తన కథ అంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

"నా కన్నతల్లైనా ఆమెను మీరందరూ గుర్తించినా ఆ మహోన్నత వ్యక్తిని అర్థం చేసుకునేసరికి చాలా ఆలస్యం అయిపోయింది. ఆవిడ కొడుకుగా ఆవిడ పంచిన ప్రేమను అర్థం చేసుకోలేదు.

ఆవిడ పెంచుతున్న అనాథల్లో ఒకడిగానైనా పొందుదామంటే నువ్వు అర్హుడివి కాదన్నట్లు వెళ్లిపోయింది. నా పాపానికి ప్రాయశ్చిత్తంగా ఆమె మొదలుపెట్టిన యజ్ఞాన్ని కొనసాగిస్తున్నాను" అన్నాడు.

నళిని కాస్సేపు వెక్కివెక్కి ఏడ్చింది. ఆమె దుఃఖం తగ్గాక "మరి జెన్నీ ఏడి?" అంది.

"అమ్మలేని ఇంట్లో ఉండలేనని సన్యాసం పుచ్చుకున్నాడు. దిండిగల్లు దాటాక ఒక ఆశ్రమం ఉంది. అందులో ఉంటాడు. ఎవరైనా పిలిస్తే ప్రవచనాలు ఇవ్వడానికి వెడుతూ ఉంటాడు. ఇప్పుడు ఆయన పేరు జ్ఞానానందస్వామి" అన్నాడు.

"అత్త చేస్తున్న పనులు నాకు తెలుసు. నా తరఫు నుంచి కూడా ఆవిడ చేసే మంచిపనులకు సహాయం చేద్దామని వచ్చాను. పోనీ నువ్వు కూడా అత్త చేస్తున్న పని కొనసాగిస్తున్నావు కదా! ఇదిగో చెక్. నీకు కావాలంటే నా ఫ్రెండ్స్

ద్వారా కూడా డబ్బు సహాయం అందేటట్లుగా చూస్తాను. ఈ యజ్ఞం ఆగకూడదు" అంది.

"అలాగే తప్పకుండా అవసరం పడితే నీకు తెలుపుతాను. అమ్మ చేరదీసిన పిల్లల్లో హర్షిత డాక్టర్ పూర్తిచేసింది. ఆమె తమ్ముడు కూడా చదువు పూర్తి చేసుకుని ఉద్యోగం చేస్తున్నాడు. అమ్మకిచ్చిన మాటప్రకారం వాళ్లిద్దరూ ఇంకో ఇద్దరు పిల్లల చదువుకు ఫైనాన్స్ చేస్తున్నారు. అమ్మ పెట్టిన ఈ చైన్ రియాక్షన్ కొనసాగాలి. అమ్మ పేరు మీద ఒక హాస్పిటల్ కట్టి, అతి తక్కువ ఫీజ్‌తో పేదలకు వైద్యసౌకర్యం అందించాలని హర్షిత కోరిక.

ఈ ఇంట్లో పెరిగే పిల్లలలో మిగిలిన ఐదుగురూ చదువులు పూర్తిచెయ్యాలి. నా శక్తిమేరకు దీన్ని కొనసాగించి అమ్మ ఆత్మకు శాంతి కలుగచెయ్యడమే కొడుకుగా ఆమెకు నేను చెయ్యదల్చుకున్నది. ఇదే నా జీవితలక్ష్యం. ఈ అమృతవాహిని నిరంతరం ప్రవహించాలి.

అమ్మ రాసుకున్న మహాత్ముల మాటలు చదివాక నేను అర్థం చేసుకున్నది, ధర్మం భారతదేశానికి వెన్నెముక. తత్వవేత్తలు, జ్ఞానులు ప్రతియుగంలోనూ ఈ గడ్డపై పుట్టి మానవుల్లో జ్ఞానదీపాలు వెలిగించారు. ప్రేమానురాగాలకు పెన్నిధి మన భారతి. భారతదేశం వేదాలకు జన్మభూమి. ఆధ్యాత్మికతత్వం భారతికి నేస్తం. ధర్మం మన జీవితంలో అనుక్షణమూ పెనవేసుకుపోవాలి.

ఇంతమంది మహానుభావులు ప్రతి హిందువూ గర్వించేలా సుసంపన్నమైన ఆధ్యాత్మిక వారసత్వాన్ని మనకు ప్రసాదించారు.

హే భారతీ వందే భారతీ శోభామయీ భవ్య తేజోమయీ!





# అనురాధ (సుజల గంటి)

**పుట్టింది-**

గోదావరి తీరం రాజమండ్రి.

**పెరిగింది, చదివింది...**

తెలంగాణా మరియు ఆంధ్రాలలో.

**ప్రస్తుత నివాసం-**

హైదరాబాద్.

**నా జీవన నేస్తం-**

గంటి శ్రీహరి సూర్యనారాయణ మూర్తి O.N.G.C DGM Geologyగా
పదవీ విరమణ.
ముగ్గురు పిల్లలు.
పెద్దాబ్బాయి అజయ్, CEO (SAAARCO) Muscat. కోడలు చారు.
మనవలు అద్వితీయ, సూర్య
చిన్నబ్బాయి విజయ్, కోడలు కవల్. ఇద్దరూ
అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు. మనవలు ఈషాన్, రియా.
అమ్మాయి హారిణి మధిర, CISNE for Arts Event Management Company, CEO.
అల్లుడు సతీష్ మధిర, ZEMOSO Technologies, CEO.
మనవలు హంస, మైత్రేయి.

**చదువు-**

ఎకనామిక్స్ లోనూ, హిందుస్థానీ సంగీతం లోనూ పట్టభద్రురాల్ని.
కర్ణాటక సంగీతం ఇంటి వారసత్వం. సంగీత సాహిత్యాలు రెండు కళ్ళు.
ఇప్పటి దాకా రచనలు - 2011 నుంచి రచనా వ్యాసంగం చేపట్టాను.
ఇప్పటిదాకాఆరు నవలలు పత్రికలలో ప్రచురించబడ్డాయి. ఏడవది ప్రచురణకు అనుమతించబడింది. నా మొదటి నవలకు అనిల్ అవార్డ్, మూడవ నవలకు ఆంధ్రభూమిలో ద్వితీయ బహుమతి, ఆరవ నవలకు జాగృతిలో తృతీయ బహుమతి. ఇప్పటిదాకా సుమారు నలభై కథలు వివిధ పత్రికల్లో వచ్చాయి. అందులో కొన్ని బహుమతులు పొందాయి.




JV PUBLICATIONS